# అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు

## వ్యాస సంకలనం



సంపాదకుడు

ఆచార్య పేర్వారం జగన్నాథం

తెలుగు శాఖాధ్యక్షులు

కాకతీయ విశ్వవిద్యాలయం

వరంగల్లు

ప్రచురణ




సాహితీ బంధు బృందం

వరంగల్లు

ABHYUDAYA KAVITVANANTARA DHORANULU
Edited by : Prof. Pervaram Jagannadham

Publication No : 17

Copies : 1000

First Edition : D/ 2-10-1987
Prabhava Vijaya Dasami



*Cover Design* : Seela Veerraju

Price : Rs. 80-00

*For Copies* :

1. Andhra Saraswatha Parishath
Boggulakunta, Tilak Road
HYDERABAD – 500 001

2. Sahithi Bandhu Brindam
1/705/5-1-C, Mithilanagar
Hanamkonda
WARANGAL-506 001

*Printed at* :
Padmavathi Art Printers
3-5-850, Hyderguda
Hyderabad - 500 029

* అభ్యుదయ కవిత్వానంతరం తెలుగులో ప్రవర్తిల్లిన ధోరణులపై జరిగిన సమగ్ర పరిశీలనం—

* వర్తమాన ఆంధ్రకవితా రీతులకు సరియైనమార్గంలో చేసిన వ్యాఖ్యానం—

* నిష్పక్షపాతవైఖరితో వెలువడిన కవితానికషోపలం—

* కావ్యకళా తత్వాన్ని గుర్తెరిగిన అపూర్వ విమర్శక గ్రంథం—

* వస్తు విభజనలో విషయ వైశద్యంలో సిద్ధాంత ప్రతిపాదనలో ప్రాక్పశ్చిమ సాహిత్య సంప్రదాయాల సమన్వయాన్ని సాధించిన ప్రామాణిక సాహిత్య శాస్త్రం—

* ఆధునిక కవితా వికాసహేతువుల్ని చక్కగా అనుశీలించి వర్తమాన సాహిత్య స్వభావాన్ని చూపుతున్న నిలువుటద్దం—

* ప్రముఖ విమర్శకులు, రసజ్ఞులు, కవి పండితులు, పరిశోధకులూనైన సదసద్వివేక విద్వాంసులచే విరచింపబడిన—

సాహిత్య భాష్యం

# అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు

దేశం కోసం
ఈ దేశంలో మొలకెత్తిన
ధర్మం కోసం
ప్రజల జీవనాడిలో
రాగాలు పలికించి
మానవత నుద్దీపింపజేసి
ప్రేమ మధువులొలికించి
ఉపనిషద్విజ్ఞాన జాహ్నవిని
ఈ ధాత్రిపై పారించిన
తత్వవేత్త, ఆర్షధర్మప్రవక్త, సంఘసంస్కర్త
పరివ్రాజక ప్రభువు
కర్మయోగి

## స్వామి వివేకానందునికి

## అంకితం

# వ్యాసాలు – వ్యాసకర్తలు

# ఇట్లా సవరించండి

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 64 | 21 | ఆ కవితారూపం | అకవితారూపం |
| 66 | 9 | ఆ కవితాధోరణి | అకవితాధోరణి |
| 67 | 4 | సమాజాన్ని | సమాజాన్ని చిత్రించారు |
| 73 | 22 | వచ్చిన | వచన |
| 80 | 9 | 1936 | 1946 |
| 185 | 20 | తత్సమరాజులూ | తత్సమపదాలూ |
| 187 | 13 | సన్నటి జట్కా-వాలా | నిన్నటి జట్కా-వాలా |
| 192 | 4 | కొంత తగ్గించి మిశ్రమ శైలిని పాటించినట్లుగా కనబడుతుంది. | — |
| 193 | 5 | పాడించినట్లుగా | పాటించినట్లుగా |
| 202 | 19 | వైచిత్ర్య | వైచిత్ర్యా, వైచిత్రం |
| 209 | 27 | అరసమెందు? | అరసమెందుకు |
| 227 | శీర్షిక | నేటి కత్వంలో | నేటి కవిత్వంలో |
| 253 | 14 | 'తేట వలపు' | 'తేటి వలపు' |



# వేదిక

'సాహితీ బంధు బృందం' 1955 లో స్థాపింపబడి 1985 నాటికి మూడు దశాబ్దాలు పూర్తిచేసుకున్నది. సంస్థకు ముప్పై సంవత్సరాలు నిండిన శుభ సందర్భంలో "అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు" అనే విషయంపై సాహిత్య సదస్సు నిర్వహించాలని నిర్ణయించుకున్నాం. మా ఈ తలంపు మార్చి 1986 నాటికిగాని ఫలించలేదు. చిత్రమేమిటంటే "అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు" గురించి పరిశీలించడమంటే సరిగ్గా ఈ ముప్పై సంవత్సరాల కాలానికే వర్తిస్తున్నది. ఎందుకంటే అభ్యుదయ కవిత్వం తన ఉద్యమ లక్షణాన్ని కోల్పోయి దాని స్థానంలో సరికొత్త కవితా ధోరణులు ప్రవర్తిల్లింది సుమారు 1955 నుండే అని పలువురు పండితుల అభిప్రాయం. ఇది కాకతాళీయంగానే జరిగినట్లు ఈనాడు మనకు కనిపించినా 1955 లోనే 'సాహితీ బంధు బృందం' స్థాపన ఒక గురుతరమైన చారిత్రక నేపథ్యంతో జరిగిందేమోనని ఊహించవలసివస్తున్నది. సాహిత్యరంగంలో బాధ్యతాయుతమైన పాత్రను నిర్వహించడానికి దీని అవసరం అనాడు ఏర్పడి ఉంటుంది. ఆ తరువాత 1 నవంబరు 1956 లో ఆంధ్రప్రదేశ్ అవతరించింది. అక్కడి నుండి ఆధునిక తెలుగు కవిత్వ స్వరూప స్వభావాల్లో మార్పు వచ్చింది. ఈ మార్పును గుర్తించి దాని అంతస్తత్వాన్ని సహేతుకంగా వ్యాఖ్యానించడం ఈ కార్యక్రమ లక్ష్యం.

దేశంలో కొనసాగుతున్న ఆర్థిక రాజకీయ పరిస్థితుల అవగాహనతో సామాజిక చైతన్య స్ఫూర్తితో నిర్మాణాత్మకమైన దిశలో సమాజాభ్యుదయాన్ని కాంక్షిస్తూ వ్యక్తి వికాసానికి తోడ్పడే విధంగా కావ్యకళా గౌరవానికి భంగం లేకుండా సాహిత్య సృష్టి జరగాలని 'సాహితీ బంధు బృందం' ఆశిస్తుంది. అటువంటి రచయితల్ని ఆహ్వానిస్తుంది. ఆ లక్ష్యసాధన కోసం కార్యక్రమాల్ని చేపడుతుంది.

'అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు' అనే సదస్సుకు మా ఆహ్వానాన్ని మన్నించి ప్రముఖ పండితులు విమర్శకులు దూరప్రాంతాల నుండి కూడ వచ్చి కార్యక్రమంలో పాల్గొని వ్యాసాల్ని సమర్పించినారు. మరికొందరు సదస్సులో

పాల్గొనకపోయినా మా కోరిక మేరకు వ్యాసాలు రాసి పంపించి మా ఈ పుస్తక ప్రచురణ విజయవంతం కావడానికి సహకరించినారు. మరికొందరు అనివార్య కారణాలవల్ల మా అభ్యర్థన ప్రకారం వ్యాసాలు పంపించలేకపోయినారు. వాళ్ళ వ్యాసాలు కూడ మా కంది ఈ పుస్తకాన్ని అలంకరించి ఉంటే దీని శోభ మరింత పెరిగి ఉండేదని సవినయంగా మనవి చేస్తున్నాం. ఈ అందరికీ మా వందనాలు. సదస్సు నిర్వహణ కోసం మా కోరికను మన్నించి అప్పటి వరంగల్లు జిల్లా కలెక్టరుగారు రూకు రు. 2000 = 00 మంజూరీచేసినారు. ఇంకా శ్రీ కె. యస్. ఆర్. జి. ప్రసాద్ (ప్రముఖ న్యాయవాది) వంటి సాహితీ ప్రియులు వదాన్యులు మా బుజం తట్టి మమ్మల్ని ముందుకు నడిపించినారు. వాళ్ళకందరికీ మా ధన్య వాదాలు. పుస్తక ప్రచురణలో మమ్మల్ని ప్రోత్సహించిన శ్రీ టి. పురుషోత్తమ రావు (మాజీ ఎం. ఎల్. ఏ.) వంటి విద్యావేత్తలకు మా కృతజ్ఞతాభి వందనాలు.

అభ్యుదయ కవితోద్యమం చల్లారిన పిదప ఇటీవలి ధోరణుల గురించి విశ్లేషణాత్మకంగా అనుశీలన చేసిన పుస్తకాలు మనకు చాలా తక్కువ. ఈ లోటును తీర్చే ఉద్దేశంతో మేము కేవలం సదస్సు నిర్వహించడంతోనే తృప్తి పడక ఈ గ్రంథ ప్రచురణకు కూడ పూనుకున్నాం. దీనికి హార్దికంగానే కాక ఆర్థికంగానూ సహకరించి మమ్మల్ని తమ హర్షామోదములతో ఆశీర్వదించిన పెద్ద లెందరో ఉన్నారు. అట్టి ఉదార హృదయుల పేర్లు వేరే పట్టికలో ప్రకటిస్తున్నాం. వాళ్ళకందరికీ మా కృతజ్ఞతాభి వందనాలు. ఈ సంకలనానికి సంపాదకుడుగా వ్యవహరించి ఇంతటి ప్రామాణిక గ్రంథంగా వెలువడడానికి కారకులైన ఆచార్య పేర్వారం జగన్నాథంగారికి మా కృతజ్ఞతలు. సదస్సు ప్రారంభోత్సవంలో ప్రధాన వక్తగా పాల్గొనడమేకాక ఈ పుస్తక ప్రచురణ గురించి కూడ మాకు అన్ని విధాలుగా సహకరించి సలహాలందించిన ఆచార్య జి. వి. సుబ్రహ్మణ్యం గారికి మా అభివాదాలు. అందంగా అతి శీఘ్రంగా పుస్తకాన్ని ముద్రించి మాకానందాన్ని చేకూర్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు యాజమాన్యా నికీ, దాని సిబ్బందికీ మా కృతజ్ఞతాభివందనాలు. సాహితీ ప్రియులూ, విద్యా వేత్తలూ, దాతలూ సహకరిస్తే త్వరలో "సాహిత్యం - సమాజం - రాజకీయాలు" అన్న అంశంపై ప్రముఖులతో సదస్సు నిర్వహించడానికి సిద్ధంగా ఉన్నామని మనవి చేస్తున్నాం.

శ్రీ ప్రభవ, విజయదశమి
తేది [illegible]

కె. వి. కృష్ణమాచార్య
కార్యదర్శి

# నివేదిక

'సాహితీ బంధు బృందం' ఆధ్వర్యంలో 'అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు' అనే విషయంపై వైభవోపేతంగా నాలుగురోజులు సదస్సు నిర్వహించినాం. దీనితో వరంగల్లు పట్టణంలోనే కాక స్థానిక విద్యా సంస్థల్లో విశ్వవిద్యాలయంలో గొప్ప సంచలనం కలిగింది. విద్వజ్జనులంతా పరమానందాన్ని వ్యక్తం చేసినారు. సభలు దిగ్విజయంగా జరుగడాన్ని పత్రికలు వేనోళ్ళ కీర్తించినాయి. విద్యార్థులూ యువకులూ ఈ సదస్సు ఇచ్చిన నూతనోత్తేజంతో ప్రభావితులై సాహిత్యంపై సదవగాహన పెంపొందించుకున్నారు. సాహిత్యం పేరుతో అలజడులూ అల్లరులూ వెకిలివేషాలూ ధోరణులుగా చలామణి కావడం హేయంగా గుర్తించినారు. సదస్సు నిర్వహణకోసం ఈ దిగువ పేర్కొన్న సభ్యులతో ఒక కార్యనిర్వాహక మండలిని ఏర్పాటు చేసుకున్నాం—

1. డా॥ పేర్వారం జగన్నాథం - అధ్యక్షుడు
2. శ్రీ కె.వి. కృష్ణమాచార్య - కన్వీనర్
3. శ్రీ నమిలికొండ బాలకిషన్‌రావు - ఆర్గనైజర్
4. డా॥ కె. యాదగిరి
5. శ్రీ పొట్లపల్లి శ్రీనివాసరావు
6. శ్రీ శీలం రాజేశం
7. శ్రీ లింగంపల్లి రామచంద్ర

నాలుగు రోజుల కార్యక్రమాలతో సదస్సు ఈ విధంగా జరిగింది—

**I.** ది. 15-3-1986 ప్రారంభ సమావేశం

అధ్యక్షులు : శ్రీ కాళోజీ రామేశ్వరరావు

ముఖ్య అతిథి : శ్రీ కె.యస్.ఆర్.జి. ప్రసాద్

ప్రారంభకులు
అనుభూతి వాదం } ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం

**II.** ది. 16-3-1986

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | శ్రీ కె.యస్.ఆర్.జి. ప్రసాద్ |
| వక్తలు | : | డా॥ అరిపిరాల విశ్వం |
| | | శ్రీ ఆద్దేపల్లి రామమోహనరావు |
| | | శ్రీ ఇంద్రగంటి శ్రీకాంతశర్మ |

**III.** ది. 22-3-1986

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | ఆచార్య ఎస్. లక్ష్మణమూర్తి |
| వక్త | : | డా॥ వి.వి.ఎల్. నరసింహారావు |

**IV.** ది. 23-3-1986 - ముగింపు సమావేశం

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | శ్రీ అనుముల కృష్ణమూర్తి |
| ముఖ్య అతిథి | : | శ్రీ కె. అరవిందరావు, ఐ.పి.ఎస్. |
| వక్త | : | డా॥ కోవెల సంపత్కుమారాచార్య |
| సమీక్ష | : | ఆచార్య పేర్వారం జగన్నాథం |

మా కోరిక మేరకు సదస్సులో పాల్గొన్న వక్తలు తమ తమ వ్యాసాల్ని మా కందించినారు. పనుల వత్తిడివల్ల ఒక్క డా॥ అరిపిరాల విశ్వం మాత్రం తమ రచనను మాకు పంపించలేకపోయినారు. ఆ తరువాత పుస్తక ప్రచురణ కోసం వేరు వేరు అంశాలపై వ్యాసాల్ని రాయవలసిందిగా కోరుతూ రాష్ట్రంలోనే కాక రాష్ట్రేతర ప్రాంతాల్లోనూ ఉంటూ సదస్సులో పాల్గొనలేకపోయిన ఆయా పండితులకెందరికో లేఖలు రాసినాము. మా కోరికను మన్నించి కొందరు విద్వాంసులు తమ తమ వ్యాసాల్ని మా కందజేసినారు. ఈ రచనలనన్నింటినీ ఇందులో సంకలితం చేసి మీ ముందుంచుతున్నాం. ఆయా అంశాలపై వ్యాసాలు పంపించవలసిందిగా ఈ దిగువ పేర్కొన్న పండితుల్ని కూడ అర్థించినాము. అనివార్య కారణాలవల్ల వాళ్ళు తమ వ్యాసాల్ని అందించలేకపోయినారు. వాళ్ళ రచనలు కూడ ఈ గ్రంథంలో చేరి ఉంటే దీని విలువ మరింత పెరిగి ఉండేదనడంలో సందేహం లేదు. ఐనా వీళ్ళందరి సహకారం మాకు మునుముందైనా తప్పక లభిస్తుందని ఆశిస్తున్నాం.

1. శ్రీ శీలా వీర్రాజు
2. శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు
3. శ్రీ కడియాల రామమోహనరాయ్
4. శ్రీ టి.ఎల్. కాంతారావు
5. డా॥ అమరేంద్ర
6. డా॥ ముదిగొండ శివప్రసాద్
7. డా॥ ఏటుకూరి ప్రసాద్
8. డా॥ ఎస్. భక్తవత్సలరెడ్డి
9. డా॥ మిరియాల రామకృష్ణ
10. డా॥ అత్తలూరి నరసింహారావు
11. ఆచార్య మద్దూరి సుబ్బారెడ్డి
12. ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ
13. ఆచార్య సాళ్వ కృష్ణమూర్తి
14. ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు
15. ఆచార్య కొర్లపాటి శ్రీరామమూర్తి

ఈ సదస్సు నిర్వహణలో పుస్తక ప్రచురణలో మాతో సహకరించిన రచయితలకూ దాతలకూ సాహితీ ప్రియులకూ విద్యా వేత్తలకూ సమస్త ప్రజానీకానికీ ధన్యవాదాలు.

హనుమకొండ

దీ. 2-10-198

నమిలికొండ బాలకిషన్ రావు

ఆర్గనైజర్

# గ్రంథ ప్రచురణకోసం

# భూరి విరాళాలిచ్చి సహకరించిన దాతలు

## ఈ అందరికీ మా వందనాలు

1. శ్రీ కావూరి రామారావు — రు. 5000-00
రైల్వే కంట్రాక్టర్, రాంనగర్
హనుమకొండ-వరంగల్లు.

2. శ్రీ ఎం. మోహన్‌రావు — రు. 2000-00
ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్
ఎస్సి సర్వీసు కో-ఆపరేటివ్ సొసైటీ, లిమిటెడ్
వరంగల్లు.

3. డా॥ ఎ. సురేంద్రకుమార్ — రు. 2000-00
ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్
ఎస్సి సర్వీసు కో-ఆపరేటివ్ సొసైటీ, లిమిటెడ్
ఆదిలాబాదు.

4. శ్రీ నమిలికొండ బాలకిషన్ రావు — రు. 1116-00
అడ్వొకేటు, రాగన్న దర్వాజ
హనుమకొండ-వరంగల్లు.

5. శ్రీమతి పొన్నాల రాధమ్మ — రు. 1116-00
ఖిలాషాపురం, రఘునాథపల్లి మండలం
తా॥ జనగామ, జి॥ వరంగల్లు

6. శ్రీ అల్లూరి మూర్తిరాజు — రు. 1116-00
హంటర్ రోడ్డు
హనుమకొండ-వరంగల్లు.

7. శ్రీ పెరుమాండ్ల జగన్మోహన్ రు. 500-00
కరెస్పాండెంట్, మోడల్ పబ్లిక్ స్కూల్
నయీం నగర్,
హనుమకొండ-వరంగల్లు.

8. శ్రీ గుజ్జుల రామిరెడ్డి రు. 500-00
పీసర, ధర్మసాగరం మండలం
తా॥ వరంగల్లు, జి॥ వరంగల్లు.

9. శ్రీ ఇరుకుళ్ల సదానందం రు. 200-00
డివిజనల్ అకౌంట్స్ ఆఫీసర్
ఐ. బి. డివిజన్, నక్కలగుట్ట,
హనుమకొండ-వరంగల్లు

10. శ్రీ ఎనుములపల్లి రామానుజం రు. 100-00
సీనియర్ అసిస్టెంట్
వైద్య & ఆరోగ్య శాఖ- లష్కర్ బజార్,
హనుమకొండ-వరంగల్లు.

11. శ్రీ మునిగేటి సత్యనారాయణ రు. 100-00
డిప్యూటి ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్ (పి. హెచ్.)
బాలసముద్రం,
హనుమకొండ-వరంగల్లు.

12. శ్రీ పోకల చందర్ రు. 100-00
అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజినీర్
శ్రీరామసాగర్ ప్రాజెక్టు (ఐ. డి.)
హనుమకొండ-వరంగల్లు.

# సాహితీ బంధు బృందం

హనుమకొండ-వరంగల్లు

## శాశ్వత సభ్యులు

1. శ్రీ కావూరి రామారావు
   హనుమకొండ-వరంగల్లు
2. శ్రీ ఎం. మోహన్ రావు
   హనుమకొండ-వరంగల్లు
3. డా॥ ఏ. సురేంద్రకుమార్
   ఆదిలాబాదు.
4. శ్రీ నమిలికొండ బాలకిషన్ రావు
   హనుమకొండ-వరంగల్లు
5. శ్రీమతి పొన్నాల రాధమ్మ
   ఖిలాషాహపురం-వరంగల్లు జిల్లా.
6. శ్రీ అల్లూరి మూర్తిరాజు
   హనుమకొండ-వరంగల్లు.
7. శ్రీ పెరుమాండ్ల జగన్మోహన్
   హనుమకొండ-వరంగల్లు.
8. శ్రీ గుజ్జుల రామిరెడ్డి
   పీసర, వరంగల్లు జిల్లా.

సంపాదకీయం :

# నవాలోకన

పేర్వారం జగన్నాథం

'తా' నొక గడ్డకట్టుకొని తత్పరతన్ శిలలై నశించు స
జ్ఞానుల కేడనోయి సుఖసంగతి! తా తనయాలు నాత్మసం
తానము తోడబుట్టువులు తల్లియు దండ్రి కులమ్ము దేశమున్
మానవు లెల్లప్రాణులు కుమార! సమస్తము దాను గావలెన్.

—సౌందరనందము.

## I

'అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు' అన్నప్పుడు అభ్యుదయకవిత్వం ఆగిపోయిందా అన్న సందేహం సామాన్యంగా కలుగుతుంది. "అభ్యుదయ కవిత్వం ఇంకా కొనసాగుతూనే ఉందిగదా! అభ్యుదయ కవిత్వానంతరం అనడం సబబుగా ఉంటుందా?" అని ఎవరైనా అనుకోవచ్చు.

అందుకని ముందు అభ్యుదయ కవిత్వం ఆగిపోయిందా అన్న ప్రశ్నకు సమాధానం వెదుకవలసి ఉన్నది. ఆ భావధోరణితో ఇప్పటికీ ఒకటీఅర కావ్యాలు వస్తున్నా దాని ఉద్ధృతి ఏనాడో తగ్గిందని చెప్పక తప్పదు. అది పందొమ్మిది వందల ముప్పైలో ప్రారంభమై తెలంగాణా సాయుధపోరాటం ఊపుతో మహోజ్వలంగా ప్రకాశించి ఆ తరువాతికాలంలో క్రమంగా కనుమరుగై పోయింది. వజ్రాయుధం, త్వమేవాఽహం, అగ్నివీణ, అగ్నిధార, రుద్రవీణ, అడవి, సంఘర్షణ, ఉదయిని, మహాప్రస్థానం వంటి ప్రముఖ అభ్యుదయ కావ్యాలన్నీ 1949, 1950ల లోనే మొదటిసారి పుస్తకరూపంలో వెలువడినాయి. ఇవి పోగా మిగిలిన ఒకటి రెండు కావ్యాలు 1955, 56 వరకల్లా ప్రచురింపబడినాయి. ఈ కావ్యాల వరుసలో నిలువగలిగిన అభ్యుదయ కావ్యమేదీ ఆ తరువాత కొత్తగా రచింపబడిన జాడ మనకు కనిపించదు. అప్పటినుంచే ప్రముఖ అభ్యుదయ కవుల్లో కావ్య వస్తువు గురించిన నూతనాన్వేషణ ప్రారంభమైంది.

ఏ ఉద్యమమైనా యుగమైనా హఠాత్తుగా ఆరంభం కానట్లే, హఠాత్తుగా ఆగిపోనూపోదు. దాని భావధోరణులు, ఛాయలు ఆ తరువాత కాలంలో కూడ అంతో ఇంతో ప్రసరిస్తూనే ఉంటాయి. ఈ రోజుల్లో కూడ పురాణాలు ప్రబంధాలు భావకవితా రచనలు వెలువడినంతమాత్రాన నేటికాలాన్ని ఆ పేర్లతో పిలువలేము. అట్టాగే నేటికి అభ్యుదయ భావధోరణికల కావ్యాలు వెలువడుతూ ఉండవచ్చు. అంతమాత్రంచేత అభ్యుదయ కవిత్వం నేటికీ తెలుగు సాహిత్యాన్ని పరిపాలిస్తున్నదని చెప్పడం కుదరదు. ఆధునికాంధ్ర కవితా సామ్రాజ్యాన్ని అభ్యుదయోద్యమం 1934 నుండి 1955 వరకు అంటే దరిదాపు రెండు దశాబ్దాలు పరిపాలించిందని చెప్పడం అహేతుకమేమీకాదు. తెలుగులో నవ్యకవితా ప్రస్థాన చరిత్రను పరిశీలించిన విమర్శకులు, పరిశోధకులు అట్లాగే భావిస్తున్నారు. ఆ విషయం ఈ సంకలనంలోని వ్యాసాలవల్ల మరింత దృఢపడుతున్నది. 'అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు' అంటే-సుమారు 1955 దాకా అభ్యుదయోద్యమం తెలుగు కవితపై తన ప్రాబల్యాన్ని నెరపిన కాలంగా గుర్తించి, అక్కడి నుండి ఆధునికాంధ్ర కవిత్వంలో ప్రవర్తిల్లిన నూతన ధోరణుల గురించి ఈ వ్యాసాల్లో అనుశీలించడం జరిగింది. ఈ సందర్భంలో 1955 కు ముందు మన తెలుగు నేలలో రాజకీయ, సాంస్కృతిక, సాహిత్యాది రంగాల్లో కలుగుతూ వచ్చిన పరిణామాల్ని సింహావలోకనం చేసుకోవడం అవసరం.

1948లో హైదరాబాదు రాష్ట్రంపై పోలీసు చర్య జరిగి అది ఇండియన్ యూనియన్‌లో కలిసిపోయింది. అంతకుముందునుంచే అనగా 1946 నుంచీ సాగుతూ వచ్చిన తెలంగాణా సాయుధ పోరాటాన్ని ఆపివేయక కమ్యూనిస్టులు దాన్ని 1951 దాకా పొడిగించినారు. చివరికి వాళ్ళు ఆయుధాల్ని దించివేసి ప్రభుత్వంతో రాజీకి వచ్చి 1952 లో జరిగిన మొట్టమొదటి సాధారణ ఎన్నికల్లో పాల్గొన్నారు. ఇక్కడే అభ్యుదయ కవితోద్యమం మొదటిసారి నైతికంగా దెబ్బతిన్నది. ఈమధ్య కాలంలో ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రోద్యమం బలపడి పొట్టి శ్రీరాములు చేసిన ప్రాణత్యాగ ఫలితంగా 1 అక్టోబరు 1953 నాడు మదరాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతంతో 'ఆంధ్రరాష్ట్రం' అవతరించింది. కాని హైదరాబాదు రాష్ట్రంలోని తెలంగాణం ఆంధ్రరాష్ట్రంలో చేరలేదు. అందుకని భాషా ప్రయుక్త రాష్ట్రాల ప్రాతిపదికగా విశాలాంధ్ర నిర్మాణం కావాలని అయ్యదేవర

కాళేశ్వరరావు వంటి నాయకుల ఆధ్వర్యంలో దేశంలో మహోద్యమం సాగింది. విశాలాంధ్ర సదస్సులు జరిగినాయి. రాజకీయ నాయకులేకాక విద్యార్థులూ, సాహితీవేత్తలూ ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. కవులు తమ వంతు బాధ్యతను నిర్వహించినారు. ఆంధ్రప్రదేశ్ అవతరించేదాకా కవుల కంఠాలు కంఠీరవాల్లా నినదించినాయి.

అప్పటి హైదరాబాదు రాష్ట్రంలో 'తెలంగాణా రచయితల సంఘం' ఏర్పడి యువకుల్లో సాహిత్య చైతన్యాన్ని ఉత్తేజాన్ని పెంపొందించింది. కాళోజి, దాశరథి, సి. నారాయణరెడ్డి, బి. రామరాజు వంటి యువకులు ఈ సంఘానికి సారథ్యం వహించినారు. వీళ్ళలో కాళోజి 'నా గొడవ' (1953)ను ప్రకటించి జాతీయ భావ ప్రసారానికి దోహదం చేసినాడు. మనిషిలోని బలహీనతల్ని పట్టి చూపి, మనిషిని సంఘజీవిగా మలచి మానవతకు మణికిరీటాన్ని తొడిగిన కావ్యమిది. ఈయన నైజాం ప్రభుత్వాన్ని ఎదిరించి జైలుకు వెళ్ళిన కార్యవాది. ఇప్పటికీ ఆయన కలం సంఘంలోని అన్యాయాల్ని అక్రమాల్ని ఖండిస్తూనే ఉన్నది.

దాశరథి అప్పటికే రుద్రవీణను పలికించి 'అగ్నిధార'లు కురిపించినాడు. మహాంధ్రోదయం, పునర్నవంకోసం ఆయనలో తపన ప్రారంభమైంది. ఈయన కూడ తెలంగాణా పోరాటంలో పాల్గొని నైజాం సర్కారుచేత చేతులకు బేడీలు వేయించుకున్నవాడే. ఈయన సరసరాల్లో తెలంగాణా ప్రజల వాణి ప్రతిధ్వనిస్తుంటుంది. ఐనా ఈతడు మూడు కోటులనొక్కటే ముడి బిగించాలని ఆశించిన వైతాళికుడు. నేటికీ ఈయన నిర్విరామంగా సాంఘిక చైతన్య స్ఫూర్తితో దేశీయతా ముద్రను వదలకుండా రచనలు చేస్తున్నాడు. అభ్యుదయ భావాల్ని పద్యాల్లో చెప్పి మెప్పించిన అభ్యుదయ కవి ఈయన ఒక్కడేనేమో!

సి. నారాయణరెడ్డి తెలుగు మాగాణిలో జలపాతాన్ని దూకించి విశ్వగీతిని వినిపిస్తున్నాడు. ఆయనలో వ్యక్తి చైతన్యం సంఘ చైతన్యంగా రూపుదిద్దుకుంటున్నది. ఆ తరువాతి కాలంలో ఈయన సంఘంకోసం ఆత్మార్పణ గావించిన త్యాగమూర్తుల జీవితేతివృత్తాలతో కావ్యాలనేకం రచించినాడు. సామాజికచైతన్యం ఈతని రచనల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. ఇదే సమయంలో తెలంగాణా రచయితల సంఘం అఖిలాంధ్ర కవుల కావ్యఖండికల్ని సంకలితంచేసి 'ఉదయ

ఘంటలు' (1953) ప్రచురించింది. ఇది యువతరంలో సాహిత్య చైతన్యాన్ని రగుల్కొలిపి సమాజంపట్ల సదవగాహనను కలిగించింది. 'వైతాళికులు' తరువాత మళ్ళీ చెప్పుకోదగినదీ 'ఉదయ ఘంటలు.'

ఇంతేకాక హైద్రాబాదును కేంద్రంగా చేసుకొని జాతిపునర్నిర్మాణానికీ దేశం భవిష్యత్తుకూ అంకితమైన సాంస్కృతిక సాహిత్య సంస్థలు మరికొన్ని వున్నాయి. ఆంధ్ర సారస్వత పరిషత్తు భాగవతోపన్యాసాలు భారతోపన్యాసాలు వంటి ఉత్తమ సాహిత్య సదస్సుల్ని నిర్వహించడమేకాక తెలుగు భాషాభివృద్ధికి పరీక్షలు నడిపించి సాంస్కృతిక చైతన్యానికి దోహదం కలిగించింది. దేవులపల్లి రామానుజరావు, గడియారం రామకృష్ణశర్మ వంటి ప్రముఖులు దీనికి నేతృత్వం వహించినారు. ఇప్పటికీ దాని సేవ మరువరానిది. దేశోద్ధారక గ్రంథమాల ద్వారా వట్టికోట ఆళ్వారుస్వామి తెలుగు ప్రజల సాంస్కృతిక వికాసానికి ఏతమెత్తి నీళ్ళు తోడినాడు. శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం తెలుగు భాషా సంస్కృతుల వ్యాప్తికోసం ఇతోధికంగా కృషి చేసింది. ఇప్పటికీ నిరాటంకంగా నిర్వహిస్తూనే ఉన్నది. వీటన్నింటికి "ఆంధ్రపితామహ" మాడపాటి హనుమంతరావు, సురవరం ప్రతాపరెడ్డి వంటి మహనీయులు వేసిన పునాదులే కారణం. అవి సువిశాల ప్రాతిపదికపై నిర్మింపబడినాయి. ఇవికాక హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయం పరిధిలోని కళాశాలావిద్యార్థులకోసం "ఆంధ్రాభ్యుదయోత్సవాలు" నిర్వహింపబడేవి. యువతరం విద్యార్థుల్లో ఈ ఉత్సవాలు కలిగించిన సాంస్కృతిక వైజ్ఞానిక వికాసం అద్వితీయమైంది. దేశభాషలపై దేశీయ సంస్కృతిపై మక్కువను కలిగించి, దేశాభిమానం పెంచినాయి. ఆంధ్రాభ్యుదయోత్సవాలు ఆగిపోయిన సమయాన రాజధానీ నగరంలో "యువభారతి" వెలసింది. ప్రాచీన ఆధునిక తెలుగు సాహిత్యాలకు ఇది చేసిన చేస్తున్న సేవ అద్వితీయం. యావదాంధ్రదేశంలో సాహిత్య చైతన్యాన్ని కలిగించి సత్సంప్రదాయాన్ని నెలకొలిపిన వి. విశ్వనాథం, జి.వి. సుబ్రహ్మణ్యం, ఇరివెంటి కృష్ణమూర్తి మొదలైన ప్రముఖులు దీనికి మూలస్తంభాలవంటివాళ్ళు.

మరోవంక కవికోకిల జాషువ జాతీయ భావస్ఫూర్తితో కావ్యరచన సాగిస్తూ దేశాభిమానం పురికొల్పుతున్నారు. జాతీయ నాయకుల జీవితచరిత్రను కావ్యం చేసి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందిస్తున్నాడు. కరుణరసపోషణతో

మానవతా వాదానికి పట్టం కడుతున్నాడు. పాత్రలకు సరికొత్త జీవంపోస్తూ ఆధునిక సమాజాని కనుగుణంగా 'కరుణశ్రీ' పౌరాణిక ఐతిహాసిక కథల్ని వ్యాఖ్యానిస్తున్నాడు. పద్యాన్ని సామాన్య ప్రజలదాకా తీసుక వచ్చిన ఖ్యాతి తిరుపతి వెంకట కవుల తరువాత మళ్ళి జాషువ, 'కరుణశ్రీ'లకే దక్కుతుంది. మధునాపంతుల తన 'ఆంధ్ర పురాణం' ఈ కాలంలోనే పూర్తి చేసినాడు. ఇది ఆంధ్రుల మహోజ్జ్వల చరిత్రకు నీరాజనం పట్టిన మహేతిహాసం. మరోవంక మన తెనుగు లెంక తుమ్మల ఆత్మకథను ముగించి మహాత్మకథకు ఉద్యుక్తుడైనాడు. కట్టులో బొట్టులో మాటలో మమతలో తెలుగుదనం ఉట్టిపడుతూ మహాత్ముని ఆస్థాన కవిగా పేరొందినాడు. అచ్చమైన జాతీయ కవి. నేటికీ తెలుగువాళ్ళ జీవితం ఉట్టిపడే విధంగా కావ్యాలనేకం రచిస్తున్నాడు. కవిసమ్రాట్ విశ్వనాథ రామాయణ కల్పవృక్షం సుందరకాండలోకి ప్రవేశిస్తున్నాడు. ఈయన వదిలిపెట్టిన సాహిత్య ప్రక్రియ అంటూ లేదు. ప్రాచీన సాంస్కృతిక మహత్వాన్ని ఆర్షధర్మాన్ని తాసాశించిన ఆదర్శ సమాజాని కనుగుణంగా వ్యాఖ్యానిస్తున్నాడు. ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఆయన ఒక హిమవన్నగ శిఖరం వంటివాడు.

ఈ సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలు 'ఆంధ్రప్రదేశ్' ఏర్పడేదాకా దేశంలో ప్రచలితంగా సాగి యువతరంలో దేశభక్తినీ, దేశాభిమానాన్ని పెంపొందించినాయి. జాతి తనను తాను దర్శించుకొని గుణదోషవిచారణ చేసుకోవడానికి సహకరించినాయి. అంతేకాక స్వస్థాన వేష భాషల్ని పునరుద్ధరించుకోవడానికీ తదనుగుణంగా తెలుగు భాషా సాహిత్యాల్ని మలచుకోవడానికీ నేపథ్యంగా పని చేస్తినాయి.

మరొకవైపు 1955 ఉప ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ ఆంధ్రలో ఘోరంగా పరాజయం పొందింది. దీనితో దానికి అనుబంధంగా ఉన్న అభ్యుదయ రచయితల సంఘం నిర్వీర్యమై పోయింది. అభ్యుదయ కవితోద్యమానికి ఇది రెండవ దెబ్బ. దీన్ని మళ్ళి పునరుద్ధరించడానికి ఎన్ని ప్రయత్నాలు జరిగినా కాలచక్ర పరిభ్రమణంలో అతకడంలేదు. ఎందరు అవునన్నా కాదన్నా అభ్యుదయ రచయితల సంఘానికి మార్క్సిస్టు తత్వచింతన వెన్నెముకవంటిదన్న సంగతి మరువరానిది. రచయితల సంఘం కమ్యూనిస్టు పార్టీకి అనుబంధంగా పనిచేసిందని చరిత్ర చెబుతున్నది 1955 విజయవాడలో జరిగిన ఐదవ మహాసభలతో అభ్యుదయ రచయితల సంఘానికి వీడ్కోలు విందు చేసినట్లైంది. ఈ పరిస్థితుల్లో నుంచి 1 నవంబరు 1956 నాడు హైదరాబాదు రాజధానిగా ఆంధ్రప్రదేశ్ అవతి

రించింది. అప్పటినుంచి అఖిలాంధ్ర దేశానికి హైదరాబాదు నగరం సాహిత్య సాంస్కృతిక కార్యకలాపాలకు ప్రధాన క్షేత్రమైంది.

ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డంతోటే దేశంలో అక్కడక్కడా ఉన్న కవులు రచయితలూ ఉద్యోగరీత్యా హైదరాబాదుకు మారినారు. అట్లా గోపీచంద్, నాయని సుబ్బారావు. రాయప్రోలు భరద్వాజ, బుచ్చిబాబు, కుందుర్తి, బోయి భీమన్న, కృష్ణశాస్త్రి మొదలైన రచయితలంతా హైదరాబాదుకు చేరినారు. ఈ అవకాశాన్ని తీసుకొని కుందుర్తి వచన కవితా ప్రచారానికి పూనుకున్నాడు.

ఇదీ అభ్యుదయ కవితోద్యమానికి క్రమంగా తెరపడిన దృశ్యం.

భావ కవిత్వం నిస్తేజమై పోతున్న రెండవ దశలో దానిపై తిరుగుబాటుగా వచ్చిన అభ్యుదయకవితోద్యమంవల్లా తెలుగు సాహిత్యానికొక మేలే జరిగింది. కవిత్వం ఆకాశయానం మానుకొని భూమార్గం పట్టింది. ఊహా ప్రేయసి వెంట పడడం వదులుకొని సమాజాభ్యుదయానికే అంకితమైంది. సామాన్యుడు మాన్యుడైనాడు. ఎన్నడో కోల్పోయిన సాహిత్యపరమార్థాన్ని అభ్యుదయ కవులు పునరుద్ధరించినారు. "విశ్వశ్రేయః కావ్యమ్" అన్న సూక్తికి మళ్ళీ గౌరవం పెరిగింది. మరి ఇంత చేసి అభ్యుదయ కవిత్వం ఏమీ సాధించకుండానే ఎందుకాగి పోయిందంటే-ఆ కవుల కంఠాలకు రిమోట్ కంట్రోల్ ఎక్కడో సప్తసముద్రాల కావల ఉండేది. వాళ్ళ కలాన్ని కదిలించే 'బిస' ఎక్కడో ఏ మట్టిచెట్టు తొఱ్ఱలోనో ఉండేది. మాతృదేశ గౌరవాన్ని కాపాడాలన్న ధ్యాస వాళ్ళకు లేదు. మార్క్సిస్టు తత్వచింతన ఆధారంగా వర్గ సంఘర్షణకు ప్రేరేపించడం వాళ్ళకున్న ఒకే ఒక్క ఆశయం. అది ఇక్కడి ప్రజల జీవన విధానానికీ పరంపరాగత దేశ సంస్కారానికీ కుదిరింది కాదు. ఇక కవితా శిల్పం గురించి చెప్పవలసి వస్తే అభ్యుదయ కవిత్వం రాను రాను పూర్తిగా నినాదప్రాయంగా మారింది. వస్తు వైవిధ్యం కొరవడింది. సుష్టుగా భోంచేసిన వాళ్ళే ఆకలి కేకల బాకాలూదడం ఎక్కువైంది. అభ్యుదయ కవిత్వమంటే పాడిందేపాటగా తయారైంది. అన్నింటి కన్నా మించి చిత్తశుద్ధి లోపించింది. మొదటి తరం కవుల వారసత్వాన్ని అందుకోగల రెండవ తరం కవులు పుట్టనేలేదు. కమ్యూనిస్టుపార్టీ ఎత్తుగడల వైఫల్య ప్రభావం అభ్యుదయ కవులపై ప్రసరిస్తూ వచ్చింది. అభ్యుదయ కవిత్వానికి మార్క్సిజం గుండెకాయవంటిదనీ, అభ్యుదయ రచయితల సంఘానికి కమ్యూనిస్టు పార్టీ చోదకశక్తి వంటిదనీ మరువరాదు.

# II

సుమారు 1955 నుండి ఆధునిక తెలుగు కవిత్వం అభ్యుదయ కవిత్వ ప్రభావం నుండి బయటపడి నూతన దిశాభిముఖంగా సాగింది. దీనికి తగిన బీజాలు దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన పిదప బలంగా నాటబడినాయి. ఇంతకు ముందు పేర్కొన్నట్లుగా స్వాతంత్ర్యానంతరం దేశంలో రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక పరిణామాలు జరిగి దేశం పునర్నిర్మాణ కార్యక్రమంలో నిమగ్న మైంది. ప్రజలు దేశాభిమాన ప్రపూరితులై భవిష్యత్తుపై ఆశలు పెంచుకున్నారు. సంఘంలోని వ్యక్తులంతా ఒకరినొకరు అర్థంచేసుకొని పరస్పరం ప్రేమించు కుంటూ మనుగడ సాగించాలన్న భావం ప్రచలితం కాసాగింది. సంఘంలోని దోషాలకు మరెవరినో బాధ్యులుగా చేసి ప్రౌఢ్ధస్తమానం నిందించడంకన్నా ఆత్మావలోకనంతో వాటిని నిర్మూలించుకోవాలన్న తపన ప్రారంభమైంది. పరా వలంబనతత్వం నిరసింపబడి స్వావలంబనభావానికి గౌరవం వచ్చింది. మనిషిపై మనిషి భరోసా పెంచుకొని మమతానురాగాలతో దేశప్రగతి కోసం పాటుపడా లన్న సంకల్పం దృఢపడింది. ఈ సామాజికభావ స్పందన కనుగుణంగానే సాహిత్య నిర్మాణం అంధునా-ఆధునిక తెలుగు కవితాప్రస్థానం సాగినట్లు పరి శీలనవల్ల మనం గమనించవచ్చు.

ఈ యుగోదయ సమయంలోనే లేతవెలుగు రేకలసవ్వడి ఆకసంలో ప్రాకి నట్లు సాహితీబంధు బృందం - వరంగల్లువారు ప్రచురించిన కవితా సంకలనం 'తొలికారు' (1955) వెలువడింది. ఇందులోని కవులంతా అప్పుడప్పుడే కొత్త గొంతులు విప్పుతున్న యువకవులే అయినా ఆ తరువాతికాలంలో దీనిలోని చాలా మంది ఆధునిక తెలుగు కవులలో ప్రముఖస్థానం అలంకరించినారు. ఈ సంకల నంలో నూతన సమాజ ఆవిష్కరణ కోసం సాగిన కవుల ఆర్తి కనిపిస్తుంది. బోయి భీమన్న దీపసభ (1955) పైన వివరించిన మహదాశయాలు ప్రతిఫలించే ఉత్తమకావ్యం. ఇందులో "మానవుడు పురోగమించడానికి ప్రాథమికంగా అతడికి కావలసింది స్వేచ్ఛ, సమృద్ధి. ఈ రెంటికోసం దీపసభలో సర్వోదయ సమాజ నిర్మాణం ప్రతిపాదించబడింది. సమాజం దీపాధారంవలె స్నేహపూరమైనప్పుడు మానవుడు అఖండజ్యోతివలె జగజ్జేగీయ మానుడు కాగలడ"ని సూత్రీకరించ బడింది.

"మానవుని భావనోద్యానమందు పూచు
ప్రతిసుమమ్మును ఫలియించు వసతినిడుము
ఒకనికోర్కెను ఢీకొని యొకని కోర్కె
బద్దలైపోవకుండ జాగ్రత్త పడుము"

అంటూ మానవాభ్యుదయాన్ని గూర్చి సర్వోదయ సిద్ధాంతం గూర్చి ప్రవచించిందీ కావ్యం.

ప్రజావాణికి మైక్ అమర్చి ప్రజలపక్షం నిలిచి ప్రజాపోరాటాల్లో పాల్గొన్న దాశరథి "మహాంధ్రోదయం" (1955) లో—

"మంగళ గీతి పాడెద హిమాచల శృంగ సరత్ సురాపగా
భంగతరంగ రంగముల పాదములూని నటించు బాలసా
రంగధరున్ వినీలచికురమ్ములలో ధరియించినట్టి భ
స్మాంగుని ఫాలనేత్రము నవాగ్నికణమ్ముల జిమ్ము దారులన్"

అంటూ దేశాభ్యుదయం కోసం తన కర్తవ్యమెట్టిదో కవి తెలియజేస్తున్నాడు. అంతేకాక—

"దూర దూరాల దీపాల తోరణాల
భరత వీరుల నెత్తుటి వరద కలదు
అందులో విచ్చె బంగారు టంబుజములు
భరత మాతృ పదమ్ముల వ్రాలుకొఱకు"

అంటూ దేశాభిమానాన్ని కలిగి ఉండడం ఎంతటి పవిత్రమైందో తెలియపరుస్తున్నాడు.

సి. నారాయణరెడ్డి 'నాగార్జున సాగరం' (1955) లో వ్యక్తి చైతన్యానికీ సంఘ చైతన్యానికీ జరిగిన సంఘర్షణ చక్కగా చిత్రింపబడింది. సంఘంకోసం స్వసౌఖ్యాన్ని త్యాగం చేసి ఆత్మార్పణ చేయవలసిన అవసరాన్ని ఈ కావ్యం సంబోధిస్తున్నది. దీని తరువాత వెలువడిన 'కర్పూరవసంతరాయలు' 'విశ్వనాథ నాయకుడు' వంటి కావ్యాల్లో కూడ ఇదే సందేశం ప్రతిపాదింపబడింది

'నయాగరా' కవుల్లో ఒకడై ప్రముఖ అభ్యుదయ కవి అయిన కుందుర్తి వచన కవితా ప్రక్రియను చేపట్టి 'తెలంగాణా' (1956) కావ్యం రచించినాడు. తెలంగాణా ముక్తికోసం సాగిన పోరాటం చరిత్ర దీనిలోని వస్తువు. కావ్యవస్తువు కానైతే అభ్యుదయ కవితోద్యమానికి సంబంధించిందే కాని కుందుర్తి ఈ కాలం నుండి వచన కవితా ప్రక్రియకు బహుళ ప్రచారాన్ని తలపెట్టి సభల్లో సమావేశాల్లో సమయం చిక్కినప్పుడల్లా గ్రంథ పీఠికల్లో వచన కవితా ప్రక్రియ అవశ్యకత గురించే ప్రస్తావించడం ప్రారంభించినాడు. 'ఫ్రీవర్స్ ఫ్రంట్'ను స్థాపించి దేశంలో వచన కవితా ప్రక్రియ గూర్చి సంచలనం కలిగించినాడు. యువకవుల్ని ఆకర్షించడమేకాక వచన కవితా ప్రక్రియను సమర్థిస్తూ 'వచన కవిత' అనే వ్యాస సంకలనాన్నికూడ ప్రచురించినాడు. ఈనాటి అవసరాలకు ప్రజాస్వామ్య స్వభావాన్ని సంతరించుకున్న ప్రక్రియ ఇదేనని సైద్ధాంతికంగా నిరూపించినాడు అంతేకాక వచన కవితా ప్రక్రియలో భిన్న భిన్న స్వభావాలతో కూడిన పాత్రల్ని పోషిస్తూ నవరస భరితంగా కథాకావ్యాల రచనకూడ సాగాలని సిద్ధాంతీకరించినాడు. దీనితో సహజంగానే కావ్యనిర్మాణంలో అభ్యుదయ వస్తువు గురించిన ప్రాధాన్యము తగ్గి వచన కవితా ప్రక్రియవైపు యువకవుల దృష్టి మళ్లింది. అంటే వస్తువు గురించిన పట్టుదల సడలి ప్రక్రియకు ప్రాధాన్యము పెరిగిందన్నమాట. ఇది అభ్యుదయ కవితోద్యమంపై దాని లోపలినుండే తగిలిన మూడవ దెబ్బ. అభ్యుదయ కవితోద్యమానికి ఒక అభ్యుదయ కవివల్లనే ఈ విపత్తు కలుగడం గమనించదగింది.

నార్ల వెంకటేశ్వరరావు 'నవయుగాలబాట' (1956) పేరుతో పద్య సంపుటిని ప్రచురించినాడు. దీనిలోని పద్యాలు అంతకుముందే 'ఆంధ్రప్రభ' పత్రికలో ప్రకటింపబడినాయి. అందులో ఒక చోట—

'కన్నతల్లి ధాత్రి, కల్పవృక్షము ధాత్రి
కళల లక్ష్మి ధాత్రి, కవిత ధాత్రి
ధాత్రి పూజ నరుని ధన్యుని సేయురా
నవయుగాల బాట నార్ల మాట'

అంటూ జన్మభూమిని కొనియాడుతూ దాన్ని పూజించడం ప్రతి మానవుని కనీస కర్తవ్యమని హెచ్చరించినాడు. మాతృదేశాన్ని గౌరవించలేనివాళ్ల మనస్థితిని చూసి కవి ఆవేదనతో చెప్పినమాట లివి.

శోకసంతప్త హృదయులైన రాయలసీమ రైతు జనుల దీన గాథల్ని వర్ణించే పాట విద్వాన్ విశ్వం 'పెన్నేటి పాట' (1956). కరువు కాటకాలతో కకావికలైపోయిన రాయలసీమ ప్రజల దుర్భర దారిద్ర్యానికి అద్దంపడుతుందీ కావ్యం. ఈ దుర్భర దారిద్ర్యాన్ని పరిహరించడానికి మానవ సంఘం తన శక్తి యుక్తుల్ని ప్రయోగించి దేశం సుభిక్షంగా వర్ధిల్లడానికి పాటుపడాలని కవి పెన్నేటి పాట ద్వారా సందేశం వినిపిస్తున్నాడు—

"ధరణి గంపింప కులగిరు లురలి పడగ
మేరుశిఖరమ్ము నెక్కి మిన్నులదర
చచ్చెనీ లోకమున నాత్మసాక్షియనుచు
నెత్తినోరిడి కొట్టుకోనిండు నన్ను"

అన్నప్పుడు హృదయం కంపించిపోతుంది.

పండిత కవి పల్లా దుర్గయ్య 'గంగిరెద్దు' (1956) అనే పద్యకావ్యం ప్రచురించినాడు. ఇది తెలుగునాట గ్రామీణ వాతావరణాన్ని చక్కగా పట్టిచూపుతుంది. కాపు కుటుంబాల దుర్భర జీవన పరిస్థితుల్ని సమర్థవంతంగా చిత్రించిన కావ్యమిది. ఈయనది మడికొండ గ్రామం—

"పేదకాపున కున్నట్టి పెద్ద యాస్తి
ఆవు మాత్రమే, అదియుగా దతని సొత్తు
కరణమునకప్పు క్రింద తాకట్టు పడియె
సొదకపు జీవమిప్పు డప్పేద గోవు"

"ఆవు కరణంబుదే, ముంతెడంత చల్ల
దినము నాతని యింట నందింపవలెను
పెరుగు పాలన్ని కాపువే, పెయ్యలన్ని
కరణమయ్యవి, మగదూడ కాపు పాలు"

ఇవి ఒకనాటి తెలంగాణా పల్లెటూళ్ళలోని వాస్తవిక పరిస్థితులకు కళామయ దృశ్యాలు.

పొట్లపల్లి రామారావు నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడి జైలుకు కూడ వెళ్ళిన జాతీయ కవి. ఈయన రైతు కుటుంబం నుంచి వచ్చినాడు. ఆ రోజుల్లోనే దేశభక్తితో కూడిన కవితలూ, కథానికలూ రచించినాడు. ఈ కవి ''ఆత్మవేదన'' (1957) లో ప్రజలకూ ప్రభుత్వానికీ సామరస్యం కుదరకపోతే కలిగే విపత్తు ఎటువంటిదో నొక్కిచెప్పినాడు—

''గాలిదేవ! నీవు
కదిలేవు తండ్రి
కోడెగిత్తల్లార!
కాడికందేరు
కష్టజీవి! నీవు
కడ తొలగవయ్యా
చూదాము! ఈ ప్రభువు లే మేలుతారొ!
చూదాము! ఏ ప్రజలు పన్నులిస్తారొ!"

అంటూ ప్రజాకంటకులైన ప్రభువుల్ని హెచ్చరించినాడు. ఇవి ఏ ప్రభుత్వానికైనా అన్వయించే మాటలు. ప్రజల యోగక్షేమముల బాధ్యత ప్రజాప్రభుత్వాలపై మరీ ఎక్కువగా ఉంటుందన్న భావం దీనిలో ధ్వనిస్తున్నది. ఈయన కవితలో సామాజిక స్పృహ, దేశ పునర్నిర్మాణం గూర్చిన తపన మిక్కుటంగా కనిపిస్తుంటాయి.

మాదిరాజు రంగారావు ఆధునిక భావచైతన్యంతో వచనకవితా ప్రక్రియను స్వీకరించి నేటికీ అవిరామంగా కావ్యాలు రచిస్తున్నాడు. అనుభూతులకు చక్కని ఆకారాన్ని కలిపించి పదచిత్రాలతో ధ్వనిమయంగా కవిత చెప్పడం ఈయన ప్రత్యేకత. తన 'కిర్మీరం' (1957) కావ్యంలో ఒకచోట దేశానికి కల ఉజ్జ్వల భవిష్యత్తును ఈవిధంగా ఊహిస్తున్నాడు—

"కాలచక్ర భ్రమణంలో
పూర్వరంగ మంతరించె
ఋతువు మారె, వీచే
గాలుల దిక్కు మారె
జలధారలు హిమశైలీ
రూపమెత్తి నవ్వుచుండే
ఘుసృణారుణ మసృణ
పద్మరాగ కాంతి! కాంతి!"

ఈయన కావ్యా లన్నింటిలో సామాజిక సంవేదన అంతర్వాహినిగా ప్రవహిస్తుంటుంది.

జగత్సత్యాన్ని అన్వేషిస్తూ కవిరాజమూర్తి 'ప్రణుతి' (1958) కావ్యాన్ని ప్రచురించినాడు. లోకంలో శాంతిని నెలకొల్పి సర్వమానవాభ్యుదయాన్ని ప్రసాధించుమని జగద్రక్షకుడైన పరమేశ్వరుణ్ణి ప్రార్థించడం దీనిలోని వస్తువు. మానవ వికాసాన్ని కాంక్షిస్తూ ఈ కవి 'మహైక' వంటి కావ్యాల్ని ప్రకటించినాడు.

దుర్గానంద్ రచించిన 'మధూలిక' (1958) కల్పితేతివృత్తంకల కావ్యం. ఐదాశ్వాసాల్లో రచింపబడిన పద్యకావ్య మిది. దీన్ని కవే అభ్యుదయ ప్రబంధమని చెప్పుకొని - కావ్య సమస్య అభ్యుదయం తీరు ప్రాబంధికమని సమర్థించుకున్నాడు. ఏమైనా యుద్ధ వ్యతిరేకతనూ ప్రపంచ శాంతినీ కాంక్షించే కావ్యమిది. లోకాన్ని నరకంగా మార్చిన పాత సంప్రదాయాలు, పాత భావాలు చెల్లిపోయినవనీ నేడు సమాజాన్ని నందన వనంగా మార్చగలిగే జాతినిర్మాతలు, నిర్ణేతలు అవసరమనీ దీనిలోని ఒక పాత్ర ద్వారా కవి ఈ విధంగా పలికిస్తాడు—

"చీకులుచేసి కందలు గ్రసించిన జాతులు నీర్గె చెల్లె భూ
లోకము రౌరవంబయిన రోజులు, కావలె నిప్పు, నందనా
లోకము దెచ్చు కోవిదవరులున్, కవులున్, సుధీ[illegible]
లోకపు శిల్పులున్, శ్రమికులున్, [illegible]"

సుప్రసన్న లోతైన భావుకుడు. ఈయన కావ్యాలన్నింటిలో భారతీయ ఆధ్యాత్మిక భావన అంతస్సూత్రంగా భాసిస్తుంటుంది. శ్రీ అరవిందుని తత్వ చింతన ఈతని కవిత్వంలో గుబాళిస్తుంటుంది. ఎంతటి చిన్న వస్తువులోనైనా ఆనందలక్ష్మీసామ్రాజ్యమును దర్శించగలిగిన శక్తిసంపన్నుడు. ఈయన ప్రచురించిన 'తేజశ్చక్రము' (1958) రెండు లఘు కావ్యాల సంపుటి. దీనిలోని ఛందస్సు ఒక నూతన ప్రయోగం. 'దుఃఖయోగిని' కావ్యం అపూర్వ భావనా విలసితం—

"లోకమున బాధయన్నది రాకమునుపు
అది భరింపరానిది, అతిభయదము
అనుభవింపక తప్పని యప్పు డది భ
రింపబడెడు నాశాభావ సంపుటమున"

అన్నది దీనిలోని సందేశం. ఈయన తరువాత కాలంలో రచించిన 'అధునా' (1964) కావ్యాన్ని త్రిపురనేని గోపీచంద్‌కు అంకితం చేసినాడు. సుప్రసన్న 'చేతనావర్తం' కవుల్లో ఒకడై మొదటి సంపుటానికి సంపాదకుడుగా వ్యవహరించినాడు.

జె. బాపురెడ్డి 'చైతన్యరేఖలు' (1960) రచించి వ్యక్తికీ సమష్టికీ సమన్వయం సాధించినాడు. మానవాళి సంక్షేమాన్ని కోరుతూ ఈయన తరువాత 'రాకెట్ రాయబారం' కూడ నడిపినాడు.

రామాయణ కథలోని శ్రీ సీతారాముల కళ్యాణ ఘట్టం వస్తువుగా స్వీకరించి చిలుకమర్తి రామానుజాచార్యులు 'కళ్యాణ రాఘవము' (1960) అనే పద్య కావ్యాన్ని రచించినాడు—

"అమల ధర్మాధ్వమున గృహస్థాశ్రమ మొక
రమ్యవనవాటి, యెట్టివారలకు నట్టి
సేవగావించి సంతృప్తి జేసినపుడె
సఫలమై యది మిన్నంట జాలునోయి"

అని గృహస్థాశ్రమ ధర్మ స్వరూపాన్నీ దాని పరమార్థాన్నీ లోక కళ్యాణం కోసం అది నిర్వహించవలసిన కర్తవ్యాన్నీ కవి జనకుని నోట చెప్పించినాడు. ఈయనే ఆ తరువాత 'మధురవేదన' (1967) అనే చక్కని కావ్యాన్ని రచించి ధన్యుడైనాడు.

పేర్వారం జగన్నాథం సాంఘిక చైతన్యస్ఫూర్తితో 'జాతికోసం జనుల కోసం కాగడానై కాలిపోదును' అంటూ 'సాగరసంగీతం' (1960) ప్రచురించినాడు. దీనిలోని 'ప్రసవవేదన' 'వక్రభాష్యం' 'మహావిష్ణువు మరణం' అన్న ఖండికల్లో - అణువు ప్రసవించడం, దైత్యారికి పట్టపగలు దయ్యం పట్టడం, మహావిష్ణువు మంచమెక్కి మరణించడం వంటి ఊహలే అత్యంత నూతనములు. విలక్షణమైన ఆధునిక అభివ్యక్తి సామాజిక చైతన్యం ఈయన కవితలకు జీవనాడి. ఈయన కూడ 'చేతనావర్తం' కవుల్లో ఒకడు.

అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ తరువాత చెప్పుకోతగినవాడు ఆరుద్ర. ఈయన 'త్వమేవాఽహమ్' తరువాత కూడ ఎన్నో ప్రయోగాలు చేసినాడు. అటువంటి ప్రయోగశీలంతో వెలువడిందే 'సినీవాలి'(1960). ఇది నేటి నాగరక, పారిశ్రామిక, యాంత్రిక కృత్రిమ జీవిత నైరాశ్యాన్నీ దాని వైఫల్యాన్నీ చిత్రించిన కావ్యం. లోకానుభవంతో అన్వయం కుదరని ఆశయాలూ ఆదర్శాలూ ఎట్లా సఫలీకృతం కావో కవి దీనిలో చక్కగా చిత్రించినాడు. కవి దీనికి ముందు ప్రచురించిన సాహిత్యోపనిషత్తులో—

"చూశావా ఆరుద్రా ఒక తమాషా
సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా
మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం
కాని, సంప్రదాయం తాతముత్తాతలనాటి ధనం
జాతికి జీవన నాళిక
జానపద గీతిక"

అంటూ శ్రీశ్రీ పలుకడం

"క్షణక్షణం ఉత్పన్నమయ్యే సాదా సమస్యల
పరిష్కర్త పనికి కవిత రాజీనామా చేస్తుందా?

అసలు ఆ ఉద్యోగం కవిత్వం చెయ్యాలా ?
ఐన్‌స్టయిన్ని ఐదో ఎక్కం నేర్పమన్నట్లు
కవిత్వంతో జీవితం గొడ్లపాకలోని
కసువు ఊడ్పించాలా ? కవిత గొరక చీపురా ?"

అంటూ ఆరుద్ర పలుకడం అభ్యుదయ కవుల్లో వచ్చిన మార్పును స్పష్టంగా సూచిస్తున్నాయి. ఇదంతా ఎందుకంటే మార్క్సిజం పునాదిగా ఉన్న అభ్యుదయ కవిత్వం క్రమంగా కనుమరుగై పోయి ఆధునిక తెలుగు కవిత ఎట్లా నూతన దిశాభిముఖంగా సాగి మానవతా చేతనంగా రూపొందిందో వివరించడానికే.

పోలూరి ఆంజనేయ ప్రసాద్ ఆధునిక భావచైతన్యంతో సామాజిక సంవేదనాభరితంగా 'పోతన' (1962) కావ్యాన్ని పద్యాల్లో విరచించినాడు. దీని పీఠికలో రచయిత- "పోతన్నగారొక్కడే రాజుల దుశ్చర్యలను ఖండించి ఇటువంటి రాజులకు కృతి ఈయడంకంటె కవులు స్వతంత్రులై అడవుల్లో కంద మూలాలు తినటం శ్రేయస్కరమని ప్రపంచానికి చాటాడు. రాజులంటే భయాందోళనలు వ్యాపించిన రోజుల్లో ఒక కవి, నిరుపేద సామాన్య హాలికుడు ఇలా చెప్పాడంటే ఇంతకంటె స్వతంత్ర శీలం మరేముంటుంది ? ఈ దృక్పథంతో నేనీ కావ్యరచనకు పూనుకున్నాను. నా కవిత్వం వాస్తవానికి దూరం కాకుండా, గతంలో పుట్టి, ప్రస్తుతంలో పెరిగి, భవిష్యత్తును చేరటానికి సాహసిస్తుంది" అని చెప్పుకున్నాడు. అంతేకాదు—

"నాలో సాంఘిక భావ విప్లవ మహా నాదమ్ము విన్పించి, ఉ
ద్వేలంబైన రసానుభూతి నను నావేశించి, స్వాతంత్ర్య దీ
క్షాలోలుండగు పోతరాజ కవితా సందేశమున్, దిగ్దిగం
తాలన్ చాటెదగాక అభ్యుదయ పంథాలోన వర్తించుచున్"

అని తన కావ్య దృక్పథాన్ని చాటుకున్నాడు.

1962 లో భారతదేశం చైనాతో యుద్ధం చేయవలసివచ్చింది. చైనా భారత భూభాగాన్ని దురాక్రమించినప్పుడు దేశరక్షణ కోసం కవులంతా ముక్త కంఠంతో చైనా కుటిల నీతిని నిరసించినారు. కాళోజి నారాయణరావు "తుపా

గించినారు. ఈ దిగంబరులకు తాత్త్విక ఆలోచనా ధార ఏదీ లేనందున సాహిత్య పరిణామ శీలం తెలిసిన పండితులెవ్వరూ దీన్ని ఉద్యమంగా గుర్తించరు.

సాహిత్యరంగంలో ఏర్పడిన ఈ గందరగోళాన్ని తొలగించి సాహిత్యం పట్ల సదవగాహన పెంచడానికి పోయిన విలువల్ని మళ్లీ ఉద్ధరించడానికి, 'చేతనా వర్తం' సంపుటాలు రెండు వెలువడినాయి. డా॥ కోవెల సుప్రసన్నాచార్యులు సంపాదకత్వాన మొదటి సంపుటం 1967లో వెలువడగా, డా॥ కోవెల సంపత్కుమారాచార్యులు సంపాదకత్వాన రెండవ సంపుటం 1970లో వెలువడింది. ఆనాడు పండితులూ పత్రికలూ ఈ కృషిని వేనోళ్ల కొనియాడడం జరిగింది. సాహిత్యం పేరుతో సాగిన అరాజకాన్ని ఇది అరికట్టగలిగింది. 'చేతనా వర్తం' కవులు నలుగురు- (1) సుప్రసన్న (2) సంపత్కుమార (3) పేర్వారం జగన్నాథం (4) వే. నరసింహారెడ్డి.

దిగంబర కవుల 'లొల్లి' ఒక పీడకలగా వచ్చి పూర్తిగా చెరగిపోక ముందే 1970 లో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది. దీనికి మార్క్సిస్టు-లెనినిస్టు భావధోరణి జీవనాడి వంటిది. వీళ్ళు సుమారు ఒక దశాబ్దం పాటు అంటే - 1970 నుండి 1980 దాకా అలసిపోకుండా అల్లరి చేసినారు. ఈ అల్లరిని చూసి మురిసిపోయిన కొందరు ఈ దశాబ్దాన్ని విప్లవ కవులే పాలించినారని అందమైన అబద్ధాన్ని ప్రచారం చేసినారు. ఈ 'విరసం'కు ఒకానొక సామాజిక సిద్ధాంతాన్ని ప్రచారం చేయడమే పరమ లక్ష్యం. కనుక కవిత్వం గూర్చి చెప్పవలసి వస్తే అది తిట్లు శాపనార్థాలతో "పోటో నీళ్ళకున్ పలుచనై" పోయింది. నినాదాలు తప్ప కవితాస్పృహ కలికానిక్కూడా కనిపించకుండా పోయింది. కవిత్వాన్ని ఎంతగా విధ్వంసం చేయగలుగుదురో అంతగా వాళ్ళ శక్తి కొద్దీ చేసి అంతర్థానమైనారు. తాటాకు మంటలా భగ్గుమని 1980 వరకల్లా ఇదీ క్రమంగా చల్లారిపోయింది. దీనికొక తాత్త్విక దృక్పథం ఉండి కూడా కవితాకళ మృగ్యమైనందున ఇదికూడా సాహిత్యోద్యమ స్థాయికి చేరకుండానే మటుమాయమైపోయింది. దిగంబర కవులూ, విప్లవ కవులూ కలిసి 1965 నుండి 1980 దాకా అంటే-సుమారు 15 సంవత్సరాలు తెలుగు కవిత్వాన్ని అగమాగం చేయడానికి విఫల ప్రయత్నం చేసినారు. వీళ్ళ 'లొల్లి'నీ 'అల్లరి'నీ ఖాతరు చేయకుండా మరోవైపు అచ్ఛమైన, స్వచ్ఛమైన ఆధునిక తెలుగు కవిత నవనవోన్మేషంగా సాగుతూనే వస్తున్నది. ఇక్కడ దాని ఉద్గమన శీలాన్ని పరిశీలిద్దాం.

# III

ఇదే కాలంలో వానమామలై వరదాచార్యులు 'పోతన చరిత్రము' (1966) రచించినాడు. జాతికి ఆదర్శప్రాయమూ, అనుసరణీయమూ అయిన పోతన వ్యక్తిత్వ మహత్వాన్ని కీర్తిస్తూ నవీన ప్రబంధ మార్గంలో రచింప బడినదిది. నిరాడంబరమూ, నిసర్గ సుందరమూ అయిన పోతన జీవితాన్ని తలచుకుంటూ తెలుగువాళ్ళు నేటికీ పులకాంకితులవుతుంటారు. ప్రాపంచిక భోగ భాగ్యాలను రాచరికాన్ని నిరసించిన పరమ భాగవతోత్తముని జీవితగాథను చిత్రించి వరదాచార్యులు 'అభినవ పోతన'గా ఖ్యాతిగన్నాడు-

> "దీన జనులను దయజూచు దివ్యకర్మ
> తపములన్నిటిలో నుచ్చతమము
> మరువ వలదు........"

అన్న పద్యంలో మానవ ధర్మాన్ని చక్కగా ఉద్బోధించి సామాజిక చైతన్యాన్ని ధ్వనింప జేసినాడు. అంతకు ముందే ఈ కవి వర్తమాన దేశ పరిస్థితులు ప్రతి ఫలించే విధంగా 'మణిమాల' (1945) 'ఆహ్వానము' (1957) అను కావ్య సంపుటాలు ప్రకటించినాడు. ఈయన వరంగల్లు సమీపమందలి మడికొండ నివాసి. సాహిత్య సేవలో మడికొండ కవుల పాత్ర గణనీయమైంది. సుప్రసిద్ధ కవి వరేణ్యులూ, స్వాతంత్ర్య సమరయోధులూ అయిన కాళోజీ సోదరులు ఈ గడ్డపై జన్మించినవాళ్ళే. వీళ్ళలో కాళోజీ రామేశ్వరరావు (కలామెషాద్) ఉర్దూలో చక్కని వ్యంగ్య కవిత్వం రాస్తుంటాడు.

ప్రజాకవి కాళోజీ పరాభవ సంవత్సరం (1966-67)లో బుతువు కొక్కటిగా 'నా గొడవ' భాగాలు ప్రకటించినాడు. పల్లెటూరి సమస్యలనుండి ప్రపంచ రాజకీయాలదాకా ప్రతి సమస్యకు స్పందించి కళామయంగా కవిత చెప్పే నేర్పు కాళోజీది. అయినా ఈయన ఏ పార్టీకి తాకట్టు పడని స్వతంత్రుడు. సామాజిక స్పందన ఈయన కవితకు ప్రాణం వంటిది. తీక్ష్ణమైన అధిక్షేపకత ఈయన కవితారీతి. నిజాయితీని నమ్మినవాడు.

కవిత్వంలో గడుసరితనాన్ని నాజూకుగా ప్రదర్శించడంలో అనుముల కృష్ణమూర్తి సిద్ధహస్తుడు. ఈయన 'సరస్వతీ సాక్షాత్కారం' (1967) లో చూపిన ఇటువంటి కొత్తపోకడలు రసజ్ఞుల్ని అలరిస్తుంటాయి-

"ఇల ఆనంద రస ప్రవాహమున కంతే లేదు చిన్నారిదో
సిలితో ఎంతని త్రావ నోపుదుము మా చిన్నారి కన్నాల రె
ప్పలలో నీ బహుకాంతి పుంజముల సంభాళింతుమేలాగు మా
మలినోద్యాన మనః కవాటముల నమ్మా ఎన్నడూ డ్పింతువే!"

అనీ ఆ చదువుల తల్లిని వేడుకుంటాడు. లోకంలో ఆనందమున్నది. దుఃఖమూ ఉన్నది. ఆనందాన్ని అనుభవించగలిగే శక్తిని సంపాదించుకోవలసి ఉన్నది. ఈ కవి కూడ మడికొండ గ్రామానికి చెందినవాడు.

దేవరకొండ బాలగంగాధర తిలక్ అభ్యుదయోద్యమం దేశంలో సాగుతున్న కాలం నుంచే చక్కని కవితలు పత్రికల్లో ప్రచురిస్తూ వచ్చినాడు. ఈయన కావ్య సంపుటి "అమృతం కురిసిన రాత్రి" (1968) పేరుతో ప్రకటింపబడింది. కవి గాఢానుభూతి, సామాజిక సంస్పందన దేశ సంస్కారాభిముఖంగా సాగుతుంది. కవులు వర్గాలుగా పార్టీలుగా విడిపోవడాన్ని ఈయన గర్హిస్తాడు.

"ఈ కాలంలో బ్రతుకు, యీ ప్రపంచాన్ని ప్రతిఫలించు
ఇంటికున్న కిటికీలన్నీ తెరచి అన్ని పవనాల్నీ ఆహ్వానించు
నువ్వు చెప్పేదేదైనా నీదై వుండాలి, నీలోంచి రావాలి చించుకొని రావాలి"

అన్నది తిలక్ కవితా తత్వం.

ఆరిపిరాల విశ్వం "రేపటి స్వర్గం" (1968) లో ఆశావాదాన్ని ప్రతిపాదించినాడు. దుఃఖాలతో, వ్యథలతో నిండిన ఈ వర్తమాన సమాజం భవిష్యత్తులో అందమైన పూలు పూస్తుందని విశ్వాసం ప్రకటించినాడు.

బోయి భీమన్న 'అశోక వనిలో రాముడు' (1969) అనే పద్య కావ్యంలో తనదైన ఒక నూతన సామాజిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించినాడు. దాని పీఠికలో

కవి- "రామాయణ కాలంలో ఉండిన భారత రాజకీయ వ్యవస్థ సర్వజన సమత్వంపై ఆధారపడినట్టిది. తద్విరుద్ధంగా కనిపించే సందర్భాలన్నీ ప్రక్షిప్తాలేననీ కుల తత్వంపై బాగా కరడుగట్టిన తర్వాత ఎవరెవరో ఆ మహా గ్రంథాలలో చొప్పించి నట్టివేననీ నా విశ్వాసం............ఈ కావ్యంలో రాముణ్ణి సంపూర్ణ మానవుడైన ఒక సోషలిస్టుగానే దర్శించాను" అంటాడు. అట్లా రాముని పాత్రను కవి కొత్తగా వ్యాఖ్యానించినాడు ఈ కావ్యంలో.

వేగుంట మోహన్ ప్రసాద్ రచించిన 'చితి చింత' (1969)లో జీవన తత్వం వ్యాఖ్యానించబడింది. మార్మికత కారణంగా కావ్యం వెంటనే అర్థంకాదు. అభివ్యక్తి మార్గంలో దీని కొక ప్రత్యేకత ఉన్నది.

బాడాల రామకవి పద్య విద్యలో ఆరితేరినవాడు. దానికి ఈయన "లేపాక్షి స్వప్న దర్శనము" (1970) చక్కని నిదర్శనం. లేపాక్షిలోని శిల్ప సౌంద ర్యాన్ని ఆధ్యాత్మిక భావనాశక్తితో వర్ణించిన కావ్యమిది. దీన్ని పలువురు పండి తులు బహుధా కొనియాడినారు. ఈ కవి ఇంతకుముందే భారతీయ ఆత్మతత్వాన్ని నిరూపించే 'కృష్ణ కథా విపంచి'ని వినిపించినాడు.

ఉత్పల సత్యనారాయణాచార్యులు తన 'ఈ జంట నగరాలు - హేమంత శిశిరాలు' (1971) అనే పద్య కావ్యంలో హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలోని ప్రజా జీవితాన్ని నిశితమైన పరిశీలనా దృష్టితో వర్ణించినాడు. పద్య రచనా శిల్ప రహస్యం తెలిసినవాడు. కవి దీన్ని క్రీడాభిరామం పద్ధతిలో రచించినాడు. దీన్ని చదువుతుంటే హైదరాబాదు ప్రజల దైనందిన జీవితం కనులకు కట్టినట్లుంటుంది.

శశాంక 'స్వర లహరి' (1971) లో సంఘజీవియైన మనిషి మనోభావాలకు అక్షరాకృతి కలిపించినాడు. భావ సౌకుమార్యం ఈయన రచనల్లో ఉన్న ప్రత్యే కత. ఇంతకుముందే ఈ కవి 'నయా జమానా' (1954), 'రాగవల్లరి' (1955) కావ్యాల్ని ప్రకటించి సుప్రసిద్ధుడైనాడు.

నాయని సుబ్బారావు 'జన్మభూమి' (1973) తనను కన్న పుడమి తల్లిని కీర్తించే ఉత్కృష్టమైన పద్య కావ్యం. కవి తన స్వగ్రామాన్ని ఉపలక్షించినా

దీనిలో భారతీయ జీవన తత్వాన్ని మనోహరంగా వర్ణించినాడు. ఇది భౌతిక మానసిక ఆధ్యాత్మిక స్థాయిల్లో జాతీయ జీవనాన్ని దర్శించి సాంస్కృతికంగా ఏకీభావాన్ని సాధించిన కావ్యమని కొనియాడబడుతున్నది. ఇదే కాక ఈయన 'వేదనావాసుదేవము' 'భాగ్యనగర కోకిల' వంటి కావ్యాలనేకంగా రచించినాడు.

ఎస్వీ జోగారావు 'ప్రసన్న కుసుమాయుధం' (1973) చదువుతుంటే సుమనోజ్ఞ సుందర లోకాల్లో విహరించినట్లుంటుంది. ఇది చక్కని పద్య కావ్యం. పద్యాన్ని హృద్యంగా రచింపగల శిల్పి జోగారావు.

కొత్తపల్లి సత్యశ్రీమన్నారయణ 'వెలుతురు పిట్టలు' (1974) అనుభూతి సాంద్రత వెలార్చిన అందమైన కావ్యం. కవి లోతైన భావుకుడు.

గుంటూరు శేషేంద్రశర్మ 'నా దేశం- నా ప్రజలు' (1975) ఆధునిక ఇతిహాసంగా చెప్పబడింది. అభివ్యక్తిలో, ఆలంకారికతలో, వస్తువిన్యాసంలో కవి తనదైన వ్యక్తిత్వాన్ని ముద్రించుకున్నాడు. విప్లవ భాషావిధాతగా పేరుగన్నాడు. ఈయన 'కవిసేనమేనిఫెస్టో' (1977) పేరుతో ఆధునిక కావ్యశాస్త్రాన్ని కూడ రచించి నేటి యువతరాన్ని ఆకర్షిస్తున్నాడు. పద్యాల్లో, వచన కవితా ప్రక్రియలో కావ్యాలనేకంగా రచిస్తూ సమకాలిక తెలుగు కవితారంగంలో శిఖరాయమానంగా వెలుగుతున్నాడు. క్రొంగ్రొత్త ప్రయోగాలతో కావ్యభాషా స్వరూపంలో మార్పు తెస్తున్న ఆధునిక వాగనుశాసనుడు శేషేంద్ర.

"ఈ దేశంలో ఒంగేవానికి ఒంగి సలాంచేసేవాడు పుడుతున్నాడు జాగ్రత్త!
ఈ లక్షణం తలయెత్తిందంటే ఆకాశంలో తోకచుక్క పుట్టిందన్నమాటే"

అన్న పంక్తులు లోక తంత్రాన్ని సూటిగా ఘాటుగా వ్యక్తం చేస్తున్నాయి.

ముదిగొండ వీరభద్రమూర్తి 'వందేమాతరం" (1977) స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రను మొదటిసారి కమనీయ కళాఖండంగా తీర్చిన మహాకావ్యం. ఇది 18 ఖండాలలో సాగి ప్రతి పద్యంలో దేశాభిమానం ఉట్టిపడుతుంది. కావ్యమంతా జాతీయతా భావదీప్తితో నిండింది. జాతి ప్రదర్శించిన త్యాగనిరతి, వీరతామూర్తి దీనిలో ఒళ్లు పులకరించేట్లుగా వర్ణింపబడింది.

"ఈశభక్తికి మించిన దేశభక్తి
దేశభక్తికి దగిన యాత్మీయశక్తి
యాత్మశక్తికి దోడుగ నాధునికత
రక్తి యవి యెప్పునాడె భారతము ముక్తి"

వంటి సందేశాత్మకములైన మాటలు జాతికి శిరోధార్యములు.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'కీర్తితోరణము' (1978) కాకతీయుల చారిత్రక ఔన్నత్యానికి, వాళ్ల కళావైభవానికి వేసిన ముత్యాలపందిరి. సుమనోభి రామంగా అల్లిన పద్యకావ్యమిది.

"ప్రాణంబైనది తెల్గుగడ్డకు, ధరాప్రాలంబమౌ నీ తెలం
గాణంబందున జాయిరప్పయును మాటాడున్ మనస్సిచ్చి, వి
న్నాణంబైన కవిత్వ సంపదల కన్నాకై దిగంతాఖిల
క్షోణీకీర్తిత వైభవంబగుచు వెల్గున్ నాటికిన్ నేటికిన్"

వంటి పద్యాలు చదువుతుంటే పురావైభవం కనులకు కట్టి ఒడలు పులకి స్తుంది. ఈయన ఇంతకుముందే 'దక్షారామం' (1949) కావ్యరచన చేసి ధన్యుడై నాడు.

నాయని కృష్ణకుమారి "అగ్నిపుత్రి" (1978) అనుభూతి సాంద్రత, లోకవర్తనం సమంగా కలిసిన ఇక్షుఖండం.

రామా చంద్రమౌళి 'శిలలు వికసిస్తున్నాయి' (1979) లో నూతన అభి వ్యక్తితో అనుభూతులకు రూపకల్పన చేసినాడు. నేటికీ ఈయన అనుభూతి కవి తలు వెలారుస్తున్నాడు. మంచి భావుకుడు. ఈయన ఇంతకుముందే సంఘ చైతన్యం ప్రతిఫలించే 'దీపశిఖ' (1971) రచించినాడు.

ఇస్మాయిల్ కూడ ఇదేకోవకు చెందిన అనుభూతికవి. ఈయన ప్రకృతినీ, ప్రపంచాన్నీ దర్శించే తీరు విశిష్టంగా ఉంటుంది. ఈ కవి 'చిలుకలు వాలినచెట్టు' (1980) అందుకు నిదర్శనం. ఈతనిదే 'చెట్టు నా ఆదర్శం' అన్న కావ్యంకూడ గణనీయమైంది. సూక్ష్మ పరిశీలనాదృష్టి, పదచిత్రరచన ఈయన ప్రత్యేకత.

వానమామలై జగన్నాధాచార్యుల 'రైతురామాయణం' (1980) ఒక విశిష్టమైన పద్యకావ్యం. దీనిలోని ప్రతి పద్యం ఒక రసగుళిక. కథ రామాయణానికి ప్రతిబింబంవంటిది. ఇక్కడ రైతురాముడు కథా నాయకుడు. తెలంగాణా పల్లెజీవితానికీ కావ్యం నిలుపుటద్దంవంటిది. తెలంగాణా విముక్తికోసం సాగిన పోరాటం, రజాకారుమూకల దురాగతాలుకూడ ఈ కథతో ముడివడి ఉన్నాయి. ఈ కవి వరదాచార్యులకు సోదరుడు. మడికొండకు చెందినవాడు.

ఆలూరి బైరాగి 'ఆగమగీతి' (1981) కావ్య సౌందర్యాన్ని సంతరించుకున్న చక్కని కవితాసంపుటి. అంతశ్చైతన్య విలసనంతోకూడిన మానవ మనోభూమికలలోని వివిధ దశల్ని చిత్రించే కావ్యమిది. ఈయన ఇంతకుముందే 'నూతిలో గొంతుకలు' (1978) 'చీకటి నీడలు' (1978) ప్రచురించి ఆధునిక తెలుగు కవిత్వానికి కొత్త అభివ్యక్తిని ప్రసాదించినాడు.

తుమ్మపూడి కోటేశ్వరరావు 'కుమారభారతి'(1981) పద్యకావ్యం రచించినాడు. కావ్యవస్తువు వివేచనాత్మకమై భారతీయ ఆధ్యాత్మికభావన ఆధునిక చైతన్యంతో వ్యాఖ్యానించబడింది. ఎన్.టి.జ్ఞానానందకవి 'పిల్లనగ్రోవి' (1982) పద్యకావ్యంలో సామాజిక దురన్యాయాల గూర్చిన సంవేదన కనిపిస్తుంది. ఈయన ఇంతకుముందే 'ఆమ్రపాలి' పద్యకావ్యం రచించినాడు. మరయా రచించిన 'శిల్పి' (1983) పద్యకావ్యం కవి కళాత్మకదృష్టిని ప్రదర్శిస్తున్నది. పేర్వారం జగన్నాథం 'వృషభపురాణం' (1984) అనే అధిక్షేపక కావ్యంలో రాజకీయ దుర్నీతిపై సాంఘిక దుర్వ్యవస్థపై వ్యంగ్యాత్మకంగా దాడిచేసినాడు. శేషేంద్ర తన రచనలనన్నింటిని పునర్వ్యవస్థీకరించి 'ఆధునిక మహాభారతం' (1985) పేరుతో ప్రకటించినాడు. దీనిలో ఆధునిక చేతన, ఆధునిక అభివ్యక్తితోపాటు శిల్పమూ చక్కగా సమన్వయాన్ని పొందినాయి. 'సంపత్' (కీ.శే. శంఖవరం రాఘవాచార్యులు) రచించిన 'విశ్వనాథవిజయము' (1987) ఆంధ్రుల సాహస ఔదార్యాలతోపాటు దేశభక్తిని చిత్రించే పద్యకావ్యం. వ్యక్తి చైతన్యం సమాజ చైతన్యంగా పరిణమించడం దీనిలో చక్కగా వర్ణించబడింది. సుప్రసన్న 'శతాంకుర' (1987) శ్రీ అరవిందతత్త్వ దర్శనానికి కళామయ వ్యాఖ్యానం. ఆనంద చేతన గురించిన అన్వేషణ దీనిలో కనిపిస్తుంది.

విశ్వనాథ అభ్యుదయ కవితోద్యమం చల్లారిన పిదప నిర్విరామంగా, దేశీయ చైతన్యంతో, మానవీయ దృక్పథంతో, సంప్రదాయ నవ్యత్వాన్ని కాంక్షిస్తూ

సుందర సుమధురకావ్యాలెన్నింటినో నేటికీ రచిస్తూ కవితారంగాన్ని ప్రభావితం చేస్తున్న బోయి భీమన్న, తుమ్మల, దాశరథి, సి.నారాయణరెడ్డి, శేషేంద్ర,కాళోజీ, సోమసుందర్, అజంతా, కరుణశ్రీ వంటి వాళ్ళెందరో ఉన్నారు. కరుటూరి సత్య నారాయణ వంటి వాళ్ళు బౌద్ధవాఙ్మయంనుండి వస్తువును స్వీకరించి బుద్ధుని సందేశాల్ని కళామయంగా వినిపిస్తున్నారు. చాలారోజులక్రితమే వి.వి.ఎల్.నర సింహారావు 'ఆనందభిక్షువు' రచించి రసానందంతో కూడిన కావ్య సందేశాన్ని వినిపించాడు. విశ్వనాథ వెంకటేశ్వర్లు "కాళింది పరిణయం" రచించి భారతీయ ఆత్మధర్మాన్ని ధ్వనింపజేసినాడు. బెఝ్జూరి శ్రీనివాసమూర్తి, నండూరి రామ కృష్ణమాచార్య, ఉండేల మాలకొండారెడ్డి, వేముగంటి నరసింహాచార్యులు, ఆందె వెంకటరాజం, ఆచార్య తిరుమల ముకురాల రామారెడ్డి వంటి కవులెందరో సమ కాలిక సమాజస్పృహతో ఆధునికతా ముద్ర కలిగి పద్యకావ్యాలల్లుతున్నారు. ఇ. శివారెడ్డి, పల్లా రామకోటాచార్య, నీలా జంగయ్య, సంపత్కుమార, ఎన్. గోపి, వసునందన్, మిరియాల రామకృష్ణ, ఎక్కిరాల కృష్ణమాచార్య, పరిగి రాధాకృష్ణ, సి. వి. కృష్ణారావు, రంధి సోమరాజు, అద్దేపల్లి రామమోహనరావు, ఎల్లోరా, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ వంటి కవుల్లో గాథాను భూతితో కూడిన భావుకత కనిపిస్తుంది. వీళ్ళంతా సమకాలిక యుగధర్మాన్ని తమ రచనల్లో ప్రతి ధ్వనింపచేస్తున్నారు.

ఇట్లా సంప్రదాయం విచ్ఛిన్నంకాకుండా దేశీయతా స్పృహకలిగి, సామా జిక చైతన్యస్ఫూర్తితో కళామయంగా కావ్యరచన చేస్తున్న కవులింకా ఎందరో ఉన్నారు.ఇక్కడ నా ఓపినంతమేరకు నాకు తెలిసినంతవరకు సమయ సందర్భాల పరిమితికి లోబడి కొందరి కావ్యాల్ని మాత్రమే సమీక్షించగలిగినాను. మిగతా వాళ్ళనందరినీ ఇక్కడ ఉదాహరించలేకపోయిన నా అశక్తతకు క్షంతవ్యుణ్ణి.

ఆధునిక తెలుగు కవితావికాసం భారతీయత, దేశీయతాముద్రను సంతరించు కొని అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్నది. ఈ ముప్ఫైసంవత్సరాలకాలంలో భిన్నధోరణులు, భిన్నరీతులు, వస్తువైవిధ్యంతో కూడిన రచనలు ప్రవర్తిల్లినా దీనితో ఏకాత్మకత భజింపబడుతున్నది. అది జాతి మనుగడను శాసించే స్వధర్మం స్వకీయమైన జీవితాదర్శం. సంప్రదాయ విచ్ఛేదం చేయడానికి జరిగిన ప్రయ త్నాలు ఘోరంగా దెబ్బతిన్నాయి. ఈ ఆటుపోటుల్ని అధిగమించి ఆధునిక తెలుగు కవితా ప్రస్థానం సాగిపోతూనే ఉన్నది. తూరుపు వాకిళ్ళు తెరచి మనం ఈ నవయుగోదయాన్ని స్వాగతిద్దాం.

ఈ సంకలనంలోని వ్యాసాలు ఇదే విషయాన్ని స్పష్టం చేస్తున్నాయి.

# IV

ఈ సంకలనంలో మొత్తం 18 వ్యాసాలున్నాయి. వాటిలో గత ముప్ఫై సంవత్సరాలలో వచ్చిన ఆధునిక తెలుగు కవితా ప్రస్థానం గురించి వివరంగానూ, అంతకు ముందున్న కవితా స్థితి గురించి స్థూలంగానూ వ్యాఖ్యానించటం జరిగింది. కవితారంగంలో ప్రవర్తిల్లిన వివిధ ధోరణుల తీరుతెన్నుల్ని స్వరూపస్వభావాల్ని, వాటి తాత్వికతనీ వ్యాసకర్తలు సాధ్యమైనంతవరకు నిష్పాక్షికంగానే అన్ని దృక్కోణాలనుండి అనుశీలించినారు. ఐతే వాళ్ళకున్న సమయ సందర్భాలు చాలా పరిమితమైనవి. అందునా ఆధునిక తెలుగుకవిత్వాన్ని మొత్తం అంచనా వేయడమంటే సాగరాన్ని కొలువడంవంటిది. నక్షత్రాల్ని లెక్కించడం లాంటిది. అందువల్ల మా ఈ ప్రయత్నం సమగ్రమైందని చెప్పజాలము. సమగ్రతను సమీపించాలన్నదే మా ధ్యేయం. ఎవరెంత చెప్పినా సమగ్రతకు సమీపంగా వెళ్ళగలుగుతారే తప్ప, దాన్ని చేరుకోలేరన్నది నిర్వివాదాంశం. ఆయా సాహిత్య సంస్థలు, పరిశోధకులు, పండితులు మునుముందు ఆధునిక తెలుగు కవిత్వాన్ని సరియైన విధంగా మదింపు చేసి, దాని స్వస్వరూపాన్ని దర్శించటంలో ఈ వ్యాస సంకలనం కొంతైనా ఉపకరిస్తే మేము ధన్యులం. ఇక ఆ వ్యాసాల్ని క్లుప్తంగా సమీక్షిస్తాను.

ఆర్. ఎస్. సుదర్శనం "సాహిత్యము : ఆధునికత" అన్న వ్యాసంలో, ఆధునికత గురించి నిర్వచిస్తూ- "భారత జాతీయ పునరుజ్జీవనంలో ప్రధానపాత్ర వహించిన రాజారామమోహనరాయ్ (బ్రహ్మసమాజము), దయానంద సరస్వతి (ఆర్యసమాజము), రామకృష్ణపరమహంస వివేకానందులు (అనుష్ఠాన వేదాంతము), తిలక్ (గీతారహస్యము), గాంధీ (సత్యాహింసలు), ప్రభృతుల ఉద్యమాల స్వభావాన్ని పరిశీలించిచూస్తే తేటతెల్లం అయ్యే సత్యం ఒకటి ఉన్నది. పాశ్చాత్య సంస్కృతి మన జీవన విధానం మీద చూపిన ప్రభావం సంక్షోభానికి (Crisis) దారితీస్తే, దానిని సవాలుగా(Challenge) తీసుకొని ప్రభవించిన పై ఉద్యమాలు ప్రతిక్రియగా (Response) కనిపిస్తాయేతప్ప, పాశ్చాత్య సంస్కృతిని పుణికి పుచ్చుకొని, స్వీయ సంస్కృతిని ఊచముట్టుగా కోల్పోయిన పరిస్థితి కనిపించదు ........ ఇలా పరిశీలిస్తే 'ఆధునికత' అంటే పునరుజ్జీవన ప్రతిక్రియ (Response of rejuvenation) అనీ, అది జాతి సంస్కృతి భూమికల్ని

పునర్దర్శించడమనీ (Rediscovery of the cultural bases) అవగాహన అవుతుంది" అన్న మాటలు గమనించదగ్గవి.

గుంటూరు శేషేంద్రశర్మ తన "విప్లవ కవిత్వము : సాహిత్య విమర్శ" అనే వ్యాసంలో ఏది విప్లవకవిత్వం ఏది సద్విమర్శ అనే అంశాల్ని వివరిస్తూ— "సద్విమర్శకుడు వస్తువును అలంకారపు కిటికీలో నుంచి చూస్తాడు. పొడిపొడిగా బూర్జువా, దోపిడీదార్లు, పీడితప్రజలు, శ్రామికవర్గం, పెట్టుబడిదారీవిధానం వగైరా జార్గన్‌తో ఊకదంపుడు ఉపన్యాసంలా దున్నుకుంటూ పోడు.... .. వర్గచైతన్యంలో నుంచే నిత్య జీవనాంతర్గత నిర్విరామ పోరాటాలు వ్యక్తిగతంగా ఏర్పడుతాయి. ఈ పోరాటాల్లో నుంచి పుట్టే విప్లవకవిత్వం పార్టీప్రచార కవిత్వంకంటే అత్యంత శక్తిమంతంగా ఉంటుంది" అన్న మాటల్ని మనం గమనించాల్సి ఉంటుంది.

సోమసుందర్ తన "అభ్యుదయ కవిత్వంలో ప్రమాణాలూ, పరిణామాలు" అన్నవ్యాసంలో-"ఇరవయ్యో శతాబ్దపు నాలుగో దశాబ్దంలో ఆవిష్కృతమైన అభ్యుదయ సాహిత్యోద్యమానికి పునాదులు బలంగా 1880 సంవత్సరంలోనే నిర్మితమయ్యాయి.........అతివేల ప్రగల్భంలో అట్టహాసం చేసిన దిగంబర ఉద్యమం ఐదేళ్లయినా బ్రతకకుండానే కన్నుమూసింది........విరసం ఒక సాహిత్య ఉద్యమంకన్నా నక్సలైట్ల పరోక్ష సాహిత్య ఉద్యమంగానే హృదయ లక్షణాన్ని నిర్ధారించుకుంది.........అభ్యుదయ రచయితల ఉద్యమం తెలుగు సాహిత్యాన్ని సంపద్వంతంచేసిన ఉత్తమ కావ్యాలను సమర్పించి - యావదాంధ్ర సాహిత్య జీవులపైనా విశేష ప్రభావం కలిగించింది. రచయితల ఆలోచనా రీతిలో ప్రబలమైన మార్పులను రూపొందించింది. అభ్యుదయశీల ఆలోచనాధారను దాదాపు జాతి జీవనాడిగా మార్చింది" అంటున్న మాటలు గమనార్హం.

డి. రామలింగం "అభ్యుదయ కవిత్వం; పరిణామ దశలు; అంతస్తత్వం." అన్న వ్యాసంలో- "ఆధునికాంధ్ర సాహిత్యంలో వచ్చిన అభ్యుదయ కవితాయుగం కవులకు అభివ్యక్తి విషయంలో అపారమైన అవకాశాలను గోచరింపజేయడమే కాక వచన రచయితలకు కూడా వారి కర్తవ్యాన్ని సూచించింది. తరువాతి వారికి మాతృభూమి వంటి దీ యుగం" అన్న మాటలు పరిశీలించదగినవి.

అనుమాండ్ల భూమయ్య "సాహిత్య ఉద్యమాలు" అనే తన వ్యాసంలో- "అభ్యుదయ, విప్లవ కవిత్వాలకు రష్యా, చైనా దేశాలలోని రాజకీయాలు భూమికలు. అంతమాత్రమే అయితే పరవాలేదు. కాని ఆ దేశాలల్లోని రాజకీయ ఆర్థిక సంచలనాలకు స్వాభిమానాన్నీ స్వధర్మాన్నీ తాకట్టుపెట్టే స్వభావం కలవి........ మార్క్సిజం ప్రభావంతో వస్తువుకే ప్రాధాన్యం పెరిగి, కళాత్మక విలువలు లోపించడం అభ్యుదయ కవిత్వంతోనే మొదలయింది. విప్లవ కవిత్వంలో ఆ లోపించటం మరింత పెరిగింది............ అకవితా రూపంలో కవితా రంగ ప్రవేశం చేసి ఒక అలజడిని, అరాచకాన్ని సృష్టించడమే వీరి ధ్యేయమైనట్లు వీరు (దిగంబర కవులు) ప్రకటించిన మొదటి సంపుటి మొదటి ఖండిక 'ఆత్మయోని'ని చూస్తే తెలుస్తుంది." అన్న వివరణ ప్రత్యేకంగా గమనించదగింది.

కోవెల సుప్రసన్నాచార్య "వర్తమాన కవిత్వ దర్శనము" అన్న తన వ్యాసంలో- "దాదాపు నూటయాభై సంవత్సరాలనుంచీ కొనసాగుతూ వచ్చిన భారత జాతీయ పునరుజ్జీవనోద్యమం ఆగిపోయినట్లే కనిపించినా జాతి అంతర్గత చైతన్యంలో అంతర్వాహినిగా కొనసాగుతూ వస్తున్నది............ ఏడో దశకం నడుమనుంచీ ఒకటి రెండుసార్లు చీకటి వర్షం కురిసింది. కవిత్వం పేర అశ్లీలాన్నీ జుగుప్సనూ సమకూర్చిన దిగంబర కవులు వచ్చిన దారినే వెళ్ళిపోయారు........ ఈ వర్గం (విప్లవ కవులు) క్రమంగా సాహిత్యాన్ని రాజకీయ ప్రసవశాలలో మంత్రసానిగా మార్చివేసిన అంశం స్పష్టమవుతుంది........ ఈ విధంగా ప్రగతి వాదమూ, విప్లవ వాదమూ తెలుగు సాహిత్యంలో ఒక ప్రతిభారాహిత్యానికి మూడు దశాబ్దాలు పట్టం కట్టాయి .... ఆధునిక కవితకు రసలోక ద్వారాలను నవ్య సంప్రదాయ వాదం తెరచి గొప్ప ఉపకారం చేసిందని చెప్పాలి" అన్న మాటలు ఆలోచింపదగినవి.

వడలి మందేశ్వరరావు "నవీన ప్రబంధములు" అనే వ్యాసంలో- "రాణా ప్రతాపసింహ చరిత్ర"నుంచి 'పోతన చరిత్రము' వరకూ 'ఆంధ్ర పురాణము' నుంచి 'వందేమాతరం' వరకూ వచ్చిన కావ్యాలనూ, 'హేమమాలిని' 'కుమార భారతి' వంటి కృతులను చూచినప్పుడు పద్యం కాని పద్యకావ్యం కాని సాహిత్య ప్రపంచంనుంచి అంతరించినట్టు కనబడదు........ వెనుకటి ప్రబంధ కవులకూ ఈ నవీన ప్రబంధ కవులకూ గల తేడా ప్రధానంగా తన పోషణతో

ఉంది. వీరికి శృంగారం ప్రధానమైన రసం కాదు. దేశభక్తి, మాతృదేశానికి పారతంత్ర్యం నుంచి విమోచనాన్ని సాధించడం, గత కాలపు కీర్తి ప్రతిష్ఠలు వీరికి ముఖ్యమైనవి. అందుచేత వీరము, ఉత్సాహము ఎక్కువ చోటు చేసుకుంటాయి" అంటున్న మాటలు వివేచింపదగినవి.

వి. వి. ఎల్. నరసింహారావు 'నవ్యకావ్య దృక్పథం' అన్న వ్యాసంలో "మైక్రో ఫిల్మింగ్ సాధనాలు సమకూరిన తరువాత గ్రంథాలయాల్లోని లక్షల పుస్తకాలన్నీ ఓ చిన్ని పెట్టెలోని మైక్రోఫిల్ముల్లోకి ఒదిగిపోతున్నట్లు అనంతకవితా భావన అద్భుత ప్రణవనాదంలో ఇమిడిపోవచ్చు. అటువంటిదశ ఒకటివచ్చి, అదే నవ్య సంప్రదాయంగా పరిణతమైతే ఆశ్చర్యపడ నక్కర్లేదు. సాహిత్యం, టెక్నాలజీ, కమ్యూనికేషను-అన్నీ కలిసి రేపటి కవిత్వాన్ని శాస్త్రశిశువుగా రూపొందించినా అబ్బురంలేదు. ఆ చిన్నెలిప్పటికే పొడసూపాయి. ఏమైనా మనిషికోసం నవ్యత్వ మానవత్వాలు కవిత్వాన్ని అంటిపెట్టుకొని వుండక మాత్రం తప్పదు'' అంటూ నుడివిన మాటలు కొత్త ఆలోచనలకు పునాదుల వంటివి.

అద్దేపల్లి రామమోహనరావు తన "ప్రయోజన దృక్పథం" అనేవ్యాసంలో "సమాజంలో ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక సంఘర్షణలు ప్రధానంగా ఉన్నంత కాలం అభ్యుదయ కవిత్వం ప్రధాన కవితా ధోరణిగా ఉండక తప్పదు.........మార్క్సిస్టు పునాది లేకపోయినా సమ సమాజ దృష్ట్యా ప్రగతి కవిత్వం రాసేవాళ్ళందర్నీ అభ్యుదయ కవులనే అనాలి" అంటున్న వాక్యాలు ఆలోచింపదగినవి.

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ "మానవతావాద దృక్పధము-సామాజిక చైతన్యము"అన్న వ్యాసములో-"మానవతావాదం.సామాజిక చైతన్యం అనే పద బంధాలకు ఏర్పడిన చట్టాలను వ్యతిరేకిస్తున్నాను. ఒకానొక రాజకీయ అవగాహన మాత్రమే సంకీర్ణ సమాజంలో మనిషిని ఉద్ధరిస్తుందనే ఆలోచనను వ్యతిరేకిస్తున్నాను. నిరవధికమైన సమాజంలో నివాతదీపమై కాపాడవలసింది మానవత్వమనీ దానికి ఏ రూపంలో కేతనాలెత్తినా అది మంచి కవిత్వమనీ ప్రతిపాదిస్తున్నాను" అంటున్నారు.

అక్కిరాజు రమాపతిరావు తన "అధిక్షేపక కవిత" వ్యాసంలో - "కవిత్వం కసిని పెంచి వర్గకలహాన్ని బోధించి సంఘాన్ని సాధించే దేమీ ఉండదు. సంఘంలోని ఆలోచనాపరులను ఆత్మావలోకనం చేసుకోగలిగేట్లు చేస్తే అంతకన్న కవిత్వం సాధించగల పరమార్థం ఇంకొకటి ఉండదు..... అభ్యుదయ కవిత్వం తర్వాత ఆధునిక తెలుగుసాహిత్యంలో కవితాధోరణి ఒక కొత్త మలుపు మళ్ళింది. ఈ దేశపు సామాజిక జీవనాడిని చైతన్యవంతం చెయ్యడం, దేశీయమైన సాంస్కృతిక విలువలను బలపరచడం, ప్రచారం చేయడం ఈ కవులు తమ కర్తవ్యంగా స్వీకరించారు. 'చేతనావర్త' కవులుగా తమ ప్రయత్నం తాము చేశారు" అంటున్నారు.

మావిరాజు రంగారావు "ప్రజాసామ్య కవిత్వం" అను వ్యాసంలో - "ప్రజాస్వామ్య కవిత్వంలో సామాజిక స్పందనతో పాటు వైయక్తికమైన అన్వేషణమూ ఉంటుంది. సమష్టి మరియు వ్యష్టి స్థాయిలో ఉండే భేదాన్ని గుర్తిస్తుంది. వైవిధ్యాన్ని అనుమతిస్తుంది. కళాత్మకతను భంగంచేసే లేదా తక్కువచేసే స్థితి రానీయదు. సమాజంలో సమభావాన్ని సృజిస్తూ, ప్రగతికెంత ప్రోత్సాహముంటుందో వ్యక్తి వికాసానికి అంతటి అవకాశం ఉంటుంది. సామాజిక చైతన్యం వ్యక్తిపై ఎంతటి ప్రభావాన్ని నెరపుతుందో వైయక్తిక ప్రేరణ కూడా సమాజంపై అంతే గుణాత్మకమైన స్థితిని నెలకొల్పుతుంది" అంటున్నారు.

తంగిరాల వెంకట సుబ్బారావు "భాషాశైలి"పై రాసిన వ్యాసంలో - "ప్రాచీనకాలం నుంచీ మూడు భాషాశైలులున్నాయి. (1) నన్నయ మొదలు పెట్టిన మార్గశైలి (2) పాల్కురికి సోమనాథుడు, తిక్కన మొదలుపెట్టిన దేశిశైలి (3) ప్రజా కవిత్వంలో ఉన్న జానపదశైలి. 20 వ శతాబ్ది కవిత్వంలో కూడ ఈ మూడు శైలులే ప్రధానంగా కనబడుతున్నాయి. ఈ మూడింటిలోనూ నన్నయ మార్గశైలివే ఈనాటికీ పై చేయిగా ఉంది.............11 వ శతాబ్దంలో నన్నయ ఏర్పరచిన ఆ శైలి 20 వ శతాబ్ది నాల్గవ పాదంలోని శేషేంద్ర దాకా కొనసాగుతూనే ఉంది. దానినుంచి బయటపడాలని ప్రయత్నించిన ఏ కవీ యింతవరకూ కృతకృత్యుడు కాలేదు" అన్న మాటలు ప్రత్యేకంగా గమనించదగినవి.

ఎం. కులశేఖరరావు తన "ఆధునిక కవుల వైచిత్రి" అన్న వ్యాసంలో- "ఈనాడు చాలమంది కవులు అనేక విధాలైన కవితలు వెలయిస్తున్నారు..........

విశేషమేమంటే వైచిత్రిలాంటి చిన్న కవితా గుణాలు కూడలేని ఖండికలు ఇప్పుడు అనంతంగా ఉన్నాయి. వాటిని మనం విమర్శించడం కష్టమే. కారణమేమంటే విశృంఖలంగా, నినాదప్రాయంగా ఇవి ఉండడడంచేత వీటిని మనం ఏ పరిధిలోనికి గ్రహించలేము" అంటున్నారు.

ఆర్వీయస్. సుందరం తన "అభ్యుదయ యుగానంతర కవిత్వంలో మనిషి" అనే వ్యాసంలో- "అభ్యుదయానంతర యుగంనుంచి దిగంబర కవిత అవతరించేవరకు ఉండిందని చెప్పిన ఈ స్తబ్ధత మానవతావాద సంబంధికాదు. అభ్యుదయ వాదానికి సంబంధించిందిమాత్రమే. తెలుగు కవిత్వం నిద్రపోతుండిన కాలమని విమర్శకులెందరో వచించిన ఆ పదేళ్ల (1956-65) కాలంలోనే తిలక్ అత్యుత్తమ కవితా ఖండికల్ని రచించారు.........అభ్యుదయ యుగం తర్వాత ఆధునిక తెలుగు కవిత్వానికి వైవిధ్యాన్ని సమకూర్చిన కవివర్గాలలో చేతనావర్తం కవులను ప్రముఖంగా చెప్పుకోవాలి.........ఏ కవితావాదానికీ లొంగకుండా మానవ జీవిత పురోగతిని కాంక్షించి రచనలు చేయడం వీరి ధ్యేయం" అంటున్నారు.

బి. రుక్మిణి, పి. జ్యోతి కలసి రచించిన "నేటి కవిత్వంలో జాతీయ భావన" అనే వ్యాసంలో - "1950 తరువాత తెలుగు కవిత్వంలో దేశభక్తి, జాతీయ భావనకు సంబంధించిన ఎన్నో రచనలు వచ్చాయి. ఇవి చారిత్రకమైన వస్తువుతో రాజకీయమైన అంశాలతో వర్తమాన స్థితులతో అనేకం ఎప్పటికప్పుడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జాతిని చైతన్య శిఖరాలపై నిలిపే ప్రయత్నం చేశాయి" అంటున్నారు.

కోవెల సంపత్కుమారాచార్య తన వ్యాసం "ఆధునిక కవిత్వం: దేశీయత"లో - "తెలంగాణా ఉద్యమం తరువాత అభ్యుదయ కవిత్వం స్తబ్ధమయి పోవడంతో, మొత్తం తెలుగు కవితా రంగమే స్తబ్ధమయిపోయిందన్న భ్రాంతి కలిగించడానికి విశేష ప్రయత్నాలు జరిగినయి. కాని నిజానికి దేశీయతా నిష్ఠంగా సాగే సాహిత్యంలో స్తబ్ధత రాలేదు. 1950 నుంచి చూచినా దేశీయతా భావ భూమికతో అనేక కావ్యాలు వచ్చినయి" అంటున్న వాక్యాలు ఆలోచనాత్మకాలు.

జి. వి. సుబ్రహ్మణ్యం తన వ్యాసం "అనుభూతి కవితావాదం"లో

"అనుభూతి సమగ్రతకోసం సాహిత్యం ఉద్యమించడమే యుగధర్మం. ఆధునికాంధ్ర సాహిత్యంలో నవ్యకవిత్వయుగం విభిన్న ప్రక్రియలద్వారా అనుభవాన్ని సాధించింది. భావకవిత్వయుగం వివిధ ప్రవృత్తులతో అనుభవాన్ని సాధించింది. భావకవిత్వయుగంలో భాసించిన వైవిధ్యాన్ని ఏకోన్ముఖం చెయ్యాలని విశ్వనాథ ప్రయత్నించాడు. మహాకావ్యం వ్రాశాడు. నవ్యసంప్రదాయయుగం ఆయనవెంట నడిచింది. అభ్యుదయ కవిత్వ చైతన్యం పాక్షికంగా అనుభూతిని సాధించింది. అందువలన సమగ్రానుభూతికోసం అనుభూతి కవిత్వం ఆ యుగంలోనే బలంగా తలెత్తింది. వేగాన్ని సంతరించుకుంది. దిగంబర కవిత్వంలో అనుభూతికి తావులేదు. విప్లవ కవిత్వంలో అనుభూతికి వ్యతిరేకతకూడా వ్యాపించింది. దానితో అనుభూతి కవితావాదం స్వీయరక్షణకేకాక స్వీయఉద్యమవ్యాప్తికికూడా కంకణం కట్టుకొని కదనానికి సిద్ధమైంది. కవిత్వంలో సమగ్ర సామాజికానుభవాన్ని పండించాలన్న అత్యంత ఆధునిక సాహిత్య స్పృహతో చేస్తున్న ప్రయత్నమే అనుభూతి కవితావాదం" అంటున్నారు.

ఇది నేటి తెలుగు కవితాస్థితి. అది జాతీయ జీవన తత్వాన్నీ తరతరాలుగా ఈ దేశం ప్రోదిచేసుకుంటూ వస్తున్న ధార్మిక స్వభావాన్నీ సంతరించుకొని కవుల గుండెల్లోంచి ఉబికివస్తున్నది. దేశీయత భూమికగా సాంస్కృతిక వారసత్వాన్ని మోసుకుంటూ ప్రజల జీవనాడిని స్పందింపజేస్తున్నది. వికృత చేష్టలతో జాతి సాంస్కృతిక సంపదను విధ్వంసంచేసే ప్రజల జీవన స్రవంతిని విచ్ఛిన్నంచేసే దుష్ప్రయత్నాలు ఏ కళారంగంలో కూడ అనుమతించదగినవి కావు. మానవ జాతి సమగ్ర వికాసంకోసం సర్వజన సంక్షేమాన్ని కోరుతూ కళాత్మకంగా, కమనీయంగా, భౌతిక-మానసిక-సామాజిక-ఆధ్యాత్మిక రంగాల్లో ప్రగతిని కోరుతూ కవులు కావ్యరచన చేయడం అభిలషణీయం,హర్షణీయమున్నూ. తెలుగు సాహితి తనదని చెప్పుకోగలిగిన-చెప్పుకోదగిన కవితా సరస్వతికి నీరాజనం.

జాతిని జాగృతపరచి ఈ దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దిన స్వామి వివేకానందునికి ఈ గ్రంథం అంకితం ఇవ్వగలుగుతున్నందుకు ధన్యులం.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః!"

# సాహిత్యము : ఆధునికత

ఆర్. ఎస్. సుదర్శనం

జీవితం గతానుగతికమై, సంప్రదాయాలు అర్థరహితమై పోవడమేగాక దుఃఖానికి బాధకూ కారణమై, ఆచారాలూ అలవాట్లూ ఆత్మహత్యా సదృశాలుగా మారినప్పుడు, కొత్తదనాన్ని అన్వేషించడం మానవ సహజ ప్రవృత్తి. ఒక్కొక్క సమయంలో అలా ఏర్పడే సవాలును (Challenge) ఎదుర్కొనే ప్రతిక్రియను (Response) బట్టి మానవుని పునరుజ్జీవనం కొనలు సాగుతూ, నూతనసృష్టి, జీవితానందం, నూతన చైతన్య విలసనంతోబాటు నవసమాజ నిర్మాణము జరుగుతూ వుంటుంది. మత, సామాజిక, రాజకీయ, సాహిత్య ఉద్యమాలు పునరుజ్జీవనం లక్షణాలు. వీటిని ఒక్కొక్కదాన్ని వేరుగానూ, పరస్పరాశ్రితాలుగానూ కూడా ఉపలక్షించటానికి, పరిశీలించటానికి వీలున్నది.

19-20 శతాబ్దులలో భారతజాతి పొందిన పునరుజ్జీవనానికి, పాశ్చాత్య దేశాలలో వచ్చిన పారిశ్రామిక విప్లవం, ప్రజాస్వామ్య విప్లవం వంటి మార్పులతోటేగాక, కాల్పనిక వాదము, మానవతావాదము వంటి భావసంచలనాలతోగూడా సన్నిహిత సంబంధం ఉన్నది. అయినప్పటికీ భారతజాతీయ పునరుజ్జీవనంలో ప్రధానపాత్ర వహించిన రాజా రామమోహనరాయ్ (బ్రహ్మసమాజము), దయానంద సరస్వతి (ఆర్యసమాజము), రామకృష్ణ పరమహంస, వివేకానందులు (అనుష్ఠాన వేదాంతము), తిలక్ (గీతా రహస్యము), గాంధీ (సత్యాహింసలు) ప్రభృతుల ఉద్యమాల స్వభావాన్ని పరిశీలించిచూస్తే, తేటతెల్లం అయ్యే సత్యం ఒకటి ఉన్నది. పాశ్చాత్య సంస్కృతి మన జీవన విధానంమీద చూపిన ప్రభావం సంక్షోభానికి (Crisis) దారితీస్తే, దాన్ని సవాలుగా (Challenge) తీసుకుని ప్రభవించిన పై ఉద్యమాలు ప్రతిక్రియగా (Response)గా కనిపిస్తాయే తప్ప, పాశ్చాత్య సంస్కృతిని పుణికి పుచ్చుకుని, స్వీయ సంస్కృతిని కూకటివేళ్లతో? ఊచముట్టుగా కోల్పోయిన పరిస్థితి కనిపించదు. బ్రహ్మసమాజంమీద క్రైస్తవ మత ప్రభావం

కనిపించినా, ఆ ఉద్యమం ఉపనిషత్తులను భూమికగా స్వీకరించి, మిగతా హైందవ సంప్రదాయాలను నిరాకరించడం ద్వారా, భారతీయుల్లో స్వీయ సంస్కృతిపట్ల జాగరణ కలిగించి నూత్న చైతన్యాన్నీ, ఉత్తేజాన్నీ సృష్టించింది. అది ఒక ఆధునికత. ఆర్యసమాజం కేవలం వేదాల్ని ప్రమాణంగా స్వీకరించి, కులభేదాల్ని నిరసించి నవచైతన్యానికి దోహదం చేసింది. బ్రహ్మసమాజం ప్రభావంతో హైందవులు మూర్తి ఆరాధనను నిరసించి, వ్యక్తిగతమైన మూర్తి ఆరాధన, భక్తి ప్రపత్తుల ఆధ్యాత్మిక సాధన మార్గాలనూ విస్మరించే తరుణంలో రామకృష్ణుడు ఆయా విశిష్ట మార్గాలను పునరుద్ధరించడమేగాక, వేదాంతానికీ, క్రైస్తవ మహమ్మదీయ సాధన మార్గాలకూ విప్రతిపత్తి లేదని చాటిచెప్పగలిగాడు. వివేకానందుని అనుష్ఠాన వేదాంతం పేర్కొన్న 'దరిద్ర నారాయణుడు' గాంధీగారికి యిష్టదైవం అయ్యాడు. 'గీత' కర్మనూ కర్తవ్యాన్నీ బోధిస్తున్నదని వ్యాఖ్యానించి తిలక్ జాతిని స్వాతంత్ర్య యుద్ధోన్ముఖుల్ని చేశాడు. ఇలా పరిశీలిస్తే 'ఆధునికత' అంటే పునరుజ్జీవన ప్రతిక్రియ (**Response of rejuvenation**) అనీ, అది జాతి సంస్కృతి భూమికల్ని పునర్దర్శించడమనీ (**rediscovery of the cultural bases**) అవగాహన అవుతుంది.

ప్రకృత విషయం 'సాహిత్యంలో ఆధునికత'. మొదట పాశ్చాత్య సాహిత్యంలో ఆధునికతను గూర్చి ప్రస్తావిస్తాను. ఫ్రెంచి విప్లవం తర్వాత 19వ శతాబ్ది సాహిత్యంలో వచ్చిన కాల్పనికోద్యమం, ఆనాటి పారిశ్రామిక, వైజ్ఞానిక పరిణామాలు జీవితంలో కలిగిస్తున్న నీరసత్వానికి ప్రతిక్రియ; ఘనీభవించిన రాజకీయ, సామాజిక వ్యవస్థలపై తిరుగుబాటు చెయ్యడానికి వ్యక్తికి స్ఫూర్తిని కలిగించినది ఆ నవ చైతన్యం. ప్రకృతి గాంభీర్యానికీ, గ్రామీణుల వ్యక్తిత్వాలకూ, వారి నిసర్గ సుందరమైన భాషకూ వర్డ్సువర్తు ప్రాధాన్యం యిచ్చాడు. మధ్యమ యుగాలకు చెందిన మార్మికతకు, అద్భుత రసానికీ కోలెరిడ్జ్ మానవుని నైతిక ప్రవృత్తిని సంధానించి చూపాడు. వైయక్తికమైన సౌందర్యానుభూతిలో జీవిత సత్యం ఉన్నదని కీట్సు కవిత్వం చాటింది. కీట్సు గ్రీకు సంస్కృతివైపు మొగ్గుచూపాడు. ఇంగ్లండులో కంటె ఫ్రాన్సులో కాల్పనికవాద కవులు భాషతో చేసిన ప్రయోగాలు విచిత్రమైనవి. సాదాతనంనుంచీ తప్పించుకోవడానికీ, కవిత్వాన్ని అలౌకికమయిన ప్రక్రియగా మలిచేందుకూ ఈ ప్రతీకవాద కవులు (**Symbolists**) ప్రయత్నించారు. రాంబో (**Rimbaud**) 1871 లో పాక

డీమెనీకి వ్రాసిన లేఖలో అంటాడు.[1] "ఈ కొత్త భాష ఆత్మ పలికే భాష! ఆత్మ నుద్దేశించిన భాష. శబ్ద వర్ణ గంధ సర్వస్వమూ ఒక సముచ్ఛయమైన భాష. భావం భావంతో ముడిపడి లాక్కువెడుతుంది. కవి జీవిస్తున్న క్షణంలో జాగృత మైన విశ్వాత్మ తాలూకు అజ్ఞాత పరిమాణాన్ని అభివ్యక్తం చేసేందుకు జరిగే ప్రయత్నం యిది." రాంబో అన్వేషణ మౌనంలో పర్యవసించింది. కారణం తాను కోరినది మనస్సుకు అతీతమైన స్థాయిలో ఆత్మ సంవాదము. "Not communication but communion." ఈ కపుల్లో కొందరు కవిత్వాన్ని సంగీతం స్థాయికి మార్చే ప్రయత్నంతో భాషలోని పరుష శబ్దాలనూ, మేధను స్పృశించే చమత్కారాలనూ అలంకారాలనూ పరిహరించి శ్రుతిపేయమైన శైలిని రూపొందించారు. భాషా ప్రపంచాన్ని దాటి, మేధతో భావంతో సంబంధంలేని అలౌకికానుభూతిని, అనంతమైన స్వేచ్ఛను ఆపాత మధురంగా అన్వేషించే ఈ సాహిత్య ప్రయోగాలు, సమకాలీన జీవిత సంక్షోభానికి ఒక వైయక్తికమైన ప్రతిక్రియ. అది ఆనాటి సాహిత్యంలో ఒక ఆధునికత. అదే కాలంలో వాస్తవికతా వాదం సాహిత్యంలో మరో ఆధునికతగా రూపొందింది. బాల్జాక్ (1799-1850) ఫ్లాబర్ (1820-80), జోలా (1840-1902) వ్రాసిన నవలా సాహిత్యం ఆనాటి జీవితానుభవానికి సాహిత్య రూపేణ మరో రకం ప్రతిక్రియ. బాల్జాక్, డికెన్స్ వంటి ఈ కోవకు చెందిన నవలా రచయితలను కార్ల్‌మార్క్స్ మెచ్చుకున్నాడు. అదేకాలంలో కాల్పనికవాదం నవలాసాహిత్యంలోకూడా రూపొందింది. స్కాట్ వంటి ఇంగ్లీషు నవలా రచయితా, విక్టర్ హ్యూగో, డ్యూమాస్ వంటి ఫ్రెంచి రచయితలూ సుప్రసిద్ధులే. ఏతావాతా తేలిందేమటంటే- 19 వ శతాబ్ది సాహిత్యంలో 'ఆధునికత' (1) కాల్పనికవాదం ద్వారాను (2) వాస్తవికతావాదం ద్వారాను రెండు విధాల రూపుదిద్దుకొన్నది.

---

"This new language will be of the soul, for the soul, summing up everything, smells, sounds, colours; thought latching on to thought and pulling. The poet would define the quantity of the unknown awakening in the universal soul in his time...." (Rimbaud to Paul Demeny.)

20-వ శతాబ్ది సాహిత్యంలో పై చెప్పిన 'వాస్తవికత', 'కాల్పనికత' ఎలా పరిణామం చెందాయో పరిశీలించేముందు, 'వాస్తవికత','కాల్పనికత'అనబడే రెండు దృక్పథాలను గూర్చి కొంత తాత్త్విక అనుశీలన అవసర మౌతున్నది. తద్వారా ఆధునికత యొక్క రెండు ముఖాలను అవగాహన చేసుకోవడం సూత్రీకరించడం సులభమవుతుంది.

భౌతిక శాస్త్రవేత్తలు యధార్థం (Reality) రెండు విధాలుగా వుంటుందని అన్నారు. జె. రాబర్ట్ ఓపెన్ హైమర్ వాటిని. కాలబద్ధమైనదనీ (the way of time and history), కాలతీతమైనదనీ (the way of eternity and timelessness) విభజించాడు. హైసెన్‌బర్గ్ ఇలా వివరించాడు: "దేశకాలబద్ధమై నడిచే వస్తు ప్రపంచం (the objective word pursuing its regular course in space and time); ప్రపంచంయొక్క ఏకత్వాన్ని ఆత్మానుభూతి ద్వారా గ్రహించి, వస్తువునూ వస్తుప్రపంచాన్నీ తనకంటె భిన్నంగా చూడని విషయి (a subject mystically experiencing the unity of the world and no longer confronted by an object or by any objective world). ఓపెన్‌హైమర్ ఈ రెండింటినీ సమీకరించు కోవడం శాస్త్రజ్ఞునికి (మనిషికీ) చాల అవసరం అంటాడు: "అనుభూతిని భిన్నరూపాలలో అభివ్యక్తం చెయ్యడంలో దేని సార్థకత దానికి ఉన్నది. భౌతిక ప్రపంచాన్ని సమగ్రంగా వర్ణించేందుకు రెండు మార్గాలూ అవసరమే. అయినప్పటికీ ఒక సందర్భంలో ఒక మార్గమే పనికివస్తుంది తప్ప రెండోది పనికిరాదు; రెండోది పనికివచ్చే సందర్భంలో మొదటిది పొసగదు. అలా యీ రెండు మార్గాలూ ఒకదాని కొకటి ప్రత్యామ్నాయంగా కనిపించినా, సమగ్రమైన జ్ఞానానికి రెండూ అవసరమే" (Various ways of talking about experience may each have validity and may each be necessary for the adequate description of the physical world and yet may stand in nutrally exclusive relationship to each other, so that in a situation to which one applies, there may be no consistent possibility of applying the other.) ఈ సూత్రీకరణ చాల మౌలికమైనది. అనవసరమైన అపోహలకూ, వివాదాలకూ స్వస్తిచెప్పే ప్రాముఖ్యం, ప్రయోజనం దీనికి ఉన్నది. 'వాస్తవికత' 'కాల్పనికత' రెండింటిలో ఏది ప్రయోజనకారి, ఏది కాదు;

ఏది సత్యం, ఏది అసత్యం అనే మీమాంస అంతమై, రెండూ మానవుని జ్ఞానచక్షువులుగా నిలుస్తాయి. 'వాస్తవికత' బాహ్య ప్రపంచాన్ని, సామాజిక, ఆర్థిక, చారిత్రక ప్రమాణాలతో, కొన్ని జీవిత ప్రయోజనాలకు అనుగుణంగా అవగాహనకు తీసుకువస్తే, 'కాల్పనికత' విషయికి అత్యవసరమైన 'స్ఫూర్తినీ, ఆనందాన్నీ, ఉత్తేజాన్నీ ప్రసాదిస్తుంది. లోకంలో జీవిస్తూ లౌకిక సమస్యలను ఎదుర్కొంటూనే, లోకానికి అతీతంగా, అలౌకికమైన అనుభూతినీ ఆనందాన్నీ పొందటానికి రెండు మార్గాలూ అవసరమే.

వాస్తవికతా దృక్పథంతో వ్రాయబడిన సాహిత్యంలో వ్యక్తి 'విషయి' లేకపోలేదు; అది లేకపోతే సాహిత్య రచనలో అర్థం, ఆకారం సాధ్యంకావు. అలాగే కాల్పనికతా దృక్పథంతో వ్రాయబడిన సాహిత్యంలో వస్తు ప్రపంచం లేకపోలేదు; కాని, ఈ వస్తు ప్రపంచం విలక్షణంగా, భిన్నాత్మంగా దర్శనమిస్తుంది. 'ఆధునికత' అంటే సమకాలీన జీవితం నుంచి ఎదురయ్యే సవాలు (Challenge)ని ఎదుర్కొనే ప్రతిక్రియ (Response) అన్నప్పుడు, 19వ శతాబ్ది ఆర్థిక, సామాజిక వ్యవస్థల అవగాహనకు 'వాస్తవికతా' సాహిత్యం దోహదంచేస్తే, ఆనాటి జీవితంలో వ్యక్తి పొందే నిర్వేదానికీ, నిస్పృహకూ, సద్యోవిముక్తి మార్గంగా 'కాల్పనికతా' సాహిత్యం రూపుదిద్దుకొన్నది. రాజకీయవాదులు మొదటి మార్గాన్ని, మనస్వితత కలిగిన వ్యక్తులు రెండో మార్గాన్నీ ఎన్నుకొని, తాము అభిమానించే సాహిత్యమే మానవ శ్రేయస్సుకు అవసరమనీ, రెండోది పనికిరాదనీ వాదిస్తారు. ఈ వాద ప్రతివాదాలు అంతంలేని ఆక్రోశం మాత్రమే. రెండూ మానవ జాతికి సహజమైన, అవసరమైన ప్రవృత్తులేనని గుర్తించడమే వివేకులు చేసేపని.

పైన వివరించిన 'వాస్తవికతా', 'కాల్పనికతా' సాహిత్య వైఖరులకూ మనోవిజ్ఞానశాస్త్రం (Psychology) ప్రతిపాదించే చేతన (Conscious), అవచేతన (Unconscious)లకూ కూడా సంబంధం గుర్తించవచ్చును. కార్ల్ యూంగ్ పరిశోధనలు సాహిత్యానికి బాగా అన్వయిస్తాయి. అవచేతన (Unconscious)లో ఆయన వ్యక్తి అవచేతన (Personal Unconscious), సామూహిక అవచేతన (Collective Unconscious) అన్న రెండు లోతుల్నీ గుర్తించారు. వ్యక్తిగత జీవిత సంస్కారాలతో నిండినది వ్యక్తి అవచేతన; అంతకంటె విశాలంగా

మానవజాతి చరిత్రలో రూపుదిద్దుకొన్న సంస్కృతి విశేషాలతో నిండినది సామూహిక అవచేతన. చేతన, అవచేతనల సంఘర్షణ, సమీకరణ, సమన్వయమే సాహిత్య సృష్టికీ, సాహిత్యంలో నవ్యత (ఆధునికత)కూ మూలం అనుకోవడం ఒక రకమైన సూత్రీకరణ అవుతుంది.

ఇక 20 వ శతాబ్ది సాహిత్యంలో "వాస్తవికత", "కాల్పనికత" పొందిన పరిణామాల్ని పరిశీలిద్దాము. కవిత్వంలో ప్రతీకవాదం (**Symbolism**) క్షీణించి దానిపై తిరుగుబాటుగా ప్రతిమావాదం (**Imagism**) వచ్చింది. ఇక్కడ 'వాస్తవికత' - 'కాల్పనికత'ల సమన్వయ ప్రయత్నం చూడవచ్చు. "జీవితానికి సంబంధించిన భౌతిక సత్యాలను వ్యాఖ్యానం లేకుండా, సూటియైన భాషలో అభివ్యక్తం చెయ్యడం కవిత్వం" అన్నాడు ఫోర్డ్‌మాడక్స్ ఫోర్డ్, ఇమేజిస్ట్ కవిత్వాన్ని సమీక్షిస్తూ. ఉద్యమ నాయకత్వం వహించిన ఎజ్రాపౌండ్ బాహ్య ప్రపంచమే సత్యం అన్నాడు, ప్రతీకవాదుల్ని నిరసిస్తూ. ప్రతీక వాదులు (**Disordering of the senses**) యింద్రియ గోచరమైన వస్తు ప్రపంచాన్ని చిందరవందర చేస్తూ దానికి ఆవల, అతీతంగా 'అజ్ఞాత' మైన దేన్నో అందు కోవటానికి ప్రయత్నించారు; కాని, అందుకోవలసిందీ, పొందవలసిందీ మన చుట్టూ వున్న వస్తు ప్రపంచమే, దీన్ని కొత్తగా చూచే చూపు కవిత్వం ప్రసాదిస్తుంది. అలా చూడటం అంటే "వస్తువుల పేర్లని ఒకసారి విస్మరించడం" అన్నాడు పాల్ వాలెరీ. "కొత్తగా చూడటం అంటే కొత్తదాన్ని సృష్టించడమే" (**To see something new, we must make something new**) - లిక్టెన్‌బర్గ్. ప్రూస్ట్, వాలెరీ, రిల్కే, ఎలియట్ వంటి రచయితలు తమ రచనల్ని వస్తు ప్రపంచంలో ప్రత్యేక ప్రతిపత్తి గల కళావస్తువులుగా (**Artifacts**) పేర్కొన్నారు. "ఆధునిక కళకు సంబంధించిన రచన కళా వస్తువుగా ప్రత్యేక ప్రతిపత్తి కలిగినది; దాన్ని భాషలో సమాజంలో భాగంగా పరిగణించరాదు," (**A work of modern art insists on its own status as an artifact and that it cannot therefore be treated like a piece of language or an aspect of society.**) "రచయిత ఏ ఉద్దేశంతో రచన చేసినా అంతకంటె భిన్నంగా స్ఫూర్తి నివ్వగలిగిన శక్తి దానికి ఉన్నప్పుడే, ఒక రచన కాలం దాటికి తట్టుకొని నిలవగలదు" (వాలెరీ) "**The work of art endured to the extent that it is capable of appearing quite**

other than as its author created it" (Valery). 19 వ శతాబ్ది 'కాల్పనికత' విశ్వరహస్యాల్ని, జీవితరహస్యాల్ని వర్తమాన వస్తు ప్రపంచాన్ని నిరాకరించి,అధిగమించి, గతంలోనో, తాత్త్వికతలోనో అనుభూతి వైశిష్ట్యంలోనో, అన్వేషించింది. 20 వ శతాబ్ది 'కాల్పనికత' వస్తు ప్రపంచానికి తిరిగి వచ్చి, దాన్ని పునర్దర్శించడం ద్వారా జీవితానికి స్ఫూర్తినీ రక్తినీ కలిగించే ప్రయత్నం చేసింది. "ఒక వస్తువును గురించిన జ్ఞానానికి పరిమితి ఉందనుకోవడం అజ్ఞత. ఒక్కొక్క వస్తువు కొత్తగా దర్శనమిస్తుంది; మనం దాన్ని దాన్నిగానే వివరించుకోవాలి" (క్లాడెల్) ('It is stupid to think that any object of knowledge can be exhausted. Each thing springs forth as new, to be explained by reference to itself alone-' Claudel.) కళ, సాహిత్యమూ కూడా 'వస్తు ప్రపంచానికి తిరిగిరావడమే' (a return to things in themselves)'ఆధునికత'గా పరిగణింపబడింది. కాల్పనికత పొందిన ఈ పరిణామాన్ని అల్బర్ట్ బెగిన్ యిలా పేర్కొన్నాడు : "ఆత్మాశ్రయ పద్ధతిని దాని చివరి అంచులదాకా కొనసాగిస్తే, బాహ్యప్రపంచాన్ని పునర్దర్శించే పరిణామం తప్పదు". (The way of subjectivism pursued to the utmost possible limit, results in a discovery of the exterior world— Albert Beguin)

బెగిన్ నిగమనాన్ని పరిశీలిస్తే,బహిశ్చేతనకూ అంతశ్చేతనకూ గల సంబంధాన్నిగూర్చి ఈ కవుల అభిప్రాయమేమిటో మరికొంత బోధపడుతుంది.మార్సెల్ రేమండ్ అంటాడు:"ఒక భావము, ఒక స్పందన, ఒకానొక కోరిక మన ఆంతరిక జీవితానికి సంబంధించిన వీటి స్వరూపం ఏమిటి? మనస్సు అనేదాన్ని అవలోకిస్తే అది బాహ్యవస్తు సముదాయంగానే కనిపిస్తుంది." (What is a thought, a feeling, or a certain desire, what are all phenomena of interior life, in the contemplation of the mind, if not exterior things —Marcel Raymond). అయినప్పుడు ఇమేజిస్ట్ కవులు బాహ్యవస్తు ప్రపంచాన్ని అంతశ్చేతనలోకి మారుస్తున్నారా, లేక అంతశ్చేతనలోని భావాన్నీ, స్పందననూ, ప్రవృత్తినీ బాహ్యవస్తు స్వరూపంలోకి అనువదిస్తున్నారా అనే మీమాంస వస్తుంది. డొనాల్డ్ డేవీ అంటాడు: "పౌండ్ అభిప్రాయం బాహ్య ప్రపంచం అంతర్యంలోకి మారుతుంది అని. కాని, భావమే తన వస్తుతత్త్వాన్ని

వెదుక్కుంటుంది అనే వారిలో ఆంతర్యం ప్రధానం అవుతోంది." ఇది ఒక్కొక్క కవి పద్ధతినిబట్టి ఉంటుంది. ఇక్కడ గమనించవలసింది బహిరంతర ప్రపంచాల సమీకరణ. టి.ఎస్. ఎలియట్ తన పద్ధతి నిలా వివరించాడు: "రసవిహీనమైన వాస్తవికతను, స్వాప్నికమైన కాల్పనికతను సమ్మిశ్రితం చెయ్యడ మెలాగో, గట్టి భౌతిక సత్యాన్ని ఊహాలోకం సరసన కూర్చడం సాధ్యమెలాగో, ఆ ప్రక్రియ మొదట బోద్‌లేర్‌నుంచే నేర్చుకున్నాను" అంటాడు. (I think that from Baudlaire I learned first.... of the possibility of fusion between the sordidly realistic and the phantasmogoric, the possibility of the juxtaposition ot the mother - of - fact and the fantastic —T.S. Eliot.) ఎలియట్ సమకాలీన సమాజంలోని అవ్యవస్థనూ, జీవితాల నైరాశ్యాన్నీ, అల్పత్వాన్నీ చిత్రించిన గొప్పకావ్యం 'వేస్ట్ లాండ్'లో నగర దృశ్యాల వాస్తవికతతోబాటు, మానవుని అంతశ్చేతనకూడా అభివ్యక్తమైంది. నవలా రచయిత జేమ్స్ జాయ్స్ 'యులిసిస్'కూడా నగర జీవితాన్ని పురాణ కథా నేపథ్యస్ఫూర్తితో వర్ణించే వచనకావ్యమే. జాయ్స్ నవల ప్రభావం ఎలియట్ కవితాపద్ధతిమీద ఉన్నది. ఇద్దరికీ పద్ధతిలోగల సామ్యం-గతాన్నీ ప్రకృతాన్నీ సమాంతరంగా కావ్యంలో నడిపించడం. పురాణ సాహిత్యంలోని కథలూ, పాత్రలూ, బింబాలూ ప్రకృత జీవితంలోని ఉదంతాల్నీ, వ్యక్తుల్నీ, చర్యలనీ వర్ణించేప్పుడు స్ఫూర్తి కల్గిస్తుంటాయి. కాలం ప్రసక్తి లేకుండా మానవ చరిత్రయొక్క పూర్వాపరాల సమన్వయం ఏకోన్ముఖంగా పాఠకునికి అందివ్వడం. ఇక్కడ కాలం తన ప్రవాహశీలతను కోల్పోయి, స్థలానికి (Space) నాలుగో పరిణామంగా అనుభూతికి వస్తుంది. (This is spatialized, a mere auxiliary to the other three dimensions. Space is curved, boundless and finite, the same anew).

జాయ్స్ 'యులిసిస్', ఎలియట్ 'వేస్ట్‌లాండ్' 20 వ శతాబ్ది గొప్ప కావ్యాలనడం నిర్వివాదం. వీటి 'ఆధునికత' ఎలాంటిదో పైన సూచించాను. భూత వర్తమాన కాలాల సమన్వయమూ, కవి బహిరంతర చేతనల సమ్మేళనమూ ఈ 'ఆధునికత' లక్షణము. యూంగ్ మనోవైజ్ఞానిక సిద్ధాంతం రీత్యా ఈ రచయితలు వ్యక్తి అవచేతన, సామూహిక అవచేతన లోతులు తరచారు. ఎలియట్‌తో వచ్చిన పరిణామం అందరెరిగినదే. ఆయన యూరపియన్ క్రైస్తవ సాంప్రదా-

తిక, ఆధ్యాత్మిక భూమికల్ని పునర్దర్శించడం ద్వారా సమకాలీన జీవితానికి అర్థం, అన్వయం సాధించాడు.

పోతే, పాశ్చాత్య సాహిత్యంలో అదే కాలంలో ప్రభవిల్లిన ఉద్యమాలు - సర్రియలిజమ్, డాడాయిజమ్ వంటివి వ్యక్తి అవచేతనను సమీకరించి జీవితాను భూతికి కొత్త అభివ్యక్తిని కలిగించే ప్రయత్నాలు. కాని, వ్యక్తి అవచేతనలో లభించే భూమికలు, సామూహిక అవచేతనతో సమన్వయం పొందనప్పుడు, కవిత్వానికి స్ఫూర్తిని యివ్వలేవు. (Surrealism invents without discovering —Wallace Stevens). వర్తమాన జీవిత సంక్షోభాన్నుంచీ ఆయా రచయితలకూ, వారి సన్నిహితులకూ విముక్తినీ స్వేచ్ఛనూ కలిగించినట్లు భాసించాయే తప్ప, సాహిత్యంలో స్థానం పొందడం జరగలేదు. అలా ఈ రచనల్లో ఏదైనా కళాఖండంగా నిలిచిందంటే, దానికి సామూహిక అవచేతన స్పర్శ ఉండటమే కారణం. ఈ ఉద్యమాలు ఫ్రాయిడ్ సిద్ధాంతాలను ఆధారం చేసుకొన్నవి.

సాహిత్యంలో 'వాస్తవికతా' ధోరణి 20 శతాబ్దిలో పొందిన పరిణామాన్ని పరిశీలిస్తే, 'వాస్తవికత' విమర్శనాత్మక వాస్తవికత (Critical realism)గా, సామ్యవాద వాస్తవికత (Socialist Realism) గా రూపొందింది. దీనికి ఆధారం మార్క్సిజమ్. 19 వ శతాబ్ది వాస్తవికతను బూర్జువా వాస్తవికత అన్నారు. కారణం బూర్జువా రచయిత తనకు ఎదురైన భౌతిక సత్యాల వైవిధ్యంలో ఒకదారీ తెన్నూ కనుగొనలేక, దాన్ని భౌతిక విజ్ఞాన శాస్త్ర పరిశోధనలతోనో, తనకు తోచిన కవితాన్యాయంతోనో ముడిపెట్టాడు. (మొదటి దానికి జోలా, రెండోదానికి డికెన్స్ ఉదాహరణలు.)విమర్శనాత్మక వాస్తవికత సమాజంలోనివైరుధ్యాలను, వ్యక్తిలోని వైరుధ్యాలను గతితార్కిక ఏకత్వం నుంచీ చిత్రిస్తుంది" అంటాడు జార్జి లూకాచ్. (It displays controdictions within society and within the individual in the context of a dialectical unity —George Lukacs). మార్క్సిజమ్‌ను సిద్ధాంతంగా, వర్తమాన ప్రపంచ అవగాహనకు ప్రాతిపదికగా గ్రహించినప్పటికీ, రచనలో, సాహిత్యాభివ్యక్తిలో రచయిత తన అనుభూతిమీద ఆధారపడితే తప్ప విజయం సాధించలేడు. (A writer's greatness springs from the depth and

richness of reailty —Lukacs)సామ్యవాద వాస్తవికతకూ విమర్శనాత్మక వాస్తవికతకూ తేడా వివరిస్తూ లూకాచ్ అంటాడు : విస్పష్టమైన సామ్యవాద దృక్పథం దానికి భూమిక కావడమే కాకుండా సామ్యవాదం వైపు సమాజాన్ని నడిపించే శక్తులను ఆంతరికంగా గుర్తించడానికి ఆ దృక్పథాన్ని ఉపయోగించే మెలకువకూడా దానికి అవసరం. (Socialist realism differs from critical realism, not only in being based on a concrete socialist perspective but also in using this perspective to describe the forces working towards socialism from the *inside* - Lukacs.) వాస్తవికతను ప్రదర్శించే రచనలో సామ్యవాదాన్ని ఆంతరికంగా గుర్తించడం, చిత్రించడమంటే అది భవిష్యత్తును బీజప్రాయంగా సూచించడమే తప్ప, యథాస్థితిగా కాదు అని హెచ్చరిస్తాడు లూకాచ్. (Socialist realism is a possibility rather than an actuality.) అలా కాకుండా అతిక్రమించితే అది 'విప్లవకాల్పనికత'గా మారుతుంది. మనం మనస్సులో ఆకాంక్షిస్తున్న పరిణామాలను యథార్థంలో ఉన్నట్లు చిత్రించడమే 'విప్లవ కాల్పనికత.'(Confusing what is subjectvely desirable what is objectively there). అందువల్ల విమర్శనాత్మక వాస్తవికతే కొత్తగా సామ్యవాది వ్యవస్థ ఏర్పడిన సమాజాల్లో కూడా చాలాకాలం సాహిత్యంలో ప్రాభవం వహించే అవకాశం ఉన్నదని లూకాచ్ అభిప్రాయపడ్డాడు.

20 - శతాబ్ది సాహిత్యంలో 'వాస్తవికత' మార్క్సిజమ్‌ను ఆలంబనం చేసుకోవడం అంటే సమకాలీన జీవిత సంక్షోభం సవాలు (Challenge) కి మార్క్సిజమ్ చూపే భవిష్యద్దర్శనము ప్రతిక్రియ (Response) కావడమన్న మాట. నవలలో దీని అభివ్యక్తి ఎలా వుంటుందో ఆలెక్ స్వింగ్‌వుడ్ వర్ణిస్తాడు: "వర్తమానం చరిత్రగా, పర్యవసానాన్ని గూర్చిన అనిర్దిష్టతతో, స్వేచ్ఛనూ విధాయకత్వాన్ని సమతూకంగా పొందిక చేస్తూ, సంక్షోభంలో నాయకుడూ అతని సమాజమూ తలపడినట్లు చిత్రిస్తూ ఉండే లక్షణాలు విప్లవాన్ని, శ్రామిక వర్గ రాజకీయాల్ని చిత్రించే నవలలకు ముఖ్యమని తోస్తుంది. పై చెప్పిన విషయాల్ని అర్థవంతమైన ఏక నిర్మాణంగా రూపొందించడంలో సామ్యవాద, విప్లవవాద నవలలని పేర్కొనబడే రచనలు పొందుతున్న వైఫల్యానికి కారణం- సామ్యవాద సమాజాల్లో శ్రామికవర్గం యొక్క అధికారం నిజంగా

నెలకొనక పోవడమే.... వ్యక్తిని చారిత్రక సిద్ధాంతాలకూ, ధోరణులకూ, భవిష్యద్దర్శనానికీ బలి యివ్వడమే.... గోర్కీ 'అమ్మ' నవల, పాల్‌నిజాన్ 'ఆంట్వాయిన్ బ్లాయ్' (1933) నవలా, మార్క్సిజమ్ సాహిత్యంతో సమ్మేళనం చెందిన అరుదైన నవలలు." (The Novel and Revolution—Alan Swingewood pp. 264-268) మార్క్సిజమ్ తాలూకు భవిష్యద్దర్శనం కాని మరో భవిష్యద్దర్శనం కాని జీవిత సంక్షోభానికి ప్రతిక్రియగా చేసుకోవడంవల్ల, సాహిత్య సృష్టిలో, యథార్థ జీవిత చిత్రణలో కొన్ని వైరుధ్యాలూ సమస్యలూ తటస్థిస్తాయి. ఈ సమస్యల్ని అధిగమించి విజయవంతంగా భాసించిన నవలలు 'అమ్మ', 'ఆంట్వాయిన్ బ్లాయ్' మాత్రమే అంటున్నాడీ విమర్శకుడు. ఆ వైరుధ్యాలూ, సమస్య లేమిటో మరోచోట వివరించాడు: "నవలలో రాజకీయమైన నిబద్ధత స్వేచ్ఛకోసం అని ఓవైపు చెబుతూ, పాత్రలలో ఆ స్వేచ్ఛ కనబడకుండా చెయ్యడం; పాత్రపోషణా, రాజకీయ భావ సంచలనమూ ఒకటి కావడం, నవలా స్వరూపంలో సమస్యా పరిష్కారానికి అన్వేషణ బదులు సామ్యవాదమే పరిష్కారమని మొదటినుంచీ తేల్చి చెప్పడం, ఇలా నిర్మింపబడిన రచనలో పాత్రల్లో సంశ్లిష్టతగాని, సహజ ప్రేరణగాని కనిపించకపోవడం; కార్య-కారణ సంబంధం ఒకే పద్ధతిలో కొనసాగడం; కథానాయకుడు భవిష్యద్దర్శనాన్ని సమర్థించే పాత్రగా మాత్రమే రూపొందడం తప్ప సమస్యకు కేంద్రం కాలేక పోవడం, —యిలాంటి నిర్మాణం కలిగిన రచనలు సామ్యవాద, విప్లవవాద ఛాందసానికి ఉదాహరణలుగా ఉంటూ, సామ్యవాద విప్లవం విప్లవాత్మక కళను నిరోధిస్తుంది అనే ఆరోపణకు ఆస్కారం కలిగిస్తాయి." ఇలాంటి రచనలు స్టాలిన్ రష్యాలోనూ యితరచోట్లా వచ్చాయి. పాస్టర్‌నాక్, సోల్జనిస్తీన్‌లరచనలు ఆమోదయోగ్యం కాలేకపోయాయి. ఈ మధ్య రష్యా ప్రభుత్వం పాస్టర్ నాక్ రచనల్ని ముద్రించడానికి ఆమోదించినట్లు తెలుస్తున్నది.

మార్క్సిజమ్‌ని భూమిక చేసుకొని సమకాలీన జీవితాన్ని చిత్రించే వాస్తవికతావాద రచయితలు గమనించవలసిన హెచ్చరిక మరొకటున్నది. సమకాలీన సమాజ చిత్రణలో, ఆయా దేశ సంస్కృతి ప్రభావం మనుష్యుల మీదా, వారి ప్రవర్తన మీద ఎలా ఎంత వరకు ఉన్నదో గ్రహించకుండా, వారిమీద ఆర్థిక శక్తుల, రాజకీయ శక్తుల ప్రభావం మాత్రమే ఉన్నదని భావించడంలోనూ, రచయిత వైఫల్యాన్ని పొందే అవకాశం ఉన్నది. "తన జాతి సంస్కృతితో

రచయితకు ఎంతటి గట్టి బంధం ఉంటే, అంత మౌలికంగా, విశిష్టంగా అతని రచన ఉంటుంది. తన సమాజాన్ని వ్యతిరేకిస్తూ, విదేశీ భావాల్ని సంప్రదాయాల్ని ఆహ్వానిస్తూ రచన చేసే రచయితకు కూడా పైౖ చెప్పిన సూత్రం అన్వయిస్తుంది" అంటాడు లూకాచ్. ("The stronger a writer's ties with the cultural heritage of his nation, the more original his work will be, even where he is in opposition to his own society and calls in a foreign tradition to redress the balance."—George Lukacs).

20-వ శతాబ్ది సాహిత్యంలో ఇమేజిస్ట్ కవితద్వారా 'కాల్పనికత' పొందిన పరిణామాన్నీ, మార్క్సిస్ట్ భవిష్యద్దర్శనం ద్వారా 'వాస్తవికత' పొందిన పరిణామాన్నీ పరామర్శించాము. ఇవి రెండూకాక కాఫ్కా, సార్త్రే, కేమూ రచనలు ప్రతిపాదించిన 'ఆధునికత' మరొకటున్నది. దానికి 'అస్తిత్వవాదం' అని పేరు.

వర్తమాన ప్రపంచానికి, గత సాహిత్యంనుంచీ, సంస్కృతి భూమికల నుంచీ, సామూహిక అవచేతనతో బహిశ్చేతనని సమీకరించటం ద్వారా, అర్థాన్ని ఆపాదించడం ఒక పద్ధతిగానూ; మార్క్సు భవిష్యద్దర్శనం ద్వారా, అర్థాన్నీ ప్రయోజనాన్నీ అన్వేషించడం మరో పద్ధతిగానూ ఉండగా, వర్తమాన ప్రపంచాన్ని 'అర్థరహితమైనది' (absurd)గా భావిస్తూ, వ్యక్తి అస్తిత్వపు లోతుల్నుంచి పొందే స్వేచ్ఛకూ, అనుభూతికీ విలువనిచ్చే దృక్పథం అస్తిత్వ వాదం. "నేను భావించేదికాదు ప్రపంచం, నేను జీవించేది ప్రపంచం" (మెర్లి పోంటె) (The world is not what I think but what I live). 'అర్థ రాహిత్యం' (the absurd) ఒక భావంకాదు. అది ఒక చేతనావస్థ. మనిషి యాంత్రిక జీవనంలో గతానుగతికంగా, అలవాటుపడిన భావాలూ, చేష్టలూ-ఈ బంధాలు తెగిన క్షణంలో అతనిలో ఉదయించే 'ఎందుకు?' అనే ప్రశ్నకు సమాధానం అన్వేషించకుండా, ఆ 'అర్థరాహిత్యాన్ని' అస్తిత్వ సత్యంగా అంగీకరించే లబ్ధిని, కేమూ "అది నా తిరుగుబాటు, నా స్వేచ్ఛ, నా మహదావేశం" అని వర్ణించాడు. (My revolt, my freedom, and my passion). "అర్థ రాహిత్యాన్ని గుర్తించిన క్షణంలో మనిషి అర్థరహితమైన జీవితంనుంచి విముక్తి

పడతాడు" (The absurd man becomes free the moment he recognizes his own absurdity). 'అర్థరాహిత్యాన్ని' గుర్తించడమంటే, పలాయనవాదం కాదు. ఎటువంటి అర్థాలూ, ప్రయోజనాలూ లేకుండా జీవితాన్ని యథాతథంగా అంగీకరించడమే! (The absurd human being is, by definition wedded to life; all evasion of life is a capitulation. Life is our rock.) కాఫ్కా, సార్త్రే, కేమూ తర్వాత అప్‌డైక్, స్టైరాన్, సాల్‌బెల్లోవంటి అమెరికన్ నవలా రచయితలు ఈ కోవకు చెందిన సాహిత్యాన్ని వైవిధ్యంతో సృష్టించారు. (చూ. "The absurd Hero in American fiction" by David Galloway). ఇది 20- శతాబ్ది సాహిత్యంలో 'ఆధునికత' యొక్క మూడవ రేవు.

తెలుగు సాహిత్యంలో 'ఆధునికత'ను పరిశీలిస్తే, 'కాల్పనికత'- రాయప్రోలు, కృష్ణశాస్త్రి, విశ్వనాథ, బాపిరాజు, చలం మొదలైన వారి రచనల్లోనూ; 'వాస్తవికత'-గురజాడ, ఉన్నవ, కుటుంబరావు, గోపీచంద్ గార్ల రచనల్లోనూ వ్యక్తమైంది. శ్రీశ్రీ తెచ్చిన ఆధునికతలో ఇమేజిస్ట్ కవితాశిల్పం, మార్క్సిస్ట్ విప్లవ వాదం సంగమించి, భావచిత్రాలలో దేశసంస్కృతి ప్రతిఫలించింది. ఉదాహరణకు:

"కనకదుర్గా చండ సింహం జూలు దులిపీ, అవులించింది!
ఇంద్ర దేవుని మదపుటేనుగు ఘీంకరిస్తూ, సవాల్ చేసింది!
నందికేశుడు రంకెవేస్తూ గంగడోలును కదిపి గంతేడు!
ఆదిసూకర వేదవేద్యుడు ఘుర్ఘురిస్తూ, కోర సాచాడు!
పుడమితల్లికి పురుటి నొప్పులు కొత్తసృష్టిని స్ఫురింపించాయి!"

బుచ్చిబాబు 'చివరకు మిగిలేది' అస్తిత్వవాదదృక్పథానికి చేరువగావచ్చిన నవల. ఇతర సమకాలీన సాహిత్యాన్నిగూర్చి, రచయితల్ని గూర్చి యిక్కడ ప్రస్తావించడం లేదు.

ముగింపుగా 'ఆధునికత'ను గూర్చి ఈ వ్యాసం పరిధిలో తేలిన సారాంశం ఏమిటో మనవి చేస్తాను. జాతి పునరుజ్జీవనంలోగాని, సాహిత్యపునరుజ్జీవనంలో గాని పూర్వ చరిత్ర, సంస్కృతి-వీటిని పునర్దర్శించే ప్రయత్నం ఉంటుంది. రచయితగా వ్యక్తి తన అంతశ్చేతనకు ప్రాధాన్యం ఇచ్చినప్పుడు 'కాల్పనికతా', బహిశ్చేతనకు ప్రాధాన్యం యిచ్చినప్పుడు 'వాస్తవికతా' అభివ్యక్తమౌతవి. ఈ రెండింటికీ స్పందనతోనూ హేతువివేచనతోనూ సంబంధం వుంటుంది. రచయిత సామాజికుడుగా సమాజాన్ని దర్శించి, విమర్శించి, పునర్నిర్మాణముచేసే ప్రయోజనమూ వుంటుంది. కాని, అస్తిత్వవాద సాహిత్యంలో వ్యక్తి సమాజాన్ని అధిగమించే అన్వేషణ ఉంటుంది. దాన్ని కాల్పనికత, వాస్తవికత అని చెప్పడానికి వీల్లేదు. దాని సందేశం మనిషి ఆంతర్యం నుంచీ మనిషి ఆంతర్యానికే. దానిలో కనిపించే సమాజం 'అర్థరాహిత్యాన్ని' ప్రకటిస్తుంది. దాని ప్రయోజనం ఆత్మదర్శనం, స్వేచ్ఛ. "ప్రపంచం ఊరికే ఉన్నది, అందుకే అది దివ్యం" (నీషే) (The world is divine because it is gratuitous —Nietzsche).

# విప్లవ కవిత్వము : సాహిత్య విమర్శ

గుంటూరు శేషేంద్రశర్మ

## 1

సాహిత్య విమర్శ సాహిత్యాన్ని గురించా లేక సాహిత్యకర్తను గురించా అనే ప్రశ్న సాహిత్య విమర్శలో ద్వారం దగ్గరే ఎదురయ్యే ప్రశ్న. దానికి హేతుబద్ధమైన సమాధానం ఇవ్వలేనివాడు సాహిత్య విమర్శలోకి ప్రవేశించే యోగ్యత లేనివాడు-

సాహిత్యకర్త వట్టి మనిషి; వాడు సాహిత్య గర్భధారి మనిషి కావచ్చు. కానీ, పఠిత ఆస్వాదించడం అక్షర రూపంగా లేక శబ్ద రూపంగా ఉన్న సాహిత్యాన్నే; సాహిత్యకర్త అయిన మనిషిని కాదు. సాహిత్య గర్భధారి మనిషి అసాధారణ మనిషి కావచ్చు; కానీ, అతని గర్భంనుంచి శిశువు ఉదయించినప్పుడే అతడు సాహిత్యకర్త అనిపించుకోగలడు. లేకపోతే అతడు సాహిత్య గర్భధారి అని తెలుసుకునే సాక్ష్యంకూడాలేదు. అలాంటివాడు సాహిత్య విమర్శకు విషయం కాజాలడు. పఠిత సాహిత్యాన్ని ఆస్వాదిస్తూ తల్లీనుడై పోతున్నప్పుడు తత్కావ్యతలో మునిగి ఈతకొడుతూ దాన్నే అనుభవిస్తున్నాడు; ఆ అలంకారాల్నీ, వాటిని మోసే భాషా విలాసాల్నీ, జలాల్లో బింబాల్లా అలంకారాల్లో గోచరించే లీలామయ కావ్య వస్తువుని అనుభవిస్తున్నాడు. అసలు సాహిత్య ప్రయోజనము పఠిత పొందే ఈ అనుభవమే. ఈ అనుభవమే పఠితమీద పడుతున్న ప్రభావము. చప్పుడు చెయ్యకుండా నదీ కూలాన్ని కోశే ప్రవాహం లాంటిది ఆ ప్రభావము. అప్పుడు పఠిత మనస్తత్వంలో పఠిత లోకాన్ని చూచే భంగిమలో క్రమపరిణామం వస్తుంది. అదే కావ్యం తెచ్చే మార్పు—ఈ ఇంద్రజాలాన్ని చేస్తున్నది అలంకారమూ, భాష, కావ్యవస్తువు అనే మూడు మూల పదార్థాలేగానీ వాటిని సృష్టించిన సాహిత్యకర్త కాదు, అంటే కవికాదు. పఠిత పుస్తకాన్ని చదివి ఈ అవస్థకు గురి అవుతున్నాడు. పఠిత యొక్క ఈ అనుభూతికి లేక అనుభవానికి పుస్తకకర్త అయిన మనిషి

హేతువు కాదు, పుస్తకమే హేతువు........ఆ మనిషి ఫలానా గ్రామంలో పుట్టాడు, అతడు బీదవాడు, అతడు స్ఫురద్రూపి లేక దొంగవెధవ, ఫలానా నౌకరీ చేస్తున్నాడు, ఫలానాచోట చదువుకున్నాడు, ఫలానా జీవన సంఘటనలకు లోనయ్యాడు, అతడు ఒక్క పలచటివాడు లేక బడుద్ధాయి ఇత్యాది వర్ణనలు వివరాలు పుస్తకం వాడిచేతిలో పుట్టడానికి దోహదకారి హేతువులు కావచ్చు, కానీ, ఆ వివరాల జ్ఞానం అలంకార భాషా వస్తురూప కావ్యతనుంచి పఠిత పొందే అనుభవాన్ని మార్చలేవు, చేర్చలేవు. ఓహెన్రీ బ్యాంకునౌకరీచేస్తూ ద్రవ్యాపహరణ అభియోగానికి గురి అయ్యాడు; వాల్మీకి కిరాతుడు; వ్యాసుడు అవివాహిత స్త్రీ పుత్రుడు, ఇలా ఎన్నో ఉదంతాలున్నాయి రచయితల జీవితాల్ని గురించి. అవి వాళ్ళ రచన ముఖాన అదృష్టరేఖలు గీయలేదు, తుడపలేదు. ఇది లోకానుభవ సిద్ధమైన విషయము. కనక ఫలస్వరూపంగా సిద్ధాంతమేమంటే, సాహిత్య విమర్శకు విషయం పుస్తకమే గానీ పుస్తకకర్త కాదు.

## 2

కావ్యవిమర్శ కావ్యాన్ని ఆస్వాదించడమేగానీ వాదించడం కాదు. కవి మాట్లాడడు, కావ్యమే మాట్లాడుతుంది. ఈ వాదించే లక్షణమున్నవాడు కవి మాట్లాడుతాడనే భ్రమతో ఆ అకృత్యానికి పాల్పడతాడు. కావ్య విమర్శ ఒక సంస్కృతి, ఒక సర్టిఫికేటు కాదు. విమర్శకుడు కావ్యాన్ని ఒక వినీతమనస్కుడై చేరాలి. దాని ప్రభావానికి లొంగుదామన్న కోమల సంకల్పంతో చదవాలి. రంధ్రాన్వేషణకోసం చదివేవాడు దుష్టుడు; సాహిత్యేతర కిల్బిషంచేత కలుషితుడు. వాడు సాహిత్యాన్ని మానవ పురోగమన దోహదకారి సాధనంగా అభివృద్ధి చెయ్యడంలో ఉపయోగించడు.

విమర్శించే కావ్యంలో విమర్శకుడు మూడు విషయాల్ని పరిశీలించాలి, ఒకటి అలంకారము, రెండు భాష, మూడు వస్తువు-వస్తువు అంటే కవి చెప్పదలచుకున్నది. వీటిని మించి కావ్యంలో మరేదీ లేదు. కావ్యం ఒక నూతన సృష్టి. సృష్టి ఎప్పుడూ నూతనము, కారణం తత్పూర్వం అది లేదు గనక. సృష్టిని గుర్తించడానికి నూతనత్వం, అంటే కాలరీత్యా అపూర్వత, ఒక కీలక లక్షణం అలంకారము, భాష, వస్తువు అనే మూడు ముఖ్యతత్వాల్లో సృష్టి అనదగినది

వాస్తవంగా ఒక్క అలంకారం మాత్రమే. భాష వస్తువు రెండూ లోకంలో ఉన్నవే. చంద్రుడు, ప్రభాతము, పక్షి, వృక్షము, పర్వతము, నది, సుందరి, తుఫాను ఇత్యాదులు కూడా లోకంలో ఉన్న వస్తువులు మాత్రమే అలంకారాలూ ప్రతీకలూ కావు. అవి అలంకారాల్లో వస్తున్నందువల్ల కొందరు వాటినే అలంకారాలు ప్రతీకలు అనుకుంటారు. అది అజ్ఞానము. అవి అలంకారాల్లో వాడబడుతాయి. 'ఒరే నీవు తుఫానులా వున్నావు కాస్త శాంతించు' అన్నప్పుడు తుఫాను కాదు అలంకారం. తుఫాను అనే వస్తువును వాడి ఒక విషయాన్ని ఒక భంగిమలో అభివ్యక్తం చేయడం ఏదయితే ఉందో అది అలంకారం.

ఇక్కడ ఒక కావ్య కళామర్మం గ్రహించాలి. కవి చెప్పే విషయ మేదయితే ఉందో, దేన్ని వస్తువంటున్నామో అదే అలంకారంగా మారుతుంది. అంటే తత్త్వతః వస్తువు అలంకారాలుగా మారిపోవడమే కవిత్వం. వస్తువు వంద రూపాయిల నోటు అయితే దాన్ని మార్చినప్పుడు మెరిసే వంద రూపాయి నాణ్యాలు అలంకారాలు. కనుక, కావ్యంలో వస్తువు అలంకారము అభిన్నములు.

మరొక మర్మము-భాష కూడా అలంకార సృష్టి కార్యక్రమంలో మార్పు చెందుతుంది. 'అరే వాడు తుఫాను బాబోయ్!' అని ఒక ఉద్రేకపూరిత వ్యక్తిని గురించి చెపుతూ అన్నప్పుడు భాష మారుతోంది. అంటే మనిషిని మనిషి కాదు అనడం, పైగా ఆ మనిషిని తుఫాను అనడం ఇత్యాది ప్రక్రియలో మనిషి అంటే మనిషే తుఫాను అంటే తుఫానే అనే లోకవ్యవహార ప్రసిద్ధి సమన్వయం లేదు. అది పోయి మనిషిని తుఫాను అని శబ్దార్థాలు అస్తవ్యస్తమయ్యాయి. ఈ విధంగా భాష మారుతుంది. ఈ అర్థంలో ఒక విధమైన భాషాసృష్టి కూడా జరుగుతోంది. అది సమ్మోహకంగా ఉంటుంది. వస్తువు అలంకారాలుగా మారినప్పుడూ శబ్దార్థాల ప్రసిద్ధ బాంధవ్యం వ్యత్యస్తం అయినప్పుడూ ఒక కొత్తదనం ఒక ఆశ్చర్య జనక క్రియ తద్వారా ఒక చమత్కారం ఉత్పన్నమవుతున్నాయి. అప్పుడు ఆ భాషని ఆ అలంకార రూప వస్తువుని మనం అందమైన భాష అనీ ఆహ్లాదకరమైన అభివ్యక్తి అని అంటాము.

నిజమైన సాహిత్యవిమర్శ కావ్యపరిశీలనకు ఈవిధమైన దృష్టిని అవ లంబిస్తుంది. అందులో వస్తుచర్చ అలంకార చర్చ ద్వారా జరుగుతుంది. ఎందు

కంటే, కవిత్వం అలా పుట్టింది గనక. "వ్యవసాయ కూలీల ఆకాశం వర్షాలు కురుస్తుందేగాని వసంతాలు కురువదు", "ఈ చెట్లు పూలెందుకు పూస్తాయి బుల్లెట్లెందుకు పుయ్యవు", "నేను జేబుల్లో కోకిలల్ని వేసుకురాలేదు పిడికిళ్ళలో బాంబులు బిగించుకుని వచ్చాను...." అన్నప్పుడు ఒక విప్లవాత్మక సన్నివేశం ఒక క్రోధపూరిత ఆక్రోశం ఈ పంక్తుల్లో లోకప్రసిద్ధ శబ్దార్థ వ్యవహార విరుద్ధ భంగిమలో అభివ్యక్తం చేయబడ్డాయి. ఇక్కడ వస్తుచర్చ సహజంగా అలంకార చర్చద్వారానే జరుగుతుంది. సద్విమర్శకుడు వస్తువును అలంకారపు కిటికీలో నుంచి చూస్తాడు; పొడిపొడిగా బూర్జువా, దోపిడీదార్లు, పీడితప్రజలు, శ్రామిక వర్గం, పెట్టుబడిదారీ విధానం, వగైరా జార్గన్‌తో ఊకదంపుడు ఉపన్యాసంలా దున్నుకుంటూ పోడు. అలా జరిగే వ్యవహారం ఏమిటో నేను చెప్పను.

## 3

వస్తువుచేత కావ్యానికి రంగు వస్తుంది. గ్లాసెడు పాయసంలో చిటికెడు రంగు వేయడం లాంటిది. ఏ రంగు వేస్తే అది ఆ రంగు పాయసం అవుతుంది. విప్లవాత్మక వస్తువు తీసుకుంటే విప్లవ కావ్యం, ప్రేమ వస్తువైతే ప్రేమకావ్యం, తాత్త్వికచింతన ఆధారమైన ఆధ్యాత్మిక కావ్యం ఇలా నడుస్తుంది ఈ కావ్య వర్గీకరణ విధానం. కనుక ఒక కావ్యం విప్లవ కావ్యమా లేక అన్యకావ్యమా అని నిర్ణయించడానికి ఆ కావ్యంలో ఉన్న వస్తువునుబట్టి నిర్ణయించాలి. ఆవిధంగా "నా దేశం నా ప్రజలు"లో విప్లవ ఇతివృత్తం ఉందిగనుక అది విప్లవ కావ్యం. అయితే ఒక కావ్యంలో ఒకే ఇతివృత్తం ఉండదు. ఒక్కొక్కసారి రెండుమూడు ఉండవచ్చు రామాయణంలో రామకథ ప్రధాన ఇతివృత్తము, సుగ్రీవకథ ఉప ఇతివృత్తము. కానీ, కావ్యంవస్తువు అలంకారాలుగా మారే ప్రక్రియ గనుక ఆ ప్రక్రియ భావాత్మక సంవేదనచేత మాత్రమే కలిగేదిగనుక కావ్యాన్ని ఇతివృత్తం చేతగాక భావాత్మక సంవేదన భేదంచేత వర్గీకరిస్తారు. (ముఖ్యంగా ఆధునిక కావ్యాల్ని) శాకుంతలము శృంగార రస కావ్యము, ఉత్తరరామ చరితము కరుణరస కావ్యము ఇట్లా.... నాటకం చూచే ప్రేక్షకుడు చూచి పొందే ఫీలింగు యొక్క సమగ్ర పరిణామ పర్యవసానంగా ప్రేక్షకుడు చూడబడేదానితో పొందే తాదాత్మ్యము రసము. అదే ఇక్కడ భావాత్మక సంవేదన అని నవ్యపదావళితో వివరింపబడింది. ఈ తాదాత్మ్యము కథారహిత కావ్యంలో అలంకారంచేత సాధింప

బడుతుంది. (అంటే నాటకంలో అభినయం దేన్ని ప్రేక్షకుడిలో సాధిస్తుందో దాన్నే అలంకార కవిత్వంలో శ్రోత లేక పఠితమీద సాధిస్తుంది) - శాకుంతలం శృంగారరస ప్రధానకావ్య మంటారు. కారణం, శకుంతలా దుష్యంతుల శృంగారము అందులో ప్రధానము. కానీ, వారి వియోగము తజ్జనిత కరుణ రసముకూడా అందులో ఉంది. అది ఆ కావ్యపు కళాత్మకతకు జీవం పోస్తుంది. అనుక ఒక కావ్యంలో విప్లవమేగాక అన్యవిషయాలుకూడా కావ్యతావేగంలో కలిసి కొట్టుకు వస్తాయి; అవన్నీ కలిసి ఆ ప్రవాహానికి ప్రాణప్రదం అవుతాయి. కానీ, విమర్శకుడు ప్రధాన విషయమేమిటో చూచి దానిచేత కావ్యానికి నామకరణం చేస్తాడు. ఆవిధంగా 'నా దేశం నా ప్రజలు' విప్లవ కావ్యం అనాలి. అట్లాగే ఆధునిక మహాభారతం, దాని ప్రధాన ఇతివృత్తము లేక ప్రధాన సంవేదన క్రోధాత్మక విప్లవం గనుక, విప్లవకావ్యం అనాలి - దానిలో అన్యవృత్తాలు అన్యసంవేదనలు ఉండవచ్చుగాక.

ఒక జాగ్రత- ఆధునిక పాశ్చాత్య సాహిత్యంలో రొమాంటిక్ యుగంలో ప్రారంభించిన కథారహిత కావ్యం అంటే కవిత్వం అలంకార కవిత్వము. అది సమకాలీన ఆర్థిక సామాజిక బౌద్ధిక శక్తుల కల్లోలంనుంచి సాహిత్య పరిణామంగా ఉదయించింది. కేవల సాహిత్య ప్రక్రియ కాదు. కానీ, ఏ కారణాలచేత పుట్టినా సాహిత్య ప్రక్రియలుగా ఇలాంటివి నిలిచిపోతాయి. తర్వాత వచ్చిన సింబలిజం, సర్రియలిజం, ఇత్యాది సాహిత్య ఉద్యమాలు అలాంటి కల్లోలంనుంచే పుట్టినప్పటికి వాటిసాహిత్యాభివ్యక్తిని విశ్లేషణాత్మక పరిశీలనకు గురిచేస్తే అందులో మనకు ఏ అలంకారం మొదట రొమాంటిక్ ఉద్యమ ప్రతీకగా ఉదయించిందో అదే అలంకారం సింబలిస్టు, సర్రియలిస్టు, డాడాయిస్టు, ఇంప్రెషనిస్టు వగైరా ఉద్యమాల కల్లోల పరిణామంలో ఛిన్నాభిన్నమై అంగవైకల్యం చెంది అనేక రూపాంతరాలలో ఆ అంతరాత్మనే నిలుపుకుంటూ స్పష్టాస్పష్ట దర్శనదాయిగా నిలుస్తుంది. అట్టి పరిణామగ్రస్త రూపరూపాంతరాల భేదం ఆధారంగా ఆయా కవిత్వ విశేషాలకు సింబలిజం అనీ సర్రియలిజం అనీ వగైరా నామకరణాలు జరిగాయి. అవి మనకు ఇక్కడ ఈ దేశవాళీ సాహిత్యంలో అన్వయించవు. కొందరు విపరీత బుద్ధులకు ఆ ఛాయాతాల్లు ఇక్కడ కనుపిస్తున్నప్పటికీ అది బుద్ధి వైపరీత్యమేగానీ వాస్తవ దర్శనం కాదు. దానిమీద విస్తృత చర్చ వ్యర్థము. కనుక ఇక్కడ మన కావ్యాల

వర్గీకరణ కేవలం ఇతివృత్తాన్నిబట్టి లేక భావాత్మక సంవేదననుబట్టి మాత్రమే జరగవలసి ఉంటుంది.

ఈ కాంతి పుంజంలో చూస్తే విప్లవ కవి ప్రేమ కవి అని కవికి-కావ్యానికి చెందిన విశేషణాల్ని తగిలించడం అశాస్త్రీయం. కవిని కవి అనడం మాత్రమే సమంజసం. విప్లవ కవి అని పేరు పెడితే వాడు జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థల్లోకూడా కేవల విప్లవభావ పీడితుడైన మనిషి అయి ఉండాలి. ఒకడు తన జీవితంలో ఆ ఒక్క అనుభూతినే గడించినవాడు అయి ఉండడం అసహజము అసంభవము. లేదా వాడు వాడి సహజ అసంఖ్యాకఅనుభూతులన్నిటినీ ప్రచ్ఛన్నం చేసుకుని విప్లవాన్ని మాత్రమే గొప్పకోసం ప్రదర్శించే ధూర్తుడు కావాలి. ధూర్తుడు కవి కాలేడు, అయితే మాత్రం ఆశ్చర్యం. విప్లవోద్యమానికి అంకితమైన వ్యక్తులు కూడా భార్యాపిల్లలు, తల్లి దండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, బంధు మిత్రులు సమస్యలు సుఖదుఃఖాలు నిండిన నిత్యజీవన యాపన చేశేవాళ్ళే. అయితే వాళ్ళలో స్పందించే ప్రధానతంత్రి విప్లవం కావచ్చు. లెనిన్ ఆఫ్ రష్యన్ పోయెట్రి అనిపించుకున్న మాయాకోవ్‌స్కీకూడా విప్లవ కవిత్వం మాత్రమే రాయలేదు. నా కవిత్వం పార్టీకే అంకితం అన్న ఆ కవి ఒకవైపు శ్రామికుడ్ని తన కవిత్వనాయకుడ్ని చేస్తూ గానం చేశాడు. మరోవైపు మానవ జీవనతంత్రంలో కోమల స్వరమైన ప్రేమనూ నాదం చేశాడు. ఆయన్ని ఆ దేశం విప్లవ కవి నామధేయ శృంఖలాబద్ధుడ్ని చెయ్యలేదు. ఆ దేశం సాహిత్యంలో అంత పామరత్వం చూపించలేదు.

పూర్వం కాళిదాసాదుల్ని కవులన్నారేగానీ శృంగార రసకవులనీ కరుణ రసకవులనీ ముద్రవేసి విడిచిపెట్టలేదు. వాళ్ళలో ఒకొ్కక్క కవి భిన్న భిన్నరసాలు ప్రధానంగా, అన్య ఉపరసాల సమ్మేళనతో కావ్యాలు రాశారు. వాళ్ళకి వాటిలో ఏ ఒక్క కావ్యాన్నిబట్టి ఫలానా రసకవి అని పేరు పెట్టినా అది పొసగదు. భిన్న భిన్న రసాల్ని ప్రధాన రసం చేసి అనేక నాటకాలు రాసిన భాసుడికి ఏ ఒక్క రసాన్ని ఆధారం చేసుకుని ప్రత్యేక నామకరణం చెయ్యలేదు. కవి అని మాత్రమే అన్నారు. అన్ని కావ్యాలు శృంగార రస ప్రధానంగా రాసిన కాళి దాసునుకూడా శృంగార రస కవి అనకుండా కవి మాత్రమే అన్నారు. విశాఖ దత్తుడ్ని చారిత్రాత్మక నాటకకవి అని కానీ ఏదో రసకవి అని కానీ అనలేదు.

ఏ కావ్యకర్తనైనా సరే కవే అన్నారు. ఆధునిక కాలంలోకూడా షేక్‌స్పియర్ భిన్న భిన్న ఇతివృత్తాలలో అనేక నాటకాలు రాశాడు. కేవలం కవి అని మాత్రమే అన్నారు. ఫ్రెంచికవి ఛార్‌ల్స్ బోదిలేర్ ప్రతీకాత్మక కవిత్వం రాశాడు. కానీ, ఆయన్ని ప్రతీకాత్మక కవి అనలేదు. అలాగే ఆంద్రేబ్రెతన్‌ని సర్రియలిస్టు అని నామకరణం చేసి పిలువలేదు. ఆ దేశాల్లో వాళ్ళని కేవలం కవులని మాత్రమే అన్నారు. బహుశా ఈ స్వల్ప తెలుగడ్డలోనే స్వప్రయోజన లుబ్ధులైన మనోవలీ మనస్తత్త్వపరులు ఆత్మరక్షణకోసం ఇలా తామూ తమకు నచ్చినవాళ్ళూమాత్రమే విప్లవ కవులు అని ఒక నామకరణ ముద్ర తయారుచేసి గుద్దుకుంటున్నారు. ఇది అశాస్త్రీయము; సాహిత్య విమర్శ అనే శాస్త్రీయ కార్యకలాపంలోకి ప్రవేశించే అర్హత దానికి లేదు.

కవిత్వం రాయాలంటే ఆ పీడితుడు కొన్ని షరత్తులకు లోబడి రాయాలని కొందరు ఉగ్రకంఠీరవులు అంటున్నారు. 1. ఫలానాపార్టీసభ్యు డయిఉండాలి లేదా 2. సాయుధ పోరాటంలో కలవాలి లేదా 3. సాయుధ పోరాటాన్ని ప్రోత్స హించాలి. లేదా 4. ప్రజలతో కాంటాక్టు ఉండాలి. లేదా 5. మార్క్సిజంలో కూలంకషమైన పాండిత్యం ఉండాలి. ఇలా-ఈ నిర్ణాయకుల అర్హతలను పరిశీలిం చడం సాహిత్య విమర్శకుడికి అవసరం. ఎవడేది చెపితే దాన్ని పాటించడం వాడి కర్తవ్యం కాదు. ఈ నిర్ణాయకుల అర్హతల్ని వాళ్ళ నిర్ణయాల్ని సాహిత్యపరంగా విశ్లేషించి అవగాహన చేసుకోవడం వర్తమాన సాహిత్య ఎమర్జన్సీ.

మేము ఎవరిపక్షం అవలంబించాలో తెలుసుకోడానికి మాకు మార్క్సిజంలో పాండిత్యం అక్కరలేదు అన్నాడు మాయాకోవ్‌స్కీ; మార్క్సిజం వంటి గహన మైన ఆర్థిక సిద్ధాంతాల్ని గురించి మంచినీళ్ళప్రాయంగా మాకు తెలుసునంటే, మాకు తెలుసునని పోటీలు పడడం, మీకు తెలీదంటే మీకు తెలీదని కూడా ఒక అడుగు ముందుకుపోయి ఇతరుల్ని ఆక్షేపించడం తెలుగుదేశంలో కొందరికి మామూలైపోయింది. "అబ్ధిర్లంఘిత ఏవ వానరభటైః కింత్వస్య గంభీరతాం, ఆ పాతాళ నిమగ్న పీవర తనుర్జానాతి మంథాచలః" అన్న సత్యం తెలిశినవారికి ఆ మహానుభావు లెంతటివారోకూడా తెలుసు.

ప్రజలతో కాంటాక్టు లేకపోతే విప్లవకవి కాడన్నట్లయితే ఈ మహా విప్లవ కవుల కేపాటి ప్రజల కాంటాక్టు ఉందో వివరంగా సాహిత్యవిమర్శలో [illegible]

ణాత్మకపరిశీలనకు గురిచెయ్యాలి. మహాప్రస్థానం రాశేనాటికి తనకు మార్క్సిజం తెలీదని శ్రీశ్రీ వ్రాకుచ్చాడు. అప్పటికి అభ్యుదయ రచయితల సంఘం కూడా పుట్టలేదు. ఆయనకు ప్రజలతో ఏపాటి కాంటాక్టు ఉందో రహస్యమేమీ కాదు. పోతే అన్యవిప్లవకవి నామకులకుకూడా ఏ ఫ్యాక్టరీ కార్మికులతో ఏ వ్యవసాయకూలీలతో సంపర్కం ఉందో ఏ ప్రజల సమస్యల్ని తీర్చడానికి ఉద్యమాల్లో కృషిచేశారో అదికూడా బయోడేటా రూపంలోనైనా సాహిత్య విమర్శ విశదీకరించాలి.

అలాగే ఎందరు విప్లవకవులు సాయుధ పోరాటంలో పాల్గొన్నారో సాక్ష్య సామగ్రి సాహిత్యవిమర్శలో ఇవ్వబడాలి, విప్లవకవిత్వం ఇదనీ వీడే విప్లవకవి అనీ ఈ పద్ధతిచేతనే నిర్ణయించాలని నియమం పెట్టినట్లయితే, కాదు, సాయుధ పోరాటాన్ని ప్రోత్సహించాలి అంటే ఈ ప్రత్యేక విప్లవకవులకే అగ్రాసనాలు వేసి కూర్చోబెట్టనక్కరలేదు. కారణం ఆ పని ఇతరులుకూడా అంతకంటే బాగానే చేస్తున్నారు.

పైగా సాహిత్య విమర్శలో ముఖ్యమైన విషయం - ఆయుధం పట్టుకున్న ప్రతివాడూ విప్లవ కవిత్వం రాయలేడు ఆకాశమెక్కిన ప్రతి మేఘమూ వర్షం కురువలేదు. కవిత్వానికిగాక విప్లవకవిత్వానికిగాని ఇవేవీ కీలకసాధనాలు కావు.

కవిత్వం రెండు విధాలుగా ఉత్పన్నం అవుతుంది; స్వానుభూతి చేత సహానుభూతి చేత - అనుభూతి మాత్రం అనివార్యం అన్నమాట సిద్ధాంతం. తన అనుభూతి చేత ఉద్వేజితుడైన వాడు కవిత్వం చెప్పవచ్చు వాడికి కవిత్వోత్పాదక "శక్తి" ఉన్నట్లయితే. లేక అన్యుల అనుభూతిచేత ప్రకంపితుడై సహానుభూతి పొంది తద్ద్వారా కవిత్వం చెప్పవచ్చు. (కవిత్వోత్పాదన వర్ణన వివరంగా కవిసేనమేనిఫెస్టోలో ఉంది. చూ.) తన చెయ్యి తెగి రక్తం మడుగులు కడుతుండగా ఆ బాధానుభూతి వశాన కవిత్వం రాయడం ఒకటి. మరొకటి చెయ్యి తెగి రక్తం మడుగులు కడుతుండగా చూచి సహానుభూతికి గురిఅయి కవిత్వం చెప్పడం మరొకటి. ఒక్కొకసారి సహానుభూతే అనుభూతికంటే తీవ్రతరంగా ఉంటుంగి. చెయ్యి తెగి బాధపడుతున్న కొడుకు స్థితి చూచి తండ్రి మరింత బాధ పడతాడు, మానసికవేదన అనుభవిస్తాడు. ఇది లోకానుభవం.

మన దేశంలో ఈ రెండు మార్గాలకు ప్రసిద్ధమైన ఉదాహరణ లున్నాయి. మొదటి మార్గానికి వ్యాసుడు, రెండవ మార్గానికి వాల్మీకి కర్తలు, వ్యాసుడి మహా భారతానికి కురుక్షేత్రంలో ప్రవహించిన వైయాసికీయ రక్తమే ఉత్పాదకశక్తి. కౌరవపాండవులు వ్యాసుడి ఔరసపుత్రు లిద్దరు పుత్రులే గదా! తాతకు కొడుకు మీద కంటే మనమడిమీద ప్రేమ ఎక్కువ. వ్యాసుడి హృదయం కురుక్షేత్ర యుద్ధంచేత ఎంత క్షోభించి ఉంటుందో ఊహించగలము. కానీ, కిరాతుడు పక్షిని చంపితే వాల్మీకి తాను చచ్చినంత క్షోభ పొందాడు. అందుచేతనే శోకంలో నుంచి శ్లోకం పుట్టిందన్నాడు ఆ మహాకవే. ఇది సహానుభూతి. కనక వ్యాసుడు అనుభూతి కవి; వాల్మీకి సహానుభూతి కవి.

విప్లవకవిత్వం స్వానుభూతిచేత పుట్టవచ్చు, సహానుభూతిచేతా పుట్టవచ్చు. విప్లవ పోరాటంలోగానీ విప్లవ పోరాట కార్యక్రమాల్లోగానీ పాల్గొంటూ విప్లవ కవిత్వం రాయవచ్చు. లేక విప్లవపోరాట వార్తలు విని దృశ్యాలు చూచి ప్రకంపితుడై రాయవచ్చు. కానీ, వీటన్నిటినీ మించినది ఒకటి ఉంది.– మానవ జీవనంలో జరిగే అన్యాయాన్ని నీతితో ధైర్యంతో ఎదుర్కొంటూ పలాయితుడు కాకుండా రాజీతత్త్వానికి లొంగకుండా నానాబాధలు అనుభవించే జీవి ఒకడున్నాడని ఎవరూ మరచిపోకూడదు. అన్యాయభరిత జీవితంమీద వాడు ఎప్పుడూ తిరుగుబాటు చేస్తూ ఉంటాడు. స్వాభావికంగా న్యాయపక్షం వైపే నిలుస్తుంటాడు. దెబ్బల్లు తింటుంటాడు; తనకు జరిగే అన్యాయాన్నీ పరులకు జరిగే అన్యాయాన్నీ సహించలేడు; ఉభయ సందర్భాల్లోనూ తిరుగుబాటు చేస్తాడు, పోరాటానికి దిగుతాడు. ఇది జీవితంమీద నేరుగా చేస్తున్న తిరుగుబాటు. ఇది పునాది గత విప్లవం. ఇలాంటి జీవితాలు ఎన్నో కోటలు కూలినట్లు కూలిపోయాయి, పోతున్నాయి, పోతుంటాయి! ఒకవైపు సామాజిక సంపదభోగవైభవం వర్ధిల్లుతూనే ఉంటే మరొకవైపు ఎందరో తిరుగుబాటు జీవులు బాధాగ్నుల్లో దగ్ధమైపోతున్నారు. వాళ్ళు ఏ రాజకీయముద్రలూ వేసుకోలేదు. ఏ జెండాలూ ఎగరేయలేదు. వాళ్ళకు కితాబు లిచ్చినవాళ్ళు లేరు, వీరోచిత ఊరేగింపులు జరిపినవాళ్ళు లేరు.

ఈ విధంగా నిత్యజీవనంలో అన్యాయంమీద చేసే తిరుగుబాట్లే అసలు విప్లవం. ఈ పునాదిగత విప్లవమే చరమస్థాయిలో ఉత్పత్తి సాధనాన్ని వశపరచుకోడానికి జరిపే విప్లవ సమరానికి దారితీస్తుంది. జీవితానుభవంలో ఆహ్వా

యాన్నీ అసమానతను ఎదుర్కొంటూ ధనికుల్నీ అధికారుల్నీ అపహ్యించు కుంటూ అసూయపడుతూ ద్వేషాన్ని పెంచుకొంటూ పోయే జీవన విధానమే వర్గచైతన్యజన్మకు దోహదం చేస్తుంది. వర్గచైతన్యంలోనుంచే నిత్యజీవనాంతర్గత నిర్విరామ పోరాటాలు వ్యక్తిగతంగా ఏర్పడుతాయి. ఈ పోరాటాల్లోనుంచి పుట్టే విప్లవ కవిత్వం పార్టీ ప్రచార కవిత్వం కంటే అత్యంత శక్తిమంతంగా ఉంటుంది. పంక్తి పంక్తిలోకి కవి తన ప్రాణశక్తితో జీవితాన్ని ఊదుతాడు. ఇది నేరుగా జీవన పోరాటంతో నుంచి పుట్టిన కవిత్వం. దాని కున్న చేవ సిద్ధాంతాల చేతికర్రతో నడిచే కవిత్వాని కుండదు.

వ్యక్తులు ఆచరించే వర్గచైతన్య జీవితాలే విప్లవ చైతన్యాన్ని సమాజంలో సాంద్రతరం చేస్తాయి. ఈ చైతన్యాన్ని సంఘటితపరచి అంతిమ సమరాన్ని అవతరింపజేసే ఒక రాజకీయపార్టీ అవసరం అనేది నిర్వివాదమైన విషయం. తెలుగు సాహిత్యంలో ఒక్కటే పేచీ. రాజకీయ పార్టీవరకూ ఏలాటి పేచీ లేదు. కానీ, ఆ పార్టీ పేరుతో కాయలమ్ముకునే రచయితల పార్టీ ఒకటి తయారు కాకూడదు. సాహిత్యం కాయలమ్ముకునే వ్యాపారం కాదు. అసలు పార్టీ కోసం ఒక ప్రసార సాహిత్య ఉపపార్టీ ఉండడం ఎంత మాత్రమూ ఆక్షేపణీయం కాదు. కానీ, వాళ్ళు వాళ్ళ పాత్రను మించి వ్యవహరించకూడదు, వాళ్ళకు ఆ శక్తి లేదు. పైగా ఘోరం! ప్రతి వాడిలో విప్లవ చైతన్యం వ్యాప్తం చెయ్యడానికి బదులు వాళ్ళు విప్లవచేతన ఉన్నవాడ్ని కూడా విప్లవ విరోధి అని ప్రచారం చేస్తున్నారు! విప్లవాత్మక చైతన్య మున్న కవుల్ని వాళ్ళ కావ్యాల్ని బుద్ధిపూర్వకంగా నిందిస్తున్నారు!. ఇది స్పష్టంగా విప్లవ వ్యతిరేకచర్య. ఇది విప్లవ ద్రోహం. వాళ్ళు తమకు లభించిందని భ్రమిస్తున్న ఏదో ఒక గొప్పపీఠం అన్య విప్లవ కవులచేత వారి కావ్యాలచేత పడిపోతుందేమో అనే ఒక స్వలాభ ప్రేరిత భయంచేత ఈ పని చేస్తున్నారు. బహుశ వాళ్ళ జనక పార్టీ అయిన ఏదో ఆ రాజకీయ పార్టీ, వాళ్ళు బాహాటంగా జరుపుతున్న ఈ విప్లవ భంజక చర్యల విషయంలో, జోక్యం చేసుకోవడం అవసరమేమో! లేకపోతే విప్లవచైతన్యవ్యాప్తికి ఈనాడు బ్రహ్మాండమైన ఆటంకంగా పరిణమించిన ఈ మనోపలీ మనస్తత్వం నశించే మార్గం కల్పించవడం లేదు. ఈ మనస్తత్త్వాన్ని నిర్మూలించడానికి పీడిత వర్గాల మీద సానుభూతి ఉన్నవాళ్ళు సామాజికన్యాయ సాధన మీద మానవ సమానత మీద పట్టుదల ఉన్నవాళ్ళు కటిబద్ధులు కావాలి. పత్రికల్లో ఉన్న బుద్ధిజీవులు ఈ

విపత్కర సన్నివేశాన్ని అర్థం చేసుకుని వ్యవహరించాలి. లేకపోతే మన దేశంలో వర్గ చైతన్యం వికసించకుండా స్తంభించిపోయే సమయం ఆసన్నమయింది. స్వాతంత్ర్యానంతర విజృంభిత అవకాశవాద మనస్తత్త్వం ప్రజల్లో పాతుకు పోయే అవకాశం ఏర్పడింది.

ఈ సందర్భంలో సాహిత్య విమర్శకుడి పాత్ర, స్వప్రయోజనాపేక్ష విసర్జించి విప్లవ కావ్యాల్ని నిర్ద్వంద్వంగా ప్రోత్సహించాలి. దానికి సాహిత్య విలువలమీద సాహిత్యసూత్రాలమీద ఆధారపడి సాహిత్య విమర్శ రాయడం ఒక్కటే మార్గం. సాహిత్య బాటసారికి సాహిత్యం ఒకే లక్ష్యాన్ని చేరడానికి మరొక స్వతంత్ర మార్గం అనే విశ్వాసం ఉండాలి. సాహిత్య విమర్శకుడు సాహిత్య మూల్యాంకనకోసం రాజకీయ మార్గాన్ని ఆశ్రయించకూడదు.

దీ. 18-2-1982 'ఆంధ్రజ్యోతి' వారపత్రికలో 'ప్రశ్నలు - జవాబులు' శీర్షిక క్రింద 'విప్లవ కవిత్వం రాయడానికి తప్పనిసరిగా విరసంలో సభ్యులై ఉండాలంటారా?' అన్న ప్రశ్నకు శ్రీశ్రీ ఇలా జవాబు చెప్పాడు- "ఉండడం తప్పనిసరి కాదు. విరసంలో సభ్యులు కానివారు కూడా విప్లవ కవిత్వం రాస్తున్నారు."

# అభ్యుదయ కవిత్వంలో ప్రమాణాలూ, పరిణామాలు....

## సోమసుందర్

ఇటీవల ఒక విపరీత మేధావి అన్నట్లు ఏదీ శూన్యం నుంచి ఊడి పడదు. శూన్యంనుంచి వెలువడేది శూన్యం మాత్రమే; నానారకాల ద్రావకాలతోను మెదడు నింపుకున్నందువల్ల ఇలాంటి భావకాలుష్య మేర్పడుతూంటుంది. ఎంత విపత్కర నిర్ణయాన్నయినా అలవోకగా కాలుష్యమేధ సాధించగలుగుతుంది. ఎలాంటి అసంగత ఉద్ఘాటననైనా నోట పెడుతూ వుంటుంది. వర్తమాన మేధా జీవితంలో ఇప్పటికే ఇలాంటి డిస్కోమేనియా కలిగిస్తున్న ప్రమాదం అతివేలమైపోయింది.

ఇరవయ్యో శతాబ్దపు నాలుగో దశాబ్దంలో ఆవిష్కృతమైన అభ్యుదయ సాహిత్యోద్యమానికి పునాదులు బలంగా 1880 సంవత్సరంలోనే నిర్మిత మయ్యాయి. సాహిత్యం సమకాలీనసామాజిక కల్మషాలను శాశనం చేయడానికి ప్రబలతర ఆయుధం కావాలే తప్ప- వ్యక్తిగత రసానందానికి మాత్రమే విని యుక్తం కారాదన్న నిర్ణయం యుగపురుషుడు కందుకూరి వీరేశలింగం పంతులే ఉద్ఘాటించాడు. బ్రాహ్మవివాహమనే పెద్దయ్యగారి పెళ్ళి ప్రహసనాన్ని రచించి సమాజ శ్రేయస్సుకు గట్టి నిఘా ఏర్పరచాడు. తదాదిగా ఒక అకుంఠిత దీక్షతో అటు సంఘసంస్కరణ మహోద్యమాన్ని నిర్వహిస్తూనే, వేరొకచేత సాహితీ మహాయుధాన్ని మొక్కవోకుండా నిరంతరాయంగా నిశిత మొనర్చుకుంటూనే వున్నాడు. బ్రాహ్మ వివాహం రచించబడిన మరో పదిహేనేళ్ళకు మహాకవి గుర జాడ అప్పారావు దాని ప్రభావాన్ని నిబిడీకరించుకొని, ఆ మార్గదర్శకంలో కన్యా శుల్కం అనే మహాకావ్యాన్ని విరచించాడు. ప్రథమ రచన ఆయన కళాపిపాసకు సంతృప్తి కలిగించలేకపోయింది. అందుకే మరో పదిహేనేళ్ళపాటు కన్యాశుల్కాన్ని చెక్కుతూ, శిల్పవంతం కావిస్తూ, పెంచుతూ జాతి హృదయానికి సజీవ ప్రతి బింబం నెలకొల్పుతూ చివరికి 1908 లో ప్రస్తుత రూపాన్ని సంతరించాడు.

గురజాడ. తొలి రచనలో పిండ రూపంలో ఉన్న ఎన్నో మానవాకృతులు సంపూర్ణత్వం సాధించగలిగాయి. మధురవాణి, గిరీశం, రామప్పంతులు వంటి పాత్రలు సుందరతరంగా సృష్టించబడ్డాయి. కాని, బీజప్రాయంగా కన్యాశుల్కం రచనకు ప్రభావం కలిగించినది బ్రాహ్మవివాహమేనన్న సంగతి నిర్వివాదమే!

సామాజిక పునరుజ్జీవన మహోద్యమంలో విడతీయరాని అంతర్భాగమే వ్యక్తి స్వేచ్ఛా శబలితమైన భావ ప్రకటన. ఆనాటి సమాజంలో ఫ్యూడల్ భావ దాస్యంతో సర్వరంగాలూ అదుపు చేయబడుతున్నాయి. నైతిక జీవితం సర్వతో ముఖంగా పతనావస్థకు చేరివుంది. పురుషాధిక్య సమాజ నీతి అడ్డులేని పెత్తనం వహిస్తోంది. స్త్రీని భోగ వస్తువుగా మార్చివేసింది. నిర్బంధ వైధవ్యంతో స్త్రీని కట్టుబానిసగా చేసుకుంది. పురుషుడై పుడితే చాలు, ఆ వ్యక్తికి ఎంతమంది స్త్రీలతోనైనా సంగమించే అధికారం పుట్టుకతోనే సంక్రమిస్తుంది. అదొక జన్మహక్కుగా పరిగణింపబడుతోంది. సమాజంలో ఒక వర్గం గణికలుగా కేటాయించబడి, భోగ స్త్రీలుగా సామాజిక కాలుష్యం భరిస్తూ వేర్పాటుపొందారు. ఇతర సామాజికు లనుభవించే సదుపాయాలతోగాని, ప్రాథమిక హక్కులతోగాని నిమిత్తం లేని వేరొక మాతృస్వామిక వ్యవస్థతో యీ వర్గం సాగిపోక తప్పింది కాదు.

మరో ప్రక్క జీవితమంటే ఏమిటో తెలియని బొమ్మల వంటి శిశువులకు పెళ్ళిళ్ళు జరుపుతోంది సమాజం. స్త్రీకి విద్యార్హత ఏనాడో రద్దు చేయబడింది. అవిద్యాపరులైన తల్లికి పుట్టే సంతానం అజ్ఞానంలో కొట్టుమిట్టాడవలసివచ్చింది. 1875 లో మొదటిసారిగా కందుకూరి స్థాపించిన బాలికా పాఠశాలతో తప్ప స్త్రీ విద్య ప్రారంభమే కాలేదు. తదాదిగా కళాశాల స్థాయి వరకూ పురుషులతో సమానంగా చదువుకొనే అవకాశం స్త్రీలకు కలిగింది.

హైస్కూలు కాలేజీ విద్యాస్థాయిలో ఆరంభ యౌవనులైన స్త్రీ పురుషులలో పరస్పర ఆకర్షణలు మొసులెత్త నారంభించాయి. ముక్కుపచ్చలారని పసి బాల్యంలో తమకీ ఒక వివాహం జరిగిందన్న స్పృహే నిత్యజీవితంలో విస్మరింపబడింది. ఈ పరస్పర ఆకర్షణ ప్రేమ అనే సూక్ష్మ జీవన ధాతువుకు అంకురార్పణ కావించింది. తత్పూర్వ సమాజంతోగాని సాహిత్యంతోగాని మోహమూ సంభోగమూ, సురతమూ తప్ప ప్రేమ అనే విచిత్ర వస్తువు

గురించి మన జాతి ఎరుగదు. కవిత్వంలో ఆధునికత్వానికి ప్రారంభకుడైన గురజాడ మహాకవి స్పష్టంగా చెప్పనే చెప్పారు- ప్రేమ అనే విద్యను ఒజ్జలెవ్వరూ నేర్పలేదనీ, మన సాహిత్యం దాని గురించి మౌనం వహించిందనీ, కవుల దయవల్ల, తానావిద్య నేర్చుకోగలగాననీను. ఆ కవు లనేవాళ్ళంతా ఆంగ్ల కవులే! వారి దయవల్ల నేర్చిన సంస్కారంతోనే భార్యాభర్తలు మంచిస్నేహితులే నని, భార్యకు భర్త దైవమనేది పనికిరాని పాత మాట అనీ ఆయనే వ్రాసివేశారు!

జంబూద్వీపే భరతవర్షే అని సంకల్పం చెప్పుకుంటున్న మన జాతి ఆనాటికింకా అట్టి భరత వర్షమే సకల ప్రపంచంగా విశ్వసిస్తోంది. ఆంగ్ల విద్య ద్వారం నుంచే మొదటిసారిగా విశాల ప్రపంచ దర్శనమేర్పడింది. వివిధ మతాలతో, వివిధ సమాజ వ్యవస్థలతో, వివిధ నైతిక ధర్మాలతో, అనేక ఆలోచనా రీతులతో ప్రవర్థిల్లుతున్న విశాల భూలోకం సాక్షాత్కరించింది.

అంతవరకూ ఫ్యూడల్ నిరంకుశ నీతుల ఉక్కుచట్రంలో పడి కొట్టుకుంటున్న వ్యక్తి-స్వేచ్ఛకోసం ఆరాటంచెంద నారంభించాడు. ఆ భావావిష్కరణ పథంలో ప్రధాన భాగంగానే భావకవిత ప్రాదుర్భవించింది. అది చారిత్రకంగా ఒక సామాజిక అవసరానికి జీవనధాతువు లందించింది.నన్నయ మొదలు చిన్నయ వరకూ గతాన్ని మాత్రమే ఆరాధించే తెలుగు సాహిత్యం-వర్తమాన మానవ హృదయానికి సంచలన క్షేత్రంగా పరిణామం పొందింది. గతానుగతిక పితృదేవతల పాత్రలతోనో, మతానువర్తిత పౌరాణిక పాత్రలతోనో పాడిందేపాటగా మారిన సాహిత్యం సజీవ హృదయధ్వనులను ప్రతిధ్వనించ నారంభించింది.

కావేరీ నదిలో సంలీనమయ్యే పంచనదుల సంగమ తీరభూమి తిరువయ్యారులో త్యాగరాజస్వామి కన్నుమూసిన మూడు నెలలకే గోదావరీ తీరంలో రాజమహేంద్రిలో వీరేశలింగం అవతరించడం ఒక చారిత్రక అవసరాన్ని నిర్వర్తించడానికే ననిపిస్తుంది. అలాగే చిన్నయ్యసూరి మరణించిన సంవత్సరంలోనే మహాపురుషులు గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తిగార్లు దాదాపుగా జన్మించడంకూడా చారిత్రక ప్రాధాన్యతగల చమత్కారంగానే!

రాయప్రోలు సుబ్బారావు భావకవిత్వానికి ఆరంభకుడంటూ యూనివర్సిటీ పండితులు అచారిత్రక సిద్ధాంత మొకటి తయారుచేసి, జాతితలపై రుద్ది [illegible]

యించేస్తుంటారు. కాని అది ఎంతమాత్రం సంగతమయ్యే సత్యం కాదు. రాయప్రోలు రచించిన స్నేహలత, తృణకంకణం వంటివి- సంప్రదాయానుస్యూతితో వెలువడిన వస్త్వాశ్రమ కథన కావ్యాలే! భావకవిత ప్రధానంగా ఆత్మాశ్రయం. వ్యక్తి భావనయే కావ్యవస్తువుగా పరిగ్రహిస్తుంది. వ్యక్తి స్వేచ్ఛాభిలాషను ఆవిష్కరిస్తుంది. అట్టిదానికి నిస్సందేహంగా గురజాడ అప్పారావే ప్రారంభకులు.

"కమ్మనితావి క్రమ్మెటి పుష్పనిచయము ప్రేమకాదా?"- అంటూ ఆయనే మొట్టమొదటిసారిగా సిద్ధాంతం చేశాడు.

"ప్రేమ పెన్నిధిగాని, ఇంటను సేర్ప రీకళ
ఒజ్జలెవ్వరు లేరు; శాస్త్రము లిందుగూరిచి
తాల్చె మౌనము; నేను నేర్చె భాగ్యవశమున!
కవుల కృపగని, హృదయమెల్లను నించినాడను
ప్రేమయను రతనాల కొమ్మ!!"

అంటూ తెలుగు కవిత్వంలో వైయక్తిక ప్రేమకు అంకురార్పణ చేశాడు గురజాడ. అదే దాంపత్య జీవితానికి పట్టుగొమ్మ అనీ, అప్పటికే 'అధర్మ ధర్మాలుగా' భ్రష్టత చెందిన ఫ్యూడల్ నీతు లేవీ పరిగణనీయాలు కావనీ సిద్ధాంతం చేసిన ఆదిపురుషుడాయనే.

"సతుల సౌరను కమల వనముకు
పతుల ప్రేమయె వేవెలుగు—
ప్రేమ కలుగక బ్రతుకు చీకటి!" అంటూ, "నానేర్చు కొలది ప్రేమవిద్దెకు ఓనమాలివి!" అంటూ, ఉద్ఘాటించాడు. ఈ నూతన సిద్ధాంతాన్ని "ఎదను నిల్పిన మేలు చేకూరు!" నంటూ సుహృత్ సమ్మితంగా తెలుగు జాతికి ఉపదేశించారు. అంతేకాదు-మరులు ప్రేమకాదని, మరులు వయసుతోపాటు మరలునని, మర్మం లేని నేస్తం మగువలకీ మగవారికీ ఒక్కటేననీ, అదే జీవిత సౌఖ్యానికి రాజమార్గమనీ, ప్రేమ యివ్వకుండా పరిగ్రహించటం సాధ్యం కాదనీ, ప్రేమ నిలిచినపుడే ప్రేమ నిలుస్తుందనీ ఆయనే జీవనమార్గోపదేశానికి ఆరంభకుడయ్యాడు. పతిపాద సేవయే భార్యకు ముక్తిపథమనే ఫ్యూడల్ నీతిసూత్రాన్ని ఖండితంగా పరాస్తం చేసింది ఆయనే.

'మగడు వేల్పన పాత మాటది.

"ప్రాణమిత్రుడ నీకు!" అంటూ అపూర్వ ధైర్యంతో వక్కాణించాడు. భావకవిత్వానికి ప్రాణదీపమై వెలిగిన ఆత్మాశ్రయ మార్గానికి మేనిఫెస్టోగా తన రాలిందిదే. దానితోనే తెలుగు సాహిత్యంనుంచి- ముఖ్యంగా కవిత్వంనుంచి గత కాలపు హావభావాలకు కాలదోషం పట్టింది. పితృదేవతల పాత్రలన్నీ కాలధర్మం చెందాయి. మతంపట్టునుంచి తెలుగు కవిత్వం విముక్తమైంది. వర్తమాన జీవద్లోక హృదయం కవిత్వంలో ప్రతిస్పందించ నారంభించసాగింది.

ఇదే కృష్ణశాస్త్రి, కవితాకంఠ మార్గంనుంచి బహుముఖీనమై పరవళ్ళు త్రొక్కింది. కవిత్వభాషను మరింత సునిశితం చేసుకోగలిగింది. జగమునిండ స్వేఛ్ఛాగతఝురులు నింపాలని సంకల్పించింది. బసవరాజుఅప్పారావుతో కవిత్వం నిత్యజీవిత క్లేశానందాలకూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలకూ బాసటగా నిలచి ప్రాణ వాయువులందించింది. నండూరి సుబ్బారావుతో మధ్య తరగతియిరుకుగదులలోంచి బయటపడి-ఏటికడుపుదాగిన తోటల్లో విహరించి భూగంధ బంధురత సంతరిచ్చుకుంది.

జాతిజనుల హృదయస్పందిగా యింతటి అమేయ చారిత్రకప్రాధాన్యతను నిర్వహించిన భావకవిత్వంపై యిప్పటికీ సనాతనులో, పెడమార్గం పట్టిన అతివాదులో వెక్కిరిపితూరీలు లేవనెత్తుతూనే ఉన్నారు. భావకవిత్వం తత్కాలీన చారిత్రక అవసరంగా పుట్టినది కాదనీ, అది ఆంగ్ల కవిత్వంనుంచి అంటు కట్టుకొన్న పరాయిసరుకేననీ సిద్ధాంతం చేస్తూ వుంటారు. ఈ శతాబ్దంలోని మూడవ దశాబ్ది ముగిసేలోపల భావకవితాశ్రేణిలో అనుకరణ మితిమీరి అంధత్వం ఏర్పడకపోలేదు. దానిని వింగడించడంవేరూ, మొత్తం భావకవిత్వాన్నే త్రోసిరాజనడంవేరూను. భావకవిత్వంలో అంధత్వం రెండు తావులుగా ఏర్పడింది. ఒకటి; పాడిందేపాటగా అనుకరణ మితిమీరి అనుభూతికి విరళత ఏర్పడటం! ఇది గట్టిపట్టినారంభించిన రెండవ దశకంలో స్పష్టపడింది. రెండవది భావకవిగా జన్మించి దిరిసెనమారుని ప్రణయగీతాల ద్వారా లోకహృదయ ప్రదర్శనచేసిన విశ్వనాథ, ఆత్మగౌరవం ఆంధ్రప్రశస్తిల ద్వారా తెలుగుగుండెకు పౌరుషోద్దీపన కావించిన విశ్వనాథ-కిన్నెరసానిపాటల్లు, కోకిలమ్మపెళ్ళివంటి వచనకావ్యాల ద్వారా [illegible] పాడిన వీతుల్ని తత్త్వనియమాల చేసిన విశ్వనాథ తానంతవరకూ నిర్వహించిన పాత్ర

త్రక అభ్యుదయకర పాత్రను విస్మరించి, తెరవాత్ని 1926 తర్వాత అనుయాయులతో సహా వెనక్కి వెనక్కి నడచి వేదారణ్యాల చిక్కుపడిపోవడంతో ఈ అంధత్వం మరీ ప్రబలతరమై పోయింది! తెలుగులో నవ్యకవితా పరంపరలో ఈ శతాబ్దంలో బ్రిటిష్ ప్రభుత్వ కోపానికి గురై నిషేధింపబడిన తొలి తెలుగు కవితా సంపుటి 'ఆంధ్రపౌరుష'మేనని మనం మరచిపోకూడదు!

భావకవిత్వం సాధించిన అపార విజయాలతో హార్దిక పుష్టిని చేకూర్చుకొని, ఆ కవితా శ్రేణిలో పొడసూపుతున్న అపజయాలనూ బలహీనతలనూ గుర్తెరిగి, అంధత్వ రుగ్మతలను పోకార్చుకుందుకు ప్రబల ప్రయత్నం చేసిన శక్తివంతులే తరువాతి యుగానికి మార్గదర్శకులయ్యారు. 1926-33 ల నడుమ ఏడేళ్ళ కాలం ప్రజాభ్యుదయ కవిత్వానికీ ప్రయోగవాదక కవిత్వానికీ భాగీరథ ప్రయత్నం జరిగింది. అట్టి వారిలో ప్రాతఃస్మరణీయులే శ్రీశ్రీ, పురిపండా, నారాయణబాబులు. ప్రయోగవాద కవిత్వానికి ఆద్యుడుగా 1927 లోనే వెలుగొందినవాడు శిష్ట్లా ఉమామహేశ! అతనికి అనుయాయి పఠాభిన్నీ!

1920 తర్వాత జాతీయ స్వాతంత్ర్య పోరాటోద్యమానికి కరమ్‌చంద్ గాంధీ నాయకమణిగా దీపించాడు. యావద్భారతంలోనూ గుర్తింపు పొంది రవీంద్రునిచే మహాత్మ బిరుదు పొందాడు. మోహన్‌దాస్ గాంధీ ప్రవేశంతో జాతీయోద్యమం వ్యక్తుల మధ్య నడిచే వ్యవహారంగా మణగి ఉండడం మానుకుంది. ప్రజాబాహుళ్య భాగస్వామిత్వంతో నూత్నశక్తిగా పరిణమించింది. 1919 లో ఖిలాఫత్ ఉద్యమమూ, జలియన్‌వాలాబాగ్‌లో డయ్యర్ కావించిన ఘోర హత్యలు యువతరంలో సాయుధ పోరాట మార్గాన్వేషణకు ప్రేరేపించాయి. ఆ హత్యలకు నిరసనగా రవీంద్రుడు తీవ్రపదజాలంతో ప్రకటన విడుదల చేసి తనకు బ్రిటిష్ ప్రభుత్వం ప్రదానం చేసిన 'సర్' బిరుదాన్ని విసర్జించడంతో సాహితీపరులలో జాతీయోద్యమ ప్రమేయమూ అధికమైంది.

ఆ దశాబ్దిలో జాతీయోద్యమానికి బాసటగా ఎందరో కవులు వెలిసి తమ గేయాల ద్వారా ఉద్యమోత్సాహం కలిగించారు. తెలుగు నేలలో అలాంటి కవులలో గరిమెళ్ళ సత్యనారాయణగారు నాయకులు. ఆయన రచించిన 'మాకొద్దీ తెల్ల దొరతనము' అనే గేయం ఎవరి నోట విన్నా బ్రిటిష్ ప్రభుత్వం [illegible]

పోయింది. గరిమెళ్ళవారు రచించిన గేయాలన్నిటినీ సంపుటీకరించి, పిఠాపురం వాసి సంపన్న గృహస్థు ఆచంట సత్యనారాయణగారు గ్రంథంగా ప్రచురించారు. వెంటనే బ్రిటిష్ ప్రభుత్వం ఆ గ్రంథాన్ని నిషేధించి, ప్రచురణ కర్తపై కేసు నడిపి, రెండున్నర సంవత్సరాల కఠిన కారాగార శిక్ష విధించింది. ముప్ఫయ్యెకరాల సుక్షేత్రమైన మాగాణీ భూమి యావత్తు జాతీయోద్యమం కోసమే ఖర్చు చేశారు ఆచంట సత్యనారాయణగారు.

తూర్పు గోదావరి జిల్లా తుని కాపురస్థులు శ్రీ కొండపల్లి జగన్నాథదాసు అనే జాతీయకవి ఆ దశలోనే గాంధీ హరికథ - స్వరాజ్య తాంబూలం, స్వరాజ్య బొబ్బిలి పదం మున్నగు పాట కథలు రచించి, తానే స్వయంగా ఊరూరా తిరిగి గానం చేస్తూ గొప్ప సంచలనం కలిగించారు. ఈ దేశభక్తుడు జానపదులు పాట కతల బాణీని బాగా వంట పట్టించుకోవడం వల్ల సామాన్యులలో గొప్ప సంచలనం కలిగించగలిగాడు. దానితో గంగ వెర్రులెత్తిన బ్రిటిష్ ప్రభుత్వం ఆయనపై కేసు పెట్టి మూడేళ్ళు జెయిలు శిక్ష విధించింది.

ఈ దశలోనే మచిలీపట్నానికి చెందిన శ్రీ గురజాడ రాఘవశర్మ గారుగాని-అసంఖ్యాక అనామక కవివీరులుగాని జాతీయోద్యమోత్సాహంతో కవితాగానం చేసి, కారాగారక్లేశా లనుభవించారు.

తిరిగి మళ్ళీ ప్రధాన కవితా స్రవంతికి చేరుకుంటే 1927 వరకూ పురిపండా అప్పలస్వామి కార్యకర్తగా జాతీయోద్యమ భాగస్వామిగా ఉంటున్నా సౌదామనివంటివారు భావకవితానుసరణలే చేస్తూవచ్చారు. శ్రీరంగం శ్రీనివాసరావు ప్రభవ ప్రచురించి ఒక కవితా దశకు స్వస్తి చెప్పుకొన్నాడు. కాని, వేరొక నూత్న దశ యింకా అతనికి చేరువ కాలేదు. ఆ సంధియుగంతో అది [illegible] మున మానవాస్తికా పరంపరలు అంటూ పోల్చుకో నారంభించారు. శ్రీరంగం నారాయణబాబు మిణుగురు లనే ప్రేమ గీతాలు విరచిస్తున్నాడు. 1933 లో శ్రీరంగం శ్రీనివాసరావు జయభేరి మ్రోగించారు. జాతీయ చైతన్యంతో పాటు అంతర్జాతీయ స్పృహను కైతల [illegible]. వంగ జాతీయ విప్లవ కవి నజ్రుల్ ఇస్లామ్ శ్రీరంగం కమలకు పరిచయం ద్వారా పరిచితుడై ఎంతో ఉత్సాహం కలిగిస్తున్నాడు.

1930 ం దశకంలో తెలుగుదేశంలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ద్వారా సామ్యవాద చైతన్యం ప్రజలలో వ్యాపిస్తోంది. శ్రీశ్రీ, పురిపండా, నారాయణబాబులు సమాజవాద కవితలను విరచిస్తున్నారు. వీరితోపాటు అప్పుడే తలయెత్తుతున్న యువతరం కవికిశోరాలు-భావకవుల ప్రభావానికి ప్రతిధ్వనులు కానొల్లక తమ కవి వ్యక్తిని కాపాడుకునేందుకు కొత్త తెన్నులు వెతుక్కోనారంభించారు. ఈ అన్వేషణ తత్పూర్వ అనుభవపూర్వకమే! ఎక్కణ్నుంచో ఎరువు తెచ్చుకున్నది కాదు. వీరిలో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, పింగా గణపతిశాస్త్రి,మల్లవరపు విశ్వేశ్వరరావు ప్రభృతులు ముఖ్యులు. వీరంతా భావకవిత్వంపై తిరుగుబాటు ప్రకటించారు. "మహాకవి ఊహాపనా మోయలేమయ్యా పల్లకి!" (ఇంద్రగంటి) అంటూ తమ నిరసన ధ్వనిని కంఠోక్తిగా వెల్లడించనారంభించారు.

పురిపండా అప్పలస్వామి భావకవిత్వపు పట్టు తప్పించుకొని భావి కవితా పథకం పట్టాడు. సంప్రదాయ విచ్ఛేదం చేశాడు. తనను పులిపంజాగా పోల్చుకున్నాడు. 'రాబందుల రాజ్యంలో రక్తం తిని బ్రతుకలేను' అంటూ ప్రకటించాడు. మరో విశిష్ట కవి శిష్ట్లా వుమామహేశ! గుంటూరు మండలంలో పుట్టి మిలటరీ ఆఫీసరుగా దేశాలన్నీ తిరిగి పాశ్చాత్య కవితా సారాన్ని పుణికి పట్టినవాడు. తెలుగు కవితా రీతినీ యితివృత్తాన్నీ ప్రప్రథమంగా మార్చి వేసినాడు. "అనాథ బాలికల భావాలు-అనాఘ్రాత కుసుమాలు-రాలిన రీతిగా నిరాధారాలెటో నిష్ప్రయోజక ప్రతిభావంతుల- అట్లే నిష్ఠురాలుగా నా దేశం జనులలో నిలిచిపోయినది" అని బాహ్య వాస్తవికతను దర్శించాడు. శ్రీరంగం నారాయణబాబు నూతన కవితా చైతన్యంతో-తా నొక గడ్డిపరకననీ,కర్కశపాదాలు తనను నలిపి నడిచిపోతున్నాయనీ, పశువుల నోటికి తాను పాయసమవుతున్నానని గుర్తించి-దళితుల పక్షాన నిలచి పీడనా రాహిత్య సమాజంకోసం ఎలుగెత్తాడు.

శ్రోత్రియ విద్యల పాదులో మొలిచిన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, లోక వాస్తవికతను దర్శించి దేవుని అస్తిత్వాన్నే ప్రశ్నించకుండా ఊరుకోలేదు. "ఉపనిషద్ వీధిలో ఊరేగు దేవా! ఉర్వి దౌర్జన్యాల తీరుకున్నావా? కొండ శిఖరాలపై కోటవు కూర్చుండి, కూటి పేదల ముడుపు గుంజుతున్నావా?" అంటూ; కలౌ వేంకటనాయకా అని- ప్రస్తుతించబడుతున్న దేవుణ్ణి ధిక్కరించాడు. ప్రతి

హృదయంలో ప్రతి సదనంలో జ్వాలలు రగిలించని జ్యోతులు వెలిగించని పాటెం దుకు? పదమెందుకు?" అంటూ తీవ్రాధిక్షేపం చేశాడు హనుమచ్ఛాస్త్రి. దురదృష్ట వశాత్తు ఆయన గుండెదిటవు ఎంతోకాలం నిలవలేదు. విశ్వనాథుని కరుణా కటాక్ష వీక్షణాలు పొందడమే కవిగా తనకు చరితార్థతగా భ్రమించి వెనక్కి తప్పుకొన్నారు.

సనాతన విద్వత్సంప్రదాయం నుంచి వచ్చి ఆధునిక కవిశ్రేణిలో చేరిన మరొక కవి శ్రీ పిలకా గణపతిశాస్త్రి- గొంతులో కొత్త జీర పలికిస్తూ పరుగులు తీశాడు.

"సంజనీరెండలో జాహ్నవా అలలలో
నీడలోడల లీల నిండి జారెడువేళ
ఓ మధూత్సవ పధిక ఉదయారుణాంశుకా!
నీహారమణి నౌక నోహో యనెడు కేక...."

అంటూ రచించిన తొలినాళ్ళ కవితలలో కృష్ణశాస్త్రి కవితాముద్ర దాగుడు మూత లాడుతుంది. ఆ ప్రభావ నిగళాలను త్రెంపుకొని తరువాతికాలంలో స్వీయ కంఠధ్వనులు వెలార్చుకున్నాడు. ముఖ్యంగా 'మాదాకబళం' అనే గేయంలో ఒక కరుణామయ జీవనగాథా సన్నివేశాన్ని ప్రతిబింబించాడు.

హోరని గాలి దుమారము లెగిరెన్
ఘోరని ధారావర్షము కురిసెన్
వీధులలో ఎవరో ఆ నీడలు
ఆకలితో ఏవేవో ఘోషలు!
అమ్మా మాదా కబళం తల్లీ....
అమ్మా పిల్లల మన్నం తల్లీ....

1930ల దశకంలో ఆధునిక కవిశ్రేణి అందరిదీ ఒకదారే అయితే ఒక్క పఠాభిది మాత్రం విభిన్న మార్గం. అతను ఛందస్సుల ఛండశాసనాలను సంపూర్తిగా భగ్నంచేసి వచనపు దుడ్డుకర్రలతో కవితా సౌకుమార్యాన్ని చావ మోదాడు. నగర జీవన సంక్షోభాన్ని, నాగరకతా కృతకత్వాన్ని మొదటిసారిగా

తెలుగు కవితలలో ప్రతిబింబించి ఫిడేల్ రాగాల్ డజన్ వెలువర్చాడు. కథకుడుగా అప్పటికే కీర్తిసోపానా లెక్కుతున్న పాలగుమ్మి పద్మరాజు కవిగా వినూత్న కావ్యవస్తువులను అన్వేషించి విశిష్ట రీతిలో అభివ్యక్తంచేశాడు. ఆయన అప్పట్లో రచించిన కవితలు ప్రఖ్యాతమైనవి మూడేగాని - వాటిలోనే ప్రత్యేక ముద్ర సాధించాడు. 'భూమీ, ఓ భూమీ నాకేమైనా కవితలు చెప్పు' అనేది, 'చీకటి' అనేది, 'పురిటిపాట' అనేది ఆలోచనాత్మకంగా నిలిచాయి.

ఆ దశకంలో పూషా, సింగరాచార్య, భీమశంకరం, తిలక్‌లు భావ కవిత్వపు అడ్డాలు విడిచి ఆధునిక యోచనాధార కుపక్రమించారు. ఇందరిలో సంపత్ (శంఖవరం సంపత్ రాఘవచారి) శిష్టుడూ అత్యాధునిక కవితాదక్షు డూను. ఆయనకూడా తన్ను తానేచూసి దడుసుకొని, విశ్వనాథవారి అండకు చేరు కొని ప్రాచీనత్వాన్ని ఆలింగనం చేసుకొన్నాడు. తొలి దశలో రచించిన కవిత లలో 'క్షయరోగం తినివేసిన ఊపిరితిత్తులు, సవాయితో ఛిద్రితమైపోయిన అంగం' వంటి అధివాస్తవికతా చిత్రాలను కవితలకెత్తి ఓహో అనిపించుకొన్నాడు.

ఆ దశాబ్ది పొడుగునా మహాప్రస్థాన గీతాల ప్రయోగంతో నాయకమణిగా తేజరిల్లిన శ్రీశ్రీ తెలుగు సాహిత్యంలో కావ్య వస్తువునూ రీతినీ సంపూర్ణంగా మార్చాడు. ఆగామి అభ్యుదయ కవితా యుగానికి నాయకుడయ్యాడు. పురా జగత్తును వ్యాఖ్యానించడం కర్తవ్యం కాక అతని కవితలు ఆ జగత్స్వరూపాన్ని సంపూర్ణంగా మార్చడం కోసమే మార్గ నిర్దేశ మొనర్చాయి.

అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణయుతంగా ఏర్పడక పూర్వం 1940-43 మధ్యకాలంలో కమ్యూనిస్టు రచయితలు ప్రజాశక్తి వారపత్రికలో అభ్యుదయ రచనలు ప్రచురితం చేస్తూ వచ్చారు. 17-6-1942 ప్రజాశక్తిలో "అన్యాయాన్ని ఎదిరిస్తాం, స్వాతంత్ర్యం సంపాదిస్తాం, విప్లవవీరులమూ, భారత పుత్రులమూ - సమరోత్సాహులమూ! శాంతి సభ్యతల అంతంచేసే రాక్షస దౌర్జన్యం.... ప్రపంచమంతను భస్మంచేసే హిట్లర్ ఫాసిజము - ధ్వంసం చేస్తాం, దగ్ధం చేస్తాం, గోరీ కడతాం హిట్లర్‌కు!" అనే కవిత 'హితైషి' అనేవారు రచిం చారు. వీరెవరో రాజకీయ ప్రముఖ నాయకుడే! (సుందరయ్యగారేమోనని కంభం పాటి అనుమానించారు). అప్పటి యిలాంటి రచనలలో కవితా గుణాత్మకత తక్కు

వగా ఉన్నా, సారళ్యమూ, స్పష్టతా, నవీన కాంతి ధావళ్యమూ మెండుగా కనిపిస్తాయి.

అదే పత్రిక 1-7-1942 సంచికలో జి. కోటయ్య అనేవారు-"ఫాసిస్టు ప్రళయాగ్ని ప్రజ్వరిల్లిందండి - ప్రజలందరము మేలుకోవాలి! తూర్పు దీవుల మధ్య తలెత్తిన జ్వాల కాలాగ్నికీలయై నాలుకలు జాపినది, కనుమూసితే మోస మోయీ! మన మిపుడు, కలసి పనిచేయవలెనోయీ! సింగపూర్ మలయాల మింగివేసిన అగ్ని ప్రాచ్యభూములు మొదట - చవిచూచి ఒకసారి, తరలి పోయినది. ॥ఫాసిస్టు ప్రళయాగ్ని॥ ఎన్ని ప్రాణుల మింగి ఈ యగ్ని రగిలెనో, ఎన్ని జీవాలింక ఎగిరిపోవలెనో, పచ్చి రక్తము పీల్చు ఫాసిస్టు రక్కసుల ప్రజలందరము కలసి ప్రతిఘటించాలోయ్! ఆక్రమిత దేశాల ఆక్రందనల్ విన్న- గుండె నీరై మనము కమలిపోతామోయి! దేశభక్తుల నెల్ల తీసినది ప్రాణముల - సామాన్యజనులను చెండాని విడిచినది ॥ఫాసిస్టు॥ జాతి మత ద్వేషాలు జారవిడిచి మనము-పల్లె పల్లెకు మనము పయనమైపోయి, ఫాసిస్టు వ్యతిరేక భావాల రేకొత్తి సామాన్యజనులకు చైతన్యమివ్వాలి! వీర రక్తము మనది, ఉడుకెత్తదములేద? ఫాసిస్టు భూతముల పరిమార్చ రారండి! పచ్చి రక్తము పీల్చునోయీ! యీ ఫాసిస్టు భూతము ప్రాణముల బలిగోరునోయీ!" అనే పాట రచించారు. బహుశా ఫాసిస్టు వ్యతిరేక కవితా శ్రేణిలో యిదే మొదటిది కావడంవల్ల-తెలుగు యేలపాట బాణీలో సాగి జానపద గేయానికి సన్నిహితంగా ఉన్నా - కవితాభివ్యక్తికోసం తడుముకోవడం తప్పలేదు!

8-7-1942 నాటి ప్రజాశక్తి 'ప్రజాయుద్ధం' అనే శీర్షికతో కామ్రేడ్ కంభంపాటి సత్యనారాయణ ఎమ్.ఏ. అనే పూర్తిపేరుతో సీనియర్‌గా రాక బుర్ర కథ రచించారు. దీనికి వారు బొబ్బిలిపాటవరస-అంటూ బ్రాకెట్లలో సూచించారు. అభ్యుదయసాహిత్యోద్యమ పూర్వకాలంలో తెలుగులో వచ్చిన మొట్టమొదటి బుర్రకథ యిదేనని చెప్పవచ్చు. జాతీయోద్యమకాలంలో కొండపల్లి జగన్నాథ దాసు స్వరాజ్యబొబ్బిలి పదం రచించారని ముందే తెల్సుకున్నాం. కంభంపాటి వారు రచించిన మకుటం మన యావత్తు బుర్రకథల ప్రక్రియనూ యిప్పటికీ విడువక పోవడం గమనార్హమైన సంగతి. "జయము జయము మన భారతభూమికి జయము దిగ్విజయము! జయము జయము మన ప్రజాశక్తికి జయము దిగ్వి

జయము!" ఈ పల్లవి తదుపరికాలంలో సుంకర సత్యనారాయణగారు విరివిగా పరిపోషించిన బుర్రకథ ప్రక్రియలన్నింటికీ ఉపయుక్తంకావడం విశేషం. సుంకర వారి కష్టజీవి, అల్లూరి సీతారామరాజు, కందుకూరి వీరేశలింగం, రాణిరుద్రమ్మ వంటి బుర్రకథలు ఈ ప్రక్రియలో శిఖరాయమాణ మనదగిన క్లాసిక్కు!

కంభంపాటి వారి ప్రజాయుద్ధం బుర్రకథ 15-7-42 సంచికలోనూ, 22-7-42 తేదీగల సంచికలోనూ ధారావాహికగా ప్రచురింపబడి రాజకీయ సిద్ధాంత ప్రచలితమైన తొలి బుర్రకథగా నిలిచింది. దీని నానాడు ఎవరైనా పాడి వినిపించారో లేదో తెలియదు. అభ్యుదయ రచయితల సంఘంతోపాటుగా ప్రజా నాట్యమండలి కూడా మన రాష్ట్రంలో ఆవిర్భవించిన తర్వాతగాని ప్రజల కళా రూపాలను సముద్ధరించడం జరగలేదు! కవితాపరంగా కంభంపాటివారి బుర్రకథ ఒక ఉత్కృష్ట రచన అని స్పష్టంగా చెప్పుకోవచ్చు. ప్రచారగేయంగా మార్గ దర్శకమైందనడంలో సందేహంలేదు. ఈ శాఖను సుంకర వారు అభివృద్ధిచేయగా ప్రజానాట్యమండలి కళాకారులు నాజర్, మిక్కిలినేని, కర్ణాటి లక్ష్మీనరసయ్య ప్రభృతులు విశేష ప్రచారం కలిగించగా-నేటి జాతీయ జీవన ధారలో బుర్రకథ ఒక ప్రధాన సాంస్కృతికరూపంగా నిలచిపోయింది. ఆరంభబీజావాపన కలిగిం చినవారిలో కంభంపాటి సీనియర్ ప్రధానులన్న చారిత్రక సత్యం నేడు విస్మ రింపబడిపోయింది.

29-7-1942 తేదీ ప్రజాశక్తి వారపత్రికలో 'ప్రబోధము' అనే శీర్షికతో ఒక మార్చింగ్ సాంగ్ అనే పాటను కామ్రేడ్ మహీధర రామ మోహనరావు రచించారు. తిరువాత కాలంలో అనువాదకులుగా, సిద్ధాంతవేత్తగా, నవలా రచయితగా ప్రఖ్యాతులయ్యారే తప్ప కవితా రచనకు పూనుకోలేదు. కాని, ఈ ప్రబోధం పరిశీలించినవారికి వారు కవిత్వ రచన విరమించడం మిక్కిలి నేరమే అనిపించక తప్పదు. "ముందునడూ, వేగనడూ, మృత్యుభీతి వదలవోయ్ ! క్రూర ఫాసిస్టు మూక ఉరికి వచ్చుచున్నదోయ్!" అనే పల్లవితో పాతిక పాదాలవరకూ సాగిన చక్కని పాట యిది. 'బానిసత్వము నకు బుర్రవొగ్గి తృప్తిపడుదువా? అన్నతకన్న కంఠమిచ్చి చచ్చిపోవుటుత్తమం! మనదు మేని ఎముకలున్న పేర్చి అడ్డుగొట్టుదాం - ప్రాణమిచ్చి ఫాసిజాన్ని మంటకలిపి తీరుదాం! ఒక్కటై పదండి దుఃఖఖేదవల తరించుదాం - చావుకైన

బాధకైన పదుగురున్న భయమేదోయ్? ముందుసాగు కలసినడుద మందరిదీ యుద్ధమోయ్! విజయనాదములతో వేగ స్వేచ్ఛకొరకు సాగరోయ్!" అంటూ హృద్యంగా సాగుతుంది. ఎంతో ప్రయత్నపూర్వకంగా జానపద ఫణితినీ, సరళ రచనా పద్ధతినీ అవలంబించిన తొలితరం అభ్యుదయ కవితలు ఆనాటి పాఠకులపై ఎంతో ప్రభావం కలిగించి ఉంటాయి.

5-8-1942 ప్రజాశక్తిలో అయ్యపు వెంకట కృష్ణయ్యగారు 'రారా తమ్ముడ రణరంగానికి రాక్షసత్వమును నిర్మూలింపగ!' అనే మకుటంతో చక్కని గేయం ప్రచురించారు. వీరి గేయంలో కాకినాడ విశాఖలపై జపాను ఫాసిస్టులు బాంబులు కురిపించడాన్ని ప్రస్తావించారు. అభ్యుదయ మాసపత్రికలో కూడా ఈ అయ్యపువారు ఎన్నో కవితలు ప్రచురించారు. కాని, వీరి కవితా సంకలనం వెలువడలేదు. ఇప్పు డెక్కడున్నారో, ఏం చేస్తున్నారో పట్టించుకున్నవారే లేరు.

12-8-1942 ప్రజాశక్తి పత్రికలో కామ్రేడ్ మహీధర రామమోహన్ రావుగారే - 'పరాకు వదలి కదలండోయ్' అనే మరొక గేయం ప్రచురించారు. "ప్రజాశత్రువులు ఫాసిస్టులదే - పరాకు వదలి కదలండోయ్! జపానువాడో జర్మనువాడో ఎవడైనా మనపాలిట కొకటే, ప్రపంచశాంతీ ప్రజాభివృద్ధీ స్వార్థ ముకై నాశము చేసే ఈ దుష్ట జపానుల దహించివేదాం - పరాకు వదలి కద లండోయ్!" అంటూ సాగిన యీ గేయంలో అభ్యుదయ కవిత్వపు ఆరంభ దినాల నాటి ప్రమాణాలూ పరిణామాలూ మన కీనాడు స్పష్టంగా గోచరమవుతాయి!

9-9-1942 తేదీ గల ప్రజాశక్తిలో కామ్రేడ్ కె. వి. కొండలరావు 'శ్రీరంగ రంగ రంగ రంగా అనే పాట మాదిరి' పాట ఒకటి ప్రచురించారు. ఆనాటి ప్రజాశక్తి పత్రికలో యిలాంటి మాదిరి గీతాలు విశేషంగా వస్తూ వుండేవి. యివన్నీ ఉత్తమ అభ్యుదయ గేయరచన కోసం చేసిన అన్వేషణా ప్రయత్నాలనీ, 1943 నుంచి సంఘటిత శక్తిగా రూపొందిన అభ్యుదయ రచయితల సంఘంలోని ప్రముఖ కవులు సలిపిన కవితా కృషికి కరదీపాల వంటివనీ స్పష్టంగా చెప్పుకోవచ్చు. కవితలుగా వీటికి విశేషమైన విలువలు కాకపోయినా ప్రారంభ దినాల ఒజ్జబంతులుగా నిలిచే యోగ్యత మాత్రం ఉన్నదని నిరాటంకంగా చెప్పవచ్చు. చారిత్రక అవసరాన్ని సచేతనంగా నెరవేర్చిన క్రియాశీల పురోగమనాన్ని మన మీ తొలినాటి రచనల ద్వారా పోల్చుకోగలుగుతాం.

1940 ల దశకంలో అభ్యుదయ కవులుగా ప్రఖ్యాతులైనవారు - అనిసెట్టి సుబ్బారావు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, బెల్లంకొండ రామదాసు, కుందుర్తి ఆంజనేయులు, ఆంజనేయప్రసాద్, ధనకుధరం వెంకటాచారి, మాడభూషి వెంకటాచారి, పులుపుల వెంకటశివయ్య, తుమ్మల వెంకటరామయ్య, ప్రయాగ కోదండరామ శాస్త్రి, చదలవాడ పిచ్చయ్య, సుంకర సత్యనారాయణ, కోగంటి గోపాలకృష్ణ, ఆరుద్ర, ఆవంత్స సోమసుందర్, కె. వి. రమణారెడ్డి, రెంటాల గోపాలకృష్ణ, నార్ల చిరంజీవి, గంగినేని వెంకటేశ్వరరావు ప్రభృతు లెందరో ఉన్నారు. 1948 లో కలకత్తాలో జరిగిన కమ్యూనిస్టు పార్టీ మహాసభలో రణదివే ప్రవేశ పెట్టిన తీర్మానంతో ఘోరమైన నిర్బంధం విరుచుకుపడింది. అభ్యుదయ పత్రిక నిషేధింపబడింది. సంఘ కార్యకలాపాలు చెల్లాచెదరయ్యాయి. అప్పుడు అభ్యుదయ కవులలో కొందరు సాహసమతులై 1949 లో గ్రంథాల ప్రచురణకు పూనుకున్నారు. అభ్యుదయ ప్రజావాణి కనిపించని చీకటి రోజులలో ఈ కావ్యాలే కవితా దీపాలు వెలిగించగలిగాయి. 1945 లో మన జాతీయ పోరాటం మరొక మలుపు తిరిగి స్వతంత్ర సంస్థానాల ప్రజలలో జాగృతి కలగడం, వీర తెలంగాణా సాయుధ పోరాటం ప్రజల పోరాటంగా రూపొంది ఒక జాతీయోత్తేజాన్నివ్వడం, ఆ పోరాటోత్సాహంతో ఆరుద్ర, సోమసుందర్ ప్రభృతులు కావ్యాలు రచించి ప్రఖ్యాతులు కావడం వంటివన్నీ సాహిత్య చరిత్ర విస్మరింపలేనివే!

1951 నాటికి భారత కమ్యూనిస్టు పార్టీ పునరాలోచనకు పూనుకొని, రణదివే తీర్మానాన్ని ఉపసంహరించింది. దానితో పార్టీపై నిషేధం తొలగి, భారత రిపబ్లిక్‌కు జరిగిన మొదటి ఎన్నికలలో పాల్గొనగలిగింది. ఒక్కసారి గతాన్ని కలబోసుకుంటే- వేల సంఖ్యలో ఉత్తమ పుత్రులను పోగొట్టుకోవలసిన సత్యం గుర్తించక తప్పలేదు. అభ్యుదయ రచయితల సంఘం తిరిగి పునర్నిర్మాణం పొందనారంభించింది. 1955 లో విజయవాడలోనే 5 వ మహాసభ కూడా జరుపుకుంది. అభ్యుదయ పత్రిక ప్రచురణ ప్రారంభమైంది. కాని, సుదీర్ఘమైన టైఫాయిడ్ జ్వరం నుంచి కోలుకున్న రోగి మోస్తరుగా అభ్యుదయ రచయితల ఉద్యమం మందకొడిగానే సాగుతూవచ్చింది.

దీనితో కొందరు విపరీత మేధావులు కొత్త అంచనాలకు పూనుకొన్నారు. అభ్యుదయ రచయితల సంఘ చారిత్రక పాత్ర ముగిసిపోయిందని- దానికి ప్రత్యామ్నాయంగా మరో శక్తి ఉద్భూతం కావాలనీ వెర్రిమొర్రి సూత్రీకరణలు చేయనారంభించారు. ప్రతి ఉద్యమానికీ ఆటుపోట్లుంటాయి. సామ్యవాద వ్యవస్థ రూపొందే పర్యంతం అభ్యుదయ రచయితల సంఘం తన చైతన్య పాత్ర నిర్వహించక తప్పదని వీరికి తెలియదు.

1960 లో కుందుర్తి నాయకత్వంలో రాజధాని నగరంలో ఏర్పడిన ఫ్రీవెర్స్ ఫ్రంటు పెరిగి పెరిగి- దిగంబర కవితా ఉద్యమంగా 1965 నాటికి రూపొందింది. దీనిని తిరుగుబాటుదారులపై తిరుగుబాటుగా కొందరు కీర్తించారు. తిరుగుబాటుదారులపై తిరుగుబాటు అంటే- విప్లవ ప్రతీఘాతమేనన్న సత్యాన్ని పాపం వీరు గుర్తించలేదు. వర్తమాన వ్యవస్థను- తీవ్రమైన బూతులతో దుయ్యబట్టడం చూసి దిగంబరులు అభ్యుదయకర పాత్ర నిర్వహించగలరని కొందరు భ్రమపడ్డారు. ప్రజాస్వామిక వ్యవస్థ పనికిరాదని, నియంతృత్వ మొక్కటే సర్వసమస్యా పరిష్కార మార్గమనీ భావించే కరడుగట్టిన ఫాసిస్టులు సైతం వర్తమాన వ్యవస్థను తీవ్రంగానే విమర్శిస్తారు. తీవ్రంగా విమర్శించినదంతా అభ్యుదయమే ననుకొని భ్రమ చెందడం నిష్కృతి కలిగించదు. అతివేల ప్రగల్భంతో అట్టహాసం చేసిన దిగంబర ఉద్యమం ఐదేళ్ళయినా బ్రతకకుండానే కన్నుమూసింది.

1970 లో విశాఖలో జరిగిన శ్రీశ్రీ మహాకవి షష్టిపూర్తి మహా సంరంభం అభ్యుదయ సాహిత్యోద్యమానికి దింపుడు కళ్ళంగా మారిపోయింది. అప్పటికే శ్రీకాకుళం గిరిజన ప్రాంతంలో కేంద్రీకరించిన నక్సలైట్ల బీభత్సవాద ఉద్యమం ప్రజా విప్లవమని భ్రమించి మేధావులు, రచయితలు శ్రీశ్రీ షష్టిపూర్తి సభలను ఒక పిరికి విప్లవ ప్రదర్శనగా మార్చివేశారు. అభ్యుదయ సాహితీపరులలో రెండు వర్గాలు ఏర్పడవలసిన దుస్థితి ఏర్పడవలసివచ్చింది. మరొక ఆరు నెలలకే ఒక అర్ధరాత్రి హైద్రాబాద్‌లో అరసంను తిరస్కరించిన రచయితలు శ్రీశ్రీ నాయకత్వాన విరసం నెలకొల్పారు. విరసం ఒక సాహిత్య ఉద్యమంగాకన్న నక్సలైట్ల పరోక్ష సాహిత్య ఉద్యమంగానే హృదయ లక్షణాన్ని నిర్ధారించుకుంది. పట్టుమని ఇదారేళ్ళు ఏకోన్ముఖంగా సాగేసరికి-విరసంలో చీలికలు పొడసూపనారంభించాయి.

అటు నక్సలైట్ ఉద్యమం- ప్రముఖ వ్యక్తులందరికీ తలో చీలికగా విడిపోనారంభించేసరికి- దాని ప్రభావం విరసంపై ప్రసరించి- మొదట రెండు చీలికలుగానూ, తదుపరి మరో రెండు చీలికలుగానూ రూపొంది, యీనాడు వ్యక్తుల కూటాలుగా సంగ్రహింపబడి కొట్టుమిట్టాడుతోంది.

దిగంబర, విరస ఉద్యమాలలో కవిత్వం ఎలాంటి పరిణామాలు పొందిందీ వివరించడానికి ఈ వ్యాసపరిధి సరిపోదు. అభ్యుదయ రచయితల ఉద్యమం- తెలుగు సాహిత్యాన్ని సంపద్వంతం చేసిన ఉత్తమ కావ్యాలను సమర్పించి- యావదాంధ్ర సాహిత్య జీవుల పైనా విశేష ప్రభావం కలిగించింది. రచయితల ఆలోచనా రీతిలో ప్రబలమైన మార్పులను రూపొందించింది. అభ్యుదయ శీల ఆలోచనా ధారను దాదాపు జాతి జీవనాడిగా మార్చింది. శాస్త్రీయ సామ్యవాదం పట్ల తీరని వ్యతిరేకత గల మతవాద మితవాద సాహిత్యపరులలో ప్రతిష్ఠంభన తీసుకురాగలిగింది. విరసం అలాంటి జాతీయ స్థాయిలో తీసుకురాగలిగిన ప్రభావాలేమిటోనని అన్వేషించేవారికి సంతృప్తికర సమాధానం లభ్యంకాని పాక్షికత్వమే భజింపబడుతోంది. గత పాతికేళ్ళ సాహిత్య చరిత్రలో ఒక కళ పెళలాడుతున్న సంచలన లక్షణమే కనిపిస్తోంది. ఇది స్థితీ అనలేము. ఉత్తమత్వం వైపుగా సాగించే 'గతీ' అనలేము!

# అభ్యుదయ కవిత్వం : పరిణామదశలు : అంతస్తత్వం

డి. రామలింగం

తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవితోద్యమం ఒక ప్రత్యేకత, ఒక వైశిష్ట్యము కలిగిన ఉద్యమం. పరపీడనకు గురి అవుతూ వచ్చిన సామాన్య మానవుని కష్టాలనూ అవస్థలనూ దీనివలె పట్టించుకున్న ఉద్యమం ఇంతకు మునుపు మరొకటిలేదు. వాటిని నిర్మూలించడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా ఉపయోగించడం దీని ప్రధాన ధ్యేయం. ఆ దృష్ట్యా ఇది ఆరోగ్యవంతమైన దృక్పథం గల ఉద్యమం. ఇది సాహితీలోకంలో ఒక నూతన భావ జగత్తును సృష్టించి, తెలుగు సాహిత్య చరిత్రలో ఒక వినూత్న కవితారీతికి కారకమైంది. ఈ ఉద్యమానికి వైతాళికుడూ, సంస్థాపనాచార్యుడూ, నాయకుడూ శ్రీశ్రీ. చాలాకాలం తర్వాత ఈ ఉద్యమాన్ని స్మరిస్తూ "ఆ ఉద్యమం మా పాలిటి జీవనది. ఆ మంచి నీటికి చేపల్లాగ మేము ఎదురువెళ్ళి స్వాగతం చెప్పాం. కవితా సముద్రంలోంచి జీవన ప్రవాహంలోనికి, ప్రపంచవాహినిలోంచి సాహిత్యసాగరంలోనికి ఇటూ అటూ మేము ఈదిన ఈత ఇవాళ ఒక తియ్యని తలపోత" అని ఆరుద్ర అన్నారు.[1] ఆనాటి కవులందరూ బహుశా ఇలాగే భావిస్తారనుకుంటాను.

ఒకానొక అంతర్జాతీయ పరిస్థితిలో భారతదేశంలో అభ్యుదయ సాహిత్యోద్యమం ఆవిర్భవించింది. 1930 తర్వాత ప్రపంచమంతటా ఆర్థికమాంద్యం అలముకొన్నది. మధ్యతరగతి ప్రజల, నిరుపేదల జీవితం దుర్భరమవుతూ ఉంది. వివిధదేశాలలో పరిస్థితులు ఆందోళన కలిగించే విధంగా మారిపోతున్నాయి. ఫాసిజం తలయెత్తుతూ వుంది. జర్మనీలో హిట్లరు అధికారంలోకి వచ్చి, నాజీయిజాన్ని పెంపొందిస్తూ ఉన్నాడు. అప్పుడు లండనులో మార్క్సిజమును

1. సారస వ్యాసావళి, ఆగస్టు 1967, మద్రాసు.

అధ్యయనంచేస్తూ ప్రపంచపరిస్థితులను గమనిస్తూ ఉన్న భారతీయ మేధావులూ, ఇంకా ఇతరులూ పై రెండు ఇజాలవల్ల ప్రపంచానికి రాగల విపత్తును గ్రహించారు. 1935 లో లండనులో భారతదేశ అభ్యుదయ రచయితల సంఘం ఏర్పాటైంది. ఇందులో డా. ముల్కరాజ్ ఆనంద్, డా॥ జె. సి. ఘోష్, ప్రమోద్‌సేన్ గుప్త, సజ్జాద్ జహీర్, డా॥ ఎం. డి. తాసీర్ ప్రభృతులున్నారు. వీరు రచయితల కొక మేనిఫెస్టో ప్రకటిస్తూ, అందులో భారతీయ సమాజంలో తీవ్రమైన మార్పులు వస్తున్నాయని అంటూ, ఆ మార్పులకు సాహిత్యంలో తగు వ్యక్తీకరణ మివ్వడం భారతీయ రచయితల కర్తవ్యమని ప్రబోధించారు. భారతదేశ ప్రాచీన సంస్కృతి (classical culture) ఛిన్నాభిన్నమైపోయిన తర్వాత, భారతీయ సాహిత్యం జీవిత వాస్తవాలనుండి పలాయనం చిత్తగించి, ఆధ్యాత్మికతత్త్వంలోనూ భావ వాదంలోనూ తలదాచుకొని, మార్మిక భక్తితత్త్వములనూ, సెక్స్‌పట్ల గుప్తమైన సెంటిమెంటల్ వైఖరినీ, మనోభావనాత్మక చిత్తవృత్తినీ ఆడంబరంగా, అసహ్యంగా ప్రదర్శించడం అధికమై, హేతువాదం పూర్తిగా మృగ్యమై పోయిందని హెచ్చ రిస్తూ, మనదేశచరిత్రలో అత్యంతము విషాదకరమైన గడచిన రెండు శతాబ్దాలలో ఇటువంటి సాహిత్యం ముఖ్యంగా వెలువడిందని చెప్పి, మన సాహిత్యాన్ని పురో హితవర్గంనుంచీ, ఛాందసులైన పండిత ప్రకాండులనుంచీ, క్షీణదశకు చేరు కున్న ఇతర తరగతుల వారినుంచీ కాపాడి, కళలను ప్రజలకు చేరువగా తెచ్చి, వాటిలో జీవిత వాస్తవాలను ప్రతిబింబింపజేసి, వాటిని మనల్ని ఉజ్జ్వల భవిష్యత్తు వైపుకు గొనిపోయే బలీయమైన సాధనాలుగా రూపొందించాలని ఉద్బోధించింది. "భారతీయ రచయితలమైన మనం ఉత్తమ భారతీయ నాగరికతా సంప్రదాయా లకు వారసులం. మన దేశంలో ప్రతీప వాదాన్నీ, ప్రగతివిరోధ దృక్పథాన్నీ రాజకీయ ఆర్థిక సాంస్కృతిక రంగాలలో గట్టిగా ప్రతిఘటించాలి. దేశీయ విదే శీయ వనరుల సహాయంతో మన దేశాన్ని నూతన జీవితంవైపుకు గొనిపోయే ప్రతి సాధనాన్నీ సృజనాత్మక, వ్యాఖ్యానాత్మక రచనలద్వారా పెంపొందజేస్తాము. భారతదేశ నూతన సాహిత్యం మన అస్తిత్వానికి సంబంధించిన ప్రాథమిక సమ స్యలను స్పృశిస్తూ-అంటే ఆకలి, దారిద్ర్యం, సాంఘికంగా వెనుకబడినస్థితి, రాజకీయదాస్యం మొదలైన సమస్యలను చేపట్టి, ఆ సమస్యలను మనం బోధపరచు కునేందుకూ, అట్టి అవగాహనద్వారా మనం కార్యశీలురమయ్యేందుకూ మనకు స్ఫూర్తి నివ్వవలెనని మన ఆశయం. ఈ లక్ష్యాల సాధనకై దేశంలో భాషా

ప్రాతిపదికపై రచయితల సంఘాలను స్థాపించి, మహాసభలు జరిపి, పత్రికలు పుస్తకాలు ప్రచురించి, ఆవశ్యకమైన సాహిత్యాన్ని సృష్టించాలి." ఇదీ సుప్రసిద్ధమైన లండన్ మేనిఫెస్టో సారాంశం. దీనికిముందే పారిస్‌లో అంతర్జాతీయ అభ్యుదయ రచయితల సంస్థ స్థాపించబడింది.

ఆదే సంవత్సరం- అనగా 1935 డిసెంబరులో భారతీయ అభ్యుదయ రచయితల సంఘం అలహాబాదులో ఏర్పాటు చేయబడింది. దేశం మొత్తంనుంచి పలువురు రచయితలు వచ్చి ఒక మేనిఫెస్టోపై సంతకాలు చేశారు. ఈ మేనిఫెస్టోలో "మనలో నిస్తబ్ధతనూ నిష్క్రియతనూ, అంధ విశ్వాసాలనూ కలుగజేసే ప్రతిదానినీ మనం ప్రగతి నిరోధక మైనదిగా ఎంచి తిరస్కరిస్తాము. మన సాహిత్యాన్నీ కళలనూ ప్రతీపశక్తుల ప్రాబల్యంనుండి కాపాడి, వాటిని ప్రజలకు సన్నిహితంచేసి, వాటిలో జీవంపోసి, వాటికి వాస్తవికతను ఆపాదించి, ఈ యుగంలో యే ఉజ్జ్వల భవిష్యత్తు కొరకై మానవాళి పోరాటం జరుపుతూ ఉందో దానికి మార్గాన్ని సుకరం చేయడం మన ధ్యేయం." భారత స్వాతంత్ర్య సమరానికి చేయూతనివ్వడం, అభ్యుదయ రచయితలకు అవసరమైన భౌతిక, నైతిక సహాయాలను అందజేయడం, వారు తమ భావాలనూ ఆలోచనలనూ స్వేచ్ఛగా వ్యక్తీకరించే విషయంలో వారి హక్కులను పరిరక్షించడంకూడా ఈ సంఘం కర్తవ్యాలలో కొన్ని అని స్పష్టం చేశారు. ఈ మేనిఫెస్టోపై మున్షీ ప్రేమ్‌చంద్, రఘుపతి సహాయ్ ఫిరాఖ్, సుమిత్రానందన్ పంత్, నిరాలావంటి ప్రసిద్ధ రచయితలు కవులు, సంతకాలు చేశారు. 1936 ఏప్రిలులో ప్రసిద్ధ ఉర్దూ-హిందీ రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ అధ్యక్షతన ప్రథమ అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ లక్నోలో జరిగింది. ఆ మహాసభలో పీరి మేనిఫెస్టోను ఆమోదించారు. సజ్జాద్ జహీర్ ఈ సంఘం ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. సంఘం శాఖలు బెంగాలు, అస్సాం, పంజాబు ప్రాంతాలలో, అహమదాబాదు, బొంబాయి, హైదరాబాదు నగరాలలో నెలకొల్పబడ్డవి. రెండవ అ.భా.అ.ర. మహాసభ 1938లో కలకత్తాలో జరిగింది. ఇది రవీంద్రనాథ టాగూరు ప్రారంభోపన్యాసంతో మొదలైంది. టాగూరు అస్వస్థులుగా ఉండి రాలేకపోవడంచేత వారి ఉపన్యాసం సభలో చదవబడింది. ప్రత్యేకంగా హిందీ- ఉర్దూ అభ్యుదయ రచయితల మహాసభ అలహాబాదులో జరిగినా జవహరలాల్ నెహ్రూ అందులో ప్రసంగించారు. రవీంద్రుడు దానికి

సందేశం పంపారు. ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం 1943లో స్థాపించ బడింది. దీని ప్రథమ మహాసభ 1943 ఫిబ్రవరిలో తెనాలిలో తాపీ ధర్మారావు గారి అధ్యక్షతన జరిగింది. 1955 జూలైలో విజయవాడలో జరిగిన ఐదవ మహా సభకు శ్రీ శ్రీ అధ్యక్షత వహించారు.

అయితే, లండను మేనిఫెస్టో వెలువడక ముసుపే శ్రీ శ్రీ అభ్యుదయ కవిత్వం రచించాడు. అంటే ఆంధ్రకు సంబంధించినంతవరకూ అభ్యుదయ కవి ముందు పుట్టి ఆ తర్వాత చాలా ఏండ్లకు అభ్యుదయ కవిత్వోద్యమం వచ్చింది. శ్రీశ్రీ 1934 ఏప్రిలులోనే 'మహాప్రస్థానం' అనే శీర్షికతో 'మరో ప్రపంచం, మరో ప్రపంచం, మరో ప్రపంచం పిలిచింది, పదండి ముందుకు' అంటూ తెలుగు కవిత్వానికి పూర్తిగా కొత్తదైన గేయాన్ని రచించాడు ఇటువంటి నడకతో, ఇంతటి విప్లవ కంఠంతో శ్రీశ్రీకి పూర్వం బెంగాలులో కాజీ నజురుల్ ఇస్లాం గేయాలు రచించాడు. అతని 'బిద్రోహి' (తిరుగుబాటుదారు), 'అగ్నివీణ' గీతాలు ఈ ధోరణిలో ఉన్నాయి. నజురుల్ ఇస్లాం గీతాలు తన మనసులో ఏవో మారు మూలల్లో మోగుతూ ఉండి ఉండాలి అని శ్రీశ్రీ అంగీకరించాడు. తన ఆవేశానికి ప్రోద్బలాలు బరన్స్, అలెగ్జాండర్ బ్లాక్, ఎడ్గార్ అలెన్‌పో, గురజాడ అప్పారావు రచనలని కూడా ఆయన చెప్పుకున్నాడు. అయితే, శ్రీ శ్రీ 'మరో ప్రపంచం' పూర్తిగా స్వతంత్రగీతం. 1917 అక్టోబరు మహా విప్లవంతో ప్రపంచ ప్రప్ర థమ సోషలిస్టు సమాజాన్ని నెలకొల్పి, ఒకవంక తక్కిన ప్రపంచం ఆర్థిక మాంద్యంతో సతమతవుతూ ఉండగా తాను పంచవర్ష ప్రణాళికల ద్వారా తన ప్రజలందరికీ ఉత్తమ జీవితాన్ని సాధించిపెట్టిన సోవియట్ రష్యాయే ఈ గీతం లోని మరో ప్రపంచం. ఈ గీతంలోనే ఆ మరోప్రపంచపు అగ్నికిరీటపు ధగధగ లనూ, ఎర్రబావుటా నిగనిగలనూ ఆయన దర్శించి, మన కందరికీ కనబడ లేదా అని అడిగాడు. ఇట్లా శ్రీ శ్రీ ఒక్కడే ఆ 1930 దశాబ్దంలో అంతర్జాతీయ పరిస్థితిని అవలోకించి, ప్రగతిశీల దృక్పథంతో సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలన్న దృఢ సంకల్పంతో తన గొంతుక వినిపించాడు. "ప్రపంచం అంతటా అభివృద్ధిని కాంక్షించే కవుల స్వప్నాలు రష్యన్ విప్లవంతో ఆకృతిని ధరించడం నాకు కన బడింది. సామాజిక విప్లవానికి పురోగామిగా సాహిత్య విప్లవం సాగాలన్న దృఢ నిశ్చయం ఏర్పడింది" అని శ్రీశ్రీ ఒక సందర్భంలో అన్నాడు. 1937లో రచించిన 'ప్రతిజ్ఞ' అనే గేయంలో కార్మికుల కర్షకుల ఘర్మజలానికి విలువ

లేదనీ (పెట్టుబడిదారీ దోపిడీ విధానం వల్ల), అలాంటి పీడిత వర్గాల ఉద్ధరణకూ క్షేమానికీ తన రచనను అంకితం చేస్తాననీ శ్రీ శ్రీ ప్రతిజ్ఞ చేశాడు. 'వ్యధార్త జీవిత యథార్థ దృశ్యం పునాదిగా ఇక జనించబోయే భావి వేదముల జీవనాదములు' అన్నాడు. ఆ భావి వేదాలు అభ్యుదయ కవితలే. లండన్ నుంచి వచ్చిన అరతావు కంటె ఎక్కువ సైజులేని అభ్యుదయ రచయితల మేనిఫెస్టో తనపై చెరగనిముద్ర వేసిందనీ, దాని ప్రభావంతోనే ఈ 'ప్రతిజ్ఞ' అనే గేయం వ్రాశాననీ శ్రీశ్రీ అంగీకరించాడు. ('అనంతం'లో). ఆ మేనిఫెస్టో సారాంశమంతా ఈ గేయంలోదించేశాడని అబ్బూరి రామకృష్ణారావుగారు మెచ్చుకున్నారు. 1937 లోనే శ్రీశ్రీ "కవితా! ఓ కవితా" అనే ఖండిక వ్రాసి, మానవదర్శనము, భావనాశక్తి, భావతీవ్రతా అభ్యుదయ కవితలో ఎంత బరువుగా ఉత్కృష్టంగా ఉంటాయో చూపాడు. అటువంటి మాటలతో దృశ్యాలతో కవిత్వాన్ని అంతటి విప్లవధోరణిలో ఆమంత్రించిన గేయం భారతీయ భాషలలో వేరొకటి లేదు. 'దేశచరిత్రలు' అనే గేయం మార్క్స్ చేసిన గతితార్కిక భౌతికవాద దృష్టికి సుందరకావ్యరూపం. ఏ నాగరికతలోనైనా చూడవలసింది సామాన్యుని జీవన మెటువంటిది అని ఈ కవి చెప్పాడు. 'మహాప్రస్థానం'లోని కావ్యఖండికలన్నీ దాదాపుగా - 1940 లోపల వ్రాసినవి. కాని, ఇవి పుస్తకంగా 1950 లో మాత్రమే వచ్చాయి. ఒక్క అభ్యుదయ కవితాయుగంలోనే కాదు, తరువాత వచ్చిన ఏ కవితా యుగంలోనూ ఇంత శక్తిమంతమైన కావ్యసంపుటి రాలేదు. దీనిని తలచుకుంటే 'నభూతో నభవిష్యతి' అనిపించకపోదు. ఈ అద్భుతానికి కారణం రష్యాలో ఒక మహా విప్లవం ఫలితంగా ఏర్పడ్డ నవసమాజం కలిగించిన ప్రేరణయే కదా! ఇదికాక, మరికొన్ని విషయాలను ఆరుద్ర చెప్పారు:

"....గురజాడ అప్పారావు సాక్షాత్కరించాడు. అప్పు డతని సమస్యల పరిష్కారం అవగాహనమయింది. ప్రజలకు అందుబాటులో ఉండే, ప్రజలను ముందుకు తీసుకుపోయే రచనలు సాగించు అని అనుభవం బోధపరచింది. శ్రీశ్రీ ముత్యాల సరాల మీద తీవ్ర కృషి చేశాడు. సమాజంలోని దేశి కవితలని జాగ్రత్తగా విన్నాడు. ప్రజల బ్రతుకులలో అదివరకే మెదలుతున్న 'ప్రబల చలన' గమనిస్తూ వచ్చాడు. 'అనామధేయ కవులకి అభివాదాలు సమర్పించాడు. 'పాటకపు మహాజనుల పాటల లోని ప్రాణవాయువుల్ని' పీల్చుకున్నాడు. 'రోజురోజుకీ రకరకాల ఛందస్సులు అతనికి తమ రహస్యాలు బోధిస్తూ వచ్చాయి. వాటివాటి గమనంలో సమాజ

జీవిత గమనం స్ఫురింపజెయ్యా'లని అతడు మథన పడ్డాడు ..........కాలం అతనికి కావ్యవస్తువుని పరిపక్వం చేసింది. ఆ సమయానికే శ్రీశ్రీ తన సంవిధానం అనే ఆయుధాన్ని సానపట్టి సిద్ధంగా ఉన్నాడు. దీని ఫలితమే 'మహాప్రస్థానం' కావ్య సంపుటి."[2]

శ్రీశ్రీ తన ఈ సంపుటికి ముందుమాట వ్రాయమని చలంగారిని అడగడం మరొక అద్భుతం. చలం వచన రచయిత. ఎవరినైనా ఒక కవిని, లేక గతి తార్కిక భౌతికవాదంలో నిష్ణాతుడైన మేధావిని అడిగి ఉండవచ్చే! బహుశా ఒకందుకు శ్రీశ్రీ ఇలా వ్రాయించి ఉంటాడని అనుకుంటాను. చలం ఆనాటికి సంఘంపై తిరుగుబాటుదారుగా స్థిరయశస్సు నార్జించుకున్నాడు. అందులోనూ రొమాంటిక్ అయిన తిరుగుబాటుదారు. అయితే భావకవులు చెప్పేదానికి అర్థం వెదకడం అవివేకమని అప్పటికే చలం విసుగుచెంది, అంతవరకూ ఉన్న శబ్దసౌందర్యంతో తృప్తిపడవలసిందే అనుకున్నాడు. రెండవ కారణం చలం వచనం నిండా కవిత్వమేనని శ్రీశ్రీ గమనించాడు. తన కవిత్వాన్ని అనుభవించి వ్రాయమన్నాడు. "నూతన యుగ నిర్మాతలకి బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ కింద, మార్చింగ్ బ్యాండ్ కింద కొత్త రక్తాన్ని కదను తొక్కించే సంగీతం వినపట్టం లేదా శ్రీశ్రీ గీతాల్లో?" అని ప్రశ్నిస్తూ చలం యోగ్యతాపత్రమిచ్చాడు! "మానవ జాతిని ఉద్ధరించడానికి కొత్త మతాన్ని కనిపెట్టిన ప్రవక్త, ఉషాగమాన్ని గుర్తించి స్వాగతమిచ్చే వైతాళికుడు శ్రీశ్రీ. తెలుగు కవిత్వాన్ని ఖండించి, దీవించి, ఊగించి, శాసించి, రక్షించే అపూర్వశక్తి మీ చేతులో పుస్తకం"[3] అనికూడా చలం అభిప్రాయ పడ్డాడు. ఆ శక్తి అభ్యుదయ రచయితల చేతుల్లో శాశ్వతంగా ఉండే అపూర్వ శక్తి. "సమగ్ర భారతంలో చూసినా ఇంత తెలుగు మీరిన గేయాలు ఎన్ని వున్నాయి? అని అడుగుతున్నాను. నజరుల్ ఇస్లామ్ అగ్నివీణలోని 'విద్రోహి' 'జగన్నాథుని రథచక్రాలు' ముందు ఏపాటి? జగన్నాథ రథచక్రాలు విప్లవానికి సాంకేతికాలు. జర్మన్ సాహిత్యంలో ఇవి విధ్వంసక చిహ్నాలుగా స్వీకరించ

2. శ్రీశ్రీ సన్మాన సంచిక, ఫిబ్రవరి 1, 1970, విశాఖపట్నం.
3. చలం 'యోగ్యతా పత్రం'లో.

బడ్డాయి"[4] అని పురిపండా అప్పల స్వామి అన్నారు. ఉర్దూలోనే లేవు ఇటువంటి గీతాలు. మఖ్దూం మొహియుద్దీన్ 'సుర్ఖెసవేరా'లో కూడా ఈ త్రేతాగ్నులు లేవు.

తెలుగులో అభ్యుదయ కవిత్వానికి శ్రీశ్రీ తెచ్చిన విశేషాలు ఇవి :- అంతర్జాతీయ దృష్టి; మహోన్నతమైన మరో ప్రపంచ భావన; మానవుణ్ణి అవిభక్త కుటుంబిగా, ఏకరక్త బంధువుగా భావించడం; కాలానుగుణంగా వచ్చిన సామాజిక పరివర్తనలను ఆకళింపు చేసుకొని, మార్క్స్ సిద్ధాంతాలచే ప్రభావితుడై, మార్క్స్ ప్రవచించిన కార్మికజన ప్రభుత్వాన్ని క్రాంత దర్శకత్వంతో కాంచగలిగి, కావ్యవస్తువులో మార్పు తెచ్చి, తన తరువాతి వారికి నూతన కావ్య వస్తు మార్గాన్ని తీర్చి దిద్ది, కొత్త సిద్ధాంతాలు కొత్త ఆదర్శ లోకాలు, అభ్యుదయ పథాలు చూపి, తెలుగులో అభ్యుదయ కవిత్వ యుగానికి శ్రీకారం చుట్టి, రచన విషయంలో శబ్ద శక్తినీ శిల్ప కౌశలాన్నీ పలురీతులలో గేయం నడకనూ 'శ్రీశ్రీ మార్కు పద్యాలనూ' వ్రాసి చూపడం. "ఈ యుగపురుషుడు ఎందుచేతనో సోషలిస్టు సమాజాన్ని వర్ణించలేదు. అందుకు సిద్ధం కండని ఆంధ్రులకు పిలుపు ఇచ్చాడు"[5]. అని డా॥ వుప్పల లక్ష్మణరావు అన్నారు. ఆ పని ఇతరులు చేయవచ్చు. యుగకర్త పని దిశను చూపడం.

ఇక అభ్యుదయ కవిత్వ లక్షణం, ఈ రచయితల లక్ష్యం విషయంలో యుగకర్త శ్రీశ్రీ భావాలను గమనించటం అవసరం. "కొద్దిమంది తమ చేతుల్లో పెట్టుకొని ఉన్న సిరిసంపదలు, విజ్ఞానం అశేషజన సముదాయానికి అందుబాటులో ఉండేటట్టు చేసి, సామాజిక జీవితాన్ని సుఖమయము శుభకరము చేయాలనీ, భూతలాన్ని స్వర్గంగా మార్చాలనీ ఈ దృక్పథం.... వడివడిగా ప్రజలందరినీ ముందుకు నడిపించే కవిత్వం వ్రాయాలి. సంఘాన్ని ముందుకు నడిపించడమే విప్లవ పంథా, అభ్యుదయ రీతి"[6] మరి సాహిత్యం ఎటువంటి వస్తువు అన్న

4. 'మంజీర'-తెలంగాణా రచయితల సంఘం ప్రథమ వార్షికోత్సవ సంచిక, హైదరాబాదు, 1953.
5. 'సాహిత్యాభ్యుదయం', శ్రీశ్రీ స్మారక సంస్థ; ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ, హైదరాబాదు, 1985.
6. 'అభ్యుదయ', సంపుటి 1, సంచిక 1.

ప్రశ్నకు "సాహిత్యాన్ని ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథం మీద అభ్యుదయ రచయితలు తిరగబడుతున్నారు....రచయితనీ, రాజకీయవాదినీ జీవితమే ఉద్బోధిస్తుంది"[7] అని కూడా ఆయన అన్నారు. మరి అభ్యుదయ రచనకు గీటు రాయి ఏమిటి? అన్న ప్రశ్నకు జవాబుగా "సాంఘిక ప్రయోజనం- అదే అభ్యుదయ రచయితల లక్ష్యం. ఏ రచన అయినా అది మనల్ని ఎటువైపుకి తీసుకు వెళ్తోంది, ఎక్కడికి చేరుస్తుంది అన్నదే గీటురాయి. ....మనం కోరేది అందరికీ తిండి, అందరికీ వసతి, అందరికీ పని. పరస్పర విరుద్ధ భావాల సంఘర్షణలోనే జీవితం పురోగమిస్తుంది. అది సాహిత్యంలో కూడా ప్రతిఫలిస్తుంది. ఆ సంఘర్షణని చిత్రిస్తూ, అలా పురోగమనానికి దారితీసే సాహిత్యాన్ని సృష్టించడమే అభ్యుదయ రచయితల ధ్యేయం.... ఒక వ్యక్తి ఇంకొక వ్యక్తిని దోచుకోవలసిన అగత్యం విలుప్తమై, అందరూ ఆనందమయ జీవితం గడిపి, అటువంటి విధానంలోనే మానవత్వం విశాలంగా వికసిస్తుందని విశ్వసించేవాళ్ళూ, అట్టి విశ్వాసానికి తమ రచనల్లో దోహదమిచ్చేవాళ్ళూ పరిస్థితుల మార్పుని ఆహ్వానిస్తారు.... మానవుణ్ణి వెనక్కి చిగలాగే శక్తులున్నాయి. వాటి స్వభావాన్ని గుర్తించి అడుగడుగునా వాటిని ప్రతిఘటించాలి. ఆధునిక విజ్ఞానం అందరికీ అందుబాటులోకి వచ్చేట్టు కృషి చేయాలి. విభిన్న భావాల సంఘర్షణలో తాటస్థ్యానికి తావులేదు."[8]

అభ్యుదయ కవితోద్యమానికి పుష్టినిచ్చిన కొందరు కవులను ప్రస్తావించవలసి ఉన్నది. శ్రీశ్రీ తన తరువాతివారు తన స్థాయిలో వ్రాయలేనివిధంగా వ్రాశాడని ప్రతీతి. ఆయన ఈ పంథాను సంపన్నం చేసిన ప్రతిభావంతులైన వారెందరో ఉన్నారు. వీరిలో ఎవరి గొంతుక వారిది. వీరంతా తమతమ పాత్రలు నిర్వహించవలసి ఉండటంచేత ఈ మార్గాన్ని అనుసరించారని మనం అనుకునే విధంగా ఒక్కొక్కరు ఒక ప్రత్యేక ఫక్కీలో రచనలు చేశారు. శ్రీరంగం

7. అభ్యుదయ రచయితల సంఘం తృతీయ మహాసభలో (1946) శ్రీశ్రీ ప్రసంగం.
8. అయిదవ ఆంధ్ర అభ్యుదయ రచయితల మహాసభలో (1955) శ్రీశ్రీ అధ్యక్షోపన్యాసం.

నారాయణబాబు ఇమేజిజం, సర్రియలిజం మొదలైనవాటిలో సాముచేసినా అభ్యుదయ కవిగానూ గణించదగినవాడు. 'రుధిరజ్యోతిర్జ్వలలనా ప్రియుండ, విప్లవ రుషిని, విద్రోహిని' అని తనగూర్చి తాను చెప్పుకున్నాడు. కుళ్ళి కంపుకొడుతూ ఉన్న సంఘాల్ని ఎంతో బాధగా, గుండె లోతుల్లోంచి చీల్చుకువచ్చిందానిలా వ్రాశాడు. 'పాతాళమ్మున పతితులు పలవించే మాటల జిలిబిలి తేటల చీకటి గుండె కదల్చే జాలిపాట పాడమంచి'ట ఎడద!

దాశరథి తెలంగాణాలో ఒక అభ్యుదయ ఉద్యమం. 'నా తెలంగాణ కోటి రతనాలవీణ' అంటూ మూగవోయిన కోటిమంది తెలుగుల గళ ధ్వనిని విని పించాడు. పద్యంలో, గేయంలో, వచనకవితలో అభ్యుదయ రచనలు చేశాడు. పునర్నవం, మస్తిష్కంలో లెబొరేటరీవంటి వీరి కావ్యఖండికలు గాఢమైన వీరి ప్రతిభకు నిదర్శనములు. నిజామును గద్దె దింపేందుకు సాగిన భీషణ సమరంలో వీరి గేయాలూ పద్యాలూ అమేయమైన పాత్రవహించాయి. మహాంధ్రోదయంకోసం కావ్యం వ్రాశారు. ఆవేశంతో ఉద్యమంలోకి ఉరికి అగ్నిధారలు కురిపించి రుద్ర వీణలు పలికించిన కవి. హింసా జీవనం, హింసా సాధనం దుష్పరిణామాలకు దారితీస్తాయంటారు.

నయాగరా కవులలో ఒకరైన కుందుర్తి శ్రీశ్రీ కవిత్వంచే ప్రభావితుడై పాత మార్గాన్నీ విశ్వనాధవారి శిష్యరికాన్నీ వదిలేసి, వర్గపోరాటం ద్వారానే సమసమాజ స్థాపన సాధ్యమని విశ్వసించి, అభ్యుదయ కవిత్వం వ్రాశాడు. ఈయన కవిత్వంలో సంస్కృత పదాడంబరము, ఆంగ్ల పదాల ప్రయోగాలు పాఠకుని తికమక పెట్టవు. భావనలో సామాన్యుని జీవితవలయాలు దాటిపోడు. వచన కవితకు ఈయన ఆద్యుడు కాకపోయినప్పటికీ, ఫ్రీవర్స్‌ఫ్రంట్‌ను స్థాపించి దానిని ఒక ఉద్యమంగా నడిపాడు. వచన కవితలో కథా కావ్యాల ఆవశ్యకతనుగూర్చి పదేపదే చెప్పాడు. అభ్యుదయ కవిత్వంలో మొదటవచ్చిన సంపుటి 'నయాగరా' (1944). 'మహాప్రస్థానం' 1950లో అచ్చు అయింది. బెల్లంకొండ రామదాసు, ఏల్చూరి సుబ్రహ్మణ్యం అభ్యుదయ కవిత్వం వ్రాసిన వారిలో పేర్కొనదగినవారు. ఈ ముగ్గురూ నయాగరా కవులుగా ప్రసిద్ధులై యువకులకు మార్గం చూపారు.

తమ కవిత్వం నయాగరా జలపాతమంత తీవ్రంగా, ఉధృతంగా ఉండా లని ఈ నయాగరా కవుల ఆకాంక్ష. ఆవేశం కుమ్మరించడమే కవిత్వం అనే వాదం వీరిది. ఎర్ర జండా నాయకత్వాన ఈ సమాజ వ్యవస్థ మారాలన్నదే వీరి కవితా సందేశం. ఈ కవులలో ముఖ్యుడైన కుందుర్తిని ఎర్నెస్ట్ టొలర్ అనే జర్మన్ ఎక్స్‌ప్రెషనిస్ట్ రచయిత చాలా ఆకర్షించాడు. రష్యాలో విప్లవం రాక మునుపే టొలర్ జర్మనీలో బవేరియన్ సోషలిస్టు రిపబ్లిక్ స్థాపించి దానికి అధ్యక్షు డైనాడు. అతని స్వీయ చరిత్రను కుందుర్తి తెలుగులోకి అనువదించాడు. నయా గరా కవులకు టొలర్ ఆరాధ్యుడు. ప్రజా బాహుళ్యాన్ని పేదరికంనుంచి ఉద్ధ రిస్తామన్న కమ్యూనిష్టుల కరుణావాదం వీరిని ఆకర్షించింది. వీరి కావ్యవస్తువులు చైతన్యవంతమైన ప్రజోద్యమాలకు సంబంధించినవి. ఈరీత్యా వీరు సుదృఢమైన అభ్యుదయకవులు. అభ్యుదయ కవిత్వం పూర్తిగా ఆవేశాత్మకం అని విశ్వసించిన వీరు పోనుపోను ఆలోచనాత్మక కవిత్వంకూడా వ్రాశారు.

ఆరుద్ర టెక్నిక్‌కు ప్రాధాన్యమిచ్చిన కవి. సంకేతాంతో రెంగాణాను గూర్చి ఈయన వ్రాసిన "త్వమేవాహం" కావ్యం టి.యస్. ఇలియట్ 'వేస్ట్ ల్యాండ్' కన్నా హెచ్చు ప్రతిభను ప్రదర్శించింది. వైచిత్రీ ప్రియత్వం, అభి వ్యక్తిలో కౌశలము, భావనలో అభ్యుదయ లక్షణం, నవ్యత ఈయన ప్రత్యేక తలు. విభిన్న రంగాలలో అభిరుచి కల మేధావి. పరిశోధకుడుగా, సాహిత్య చరిత్రకారుడుగా గొప్ప కృషి చేశాడు.

సోమసుందర్ ఎన్నదగిన కవి. భావ కవిత్వపు ఛాయలతోనే అభ్యుదయ కవిత్వోద్యమంలోకి వచ్చినవాడు. కాని, అభ్యుదయ కవిగా ఈయన చేసిన రచనలు ఈ సాహిత్యోద్యమానికి చాలా పుష్టి కలుగజేశాయి. మంచి సుసంస్కృ తమైన వాక్కు. పదగుంభనం ఎక్కువ. అభివ్యక్తిలో అతివ్యాప్తి కల్పించినా చదవడానికి బాగుంటాయి ఈయన కావ్యాలు. తెలంగాణానుగూర్చి 'వజ్రాయుధం' కావ్యం వ్రాశాడు. 'కబడ్దార్ నైజాం పాదుషాహే' అని హెచ్చరించాడు. సామ్య వాదంపై అచంచల విశ్వాసం కలవాడు. అభ్యుదయ కవిత్వానికి మంచివ్యాఖ్యాత. ఎందరో నవకవులకు ప్రాణమిత్రుడు.

[illegible] రంగనేని కమ్యూనిస్టు ఉద్యమంలో స్వయంగా పాల్గొని [illegible] కవిత్వం వ్రాశాడు. [illegible]హాత్యలు అబద్ధాలమధ్య జూలువిప్పి తూటుపువ్వు కొండ [illegible]

పులిపంజా వంటి ఎండ', 'కొరవివంటి ఎర్రని పిడికిలి' వంటివి ఈయన కవిత్వములో తీక్ష్ణమైన ఒక వాతావరణాన్ని ప్రవేశపెట్టాయి.

రెంటాల గోపాలకృష్ణ మంచి భాషా ప్రయోగంతో గేయం పోకడలో చక్కని గమనం, ప్రబలమైన ఉద్వేగం స్ఫురింపజేశాడు.

ఆనిసెట్టి సుబ్బారావు అభ్యుదయ భావ బంధురమైన రచనలు చేశాడు. ఈయన 'అగ్నివీణ' పాఠకుల నెంతో ప్రభావితం చేసింది. అభ్యుదయ దృక్పథంతో గేయాలే కాక కథలు కూడా రచించాడు.

రమణారెడ్డి అభ్యుదయ కావ్యరీతులపై నిశితమూ సమగ్రమూ అయిన దృష్టి కలవాడు. ఈయన కావ్య సంపుటి 'అడవి' వర్తమాన కాలంలో మానవ జీవితం ఎలా వుందో చెబుతుంది. అభ్యుదయ కవిత్వానికి భాష్యకారుడుగా, సుప్రసిద్ధుడు శ్రీశ్రీ సాహిత్యాన్నంతటినీ ప్రోగుచేసి సంపాదకుడుగా మంచి పరిచయాలతో దానిని కూర్చిన ఖ్యాతి ఈయనకు దక్కింది.

తెలంగాణా ప్రప్రథమ ప్రజాకవిగా ప్రసిద్ధికెక్కిన కాళోజీ నారాయణరావు చిన్నచిన్న మాటలతో గేయాలు వ్రాసి ప్రజలకు ఉత్తేజం కలిగించి నిరంకుశ నిజాం ప్రభుత్వానికి గొప్ప ఉపద్రవకారుడయ్యాడు. 'ప్రజాశక్తిపై పంతంగట్టిన ప్రభుత్వ మేపాటిగ నిల్చున్' అని సవాలు చేసిన మహావీరుడు. ఈయన 'నా గొడవ' సమకాలిక జీవితంపై వ్యంగ్య వైభవంతో రచించిన బృహద్ వ్యాఖ్య. 'అన్నపురాసులు ఒకచోట, ఆకలి మంటలు ఒకచోట' అంటూ 'కుటిలమతులు, దేబెమొగాలు, జగతిలో రెండే రెండు రకాలు' అని తీర్పునిస్తూ నేటి వ్యవస్థను చిత్రించాడు. సామ్యవాది కాడు, స్వతంత్రుడైన కవి. శ్రీశ్రీ ఈయనను ఫ్రెంచి కవి లూయీ ఆరగాన్‌తో పోల్చాడు. యుద్ధంలో ఫ్రెంచి కవులంతా చెల్లాచెదురై పోతే ఆరగాన్ ఒక్కడే దేశంలో నిలబడి మహాప్రజా విశ్వాసాన్ని వెల్లడించే రచనలు చేశాడు. కాళోజీకూడా అలాగే చేసి తెలంగాణా ప్రజానమరానికి వెలుగునిచ్చాడు.

తనది మార్క్సిస్టు దృక్పథం కాకపోయినప్పటికీ 'ఆర్తగీతం' 'ప్రార్థన' మొదలైన అనేక కావ్యఖండికలలో దీనుల అవస్థను చూచి బాలగంగాధర తిలక్

స్పందించిన వైనం చిరస్మరణీయమైంది. 'ఒక్క నిరుపేద ఉన్నంతవరకు, ఒక ప్రేగు ఆకలితో కనలినంతవరకు, నాకు శాంతి కలుగ దింక నేస్తం' అన్న కవి అభ్యుదయవాది కాకుండా ఎలాపోతాడు? అయితే 'పులి చంపిన లేడి నెత్తురును పుబముకోలేను' అని అన్నాడీయన. ఈయనది కరుణ దృక్పథం. అన్ని మార్గాలకు చెందిన కవులు, చివరకు విప్లవ కవులు సైతం తిలక్ కావ్యరచనా ప్రతిభకు ముగ్ధులయ్యారు.

అభ్యుదయ కవితోద్యమంలో ఇంకా పురిపండా అప్పలస్వామి, అజంతా, సి. నారాయణరెడ్డి, కవిరాజమూర్తి, నార్ల చిరంజీవి, రాంషా, వాసిరెడ్డి, సుంకర, ప్రయాగ, నారపరెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, పులుపుల వెంకటశివయ్య, వేములపల్లి శ్రీకృష్ణ, మాదిరాజు రంగారావు, ధనకుధరం, తుమ్మల వెంకటరామయ్య మున్నగు వారెందరో పేర్కొనవలసిన వారున్నారు. తుమ్మల అభ్యుదయ రచయితల సంఘం వ్యవస్థను చక్కగా విశాల ప్రాతిపదికపై నిర్మించడానికి చేసిన కృషి ప్రశంసనీయమైనది.

అభ్యుదయ కవిత్వంలో పరిణామ దశలు ఏమైనా ఉన్నాయా? మహాప్రస్థానం గీతాలు రచించిన శ్రీశ్రీ అధివాస్తవిక, ప్రతిబింబ, ప్రతివాద ధోరణులలో కవిత్వం వ్రాశాడు. శబ్ద చమత్కారాలు చూపుతూ పలు తరహాల కవిత్వాలు వ్రాశాడు. అవన్నీ అభ్యుదయ కవిత్వం కాదు. కవిత్వంలో ప్రయోగాలు చేయడంపై ఆయనకు మోజు హెచ్చు. ఆధునిక కాలంలో పాశ్చాత్య దేశాలలో కవిత్వ విషయకంగా వచ్చిన చిత్రవిచిత్ర ధోరణులను ఆయన ఎప్పటికప్పుడు అధ్యయనం చేస్తూ ఉండేవాడు. ప్రయోగశీలి కావడంచేత వాటిలో కొన్నింటిని అనుసరిస్తూ, కొన్నింటిని అనువదిస్తూ అనేక విధాల కవిత్వాలను వ్రాసి, వాటిని తెలుగువారికి పరిచయం చేశాడు. వీటిని చదివిన పాఠకులు కొంత ఆహ్లాదం పొందారు కూడా. కొందరి బుద్ధికి పదును పెట్టినట్లయింది. ప్రాస క్రీడలు వంటివాటిని పాఠకులు ఆదరించారు. అయితే శ్రీశ్రీ కొన్ని అనభిలషణీయమైన పోకడలు పోయినప్పుడు వాటిని ఏవగించుకున్నారు. ఏమైనా ప్రవృత్తితో ఈయన వ్రాసిన అధిక్షేప కవిత్వం సంఘానికి మేలే చేసింది. ఉదాహరణకు 'విషాదాంధ్ర' వంటివి.

మరొక పరిణామం కన్పిస్తున్నది. శ్రీశ్రీ అంతర్జాతీయ పరిస్థితులను మాత్రమే తన కవితలలో స్పృశింపగా, నయాగరా కవులు మానవ్యం విశ్వవ్యాప్తిని,

ఇతర కవులు ఇంకా సమీప సంఘటనలకూ, పరిస్థితులనూ తమ కావ్యాలలో చిత్రించారు. ఇది ఆయా కవుల ఇతివృత్త అవసరాలనుబట్టీ, అభినివేశాన్నిబట్టీ ఉంటుంది. ఆధునిక కవిత్వంలో ఇంత పెద్ద విప్లవాన్ని తెచ్చిన శ్రీశ్రీ తెలంగాణా సాయుధ పోరాటానికి స్పందించలేదన్న అభియోగం ఒకటి ఉంది. నిజమే, ఆయన వ్రాయలేదు. అయినా ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి తెలంగాణాపై మొత్తం మూడు కావ్యాలు తీసుకొచ్చారు. మూడూ ఉత్తమమైనవి. పోతే, ఎమర్జెన్సీ కాలంలో శ్రీశ్రీ కంఠం మూగవోయిందని కొందన్నారు. శ్రీశ్రీ విప్లవ తత్త్వాన్ని ప్రధానంగా పట్టించుకున్న విశ్వస్థాయికి చెందిన కవి. స్థానిక దురంతాలనూ అన్యాయాలనూ వస్తువులుగా స్వీకరించపోయి ఉండవచ్చు. కొంపెల్ల జనార్దన రావును గూర్చి మంచి కవిత వ్రాసి ఉండవచ్చు. ఆంధ్రలో మంచి ప్రాబల్యం గల కమ్యూనిస్టు కార్యకర్త మరణంపై వ్రాసి ఉండకపోవచ్చు. అయితే లోపం లోపంగానే ఉండిపోతుంది.

మరొక పరిణామం కూడా కన్పిస్తున్నది. మహాప్రస్థానంలోనూ, మరి కొందరు అభ్యుదయ కవులలోనూ సంస్కృత పదజాలం ప్రబలంగా కన్పిస్తుంది. కాని, పోను పోను ఇది తగ్గింది. సామాన్య వ్యావహారిక భాషలో ఎందరో మంచి గేయాలు వ్రాశారు. వృత్తాలలో, ఇతర ఛందస్సులలో అభ్యుదయ కవిత్వం వ్రాసిన దాశరథి 'పునర్నవం' లో ఫ్రీవర్స్‌లో చాలా శక్తిమంతమైన ఖండికలు వ్రాసి ఒక కొత్త రీతిని చూపెట్టాడు. కుందుర్తి అయితే సామాన్యుని అభ్యుదయ కవిగా ప్రస్తుతింపబడ్డాడు. ఆయన చివరిదశలో వ్రాసిన రచనలు ఏ మాత్రం క్లిష్టత లేకుండా సాదాగా సరళంగా, చదువురానివారుసైతం విని ఆనందించేట్టుగా ఉండేవి. అభ్యుదయ యుగంలో మనం చూచే ఇంకొక పరిణామం సామాజిక చైతన్యంతో విప్లవ దృక్పథంతో బుర్రకథలు వ్రాయబడటం. ఇది ప్రజలలో బాగా వ్యాప్తి కూడా చెందాయి. ఇకపోతే భాషా విషయకంగా చూస్తే గ్రాంథిక భాషకు శాశ్వతంగా ఉద్వాసన చెప్పి, "గణబద్ధ ఛందస్సుల ఫ్యూడలిజం నడ్డి విరగ్గొట్టి, మాత్రాబద్ధ ఛందస్సుల ప్రజాస్వామ్యాన్ని స్థాపించడమే" గాక, వ్యావహారిక భాషలో వచన పద్యాలు ఒకవైపు వ్యాప్తం చేయబడగా, మరొక వైపు అభ్యుదయ కవులలో కొందరు వ్యక్తీకరణ విషయంలో ప్రతీకలతో కొత్త సంవిధానంతో అన్వయ క్లిష్టతతో కావ్యాలు వ్రాశారు. ఇవి కొరుకుడు పడనివై పోయాయి. తమ ప్రత్యేకతను నిరూపించుకోవడానికి ప్రతి యుగంలో కవులు

ఇలా చేయడం పరిపాటి. అయితే అభ్యుదయ కవి తాను చెప్పే విధానం పాఠకులకు గ్రాహ్యమవుతుందా కాదా అని ఆలోచించవలసిన అగత్యమున్నది. ఎందుచేతనంటే, అతడు కేవలం మేధావులూ, సర్వజ్ఞులూ అయిన వారికోసమే కవిత్వం వ్రాయడు. ఈ అంశాన్ని చాలా మంది అభ్యుదయ కవులు దృష్టిలో ఉంచుకొని కావ్యరచన చేశారు. విద్యాధికులలోనే కాక, పత్రిక చదవడం వచ్చిన ఒక మాదిరి విద్యావంతులలో సైతం అభ్యుదయ కవిత్వం వ్యాప్తి చెందిందని నిరూపితమైంది. మరొక విషయం. అభ్యుదయ కవిత్వం కేవలం సామ్యవాదాన్ని ప్రచారం చేయడం కోసం వ్రాసిన కవిత్వం కాదు. వ్యక్తిగతంగా ఈ కొత్త దృక్పథం ఏర్పడ్డ ఒక్కొక్క కవి తనదైన ఒక శైలిలో తన కావ్య రచనా ప్రతిభను ప్రదర్శించవలెనన్న ఆశయంతోనే కవిత్వం వ్రాశారు. చాలా రచనల్లో కవిత్వపు పాలు బాగానే ఉంది. పతితలు బోధపరచుకున్నారు కూడా. వ్యంగమూ శాపాలూ ఉన్నా, ఈ యుగంలో కవితారచన చాలా మేరకు ఉదాత్తంగా సాగింది. ఉద్యమంలో యమబాధ లనుభవించి వ్రాసినవారు సైతం నిప్పులు చెరుగుతూనే సంయమనం పాటించారు.

ఇక అభ్యుదయ కవిత్వ తత్త్వమేమిటో పరిశీలించుతాను. పైన ఉదాహరించిన శ్రీశ్రీ అభిప్రాయాలవల్ల మనకు దీని తత్త్వం కొంత అవగతమవుతూ ఉంది. అభ్యుదయ కవితా ప్రస్థానానికి గతితార్కిక భౌతికవాద దృక్పథం ప్రధాన ప్రేరకం. వర్గ సంఘర్షణకు మూల కారణాన్ని తన భౌతిక తత్త్వ విచారణచే మార్క్స్ కనుగొన్నాడు. వర్గ భేదాల నిర్మూలనం కార్మిక కర్షకుల శ్రేయస్సుకు దోహదకారి అన్న విశ్వాసం కవికి కలిగి తదభిముఖ ప్రవర్తనకు ప్రేరకంగా రచనలు బయలుదేరాలి. అంటే వర్గ రహిత సమాజం ఆవిర్భావాన్ని అభిలషించడం అభ్యుదయ కవిత్వం (సాహిత్యం) యొక్క ముఖ్య లక్షణం. సంఘానికీ సాహిత్యానికీ అవినాభావ సంబంధం ఉంది. మరి సంఘం మనుగడకు ఆర్థిక వ్యవస్థ పునాది. అటువంటప్పుడు సాహిత్యానికి కూడా ఆర్థికాంశాలే తప్పనిసరిగా పునాది కావాలి. కళలన్నిటితోపాటు సాహిత్యమూ ఇంతవరకూ ధనిక వర్గపు విలాసవస్తువుగా ఉంది. ఈ వ్యవస్థను మార్చాలనుకున్నప్పుడు సాహిత్యం సమాజంకోసం నడుం కట్టాలి. కార్మిక కర్షకుల శ్రేయస్సుకు అంకితం కావాలి. ఈ రీత్యా అభ్యుదయ రచయితలకు మార్క్స్ సిద్ధాంతం అవశ్యం అనుసరణీయమవుతున్నది. కళకోసం కళ అనే సిద్ధాంతానికిక్కడ తావులేదు.

కళాకారుడూ కవీ కార్మికుల నాయకులై నిలవాలి. కాబట్టే బాధాసరప్రదష్టులనే అభ్యుదయ కవి ప్రధానంగా స్వీకరించాడు. పీడననుంచే సమాజానికీ, కళాకారు నికీ ప్రేరకశక్తిగా అభ్యుదయ రచనలు ఉపకరిస్తాయి. మనిషి మీదా, అతని మహోజ్జ్వల భవిష్యత్తుమీదా కల విశ్వాసం అభ్యుదయ కవితకు ప్రేరకమూ ప్రచాలకమూ కాబట్టి, మానవ జీవితంతో నిత్య సంబంధం కలిగి ఉండటమే అభ్యుదయ కవిత్వ ముఖ్య లక్షణం. కనుకనే సోషలిస్టిక్ రియలిజమ్ (సామ్య వాద వాస్తవికత) అనే సిద్ధాంతం బయలుదేరింది. దీనికి మూల విరాట్టు మార్క్స్ మహాశయుడైనప్పటికీ నాయకుడు గోర్కీ.

ఈ వాస్తవికత ఉద్దేశించేది సుసంఘటితమైన సామాజిక శక్తి. ఆ శక్తి సకలవిధములైన అభ్యుదయములను సాధించుకోగలదని సాంఘిక రాజకీయ ఆర్థిక పారిశ్రామిక విప్లవాలు ఆధునిక మానవునికి విశ్వాసం కలుగజేశాయి. అంతేకాని దేవుడో లేక మరి యే అతీత శక్తియో అందరినీ ఉద్ధరింపవని కవి నమ్మిక కాబట్టే అభ్యుదయ కవితాయుగంలో దేవుడు, మతం, మూఢవిశ్వాసాలు, పాప పుణ్యాలువంటి పాత విలువలమీద తిరగబడటం జరిగింది. అలాగే శుద్ధ కాల్పనిక ఆవేగాన్ని నిరాకరించి, వాస్తవికతనూ ప్రయోజనాత్మకతనూ నిరూపించడం జరి గింది. తన అంతరంగంలో జ్యోతిస్సుకూ తమస్సుకూ జరిగే సంఘర్షణను కవి క్రాంతదర్శిగా దర్శిస్తాడు. తన అంతర్వేదనను కవితారూపంలో వ్యక్తీకరిస్తాడు. ఈ పరిణామంలో వైరుధ్యాలు సమసి కవికి సంతృప్తి, ఆనందం కలుగుతాయి. తనను పరివేష్టించి ఉన్న బాహిర ప్రకృతికీ, అంతరిక ప్రకృతికీ నిరంతరం జరిగే సంఘర్షణను అభ్యుదయ కవి ఎదుర్కొంటాడు. ఈ ఘర్షణ కళాసృష్టికి దారి తీస్తుంది. మంచి చెడుల విచక్షణా జ్ఞానం, పీడిత మానవుల ఎడ సానుభూతి, కరుణవంటివి అతన్ని తప్పక ప్రేరేపిస్తాయి. దీన్ని ఒక అభ్యుదయ కవి[9] ఇట్లా విశదీకరించాడు: "ఒక వ్యక్తికి కష్టం కలిగితేనే కరుణ రసావేశంతో కావ్యం వెలువడింది కదా! మరి కోట్లాది మానవులకు సాముదాయకంగా తరతరాలుగా జరుగుతూ వచ్చిన అన్యాయాన్నీ దోపిడీనీ నివారించి, వారికి ఉత్తమ జీవితం కల్పింపజూచే అభ్యుదయ కవితా తత్త్వంలో కరుణ ఉంది, విశ్వశ్రేయోభావన

9. కుందుర్తి, 'తెలుగువాణి', ప్రపంచ తెలుగు సభల ప్రత్యేక సంచిక (1975)లో వ్రాసిన వ్యాసం.

ఉంది. కేవలం భావన మాత్రమే కాక, ఆచరణలో విప్లవంద్వారా దానిని సాధించాలనే నిష్ఠ, కర్తవ్య పరాయణత, కార్యదీక్ష, క్రియాశీలత్వం ఉన్నాయి."

ఈ అంతస్తత్వం దృష్ట్యా అభ్యుదయ కవులకు కొన్ని ఆదర్శాలున్నాయి. అంతర్జాతీయ దృక్పథంతో మానవాభ్యుదయాన్ని కాంక్షించడం; ఆర్థిక అసమానత అంతరించి సామ్యవాదసమాజం నెలకొనడం; పెట్టుబడిదారీ వ్యవస్థను కూలద్రోయడం; ఫాసిస్టు వ్యతిరేకపోరాటం జరపడం; కార్మికకర్షక జనానికి ఉత్తమ జీవనం కొరకై దేశదేశాలలో సామ్యవాదసమాజస్థాపన; ఒక్కొక్క సందర్భంలో కమ్యూనిస్టు అయి ఉండనక్కరలేకుండానే పీడితమానవుల శ్రేయస్సును కాంక్షించి వ్రాయడం; యుద్ధాలు లేని విశ్వశాంతి; దేశపారిశ్రామికీకరణ; ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేయడం; వర్ణవర్గ రహితమైన వ్యవస్థను గాఢంగా కాంక్షించడం; కులమత జాతివ్యవస్థను నిర్మూలించి, అందమైన భవిష్యత్తును రూపొందించుకోవడంకోసం వికృతమైన ప్రకృతాన్ని తొలగించడం; ఏ దేశాలలో సామ్యవాద వ్యవస్థ ఏర్పడిఉందో వాటి శ్రేయస్సును కోరుతూ విపత్తు వచ్చినప్పుడు వాటి తరఫున నిలబడటం. ఈ ఆశయాల సాధనకై ప్రగతిశీల సాహిత్యాన్ని సృష్టించడం; ప్రాచీన సాహిత్యాన్ని అది రచింపబడ్డ కాలం దృష్ట్యా అవగాహన చేసుకోవడం; అందులోని ప్రగతిశీల భావాలను ఆకళింపుచేసుకొని వర్తమానానికి అన్వయించుకోవడం; ప్రాచీన జానపదరీతుల్ని కళారూపాలను అభ్యుదయ భావాల ప్రకటనకు వినియోగించడం, వచన కవిత్వాన్ని ఉద్యమంగా వ్యాపింపచేయడం, మొత్తంపై వ్యక్తి చైతన్యాన్ని సంఘచైతన్యంగా పరివర్తింప చేయడం.

ఆధునికాంధ్ర సాహిత్యంలో వచ్చిన అభ్యుదయ కవితాయుగం కవులకు అభివ్యక్తి విషయంలో అపారమైన అవకాశాలను గోచరింప జేయడమేకాక, వచన రచయితలకు కూడా వారి కర్తవ్యాన్ని సూచించింది. తరువాతివారికి మాతృభూమి వంటి దీయుగం.

# సాహిత్య ఉద్యమాలు

అనుమాండ్ల భూమయ్య

ఉద్యమ మంటే ప్రయత్న మని సామాన్యార్థం. కాని, సర్వజన ప్రయోజనార్థం, ఒకానొక నిర్దిష్టమైన లక్ష్యంతో చేసే సామూహిక ప్రయత్నం ఉద్యమ మని వ్యవహరింపబడుతున్నది. ఈలక్ష్యం సంకుచిత ప్రయోజనాలపై కాకుండ, విస్తృత ప్రాతిపదిక మీద రూపొందింపబడి ఉంటుంది. ఏ ఉద్యమంకాని ప్రత్యక్షంగానో పరోక్షంగానో అనంతర కాలం మీద కూడ తన ప్రభావాన్ని చూపుతూనే ఉంటుంది.

ఆధునిక కాలంలో సాహిత్యపరంగా వచ్చిన ఉద్యమాల్లో మొదటిది-భావ కవిత్వోద్యమం. రెండవది-నవీన ప్రబంధ ఉద్యమం (నియో క్లాసిక్) నవీన ప్రబంధ ఉద్యమం ఆవిర్భవించిన కాలంలోనే మరోప్రక్క అభ్యుదయ కవిత్వోద్యమం వచ్చింది. నవీన ప్రబంధ ఉద్యమం జాతీయ పునరుజ్జీవనం ప్రేరణగా వస్తే, అభ్యుదయ కవిత్వోద్యమం, ప్రధానంగా, మార్క్సిస్టు దృక్పథం ప్రేరణగా వచ్చింది. భారతదేశం, సమకాలీన సమాజం, దేశీయ భావన భావకవిత్వ, నవీన ప్రబంధ ఉద్యమాలకు భూమిక కాగా అభ్యుదయ కవిత్వానికి వైదేశిక రాజకీయాలు, అక్టోబరు విప్లవం, వర్గపోరాటం భూమిక అయింది.

అభ్యుదయ కవిత్వోద్యమం తరువాత కవితారంగంలో ఉద్యమాలుగా చెప్పబడుతున్నవి ఇవి - వచన కవిత్వోద్యమం, దిగంబర కవిత్వోద్యమం, చేతనావర్త కవిత్వోద్యమం, విప్లవ కవిత్వోద్యమం, కవిసేన కవిత్వోద్యమం, మినీ కవిత్వోద్యమం. నిజానికి ఈ పేర్కొనబడిన వన్నీ ఉద్యమాలు కావు. కొన్ని మాత్రమే ఉద్యమాలు.

వచన కవిత్వం, మినీ కవిత్వం అనేవి ప్రత్యేకమయిన తాత్త్విక దృక్పథానికి చెందినవి కావు. ఉద్యమానికి ఉండవలసిన నిర్దిష్టమైన లక్ష్యం వీటికి లేదు.

అభిమాన ప్రేరితమయిన ప్రచారం చేత మాత్రమే ఇవి ఉద్యమాలుగా చెప్పబడినవి.

పద్యం, గేయం, వచన కవిత, 'మినీ' కవిత - ఇవి రూపానికి సంబంధించినవి మాత్రమే. భావప్రకటనకు కవి ఉపయోగించుకునే రూపం ఉద్యమం కాజాలదు. ఇవి రూపవాదానికి చెందినవి. ఉద్యమానికి ఉండదగిన నిర్దిష్టమైన ఒక లక్ష్యం కాని, ఒక సిద్ధాంతం కాని వీటికి లేవు.

దిగంబర కవిత్వానికి ఉద్యమత్వం సంపాదించడానికి ప్రయత్నాలు జరిగినవి కాని, అది విజయవంతం కాలేదు. కాజాలదుకూడ. ఎందుకంటే, ఈ కవిత్వానికి తాత్త్విక దృక్పథం లేదు. నలుగురి దృష్టిని ఆకర్షించడానికి చేసిన విఫల ప్రయత్నం మాత్రమే. ఒక విధమైన అలజడి అది. బూతు వాగాడంబరమును ఉద్యమంగా చిత్రించడానికి కొందరు వ్యర్థ శ్రమ పడ్డారు.

ఆధునిక తెలుగు సాహిత్యంలో ఉద్యమాలుగా చెప్పదగినవి ఆరు మాత్రమే. 1. భావ కవిత్వం, 2. నవీన ప్రబంధం, 3. అభ్యుదయ కవిత్వం, 4. చేతనావర్త కవిత్వం, 5. విప్లవ కవిత్వం, 6. కవిసేన కవిత్వం. భావ కవిత్వం, నవీన ప్రబంధం, చేతనావర్త కవిత్వం, కవిసేన కవిత్వం- వీటికి భూమికలు భారతదేశం, భారత జన జీవన గాథలు కాగా, అభ్యుదయ, విప్లవ కవిత్వాలకు రష్యా, చైనా దేశాలలోని రాజకీయాలు భూమికలు. అంతమాత్రమే అయితే పరవాలేదు, కాని, ఆ దేశాలలోని రాజకీయ ఆర్థిక సంచలనాలకు స్వాభిమానాన్నీ స్వధర్మాన్నీ తాకట్టుపెట్టే స్వభావం కలవి.

## భావ కవితోద్యమం :

ఇరువయ్యో శతాబ్ది ఆరంభంలో తెలుగు సాహిత్యంలో ఆధునికత ప్రవేశించింది. దీనికి దేశీయమైన పరిస్థితులే కాక పాశ్చాత్య సాహిత్య పరిచయం ప్రేరణనిచ్చాయి. ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్టమొదటి ఉద్యమం భావ కవిత్వం. దీనికి నాయకుడు రాయప్రోలు సుబ్బారావు. సుమారు 1915 నుండి 1935 దాకా సాగిన ఉద్యమమిది. వస్తువు, అభివ్యక్తి- ఈ రెంటి దృష్ట్యా భావ కవిత్వాన్ని రెండు దశలుగా విభాగింపవచ్చు. ఒకటి తొలి దశ, రెండు మలి

దశ. తొలి దశలో, ప్రధానంగా, జాతీయ పునరుజ్జీవనం భూమికగా వస్త్వాశ్రయ కావ్యాలు వచ్చాయి. దేశభక్తి, సంఘ సంస్కరణ, గతవైభవ పునరుద్ధరణ మొదలైనవి ఈ కావ్యాల్లో వస్తువులు. భావకవిత్వంలో ప్రణయ భావన ప్రధాన స్థానాన్ని ఆక్రమించింది. ఈ ప్రణయంలో 1) అమలిన శృంగారం, 2) కులపాలికా ప్రణయం, 3) స్వేచ్ఛా ప్రణయం అను ప్రధాన శాఖలు మూడున్నాయి. వీటిలో అమలిన శృగారం, కులపాలికా ప్రణయం వస్త్వాశ్రయ కావ్యాల్లో చిత్రితమయింది. ఈ తొలి దశలో రాయప్రోలు, అబ్బూరి, విశ్వనాథ, దువ్వూరి, నాయని, నండూరి, బసవరాజు ప్రధానంగా చెప్పుకోదగిన కవులు. వీరిలో కొందరు ఆత్మాశ్రయ రీతిలో ఖండకావ్యాలు వ్రాసిన కవులున్నారు. పైన పేర్కొన్న జాతీయ పునరుజ్జీవనం, అమలిన శృంగారం, కులపాలికా ప్రణయం వంటివి వస్తువుగా స్వీకరించి రచన సాగించిన కారణంగా వీరిని భావ కవిత్వపు తొలి దశ కవులుగా పేర్కొనడం జరిగింది.

భావకవిత్వపు మలి దశలో ప్రధానంగా ఆత్మాశ్రయ రీతిలో ఖండకావ్యాలు వచ్చాయి. తొలి దశలోని కావ్యాల్లో కనిపించే వస్తువు- క్వచిత్తుగా తప్ప, కనిపించదు. ఆత్మీయ భావ ప్రకటనదే ప్రాధాన్యం. ఈ దశలో వచ్చిన కావ్యాలు ఇంచుమించు అన్నీ ఖండకావ్యాలే. ప్రణయంలో మూడవ శాఖగా పైన పేర్కొన్న స్వేచ్ఛా ప్రణయం, ఈ దశలోని కవిత్వంలోనే వర్ణింపబడింది.

భావ కవిత్వావిర్భావానికి జాతీయ పునరుజ్జీవనం, ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనిక కవిత్వం ప్రేరణలు. మొదటిది వస్తుపరం, రెండోది అభివ్యక్తిపరం. తొలిదశ భావ కవిత్వంలో వస్తువులకు అభివ్యక్తికి సమానమైన ప్రాధాన్యత కనిపిస్తుంది. మలిదశ భావ కవిత్వానికి ఇంచుమించు దేశీయమైన వస్తుబలం లేదు. 'రొమాంటిక్ పోయెట్రీ' ప్రభావంగా ఆత్మీయ భావాలు, అభివ్యక్తికి ప్రాధాన్యమిస్తూ, ప్రకటింపబడడమే ఇందులో ఉంది. వస్తు, అభివ్యక్తుల్లో వస్తువు ఉపేక్షింపబడి అభివ్యక్తికే ప్రాధాన్యమీయబడింది. ఈ రెంటి సమతులనం ఈ దశలో చెడింది. చెప్పే విషయం (వస్తువు), చెప్పే విధానం (అభివ్యక్తి) రెండూ సమప్రాధాన్యం వహించి ఉన్నప్పుడే కవిత్వం రాణించి సత్ప్రయోజనాలను చేకూర్చగలుగుతుంది. మానవీయ శాశ్వత మూల్యాలు సంతరించుకొన్న వస్తువయితే ఆ కవిత దేశ కాలాతీతంగా కూడ నిలిచి సత్యమానవ వికాసానికి తోడ్పడుతుంది.

కేవలం వస్తువుకో, కేవలం అభివ్యక్తికో ప్రాధాన్యమిచ్చే కవిత, తత్కాలమైన ఒక పరిమిత ప్రయోజనాన్ని మాత్రమే సాధించగలుగుతుంది.

భావ కవితోద్యమం తరువాత స్వాతంత్ర్య పూర్వకాలంలో వచ్చిన ఉద్యమాలు రెండు. ఒకటి-నవీన ప్రబంధ ఉద్యమం. రెండు-అభ్యుదయ కవిత్వ ఉద్యమం. తొలిదశ భావ కవిత్వం భూమికగా నవీన ప్రబంధ ఉద్యమం, మలి దశ భావ కవిత్వం మీద 'తిరుగుబాటు'గా అభ్యుదయ కవిత్వ ఉద్యమం ఆవిర్భవించాయి.

## నవీన ప్రబంధ ఉద్యమం :

తొలిదశ భావ కవిత్వం నుంచి ఆవిర్భవించిన ఉద్యమ మిది. ఆత్మాశ్రయ పరమైన భావ కవితల్లో లేని కథ, వస్త్వాశ్రయ భావ కావ్యాల్లో కొంత ఉన్నప్పటికీ, నిజానికి ఆ కావ్యాలు కథాబలం కలవి కాదు. భావ కవిత సాధించిన అభివ్యక్తి మార్గాన్ని చేపట్టి, జాతీయ పునరుజ్జీవనం కథాబలంగా వచ్చిన కావ్యాలు నవీన ప్రబంధాలు (నియో క్లాసిక్స్). ఈ మార్గంలో సుమారు 1934 నుంచి వచ్చిన నవీన ప్రబంధాలు- రాణా ప్రతాపసింహ చరిత్ర, సౌందరనందం, శివభారతం, శ్రీమద్రామాయణ కల్పవృక్షం మొదలైనవి. 'కాల్పనికోద్యమంలోని మౌలికాంశాల'ను, 'భారతీయ పునరుజ్జీవనంలో మథితాలైన నూతన మూల్యాలను వ్యక్తం' చేయడంలో 'పురాతన సాంస్కృతికాంశాలకు నూతనాన్వయం కల్పించ'డంలో, కల్పవృక్షం విశిష్టమైన కావ్యం. పురాగాథా రూపమైనప్పటికి ఇందులో ఆధునిక సమాజం చిత్రింపబడింది. ఉన్నత మానవీయ విలువలు సంతరించుకొన్న గ్రంథ మిది. 1934 నుండి 1960 దాకా అంటే ఇరువయి అయిదు సంవత్సరాల కాలంలో రచింపబడిన ఈ కల్పవృక్షం 'నియో క్లాసిక్' ఉద్యమానికి ఒక సమగ్రతను, బలాన్ని అందించింది.

అభ్యుదయ కవిత్వానంతరం ఈ నవీన ప్రబంధాల రచన అవిచ్ఛిన్నంగా నేటికీ కొనసాగుతూనే వస్తున్నది. ఆంధ్ర పురాణము, పోతన చరిత్రము, పరమేశ్వర వసంతరాయలు, కీర్తితోరణము, వందేమాతరం, మధూలిక, రైతు రామాయణం మొదలైన కావ్యాలు అనేకం వచ్చాయి. కథాబలం లేకుండా వీరైనా కావ్యం, కేవలం అభివ్యక్తి ప్రధానంగా కాలాంతరాన ప్రజల హృదయాలను

పట్టి విడువకుండా నిలువగలుగడం కష్టమే. ఖండకావ్య రచనలే ఎక్కువగా వచ్చిన అభ్యుదయ కవితోద్యమంలోనివాడే అయిన కుందుర్తి కూడ, కథాబలం లేకుండ కవిత ప్రజల్లో నిలువడం కష్టమని భావించినాడు. ఈయన కథా కావ్యాలు రాయడంలో, వాటిని బలపరచడంలో, ఈ 'నియో క్లాసిక్' ఉద్యమ ప్రభావం కనిపిస్తుంది. శేషేంద్ర శర్మ తన కావ్యాల నన్నిటినీ కలిపి, 'ఆధునిక మహాభారతము' పేరిట అచ్చువేసి, ఆయా కావ్యాలను పర్వాలుగా నామకరణం చేయడం, పర్వాంతంలో పూర్వ కావ్యాల్లోవలె గద్యం రాయడంలో ఈ 'నియో క్లాసిక్' ప్రభావమే వ్యక్తమవుతుంది. వస్తువులో జాతీయతను నిలుపుకుంటూ, వస్తువుకు, అభివ్యక్తికి సమప్రాధాన్యత నిస్తున్న ఈ నవీన ప్రబంధం ఆధునిక తెలుగు సాహిత్యంలో అవిచ్ఛిన్నంగా వస్తున్న ప్రక్రియ.

## అభ్యుదయ కవితోద్యమం:

'నియో క్లాసిక్' ఉద్యమంతో పాటే వచ్చింది, ఈ అభ్యుదయ కవితోద్యమం. వస్తువు నుపేక్షించి అభివ్యక్తికి అత్యధిక ప్రాధాన్యత నిస్తూ ఆత్మానుభూతులనే ప్రకటిస్తున్న మలి దశలోని భావ కవిత్వం మీద 'తిరుగుబాటు'గా వచ్చిన ఉద్యమ మిది. ఈ ఉద్యమ ప్రవర్తకుడు శ్రీశ్రీ. శ్రామికులు, వాళ్ల సుఖదుఃఖాలు ఈయన 'మహాప్రస్థానం' లోని కవితా వస్తువు.

1917 నాటి రష్యన్ విప్లవం కొందరు భారతీయులను ఆకర్షించింది. సమ సమాజాన్ని గూర్చిన మార్క్స్ భావాలు ప్రచారం చేయబడినాయి. స్వాతంత్ర్యోద్యమ నాయకుడైన నెహ్రూ ఈ భావవ్యాప్తికి దోహదం చేశాడు. మార్క్స్ దృక్పథం గల రచయితలు కలిసి అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘాన్ని 1936లో ఏర్పాటు చేసుకున్నారు. 1936లో లక్నోలో సంఘం ప్రథమ మహాసభ జరిగింది. 1943లో ఆంధ్ర ప్రాంతంలో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. ప్రతి ఏటా ఆయా ప్రాంతాల్లో, ఈ సంఘం మహాసభలను ఏర్పాటు చేసింది. తమ ఆశయాల ప్రచారానికి ఈ సంఘం 'తెలుగు తల్లి', 'ప్రజాశక్తి', 'అభ్యుదయ' వంటి సాహిత్య పత్రికలను నడిపింది. శ్రీశ్రీ, అనిసెట్టి, సోమసుందర్, కుందుర్తి, ఆరుద్ర మొదలైన కవులు ఈ సంఘంతో చేతి రేఖలు పెనవేసినారు. ఆంధ్రలో ఈ సంఘం ఏర్పడక ముందే మార్క్స్

భావ ప్రేరణతో శ్రీశ్రీ పెక్కు రచనలు చేసి అభ్యుదయ కవితా ప్రవర్తకుడై నాడు. అఖిల భారత అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడడానికిముందే, అంటే 1933 నుంచే మహా ప్రస్థానం గీతాలు రాసాగినాయి.

రష్యన్ విప్లవం చేత ప్రేరేపించబడి, మార్క్సు భావాలను ప్రచారం చేయడం, తద్వారా సామాజిక, ఆర్థిక విప్లవాన్ని సాధించడమే అభ్యుదయ రచయితల ధ్యేయమైనట్లు స్పష్టం. దీనికి నిదర్శనంగా "ఈ ఉద్యమం మార్క్సు గతి తార్కిక భౌతికవాదం తాత్విక పునాదిగా గల ఉద్యమం. మార్క్సిజంలోని ప్రధాన లక్షణాలైన భౌతిక వాదం, గతితార్కిక సిద్ధాంతం, చారిత్రక భౌతిక వాదం, వర్గపోరాటం ఇత్యాదులు అభ్యుదయ కవితా సాహిత్యాన్ని కంఠదఘ్నంగా ప్రభావితం చేశాయి" అన్న కంచెనపల్లి చిన వెంకట రామారావు (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు) మాటలు గమనించదగినవి.

అభ్యుదయ రచయితల సంఘం కేవలం రచయితల సంఘ శక్తి మీద ఆధారపడి సాగలేదు. కమ్యూనిస్టు పార్టీయే దీనికి నేపథ్యంలో ఉండి నడిపించి. ఈ రాజకీయ పార్టీ అండవల్లనే అభ్యుదయ కవిత్వానికి ఎక్కువ వ్యాప్తికలిగింది. అందుకే ఆరుద్రకూడ ఒకచోట "అభ్యుదయ రచయితల సంఘానికి కమ్యూనిస్టు పార్టీ పురుడుపోయడమే కాక పాలు పట్టి పెంచింది. రచయితలను రాజకీయాలకు ఉపయోగించుకోవడం ఆ పార్టీ విధానాలు ఆమోదించే కార్యక్రమం" అన్నారు (సారస వ్యాసావళి). రాజకీయాల చెప్పుచేతల్లో ఉండడమే ఈ రచయితల సంఘానికి బలమూ, బలహీనత అని కొందరు విమర్శకుల అభిప్రాయం. కమ్యూనిస్టు పార్టీ బలం ఆధారంగా కవులు కొనసాగించిన అభ్యుదయ రచన, ఆ పార్టీ ఎన్నికల్లో 'ఘోరంగా' ఓడిపోవడంతో, సహజంగానే ఆగిపోయింది. లక్ష్యాన్ని సాధించకుండానే అభ్యుదయ కవిత్వోద్యమం స్తబ్దమైపోయింది—"అభ్యుదయ కవిత్వం తన లక్ష్యాన్ని సాధించకుండానే శక్తిని కోల్పోయిం"దని కడియాల రామమోహన్‌రాయ్ కూడా అంగీకరిస్తున్నారు (తెలుగు కవితా వికాసం.)

భావ కవిత్వం, నవీన ప్రబంధాల్లో వలె అభ్యుదయ కవిత్వంలోని వస్తువు భారత జాతీయ భావ ప్రేరితం కాదు. రాజకీయ ప్రయోజనాలను ఆశించి వచ్చిన ఉద్యమ మిది. మార్క్సు భావవ్యాప్తికై పూనుకొన్నందువల్ల సహజంగానే ఈ కవి

త్వంలో కవితా విలువలు లోపించాయి. మహాప్రస్థానంలో వస్తువుకు, అభివ్యక్తికి సమప్రాధాన్య మిచ్చిన రచనలున్నాయి. ఇందుకు కారణం ఆ రచనలు కవి రాజకీయ పార్టీని ఆశ్రయించక ముందు, భారత దేశంలో అభ్యుదయ రచయితలు ఒక సంఘంగా ఏర్పడక ముందు వచ్చినవే. "కాదేదీ కవిత కనర్హం, ఔనౌను శిల్ప మనర్ఘ" మని శ్రీ శ్రీ చెప్పిన మాటను అభ్యుదయ కవులెవ్వరూ ఖాతరు చేయలేదు. పైగా "ఏం చెబుతున్నామన్నదే తప్ప, ఎలా చెబుతున్నామన్నది ముఖ్యం కాదన్న స్థితికి ఆ కవులు వచ్చారు. ఈ కవితల్లో కవితాభివ్యక్తి చాలావరకు లోపించి ఉండడాన్ని ఇది స్పష్టం చేస్తుంది. అభ్యుదయ కవిత్వాన్ని గురించి ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారు ఇట్లా చెప్పారు- "అభ్యుదయం కవిత్వంతో పోల్చే ప్రసక్తే లేదు. మార్క్సు ప్రోద్బలంతో వచ్చింది. వారికి ఉద్యమమే కాని కవిత ముఖ్యం కాదు. మార్క్సిజం లేనిది వారికి కవిత్వమే కాదు. దీని ప్రచార లక్షణం దీనిలో భావుకతను చంపివేసింది." (డా. కోవెల సుప్రసన్నాచార్య గారు చేసిన ఇంటర్వ్యూ. ఆంధ్రప్రభ-దిన పత్రిక. 15-2-1987).

## దిగంబర కవిత్వం :

అభ్యుదయ కవిత్వం శక్తిని కోల్పోయిన తరువాత ఆరుగురు కవులు కలిసి 'దిగంబర కవులు'గా ఏర్పడి రచనలు చేశారు. వీరు 1965, 66, 68 సంవత్సరాల్లో వరుసగా మూడు సంపుటులు వేశారు. వీరు తమది దిగంబర కవితోద్యమ మని చెప్పుకున్నప్పటికీ ఇది ఉద్యమం కాదు. దీనికొక స్పష్టమైన, నిర్దిష్టమైన లక్ష్యం లేదు. "ఈ దేశం యీ గోళంలో ఊపిరి పీల్చే ప్రతి మనిషి ఉనికి కోసం తపనపడి, అతడి భావిని చూసి వెక్కి వెక్కి ఏడ్చి పిచ్చెత్తి ప్రవచించిన కవిత"గా తమ కవిత్వాన్ని గురించి ఈ కవులు చెప్పుకున్నారు. ఆ కవితారూపంలో కవితా రంగ ప్రవేశం చేసి ఒక అలజడిని, అరాచకాన్ని సృష్టించడమే వీరి ధ్యేయమైనట్లు వీరు ప్రకటించిన మొదటి సంపుటి మొదటి ఖండిక 'ఆత్మయోని' ని చూస్తే తెలుస్తుంది. "నన్నయ్యను నరేంద్రుడు పొందలోనే/నిద్రపోనియ్య/లేదు / పీక నులిమి గోతిలోకి లాగుతాడు / ప్రబంధాంగనల తొడలు తాడి మొత్తాడు/ తాకితే కాళ్లే విరగ్గొట్టు/ కుచములు ఎవరూ ఎక్కని పర్వతాగ్రములు/ తలలు తీకొనె ప్రబంధాల కొట్టు/... కావ్య కవుల నపుంసక హావభావాలకు సవాలు/ [illegible] కవి [illegible] గుడ్ బై! మీ కందరికీ

సలామ్ వాలేకమ్/వచనం లేదు, కవిత్వం అంతకంటే లేదు........" నన్నయ్య మొదలుగాగల ప్రాచీన కవులమీదగాని, ఆధునికులైన భావకవులు అభ్యుదయ కవులమీదగాని వీరికి ఏమాత్రం గౌరవం లేకపోవడమటుంచి అందరినీ దూషించడమే వీరు పనిగా పెట్టుకున్నారు-

"నాకు తెలుసు మీరంతా మనుషులు కానే కారని
మీరంతా చీకట్లో తిరుగుతున్న గజదొంగలు....
మీరంతా మీరంతా
నల్లులురా నల్లులు! బల్లులురా బల్లులు!
రక్తం పీల్చే జలగలు, పిశాచాలు, నిశాచరులు....
ఈ నాగరికతను మానభంగం చేస్తాను...."

(సంపుటి-1, 'హఠాత్తుగా పట్టపగలు బట్టలన్నీ ఒప్పేసి')

ఈ విధంగా కవులను, సమాజాన్నే, నాగరికతను దూషించడం ఒక విధమైన అలజడిని సృష్టించడమే. ఏదీ సాధించలేదని నన్నయాది కవులందరినీ వదలకుండా దూషించిన ఈ దిగంబర కవుల సాహిత్యంలో ఏమి సాధించినట్లు, తిరిగి దూషణలు పొందడం తప్ప? కుందుర్తి మొదలైన కవులు, విమర్శకులు వీరి రచనలను ఘాటుగా విమర్శించారు. ఈ కవులనుగూర్చి కడియాల రామమోహనరాయ్, 'తెలుగు కవితా వికాసం'లో రాస్తూ "అశ్లీల పదాలు కవి ఆవేశంలోంచి దూసుకొని వచ్చినవి కాక, సంచలనం కలిగించటానికి, పాఠకుల్ని 'షాక్' చెయ్యటానికే ప్రయత్నపూర్వకంగా తెచ్చిపెట్టుకోవటం వీరి కవిత్వంలో పెద్ద లోప"మనీ, ఈ "అశ్లీల పదాలు, వర్ణనలు కామోద్రేకాన్ని కాకుండా జుగుప్సను కలిగిస్తా" యన్నారు. జుగుప్సను కలిగించడమే కవితాధ్యేయం కాదు గదా! ఈ కవులు సాహిత్యంలో ప్రవేశపెట్టిన నూతన కవితా [illegible] ఏమీలేదు. వీరి కవిత్వాన్ని అనుసరించిన వాళ్లూ లేరు. [illegible] [illegible] లేరు. ఇది సాహిత్యంలో ఉద్యమం కాదు. ఒక అలజడి మాత్రమే.

## చేతనావర్త కవిత్వం :

అభ్యుదయ కవిత్వానంతరం; ఒక ఉద్యమ రూపంలో వచ్చింది చేతనావర్త కవిత్వం. తొలిదశ భావకవిత్వం, నవీన ప్రబంధం ఈ పరంపరలో ఆధునికతను సంతరించుకొని వచ్చిన కవిత్వ మిది. పై రెండు ఉద్యమాలలో వలెనే ఈ చేతనావర్త కవితోద్యమంలో వస్తువుకు, అభివ్యక్తికి సమప్రాధాన్య మీయబడింది. అభ్యుదయ కవిత్వంలో, దిగంబర కవిత్వంలో లోపించిన కవితాభివ్యక్తిని ఈ చేతనావర్త కవులు నల్గురు- సుప్రసన్న, సంపత్కుమార, పేర్వారం జగన్నాథం, వే. నర్సింహారెడ్డి పునరుద్ధరించారు. సాహిత్య రంగంలో దిగంబర కవులు ప్రవేశ పెట్టిన ఆ కవితా ధోరణిని, కవితా రంగంలోని విధ్వంసక ధోరణిని ఎదుర్కొన్నారు. 'చేతనావర్త' మొదటి సంపుటిలో జగన్నాథంగారి, 'యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత' అన్న కవిత దిగంబర కవితా ధోరణిని సూటిగా నిరసిస్తుంది. 'గ్లానిర్భవతి భారత' అన్నది దిగంబర కవుల మొదటి సంపుటిలోని ఒక ఖండిక పేరు.

"ప్రజాస్వామ్య యుగంలో/ పద్ధతులు మారడం సహజం/ అన్నదే అంటూండడం/ విన్నదే వింటూండడం/ తిన్నదే తింటూం డడం/ నాన్సెన్స్, అంతా చాదస్తం/ అందుకే మార్చేస్తున్నాం/ మా కాలమానం వేరు/ మా ఋతువులు వేరు/ మా తిథి వార నక్షత్రాలు వేరు/ మా చేష్టలు వేరు/ మా పేరులే వేరు/ చివరికి మేం తినే తిండే వేరు/ మేం 'నన్ అయ్య'లకు కానేకాం వారసులం/ ఆకాశం నుండి ఊడిపడ్డ బేవారసులం/ కలం బడితిమా/ కానేకాం మనుషులం/ అయ్యయ్యో/ ఆంధ్ర సాహిత్య ప్రపంచం/ అడు గంటుతూంటే/ భావ కవులు శిఖండులుగా మారితే/ అభ్యుదయ కవులు/ తాగి తందనా లాడుతూంటే/ అవతరించాం ఆదివరాహ రూపంలో...."

ఇంత మాత్రమే కాకుండ ప్రధానంగా ఈ చేతనావర్త కవుల రచన నిర్మాణాత్మకత ద్వారా ముందుకు సాగింది. జాతీయ భావన, సంప్రదాయం, ఆధునిక దర్శనం, కవి ప్రతిభ, పరిమితి నిర్దేశించే రాజకీయ సిద్ధాంతాలకు కట్టు బడకుండడం, ప్రజాస్వామ్యం, మానవత, ఐహిక, భావ, ఆధ్యాత్మిక లోకాలకు సమన్వయాన్ని సాధించం- ఇవి చేతనావర్త కవుల ధ్యేయాలు.

విజ్ఞాన శాస్త్ర విషయాదుల్లో పురోగమిస్తున్న వర్తమాన కాలాన్ని విస్మరించి ఆధునిక కవిత చెప్పడం కుదురదు. శాస్త్రజ్ఞులు సిద్ధాంతాలను ఈ కవులు పరిగణనలోనికి తీసుకున్నారు. వివేకానందుడు, గాంధి, శ్రీ అరవిందులు మొదలైన సామాజిక వేత్తలు, తాత్త్వికులు పరిశీలించిన దృష్టితో వీరు సమాజాన్ని భారతీయ తాత్త్విక చైతన్యం పునాదిగా ఉన్న ఈ కవుల చైతన్యం ఆశావాదంతో భవిష్యత్తులోని ఉన్నత పరిణామాన్ని ఆహ్వానించింది.

"వస్తువును శక్తిగా మార్చ/వచ్చునన్న సిద్ధాంతం నించి
శక్తి నానందంగా మార్చి/సాగు నూతనాశా వీధి"

సుప్రసన్నగారి ఈ వాక్యాల్లో సాపేక్ష సిద్ధాంతం చెప్పబడడమే కాకుండ, భవిష్యత్తులో రాబోయే పరిణామం ఆనందమయంగా కావాలనే లక్షణం స్పష్టంగా గోచరిస్తుంది. ఈ కవి రచనలో గతకాలంలోని శిథిలావశేషాలను, క్లిష్టస్మృతులను నిర్దయగా తొలగించడమనే విషయం కనిపిస్తుంది. మానవుడి మీద ఉండే అఖండ విశ్వాసానికి-

"ఎవడికి వాడే ఒక వెలుగు నీడల సంపుటి
ప్రపంచమంతా చైతన్య కల్లోల సంవర్తావృత్తి
ప్రతి ఒక్కడు ఒక దీపశిఖ
ఎవడి మనస్సు వాడికే ఆవిష్కార శాఖ
కాని ఒకటే ప్రాణ స్రోతస్సు అంతటికీ
అదే జీవనాధార."

"ఈనాటి దారిద్ర్యంనుండీ, దుఃఖంనుండీ, పిడివాదంనుండీ, చీకటినుండీ, దోపిడినుండీ, అజ్ఞానంనుండీ, మృత్యువునుండీ, విముక్తి కోసం - దిగివచ్చిన స్వర్గం కోసం, మానవుడు సాధించే సర్వతోముఖ ప్రయత్నాలల్లో ఉన్నత మనస్సునుంచి ప్రసరించే వెలుగుల్ని పదిలపరచేవి" సుప్రసన్న గారి కవిత.

సంపత్కుమార కవితలో వర్తమాన అనుభవం పునాదిగా గతాన్ని సమన్వయించుకొని భవిష్యత్తును రూపొందించుకోవడం, ప్రధాన సూత్రంగా కనిపిస్తుంది. వర్తమానాన్ని నిరాకరించడం ప్రయోజనవంతం కాదని తాత్పర్యం. అందుకే–

"వర్తమాన జ్ఞాన శిఖరాగ్రంపై నిటారుగా నిలబడి
భూత భవిష్యత్తుల్ని సమీక్షించటానికి మారుగా
గతంనుంచి భవిష్యత్తు చూచే ఉబలాటులు
భవిష్యత్తునుంచి గతంచూచే బులపాటులు"

అంటారు సంపత్కుమార. సంపత్కుమార ఖండికలకు 'దేశకాల సమ్మాజాల త్రిపుటి', 'నినాదాడంబరాలు లేని విధానం', 'ఆవేశాన్ని అనౌచిత్యం పాలుకానీయని ఆలోచన', 'ఆనంద భావన, అనుభూతి ప్రసారణ, అనంత జగచ్చైతన్యావగాహన' భూమిక.

పేర్వారం జగన్నాథం గారి కవితల్ని పరిశీలిస్తే 'గతంలోంచి అనుభవాల్ని పిండి, వర్తమాన విషవలయాల్ని ఛేదించి, భవిష్యదాకాంచలాలవైపు చేతులుచాచి, మనిషిలో నిగూఢంగా ఉన్న మానవతను జాగృతం' చేసే ప్రయత్నం కనిపిస్తుంది. 'మనిషిలోని మంచితనానికి నీరాజనం పట్టి మనిషిపై మనిషికి భరోసా కలిగించడం' తన కవితా లక్ష్యంగా ఈ కవి ప్రకటించుకొంటాడు. సున్నితమైన హాస్యం ఈయన సొమ్ము. ఏది చెప్పినా వ్యంగ్య వైభవంతో లోకంలో జరుగుతున్న అన్యాయాలనూ ఆక్రమాలనూ అవినీతిని ఖండిస్తాడు. అధిక్షేపాత్మక కవితా రీతిని ఆయన ఆయుధంగా వాడుకుంటాడు. ఈయన పలుకుకు పదునెక్కువ.

"మానవతను మట్టిలో పారేసి
మంచితనాన్ని మరుభూమిలో పాతేసి
అభ్యుదయం తెస్తామనడం
ఆకసాన్ని కోస్తామనడం
ప్రజావంచనకు మెత్తని మార్గం
వాన లేకుండా వట్టి పిడుగులు రాలడం"

నిత్య జీవితంలో పశుత్వాన్ని వరించి పైకి మాత్రం 'అభ్యుదయ'మన్ని అంటూండే వాళ్లను చాలా ఘాటుగా మందలిస్తున్నాడు. 'వాన లేకుండా వట్టి పిడుగులు రాలడ' మన్నది సహజ సుందరమైన లోకోక్తి. ఈయన కవితలో దేశభవిష్యత్తు గురించి ఎంతో ఆరాటం కనిపిస్తుంటుంది. దేశాన్ని ప్రేమిస్తాడు. దేశానికి కలిగిన

విపత్తును తొలగించుటకై ఆసక్తినీ ఆతురతనూ ప్రదర్శిస్తుంటాడు— "ఏమైంది మన దేశాన్ని కీనాడు/నమ్మి నానబోస్తే/పుచ్చి బుర్రలైనాయి కందులు" అంటూ హెచ్చరిస్తాడు. అధికారుల దోపిడీ దౌర్జన్యాల నుండి బయట పడాలని దేశ ప్రజలకు కవితా సందేశమిస్తాడు. "రేపు ఋతుపవనాలు మనవైపే వీచి/అమృతవర్షం కురుస్తుంది" అన్న వాక్యాల్లో ఈ కవి ఆశావాది కావడం కనిపిస్తుంది. జగన్నాథం గారి కవిత్వం పరిపూర్ణ మానవతా చైతన్యం అంతస్సూత్రంగా కలిగి సంఘ సంక్షేమాన్ని దేశకళ్యాణాన్ని ధ్వనింపజేస్తుంటుంది.

వే. నరసింహారెడ్డి గారు ఈ 'దేశాన్ని అఖండంగా తప్ప చూడ' లేదు. "ఇక్కడ వేర్వేరు జాతులు లేవు. భారతజాతి ఒక్కటే. ఇక్కడ పేరుకున్న అవ్యవస్థను, రాజుకొంటున్న అరాజకతను, కుళ్లురాజకీయాలను, కులగోత్రాల మూఢవిశ్వాసాల గోడలను, ఆకలినీ, అంతకన్న భయంకరమైన అవమానాన్ని తొలగించుకోవాలని" ఈ కవి ఆవేదన.

"కులం పేర, మతం పేర
భాష పేర, ప్రాంతం పేర
నిన్ను విభజించి, చించి
నీ కళ్లలో దుమ్ము చల్లి
నీ గాయమ్మీద కారం చల్లి
రేచుల్లాగ త్రాచుల్లాగ
లేపుతారు, ప్రేరేపుతారు
నీలో పశువుని".

మనిషిలోని మంచితనాన్ని తట్టి లేపి మానవునిగా తీర్చిదిద్దాలి తప్ప పశుత్వాన్ని ప్రేరేపించి మానవ సమాజాన్ని మంట కలుపగూడదు. మనిషి తన బాధ్యతలను గుర్తెరిగి కొత్తతరానికి ద్వారాలు తెరిచే ఆలోచనలు చేయగలిగితే అతన్ని మించిన బలవంతుడు లేడు— "ఎత్తయిన నీ భుజాలమీద/ఎత్తుకో బాధ్యతల బరువు/నీ ఆలోచన చూపుల నుండి/కొత్త తరానికి ద్వారాన్ని తెరువు/ఒట్టు, నీకన్న బలవంతు డెవడూ లేడు."

'చేతనావర్తం' సంచికలు రెండు 1967, 70 సంవత్సరాలలో వచ్చాయి. ఇదే వరుసలో మరిన్ని సంచికలు వే. నరసింహా రెడ్డి మరణం అంతరాయంగా రాకపోవడం ఆధునిక తెలుగు కవిత్వానికి ఒక లోటు. జాతీయత, ప్రజా స్వామ్యం, మానవత, సంఘశ్రేయస్సు, సమకాలిక చైతన్యం మొదలైన వాటికి ఈ కవులు భావవ్యాప్తిని కలిగించారు. చేతనావర్త కవిత్వం గురించి పలువురు ప్రముఖ విమర్శకులు ఈ విధంగా ప్రశంసించారు—

**"This anthology of free Verse adds a new dimension to free verse in Telugu."**

—అమరేంద్ర

చేతనావర్తం కవులు నలుగురి "వ్యక్తీకరణ సంవిధానమూ ఒకటే. పద చిత్ర ప్రత్యయమూ ఒకటే. ఆధునిక విశ్వమానవ చైతన్యం నలుగురినీ ఒక్క మాదిరిగానే వివశీభూతం చేసుకున్నది. వర్తమాన మానవీయత కందరి హృద యాలూ ఒకేతీరుగా ఉపస్కారం కలిగిస్తున్నవి....

—సోమసుందర్
విశాలాంధ్ర, 22-10-1967

"చేతనావర్తం వచన కవితాయుగంలో కొత్త శకాన్ని సృష్టించిందనటం అతిశయోక్తి కాదు".

—రామమోహనరాయ్
భారతి, డిసెంబర్, 1967

## విప్లవ కవిత్వం

అభ్యుదయ కవితా మార్గంలో వచ్చిన కవితోద్యమ మిది. సామాజిక విప్లవ సాధనలో అభ్యుదయ కవిత్వం విఫలమయిం తరువాత దాదాపు ఇరువయి సంవత్సరాలకు, మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం స్ఫూర్తితో, 'విప్లవ రచయితల సంఘం' పేరుతో 1970 లో విప్లవకవిత్వం వచ్చింది. విప్లవ రచయితల ధ్యేయాలు స్థూలంగా, ఈ క్రింది విధంగా ఉన్నాయి—

"మార్క్సిస్టు దర్శనం పునాదిగా వెలువడే భావాలను ప్రచారం చేస్తూ రచయితలు సామాజిక చైతన్యాన్ని ఉద్దీపింపజెయ్యడం."

"మార్క్సిజాన్ని శాస్త్రంగానే కాక, శస్త్రంగా ఆమోదిస్తూ రాజకీయ మహోద్యమానికి చేదోడువాదోడు" కావడం.

"విప్లవ పోరాటా లన్నింటినీ సాకల్యంగా సమీక్షిస్తూ ప్రజల దీర్ఘకాలిక విమోచన పోరాటాలను సమర్థిస్తూ విప్లవ రచయితల సంఘం కృషి" చేయడం.

"నూతన ప్రజాతంత్ర విప్లవ లక్ష్యంగా మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం వెలుగులో విప్లవ రచయితల సంఘం సాహిత్య కళారంగా లను తన కార్యక్షేత్రంగా ఎంచు" కోవడం.

అభ్యుదయ రచయితల సంఘం యొక్క పరివర్తిత రూపమే విప్లవ రచయితల సంఘం. అక్కడ అభ్యుదయం; ఇక్కడ విప్లవం. అక్కడ మార్క్సిజం; ఇక్కడ దానికితోడు లెనినిజం, మావో ఆలోచనావిధానం చేరాయి. మార్క్సిజాన్ని 'శస్త్రం'గా ఆమోదించడం ఇక్కడ ప్రధానమైన విశేషం. అభ్యుదయ కవిత్వానికి రష్యా దేశం ఆదర్శం కాగా విప్లవ కవిత్వానికి చైనాదేశం ఆదర్శమే కాక ఆదేశకమైంది. దానివలె ఇదికూడా రాజకీయ పార్టీ ప్రాబల్యం కలిగిఉంది. మార్క్సిజం ప్రభావంతో వస్తువుకే ప్రాధాన్యం పెరిగి, కళాత్మక విలువలు లోపించడం అభ్యుదయ కవిత్వంతోనే మొదలయింది. విప్లవ కవిత్వంలో ఆ లోపించటం మరింత పెరిగింది.

సాహిత్యంలో మార్క్సిజం ప్రవేశించిన కవితాస్థితిని 'అభ్యుదయ కవిత్వం' తెలియజేయగా ఆ 'ఇజం' రాజకీయపార్టీకి 'కార్యక్షేత్రం'గా వాడుకోబడిన కవితా స్థితిని 'విప్లవ కవిత్వం' తెలియజేస్తుంది. ఈ కవులు తమ రచనలను, అభ్యుదయ కవిత్వం చివరినాళ్లలోవలె, వచన కవితలుగా ఖండకావ్య రూపంలో వెలువరిస్తున్నారు. కొందరు కవులు జానపద బాణీలనెన్నుకొని రచనల్ని చేస్తున్నారు. ఇది అభ్యుదయ కవిత్వం తొలినాళ్ల మాత్రాచ్ఛందోరూపాన్ని పునరుద్ధరింప ప్రయత్నించడాన్ని సూచిస్తుంది.

విప్లవ రచయితల సంఘం రాజకీయాలలో ప్రత్యక్షంగా సంబంధాలు పెట్టుకొన్న కారణంగా పార్టీ రాజకీయాలలో పొటమరించిన అంతఃకలహాలు వ్యక్తిగత ద్వేషాలు విప్లవ రచయితల సంఘంలోను ప్రజ్వరిల్లి గ్రూపులుగా విడిపోయింది.

## కవిసేన కవిత్వం :

మార్క్స్, లెనిన్, మావో భావవ్యాప్తికీ, రాజకీయపార్టీకి మాత్రమే పరిమితమయి అభివ్యక్తిని కోల్పోయి 'నినాదప్రాయ' స్థితికి వచ్చిన విప్లవ కవిత్వం మీద తిరుగుబాటుగా 1977 లో కవిసేన కవిత్వం ఆవిర్భవించింది. భావకవిత్వం, నవీన ప్రబంధం, చేతనావర్త కవిత్వం – వీటి వరుసలో ఈ కవిత్వం వచ్చింది. విప్లవ కవిత్వంలో లుప్తమైపోయిన కవితాభివ్యక్తిని పునరుద్ధరించడంలో వస్తువు కొంత వెనక్కుపట్టి అభివ్యక్తియే ఈ కవిత్వంలో ఎక్కువ ప్రాధాన్యం వహించింది. అభివ్యక్తి ప్రాధాన్యంలో ఈ కవిత్వం మలిదశ భావ కవిత్వాన్ని పోలిఉన్నది. వస్తువులో మార్క్స్ భావాలు కూడా కొన్ని చోటు చేసుకొన్నాయి. కవిసేన కవిత్వానికి నాయకుడు గుంటూరు శేషేంద్రశర్మ. కవిసేన ఆశయాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి–

1. "కవి-కవితాశిల్పం; 2. కవికీ-సమాజానికీ వుండే సంబంధాలు-ఈ రెంటిపై ఈ సంస్థ రూపొందించబడింది";

2. "ప్రపంచంలో కవిత్వ తత్త్వవేత్తలు ప్రతిపాదించిన సిద్ధాంతాలు పరిశీలించి ఏదో ఒక సార్వత్రికమైన సూత్రాన్ని" కవిత్వానికి ప్రమాణంగా స్వీకరించడం.

3. "ఆర్థిక సామాజిక సమస్యలవరకు ఈ శతాబ్దం అంగీకరించిన మార్క్సిస్టు సిద్ధాంతాన్ని కవిసేన పరిష్కారంగా స్వీకరించడం."

4. "కవి సంపూర్ణ మానవ జీవితం మీద తనకున్న బాధ్యతల్ని విస్మరించి [illegible] ప్రయో[illegible] మాత్రమే [illegible]. కవి [illegible] [illegible] బాధ్యుడు ఒక రాజకీయ [illegible]

ఇందులో చెప్పబడిన ప్రధానమైన అంశాలు రెండే. ఒకటి, ఆధునిక సమాజం. రెండు, కవితాభివ్యక్తి. ఆధునిక సమాజంలోని వస్తువును వాచ్యంగా కాకుండ, కవిత్వీకరించి చెప్పడం ఈ కవిసేన కవిత్వం ధ్యేయం. ఒకవిధంగా ఇది చేతనావర్త కవిత్వ పద్ధతి. కాని, మార్క్సిస్టు సిద్ధాంత స్వీకరణలో విప్లవ భాషా ప్రయోగంలో, అభివ్యక్తి కిచ్చిన అధిక ప్రాధాన్యంలో చేతనావర్త కవిత్వంకంటె ఈ కవిసేన కవిత్వం భిన్నమైంది. ఈ కవిత్వానికి ఉదాహరణగా కొన్ని ఖండికలు-

"నేనే రస్తానై కలలు కంటున్నాను/వడివడిగా నడిచే మీ ముందడుగు కోసం/పదండి ముందుకు మీ జెండానై ఎగురుతాను."

"నా కవిత్వం ఏ జెండాను ఎగురవేయదు
కానీ నా చేతులు నా దేశపు ఖడ్గాలు."

"ప్రతి ఏడూ భూమిలోనుంచి బయటికొచ్చి నుల్చునే ధాన్యాలు
ఆకలిమీద దండయాత్ర కోసం బయలుదేరుతున్న సైన్యాలు."

"నిశ్శబ్దాల నిర్మాణ వాస్తువు తెలిసినవాడు/ఋషి/
శబ్దాలకు రెక్కలిచ్చి నిశ్శబ్దాల్లోకి/ఎగరేశేవాడు కవి."

శేషేంద్రశర్మ తొలినాళ్ళలో పద్యం, గేయం మీద అధికారం సంపాదించారు. ఇప్పుడు వచన కవితారీతిని ఆత్మీకరించుకొన్నారు. వచన కవితల్లో పాటింపబడే పాద నియమాన్ని ఈ కవి 'నా దేశం నా ప్రజలు' మొదలైన కొన్ని కావ్యాల్లో పాటించలేదు, వచనంలోని పేరా పద్ధతిని పాటించారు. శేషేంద్ర కొన్ని కావ్యాల్లో, పాద నియమాన్ని పాటించిన భాగాలు, పాద నియమాన్ని పాటించకుండ వచనంవలె సాగిన భాగాలు కలగలుపుగా ఉన్నాయి. కొన్ని చోట్ల వచ్చిన కవితలతోపాటు మాత్రాచ్ఛందో పాదాలు కలిసి ఉన్నాయి.

ఏ విధమైన కవిత్వాన్ని కవిసేన కోరుతుందో దాన్ని గూర్చి సమగ్రంగా వివరిస్తూ శేషేంద్ర, 1977 లో 'కవిసేన మేనిఫెస్టో' ప్రచురించారు. ఇది ప్రాచ్య పాశ్చాత్య విమర్శకులు కవితాభిప్రాయాలను సమన్వయం పరుస్తూ ఆధునిక కాలంలో వచ్చిన ఏకైక 'ఆధునిక కావ్య శాస్త్రమ్'.

కవిసేన కవిత్వానికి శేషేంద్ర, "ఆధునిక మహాభారతము", కవితా సిద్ధాంతానికి 'కవిసేన మేనిఫెస్టో' మూల గ్రంథాలు. 'కొమ్మలు చీల్చుకొని వస్తున్న పూలు', నాకు భూమి కావాలి', వనమాలి వచన పద్యాలు' — కవిసేన సభ్యులు వ్రాసిన కొన్ని కావ్యాలు.

ఇన్ని ఉద్యమాలు బయలుదేరినా కళాత్మక విలువల్ని కాపాడుకుంటూ వినూత్నమూ ప్రయోజనాత్మకమూనైన అభివ్యక్తి మార్గాల్లో ఆధునికతా ముద్రను సంతరించుకుంటూ సర్వజనామోదకంగా సాగేదే నిజమయిన కవితోద్యమం. పాశవికతను ఖండిస్తూ మానవత్వపు విలువల్ని మన్నించుకుంటూ సత్యం శివం సుందరంగా క్రాంతి మార్గంపైపు సాగడం ఏ ఉద్యమానికైనా కనీస ధర్మం. అది సమగ్ర మానవ వికాస చైతన్యాన్ని కలిగించాలి. ఈ విధంగా చూస్తే ఆధునిక తెలుగు కవితా రంగంలో అభ్యుదయ కవిత్వానంతరం వచ్చిన ఉద్యమాలు- చేతనావర్త కవిత్వం, కవిసేన కవిత్వం మాత్రమే అని చెప్పవచ్చు.

# వర్తమాన కవిత్వ దర్శనము

కోవెల సుప్రసన్నాచార్య

అభ్యుదయ కవిత్వానంతరం తెలుగు కవితారంగంలో వచ్చిన ధోరణులను, కవిత్వాన్ని అంచనా వేయడం ఈ సంధానం ఉద్దేశ్యం. దీన్ని స్థూలంగా భారత స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కవితా రంగాన్ని అంచనా వేయడంగా భావించవచ్చు.

భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తరువాత - తత్పూర్వం ఉన్న స్వరూపం-ఆదర్శం-లక్ష్యం అన్నీ మారిపోయాయి. ఒక జాతీయాదర్శం పరపరిపాలన నుంచి విముక్తిని పొందడం అప్పటి లక్ష్యమై-తరువాత స్వతంత్రమైన జాతి స్వేచ్ఛగా భౌతిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో స్వస్థితినీ, సుస్థితినీ పొందే ప్రయత్నాలు ఆరంభమయినాయి. అయితే స్వాతంత్ర్యంతోపాటు దేశ విభజన జరగడం - జాతి చైతన్యంలో ఆత్మవిశ్వాసానికి బదులు పరాజయభావాన్ని నెలకొల్పింది. ఈ పరాజయ భావం సంకుచితత్వానికీ, భయానికీ, పిరికితనానికీ హేతువైంది. ఆ గుణాలు తెచ్చే అవగుణాలు అన్నీ జాతికి సంక్రమించాయి.

దాదాపు నూట యాభై సంవత్సరాలనుంచీ కొనసాగుతూ వచ్చిన భారత జాతీయ పునరుజ్జీవనోద్యమం ఆగిపోయినట్లే కనిపించినా జాతి అంతర్గత చైతన్యంలో అంతర్వాహినిగా కొనసాగుతూ వస్తున్నది. చైతన్య భూమికలోని ఈ విరుద్ధ శక్తుల సంఘర్షణ మన చరిత్రగా కొనసాగుతూ వచ్చింది. మన సాంస్కృతిక రంగంలో ఈ సంఘర్షణ ప్రధానవస్తువైంది.

అన్ని రంగాలతోనూ రాజకీయ రంగం ప్రాధాన్యం వహించింది. మన దేశచరిత్రలో రాజకీయాలకు ఇంత ప్రాధాన్యం ఇంతకు మునుపెన్నడూ లేదు. [illegible] పాలన కొనసాగిన ఇన్ని వందలయేళ్లలో కూడా సాంస్కృతికరంగం

స్వతంత్రమై జాతి భావుకతకు సజీవమైన అనుస్యూతికీ పట్టం కట్టింది. అయితే స్వాతంత్ర్యోదయం తరువాత ఈ భావప్రవాహం మందగించింది. సాంస్కృతిక నాయకత్వం లోపించింది. అన్ని రంగాలూ పదవీ దాహం కలవాళ్ళూ, ధన కాంక్షాపరులూ ఆవరించారు.

తెలుగు సాహిత్యం విషయం వస్తే స్వాతంత్ర్య సన్నివేశం ఒక మలుపును తెచ్చింది. కవి స్వాతంత్ర్యం క్రమంగా ప్రభుత్వోత్సవాలకూ ఆకాశవాణి మొదలైన సంస్థలకూ ఒదిగిపోతూ వచ్చింది. బహుళ ప్రచారం పొందుతూ వచ్చిన పత్రికలు వారి యిష్టానిష్టాల మీద రచయితను నిలబెట్టడం, నిరాకరించడం చేస్తూ వచ్చాయి. కవులు చాలామంది తమకు తెలియకుండానే ఈ మయ సభలో విభ్రాంతులౌతూ వచ్చారు,

అప్పటికే కాల్పనిక సాహిత్యోద్యమం క్రమంగా వస్తు సమాప్తి పొంది నవ్య సంప్రదాయ సాహిత్యంగా రూపుకట్టుతూ వచ్చింది. ఈ నవ్య సంప్రదాయంలో - కాల్పనికోద్యమంలోని వాగర్థ సౌందర్యానుసంధానాన్ని సంప్రదాయ సాహిత్యం తనలోకి చేర్చుకున్నది. జాతీయోద్యమ పునరుజ్జీవన భావధార - సంప్రదాయాన్ని సజీవంగా అవిచ్ఛిన్నంగా నిలబెడుతూ వచ్చింది. కేవల భావ శబలతను చిత్రించే ఖండకావ్యం నుంచి దాన్ని మానవ జీవనంలో అనుభవ లోకంలో ప్రతిఫలింపజేసి రసోదయానికి మార్గాన్ని సుగమం చేసిందీ నవ్య సంప్రదాయ సాహిత్యం.

అయితే వేరొకవైపు ఈ నవ్యతాస్పర్శ లేకుండా ప్రాచీన ధోరణిలోనే క్షేత్రమాహాత్మ్యాల వంటి రచనలు చేసేవాళ్లూ కొంతమంది లేకపోలేదు. అట్లాగే ప్రయోగాల పేరుతో నిష్ప్రయోజనమైన నిరర్థమైన సుదూర కళావాదాల సార్థవాహులూ లేకపోలేదు. సాహిత్య క్షేత్రం అనేక ముఖమై శిథిలమై పోతున్న దశ అది. ఈ దశ సాహిత్యంలో విశృంఖలతనూ, అలసత్వాన్నీ ప్రవేశపెట్టింది.

కృష్ణశాస్త్రి 1949 ఈ అరాచక దశలో ఇలా అంటూ వేశాడు—

"నేనూ నా [illegible] [illegible]....

[illegible]

గొలుపబోయి వికాసమూ ఆనందమూ ఇవ్వలేక పోతాం. కొందరం 'ప్రజలు, ప్రజలు' అంటూనే ప్రజాలోకానికి దూరంగా ఉంటూ దాని స్వరూపమూ, సంప్రదాయమూ, జీవద్భాషా గ్రహింపలేక, విజాతీయ సమాజంలోనుంచీ, విజాతీయ కంఠాలలో నుంచీ వచ్చిన రచనలను మన కంఠద్వారాల నుంచి వదులుతాం. కొందరం కేవలం కొత్తదనం చూపించి ప్రముఖులు కావడానికి ఉత్త ఓటి బొమ్మలచుట్టూ కొత్త దుస్తులు అతుకుతాం."

కృష్ణశాస్త్రి వాక్యాలను విశ్లేషణ చేస్తే మనకు స్థూలంగా గోచరించే అంశాలు ఇవి :

నవ్యతాస్ఫురణ లేకుండా గతానుగతికంగా సాగే ప్రాచీన కావ్యధోరణులు, పురాణానువాదాలూ, ప్రబంధరచనలూ, క్షేత్రమాహాత్మ్యములూ చిత్ర కావ్యాలూ—

చమత్కారం ప్రధానమై - శబ్దార్థాలగారడీతో తళుక్కుమనిపించే ముక్త కాదులు—

ప్రజాసాహిత్యం పేర ఈ దేశపు స్వభావానికీ, పరిస్థితికీ సంబంధంలేని-వైదేశిక భావప్రేరిత రచనలూ, సుఖాసన (ఈజీఛైర్) సిద్ధాంతుల ధోరణులు—

ప్రపంచ యుద్ధం వల్ల నిరాశా నిస్పృహలకు లోనైన యూరోపియన్ కళా రంగాలలో ప్రభవించిన విధ్వంసక, కళా మూల్యచ్ఛేదక వైయక్తిక కళా వాదాలైన అధివాస్తవిత, డాడాయిస్టు ధోరణులు—

వీటన్నింటినీ కృష్ణశాస్త్రి తిరస్కరిస్తున్నాడు. అయితే సమష్టి ప్రయత్నం ద్వారా ఒక వినూత్నోజ్జ్వల యుగాన్ని నిర్మించవచ్చుననే ధోరణి ఆయనలో స్ఫుటమౌతున్నది—

"కాని, మనలో కొందరు గొప్ప కవిబ్రహ్మలూ ఉన్నారు. జీవవంతమైన సృష్టి చేసిన వారూ, చేయగల వారూనూ. వీరందరూ వెంకటశాస్త్రి మొదలుకొని అతినవ్యుని దాకా ఒక మహాపరిషత్తులో సమావేశమయి కవి ప్రాజాపత్యము స్థిరపరిస్తే బావుండును. ఆ మహామేళనంలో నుంచి

జగత్తంత మానవాలయం కట్టగల ఏ తెలుగు నాటి వ్యాసుడు పుట్టుకొని వస్తాడో! అంతవరకూ నవ్య కవితోద్యమం సాగవలసిందే!"

కృష్ణశాస్త్రి పై మాటల్లో - జగత్తంత మానవాలయం కట్టగల - ఒక మహాకవి కోసం నిరీక్షణ కనబడుతున్నది, ఇంత పెద్ద భావానుకలనం విశ్వజనీనమైన ఏ మహేతిహాసమో చేయదగింది. కాని, స్వల్పపరిధి గల ఖండ కావ్యాలలో సాధ్యమయేది కాదు.

ఇప్పటికి తెలుగులో ప్రగతివాద కవితోద్యమం పశ్చిమ శిఖరానికెక్కింది. సర్రియలిస్టు డాడాయిస్టు ధోరణులు ఒక్కసారి మెరుపు మెరసినట్లు మెరిసినా త్వరలోనే అంతర్హితమయ్యాయి.

లండన్‌లో 1935 లో ఏర్పడ్డ భారతీయ ప్రగతిశీల రచయితల సంఘ ప్రణాళికలో ఎక్కడా మార్క్సిస్టు సిద్ధాంతాలకు అనుబద్ధం కావలసిన అంశం లేదు.

**"It is the duty of Indian writers to give expression to the changes taking place in Indian life and to assist the spirit of progress in the country. Indian literature, since the breakdown of classical culture, has had the fatal tendency to escape from the actualities of life."**

పైన పేర్కొన్న ప్రణాళికాంశాలను బట్టిచూస్తే ఉదాత్త సంస్కృతి (క్లాసికల్ కల్చర్) విచ్ఛిన్నమైన తరువాత దేశంలో ఒక పలాయన ప్రవృత్తి ఏర్పడినట్లు చెప్పబడ్డది. ఈ క్లాసికల్ సంస్కృతి అంటే ఏమిటో ప్రగతి వాదోద్యమం ఎప్పుడూ స్పష్టంగా పేర్కొనలేదు. ఈ ప్రణాళికలోనే ఉన్న **"Such literatrue was produced particularly during the past two centuries, one of the most unhappy periods of our history, a period of disintegrating feudalism and of acute misery and degredation for the Indian people as a whole"** అన్న వాక్యాలవల్ల జాతి జీవనంలోని శైథిల్యం పలాయన ప్రవృత్తి వలసపాలనవల్ల మనకు సంక్రమించ

చెందని స్పష్టపడుతున్నది. అయితే తెలుగుదేశంలో ప్రగతి వాదోద్యమం ఎప్పుడూ దేశీయ సంస్కృతినీ, జాతి ఉపలబ్ధినీ కించపరచే ధోరణినే వ్యక్తం చేసింది. మీదు మిక్కిలి తెలుగు దేశంలో ఈ ఉద్యమం నిర్వహించిన అభ్యుదయ రచయితల సంఘం ఆవిర్భావం వెనుక జస్టిస్‌పార్టీ వ్యాపింపజేసిన భావబీజాల అంకురాలు ఉన్నాయ్. జస్టిస్ పార్టీ జన్మతః ఆంగ్ల ప్రభుత్వానికి అనుకూలం కావడంవల్ల - "మంచి గతమున కొంచెమేనోయ్", "కన్నుగానని వస్తుతత్త్వము కాంచనేర్చిరి లింగిలీజులు", "దేశమంటే మట్టికాదోయ్", అన్న-ఆంగిలేయుల ధర్మరాజ్యము వర్ధిల్లమని కోరిన గురజాడ ఈ ప్రగతివాద ఉద్యమానికి ఆది పురుషుడు కావడం జాతీయోద్యమ ప్రబోధకమైన రాయప్రోలు వంటివారి సాహిత్యం సంకుచిత ధోరణిని వ్యక్తంచేసేదిగా భావించబడడమూ జరిగింది.

భారతదేశంలోని మిగిలిన ప్రాంతాలలో ప్రగతివాద కవితోద్యమానికి ఉన్నంత వైశాల్యమూ, సంప్రదాయానుబంధమూ తెలుగుదేశంలో కనిపించదు. హిందీలో నిరాలా; పంత్, అజ్ఞేయల స్థానం విలక్షణమయింది. అఖిల భారత ప్రగతిశీల రచయితల మహాసభకు 1936లో అధ్యక్షత వహించిన ప్రేమ్‌చంద్‌లో సంప్రదాయ ప్రగతిశీల ధోరణుల అనుస్యూతీ; సమన్వయమూ కానవస్తుంది. తమిళంలో సుబ్రహ్మణ్యం భారతి నుంచి ఈనాటివరకూ, కన్నడంలో బెంద్రే, కువెంపుల నుంచి గోపాలకృష్ణ అడిగ దాకా, మలయాళంలో కుమారన్ ఆశాన్ నుంచి ఈనాటి అయ్యప్ప ఫణిక్కర్ దాకా పరంపరా విచ్ఛేదం ఉద్దిష్టంకాలేదు.

కాని, తెలుగులో సంప్రదాయ విచ్ఛేదం ప్రధానాంశంగా ప్రగతి వాదోద్యమంలో సాక్షాత్కరిస్తుంది. తెనాలిలో మొదటి అభ్యుదయ రచయితల సంఘం మహాసభల్లో అధ్యక్షుడు తాపీ ధర్మారావు – "మన పూర్వ సాహిత్యమంతా జన సామాన్యానికి ద్రోహం చేస్తూ వుందన్నమాట తేటపడుతుంది. అదంతా స్వార్థపరులు చేసిన మోసం అని బోధపడుతుంది. నిజాన్ని మఱుగుపరచి, ప్రజలను చిన్నపరచిన వాఙ్మయం, అబద్ధాలకు చేయూత నిచ్చి అధికులను బలపరచే సాహిత్యం కల్లలకు కటికతనానికి పట్టుగొమ్మ" అని వివరించడం జరిగింది. 'మన పూర్వ సాహిత్య మంతా' అని చేసిన అంచనా వెనుక జాతిని విచ్ఛిన్నం చేయడానికి ఆంగ్లేయులు నాటిన ఆర్య-ద్రావిడ బ్రాహ్మణ-అబ్రాహ్మణ బీజాలు తెలుగుదేశంలోని ఈ ఉద్యమం పునాదుల్లోకి ప్రవేశించాయి. అందుకే తెలుగు

సాహిత్యంలో ప్రగతివాదోద్యమం ప్రధాన సాహిత్య ప్రవాహానికి దూరంగా ఉంటూ వచ్చింది. 'రక్షాగరుధూపంతో రమణీయపు శివమెత్తిన రణాచారి గణాచారి రణగుణాల' ధ్వనులతో, గంతులతో సాగిపోయింది.

అందువల్లనే ఈ ఉద్యమంలో ఎప్పుడూ సంప్రదాయ సాహిత్య చైతన్యాన్ని జీర్ణించుకున్న శ్రీశ్రీ ఇమిడి ఉండలేదు. మహాప్రస్థానంతో చాలా గీతాలు మార్క్సియ పరిధిలోకి ఇమిడి పోలేనివే. 'వ్యత్యాసం', 'దేశచరిత్రలు' రాసే రోజుల్లోనే-రాజకీయాలలో నానాజాతి సమితి ఎటువంటిదో కళా ప్రపంచంలో సర్రియలిజం అట్టిదని చెప్పాలి (1939) అంటాడు. అరసం ఉద్యమం తెనాలిలో ప్రారంభమైనా రాయిస్టులు ఎవరూ ఇందులో పాల్గొనలేదు. శ్రీశ్రీ కూడా రాజమండ్రిలో 1936 ప్రాంతంలో జరిగిన మూడవ మహాసభలో, విజయవాడలో 1955 లో జరిగిన ఐదవ మహాసభల్లో మాత్రమే పాల్గొన్నాడు. మధ్యలో నైజాం కొలువు చేశాడు. 1950 లలో 'మేమే' లాంటి అనార్కిస్టు రచన చేయడం, సదసత్సంశయం లాంటి జిజ్ఞాసా రచన చేయడం ఆయన నిబద్ధత ఏమేరకు ఉందో స్పష్టం చేస్తుంది. ఆరుద్ర ఒకచోట ఇలా అన్నాడు— "తొలి రెండు మహాసభలకూ శ్రీరంగం శ్రీనివాసరావు రాలేదు. అప్పటికింకా ఆయన తాను అనార్కిస్టుననీ సర్రియలిస్టుననీ చాటుకునేవాడు. పాశ్చాత్య దేశాలలో సర్రియలిజం వైఫల్యాలను గురించి శెట్టి ఈశ్వరరావు చక్కని వ్యాసం రాశాడు. దానిమీద శ్రీరంగం శ్రీనివాసరావు కోపం తెచ్చుకున్నాడు. ఈ.రా.కు. రాసిన ఒక కార్డులో 'ఇంతకూ నువ్వు కమూనిస్టువు కదా!' అని శ్రీనివాసరావు ఎత్తిపొడిచాడు". (ఆరుద్ర-ప్రజాకళలూ ప్రగతివాదుల్లూ 167 పే.)

అయితే స్వాతంత్ర్యోదయ వేళలో తెలంగాణం నుంచి వెల్లువడ్డ ఒక విలక్షణమైన గొంతులో జాతీయ ప్రజాస్వామ్య ప్రగతివాద ధోరణుల సమన్వయం గోచరించింది—

'నా తెలంగాణ కోటి రత్నాల వీణ'
'ప్రాణముల్లొడ్డి, ఘోర గహనాటవులన్ పడగొట్టి మంచి మా
గాణములన్ సృజించి.........రైతుదే
తెలంగాణము రైతుదే
ముసలి నక్కకు రాచరికమ్ము దక్కునే'.

'జెండా ఒక్కటె మూడు వన్నెలది
దేశంబొక్కడే భారతాఖండాసేతు హిమాచలోర్వర.'

తెలంగాణం అనే మూలం నుంచి దాశరథి ప్రపంచం నలుమూలలంతా ప్రాకే మహావృక్షంగా తన కవితా దర్శనం చేశాడు. దాశరథి తెలంగాణం భౌగోళిక ఖండానికి పరిమితం కాదు. కాని, అది అతడు మొలకెత్తిన నేల. 'మూడు కోటుల నొక్కటే ముడి బిగించి పాడినాడ మహాంధ్ర సౌభాగ్యగీతి' అని మహాంధ్రాన్ని ఆహ్వానించి-

'ముక్కున శాంతిబీజములు మోయుచు బోయి
విశాలభూమి నల్దిక్కుల చల్లి వచ్చితిమి'

అని ప్రపంచ శాంతి సందేశాన్ని ప్రసరింపజేశాడు.

స్వాతంత్ర్యోదయంతో ప్రగతివాద కవిత్వోద్యమంలో ఒక మలుపు వచ్చింది. దాశరథి దాన్ని ప్రధాన ప్రవాహంతో అనుసంధించే ప్రయత్నం చేశాడు.

ఒక వైపు ప్రగతివాదంలో ఈ పరిణామం సంభవింపగా, మరొకవైపు నవ్య సంప్రదాయం తెలుగు కవిత్వంలో నూతన వసంతాన్ని తెచ్చి పెట్టింది. కాల్పనిక కవిత్వం రోజులలోనే ఈ ఉద్యమానికి కారణంబులు, ఉద్బోధకములు ఏర్పడ్డాయి. ఆంధ్రోద్యమ స్ఫూర్తితో 'ఆంధ్రపౌరుషం' రచించిన విశ్వనాథ (1917) భారత జాతీయ సంస్కృతీ పరివేషంలో వస్తుసాంద్ర సంయోజనతో ఆంధ్ర ప్రశస్తిని 1925లో రచించాడు. సర్వ ధర్మ బీజముగా ప్రణయాన్ని కుమారిల [illegible] ప్రణయంగా తీర్చిదిద్ది గిరికుమారుని ప్రేమగీతాలు పాడాడు. ప్రణయ వివాహాల నడిమి సంఘర్షణను కిన్నెరసాని పాటలలో అనార్కలిలో ప్రదర్శించాడు. కిన్నెరసానిలో ప్రకృతి మానవచైతన్యంతో ప్రవహించింది. మానుషదైవ ప్రణయం శృంగారవీథిలో వస్తువైంది. ప్రణయం పేరుతో విశ్వ[illegible] [illegible]

ఈ భూమిక మీద పింగళి కాటూరుల సౌందరనందం 1932 లో వచ్చింది. సౌందరనందంలో ప్రణయం వైయక్తిక జీవన సంవేదనలకు పరిమితం కాకుండా సమాజజీవనంలో అంతర్భాగమై కారుణ్యంలో సేవలో పర్యవసించ వలసిన అవసరం వ్యాఖ్యానింపబడ్డది. ఇందులో సుందరీనందులు సమాజ సంబంధం లేని వైయక్తిక ప్రణయోపాసకులైతే బుద్ధదేవు డాతనిని ఆ పరిధి నుంచి బయటకు లాగి సమాజకార్యంలో సంలీనం అయ్యేందుకు సిద్ధం చేయడం ఇందులో ఇతి వృత్తం. మహాత్ముని జీవనతత్త్వం బుద్ధుని ముఖాన సువ్యక్త అయింది.

ఇంచుమించు ఇదేకాలంలో రాణాప్రతాపసింహచరిత్ర 1934 లో వచ్చింది. రాజశేఖరకవిరచనలో స్వాతంత్ర్య సంగ్రామ ప్రేరణ అంతర్గర్భి తంగా ఉన్నది. రాణాప్రతాపుడు ఆనాటి భారతీయ స్వరాజ్యకాంక్షకు ప్రతీక ఆయినాడు. కొద్ది సంవత్సరాలలో శివభారతకావ్యమూ ఆవిర్భవించింది. దీని వెనుక ప్రేరణమూ స్వధర్మ స్వరాజ్య సంస్థాపనమే. వర్తమాన సమాజ సంవేదనలకు ఇతిహాస రంగభూమి మీద పాత్రకల్పనం చేయడం వీటిల్లో జరిగింది. ఈ రచనలు రెండూ రాయలసీమనుంచి వచ్చినవే. అక్కడ కవుల మీద కాల్పనికోద్యమ ప్రభావం దాదాపు మృగ్యమనే చెప్పాలి. అందువల్ల ఈ రచనల్లో కవిత్రయ భారత రచనా ప్రాబల్యం ఎక్కువ. కాల్పనికోద్యమాభివ్యక్తి లోని తళతళలు తక్కువ.

ఇదేకాలంలో తెలుగు కవితారంగంలో ప్రచురంగా ప్రకాశించిన కవి జాషువా. జాషువామీద జాతీయోద్యమం ప్రభావం వేసినంతగా కాల్పనిక కవిత్వం లోని ప్రణయ భావాభివ్యక్తులు ప్రతిఫలించలేదు. తిరుపతి వేంకటకవుల ధారాశుద్ధి మార్గంలోంచి పుట్టుకు వచ్చిన కవి. అయితే ఈ రచనలో ఆధునిక జీవన చైతన్యం ఉన్నది. సమకాలీన ఉద్యమాల ప్రాచుర్యం ఉన్నది. దానిలోంచి పుట్టిన కావ్యాలే గబ్బిలమూ, ఫిరదౌసీ.

ఈ కాలంలో శిఖరాయమాణంగా నవ్యసంప్రదాయ కవిత్వం యొక్క సర్వతోముఖాభివ్యక్తిగా వచ్చిన ఆధునికేతిహాసం శ్రీమద్రామాయణ కల్ప వృక్షం. ఈ మహాగ్రంథం 1934 లో ప్రారంభం అయినా 1961 దాకా రచన కొనసాగింది. కృష్ణశాస్త్రిగారన్నట్లు ఇది తెలుగువారి వ్యాసుని తపస్సు అయింది.

అందుకే కె. ఆర్. శ్రీనివాస అయ్యంగార్ విశ్వనాథను 'అభినవ వ్యాసుడు' అని ప్రస్తుతించారు. (వార్తాంశం - ఆంధ్రప్రభ 7 th May 1971).

కల్పవృక్షం సమకాలీన సంవేదనలలోనుంచి పుట్టి- సార్వకాలీన సంవేదనలను వ్యక్తం చేసింది. సంప్రదాయంలోని కథాంశాన్ని స్వీకరించి త్రికాలాలకు చెందిన మానవీయ చైతన్యాన్ని ఆవిష్కరించింది. ప్రాచీనచ్ఛందోరూపం గ్రహించి కాల్పనికోద్యమంలోని నూతనాభివ్యక్తిని సంయోజించి విశిష్ట లక్షణాన్ని సంతరించుకున్నది. తన ఆవిర్భావంతో పూర్వ కవులను గూర్చిన అంచనాలను పరివర్తింప జేసింది. ఆధునిక వ్యవహారంలోని పలుకుబడినీ, కాకువునీ, వాక్య క్రమాన్నీ ఇతిహాసంలో నిక్షేపించి నూతనశైలిని నిర్మించింది.

కల్పవృక్షంలో శ్రీరాముడు 'మనుజుడను నేను మనుజ ధర్మంబు నాది' అని స్పష్టంగా పేర్కొంటాడు. కల్పవృక్షంలో వివాహవ్యవస్థ సమాజసుస్థితికి ఎట్లా మూలమో, దానిని కాదన్న కామం ఎంత విధ్వంసకారియో నిరూపింపబడింది. అందుకే శూర్పణఖ, రావణుడు ఈ సిద్ధాంతాలకు ప్రతినిధులుగా కానిపిస్తారు.

కల్పవృక్షం ప్రాచీన వేదవిజ్ఞానాన్నీ, పూర్వోత్తర మీమాంసలనూ, దర్శనాలనూ, తంత్రశాస్త్రాన్నీ ఇతర ప్రాచీన భారతీయ విజ్ఞానాన్నంతా తనలో పొదువుకున్నది. అట్లాగే ఆధునిక విజ్ఞానశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, మృగయాది విద్యలూ ఇవన్నిటినీ తనలో లీనం చేసుకున్నది.

కల్పవృక్షానికి కేంద్రం సృష్టిలో అనాదిగా కొనసాగే దేవాసుర సంఘర్షణ. ఇది ఈ సృష్టిని భౌతిక దశనుంచి దివ్యదశకు పరిణమింపజేయడంలో అడుగడుగునా-దాని క్రమానికి - వేగం పెంచే ప్రధాన సాధనం. దీనిలో పాత్రలన్నీ ఈ దిశను ప్రదీప్తంచేస్తూ కావ్యంలో ప్రవర్తిస్తాయి. అంతేకాక పాత్రలలోని దేవాసుర సంపత్తికి అట్టడుగున ఒక ప్రాథమిక చైతన్యం గొంతు వినిపిస్తూవుంటుంది. ఆ ప్రాథమిక చైతన్యస్పందాన్ని కవి 'జీవుని వేదన' అన్నాడు. కావ్యంలో రెండంచులూ ఉపరితలంలోని కథాంశాన్ని-వివేచనాశీలం చేస్తున్నది. ఈ వివేచనాశీలం ఆధునిక కాలం లక్షణం. ఈ లక్షణమే ఈ కావ్యాన్ని 'నేటి' కావ్యం చేస్తున్నది.

కల్పవృక్షంలోని దేవాసుర సంఘర్షణకు సీతారావణులను ప్రధాన ప్రతీకలుగా నిర్మించడం జరిగింది. దైవం మూలప్రకృతి-అవికృతి మైంది. సత్త్వమయమైంది అది తమోమయంగా పరిణమించేసరికి అసురమైంది.

'జనక జాత శరీర నిష్ఠం బౌసర్వ
కడక వ్యవసాయి యగు పంక్తికంధరుండు
రావణుని బోధ దేవభావావృతునిగ
చేతకు గడంగు పూతధాత్రీ తనూజ

దైత్య ధాత్రికి వచ్చిన ధరణి జాత
దైత్యభావము కనునని దైత్యరాజు
దైత్యధారుణి పెకలించి దైవగుణము
రాసముద్భిన్న మగునని ధరణిజాత

ఆమె ఖండించి తినియైన నసురగుణము
కాల్చియవ ద్రొక్కగా పంక్తికంధరుండు
సఖిలమును నాశనము చేసియైన గాని
దైవగుణము ప్రతిష్ఠింప జనకజాత.'

ఈ విధంగా కల్పవృక్షం విశ్వజనీనంగా ఎదిగి - శాఖోపశాఖలుగా విస్తరించి- దేశకాలాలకు అతీతంగా పెరిగింది.

స్వాతంత్ర్యోదయ వేళకు నవ్యసంప్రదాయ మార్గం బలపడుతూ వచ్చింది. ఈ మార్గంలో ఇతిహాసము, పురాణము, కావ్యాలూ, ఖండకావ్యాలూ-ఇట్లా అనేక రచనల్లా వచ్చాయి. రచనల్లో వైవిధ్యం-రచయితల వైయక్తికానుభవాల మూలం నుంచి సమష్టి జాతీయ చైతన్య ప్రకటనం చేసే లక్షణం వల్ల వీటిల్లో అనంతమైన సృజనాత్మక ప్రతిభావికాసం సాధ్యమయినది.

అప్పటికే శ్రీశ్రీ సమకాలికులైన కొందరు కవులు తమ గొంతుకల్ని విప్పి రచనలు చేయడం ఆరంభించారు. [illegible] రామకృష్ణమాచార్యుల '[illegible]', జంధ్యాల పాపయ్యశాస్త్రి 'విజయశ్రీ', పుట్టపర్తి నారాయణాచార్యుల 'శివతాండవం',

'మేఘదూతం' మొదలైన కావ్యాలు క్రమంగా ఈ మార్గాన్ని సుసంపన్నం చేస్తూ వెలువడటం ప్రారంభించాయి.

కాల్పనిక కవిత్వంలోని సౌకుమార్యం బెళ్ళూరి శ్రీనివాసమూర్తి రచనల్లో సాక్షాత్కరించింది. తుమ్మలవారి ఆత్మకథ స్వచ్ఛమైన క్లాసికతను, ఆధునిక కథను మేళవించింది.

ప్రగతివాదోద్యమం క్రమంగా తెరమరుగవుతున్న దృశ్యం యిది. తరువాత బహుముఖీనమైన నవ్య సంప్రదాయ మార్గం ప్రక్కగా చెదురుమదురుగా కొన్ని చిన్న చిన్న ధోరణులు వ్యక్తమౌతూ వస్తున్నాయి. ఈ ఉద్యమాల రాపిడిలో నవ్యసంప్రదాయం కొత్త కొత్త అంశాలను చేర్చుకుంటూ వచ్చింది.

నాటినుంచి నేటివరకూ నవ్య సంప్రదాయ మార్గంలో వచ్చిన రచనలు వైవిధ్యంవల్ల, ప్రయోగ బాహుళ్యంవల్లా ఈ వ్యాసపరిధిలో సమగ్రంగా చర్చించే వీలివ్వడం లేదు.

'ఏమానందము భూమీ తలమున శివతాండమట శివలాస్యంబట' అని ప్రారంభించి శివతాండవ కావ్యం సృష్టిలో ఉన్న అంతర్గతలయనూ, ఆంతరిక మైన ఏకసూత్రాన్నీ స్పష్టంగా వ్యాఖ్యానించింది. స్వామి తాండవంలో ప్రకృతీ, చరాచరజగత్తూ, దేవ మనుష్యతిర్యక్కులూ, బ్రహ్మవిష్ణువులు-సర్వదేవతలూ పాల్గొన్నారు. సమస్త సృష్టి చైతన్యం స్వామితాండవంలో తల్లిలాస్యంలో ప్రతి ఫలించింది. ఈ అత్యంతికమైన సృష్టి రహస్యాన్ని ఈ కావ్యం మనోహరంగా విశదం చేసింది. సర్వపూర్వాంధ్ర కవితాసౌందర్యంతో; రఘువంశంలోవలె జాతిజీవన తత్త్వవ్యాఖ్యానంతో మధునాపంతులవారి 'ఆంధ్రపురాణం' వెలువడింది.

తరువాత వెలువడిన ఈ మార్గరచనల్లో- బోయి భీమన్న దీపసభ, ఇంద్ర గంటి హనుమచ్ఛాస్త్రి దక్షారామం, కీర్తితోరణం - బాడాల రామయ్య కృష్ణ కథావిపంచి, లేపాక్షి - విద్వాన్ విశ్వం పెన్నేటిపాట - దాశరథి మహాంధ్రో దయము, మహాబోధి - నారాయణరెడ్డి కర్పూర వసంతరాయలు - గుడిమెళ్ళ రామానుజాచార్యుల శబరి - గడియారం వేంకటశేషశాస్త్రి రఘునాథీయము - తుమ్మల వారి మహాత్మకథ - వానమామలై వరదాచార్యుల పోతన చరిత్రము-

బెళ్లూరి శ్రీనివాసమూర్తి కొండవీటి రెడ్డిరాజ్య మహోదయము - ముదివర్తి కొండమాచార్యుల పూర్ణాహుతి - బీర్నీడి ప్రసన్న పృథ్వీభాగవతము - వి. వి. ఎల్. నరసింహారావు ఆనందభిక్షువు - విశ్వనాథ వేంకటేశ్వరులు కాళిందీ పరిణయము - చాగంటి గోపాలకృష్ణమూర్తి హేమమాలి - కోటగిరి విశ్వనాథ రావు ఖడ్గనారాయణము - ముదిగొండ వీరభద్రమూర్తి వందేమాతరం - దుర్గానంద్ మధూలిక, భీతాంగన - నాయని సుబ్బారావు జన్మభూమి- వానమామలై జగన్నాథాచార్యులు రైతురామాయణము - ఎక్కిరాల కృష్ణమాచార్యుల గోదా వైభవము - తుమ్మపూడి కోటేశ్వరరావు కుమారభారతి - ఇలా ఎన్నో రచనలు పేర్కొనవలసినవి ఉన్నవి.

ఈ కావ్యాలన్నీ రూపంలోగానీ, అంతర్యంలోగానీ ఒకేరకం రచనలు కావు. వీటిమీద ఆధునిక యుగపుటొత్తిడి ఉన్నది. భావకవిత్వంలోని జిలుగు ఉన్నది. సమకాలీన చారిత్రకావసరాల స్పృహ ఉన్నది. సంప్రదాయచ్ఛందో రూపం సామాన్యమే అయినా కథాకథనంలో నిర్మాణంలో బింబకల్పనలో వస్తు భావ నిర్దేశంలో ఎంతో వైవిధ్యాన్ని సంతరించుకొన్నవి.

విశ్వనాథ కల్పవృక్షం రచిస్తూనే శ్రీకుమారాభ్యుదయము, ఝాన్సీరాణి, శివార్పణము మొదలైన కావ్యాలు మధ్య మధ్య రచిస్తూనే ఉన్నారు. ఆరవ దశకం మధ్యనుంచీ ఆయన మధ్యాక్కరలలో శతకాలు రచిస్తూవచ్చారు. ఈ శతకాలలో వచన ధోరణీ - వివేచనా లక్షణమూ ప్రకటమయినవి. ఈ ప్రోద్బలంవల్ల ప్రయోగ వాదకవుల కాలంలో ప్రయోగంగా ప్రారంభమయిన వచన పద్యం ఒక ధోరణిగా తెలుగులో స్థిరపడింది. కవిత్వంలోని పద్యమూ, గేయమూ గ్రాంథిక భాషా పరిమితులలోనే ఉండిపోయినై. ప్రజల వాడుక భాషను యథా తథంగా వ్యక్తదశలోకి తెచ్చింది వచనపద్యం మాత్రమే. సరళమూ నిరలం కృతమూ సర్వసామాన్యమూ అయిన వచన కవితా రూపం ఒకవిధంగా కవిత్వం లోని లయకూ, అంతర్గత సంగీతానికి విరుద్ధంగా ప్రారంభమైంది. ఒకవిధంగా 'అకవితా' ఉద్యమం లాంటిదే ఇది. అయితే కవులకు పాతవాసనలు పోలేదు. వచన పాదాలలోని వచన లక్షణాన్ని విరిచివేసే ప్రయత్నం జరిగింది.

శిష్ట్లా, నారాయణబాబు, శ్రీశ్రీలు ఈ రూపానికి ఆరంభకులే అయినా 1960 తరువాతనే దీనికి ప్రాచుర్యం లభించడం ప్రారంభమయింది. 1960 దాకా దీన్ని

తీసుకు వచ్చిన వారు పిఠాపురం యువరాజా, పఠాభి, ఆరుద్ర, కుందుర్తి, దాశరథి- ఐదుగురూ. అయితే 1960 నించీ వచన రూపంలో కవిత ఉండాలనే ఒక రూపవాదాన్ని నిలబెట్టే ప్రయత్నం కుందుర్తి చేపట్టాడు. క్రమంగా యువ తరంలో ఈ రూపం ప్రాచుర్యాన్నీ బాహుళ్యాన్నీ పొందింది.

వచన కవితలో ఆరంభంలో ప్రగతివాద ప్రయోగవాదాలు వాటి భావాలూ ప్రాధాన్యం పొందాయి. క్రమంగా వైయక్తికానుభూతుల పరిధిలో కాల్పనిక కవిత్వం ప్రభావం వేయడం ప్రారంభించింది. కాల్పనిక ధోరణి సంగమించిన ఈ దశలో ఇది త్రివేణి అయింది.

కవుల వైయక్తిక సామాజిక సంవేదనలు దీని ద్వారా వ్యక్తం కావడం ప్రారంభించాయి. సరళమైన వచనం క్రమంగా అంత్యప్రాసలనూ, నూతన శబ్ద భావచిత్రాలనూ, కొత్త వాక్యపు విరుపులనూ స్వీకరించి అభివ్యక్తిలోని నవ్యత్వాన్ని సంతరించుకొన్నది. ఈ విధంగా వచన కవిత్వం కవుల స్వేచ్ఛా ప్రయోగాలకు ఇష్ట భూమిక అయింది. మానవ కారుణ్యవాదమూ - మార్క్సిజమూ - మర్మవాదమూ ప్రేమవాదమూ, అనుభవాల చిత్రణమూ - దీని వస్తువులయినవి. శిక్షితులకు విస్తృతంగా రెక్కలు చాచడానికి, అశిక్షితులకు సులభంగా ప్రవేశించడానికి వచనకవిత్వం దోహదం చేసింది.

ఈ కాలంలో వచన కవిత్వాన్ని ప్రకటించిన కవుల్లో సోమసుందర్, తిలక్, బైరాగి, మాదిరాజు రంగారావు, గోపాల చక్రవర్తి, దుర్గానంద్, అరిపిరాల విశ్వం, మోహన్ప్రసాద్, ఇస్మాయిల్, రంథి సోమరాజు, నగ్నముని, చేతనా వర్త కవులూ, శివారెడ్డి, కొత్తపల్లి సత్యనారాయణ, శేషేంద్ర మొదలైన వాళ్ళను పేర్కొనవచ్చు.

వచన కవిత్వం మార్క్సిజం బంధాలను ప్రగతివాద కవిత్వంనించి వదులుచేసి ముందుకు వచ్చింది. ఈ బంధంనుంచి విముక్తుడైన కవి స్వేచ్ఛకూ ఆత్మాభివ్యక్తికి నిబద్ధుడైనాడు. వీళ్ళమీద ఎలియట్, బాదిలేర్, మలార్మే వంటి కవుల అభివ్యక్తిముద్రలు బలంగా కానవచ్చాయి.

ఏడో దశకం నడుమనుంచీ ఒకటి రెండుసార్లు చీకటి వర్షం కురిసింది. కవిత్వం పేర అశ్లీలాన్నీ, జుగుప్సనూ సమకూర్చిన దిగంబరకవులు వచ్చిన దారినే వెళ్ళిపోయారు. ఆ దశకం పూర్తయ్యేసరికి సాయుధ పోరాటం ద్వారా సమాజం మార్పును ఆహ్వానించే విరసం ఆవిర్భవించింది. క్రమంగా ఈ ధోరణి గేయాలను ప్రధాన వ్యక్తీకరణ మార్గంగా స్వీకరించింది. వస్తుతః ప్రగతివాద కవిత్వంతో తత్త్వంలో గానీ, దాని ఎత్తుగడలోకానీ దీనికి భేదం లేదు. మధ్యలో ఉన్న కాలపు అంతర్యాన్ని బట్టి భిన్నంగా వ్యవహరించడం కేవలం సౌకర్యం కోసమే.

ఆధునిక కాలంలో తెలుగు సాహిత్యంలో - ముఖ్యంగా కవిత్వంలో ప్రవర్తిల్లిన అంశాలు నాలుగు. క్లాసికత - కాల్పనికత - ప్రగతివాదం-ప్రయోగ వాదం. స్థూలంగా ఇవి వేర్వేరుగా కనిపించినా అమిళితంగా విడిగా ఏ అంశమూ కనిపించవు. అనేక సందర్భాలలో వీటి కలయిక భిన్నభిన్న నిష్పత్తులలో వ్యక్త మవుతుంది. ఈ నలభై యేళ్ళలోని కావ్యాలలో ఈ సమ్మేళన వైవిధ్యం కానవస్తుంది.

| వాదం | రూపం | వస్తువు | లక్షణాలు |
|---|---|---|---|
| క్లాసికత | సంప్రదాయ చ్ఛందోరూపం | కథావస్తు సంగతి | విశ్వజనీనత, మానవీయ మూల్యాలు, జాతీయ సాంస్కృతిక విలువలు |
| కాల్పనికత | గీతి లక్షణం | వైయక్తి కానుభవ అభివ్యక్తి | ప్రకృతి తాదాత్మ్యం, వ్యక్తి స్వేచ్ఛ, విషాదం, జాతీయాభిమానం, ప్రణయ భావం |
| ప్రయోగ వాదం | ఛందో విచ్ఛేదం | అసంప్రదాయ ధోరణి | వ్యవస్థా విచ్ఛేదం, పరంపరా విచ్ఛేదం, బాధ్యతా రాహిత్యం |
| ప్రగతివాదం | ప్రజాగేయరూపం | సమాజ పరివర్తనం | వర్గచైతన్యం, గతితర్కం, భౌతికవాదం, జాతీయాతీత దృష్టి |

క్లాసిక రూపం - కథాకావ్యం ప్రధానంగా దాని అభివ్యక్తి సరళమైన కథన లక్షణం గలిగినది. దాదాపు పౌరాణికమైంది. కాల్పనిక ధోరణికి ప్రధాన రూపం ఖండకావ్యం. దీని అభివ్యక్తి విలక్షణమైంది. క్లాసికశైలికన్నా భిన్న మైంది. లలితమూ, మధురమూ, విలక్షణమూ అయిన రూపకోపమాన సామగ్రి, పద సంయోజనలే కాకుండా రచన ఆంతరమైన సంగీత సాంతత్యం కలిగి ఉంటుంది. ఈ సంగీత సాంతత్యం వలన భావం మనస్సులో మ్రోగుతూ మ్రోగుతూ క్రమంగా అంతర్లయతోపాటుగా లీనమవుతున్నది. ప్రయోగవాదంలో కాల్పనికతలో ఉన్న సౌందర్యతృప్తి లేదు. ప్రకృతి తోడి తాదాత్మ్యం లేదు. ప్రపంచయుద్ధాలవల్ల కలిగిన క్షోభవల్ల, యాంత్రికీకరణవల్ల తనకుతానే వేరై పోతున్న మానవుడు - తన క్షోభలోంచి, కసిలోంచి వ్యక్తీకరించుకొన్న రూపం ఇది. భాషలో ఛందస్సులో వస్తువులో భావవ్యక్తీకరణలో ఉన్న అన్ని మర్యాద లను ఛేదించడమే దీని లక్ష్యం. కృష్ణశాస్త్రి రచనలనూ పఠాభి రచనలనూ పోల్చుకుంటే మనకు ఈ పోలిక స్పష్టపడుతుంది. 'అర్థాన్ని అథ్వాన్నపుటడవిలో వదిలేసి పద్యానికి గద్యానికి పెళ్ళి చేద్దాం' అన్నప్పుడు ఇదే ధోరణి స్పష్టమవు తుంది. ప్రయోగవాదం సంప్రదాయ దూరమైన పదబంధాలను, బింబసామగ్రిని కల్పించేమాట యథార్థమే.

నవ్య సంప్రదాయ కావ్యాలకు ప్రధాన చిహ్నం క్లాసిక రూపం - సంప్ర దాయచ్ఛందోరూపం- కథా కావ్యత్వం. దీనితోపాటు కాల్పనిక అభివ్యక్తి కలిగి వుండడం. కాల్పనిక యుగ లక్షణాలైన ప్రకృతి తాదాత్మ్యాది లక్షణాలను తనలో పొదివికొని ఉండటం. ఈ లక్షణాలన్నిగానీ కొన్ని కొన్ని గానీ ప్రాధాన్యం వహించి కావ్య భావ భూమికను ఆక్రమించినప్పుడు అది నవ్య సంప్రదాయ రూపంగా ఏర్పడుతున్నది.

ఈ ధోరణి మూలపు పొదులో క్లాసికత - లక్షణాలైన జాతి పరంపరగా అందించే సాంస్కృతిక మూల్యాలు మానవీయ చేతన విశ్వజనీన లక్షణం కలి గించి ఈ కావ్యాలను దేశకాలాలకు అతీతంగా తీర్చిదిద్దుతున్నవి. ఈ రెండు అంశాలను అంతర్గర్భించుకోకుండా ఎంతగా ప్రాచీన రూపం కలిగి ఉన్నా, కాల్ప నిక అభివ్యక్తిని సంతరించుకొన్నా అది తాత్కాలిక రచన అవుతుందే కాని నవ్య సంప్రదాయ రచనల్లో మిగిలి వుండదు.

నవ్య సంప్రదాయ మంటే గతానుగతికంగా వచ్చే సంప్రదాయ సాహిత్యంగా భ్రమించే వీలులేదు. దీనివల్ల సమగ్రావగాహన కలుగదు. పరంపరగా వచ్చే విశ్వసనీయములైన పురాణేతిహాసముల అనువాదా లేవీ నవ్యసంప్రదాయంలో చేరవు. ఎందుకంటే, వీటిల్లో సమకాలీనస్పందం చేరలేదు.

నవ్యసంప్రదాయంలోని అంశాలలో సంప్రదాయ కావ్యచ్ఛందో రూపం వదలి వచ్చిన కావ్యాలు కూడా వస్తూవున్నవి. వీటిల్లో క్లాసికతలోని లక్షణాలు, కాల్పనికతలోని లక్షణాలు కలసి ఉంటూవున్నవి. అయితే యిక్కడ కథ లోపించడం వల్ల వ్యక్తి కేంద్రంగా విశ్వజనీనమైన అనుభూతిని వెల్లడించే ప్రయత్నం జరుగుతున్నది. రసానుభవ వేళలో సాధారణీకరణం పొందినప్పుడు రామాదుల పరివేషాలు తొలగి కేవలం వ్యక్తి మాత్రం మిగిలిన దశలోని అనుభవ లక్షణం ఇదే కావచ్చును. ఈ లక్షణాన్నే ఇటీవల అనుభూతివాదంగా పిలుస్తూ వున్నారు. అనుభూతివాదాన్ని ఇట్లా అంచనా వేసుకోవచ్చు:

| | | | |
|---|---|---|---|
| అనుభూతివాదం | ఖండకావ్య రూపం<br>వచన చ్ఛందస్సు | ఆత్మాశ్రయ<br>ధోరణి | క్లాసిక-కాల్పనిక<br>లక్షణాలు |

అయితే ఈ ధోరణిలో ఈ పరిమితులు దాటి ప్రగతివాద లక్షణాలు చేరడమూ కద్దు. వైలక్షణ్యంకోసం, వైచిత్రికోసం ప్రయోగవాద ధోరణులు కూడా కానరావడం కద్దు.

ఈ ధోరణిలో వచ్చే కవిత్వం నవ్యకవిత్వం అనవచ్చునేమో! ఆధునిక కవిత్వంలో ఇప్పటి ధోరణి ఇది. ఒక విధంగా ఆధునిక కాలంలోని భావధోరణులు చాలావరకు దీనిలో సంగమించడం మనకు కనిపిస్తుంది.

అనిపిరాల విశ్వం, మాదిరాజు రంగారావు, చేతనావర్త కవులు, నారాయణ రెడ్డి, శేషేంద్ర, మోహన ప్రసాద్, ఇస్మాయిల్, శ్రీకాంతశర్మ మొదలైన కవులందరూ ఈ మార్గంలోనివారే అనవచ్చును.

ఒకవైపు నవ్యసంప్రదాయమూ, వేరొకవైపు నవ్యకవితాధోరణీ [illegible] ప్రత్యక్షంగా కానవస్తున్నవి. ఋతంభర, నా దేశం [illegible] ప్రజలు, [illegible]

చితీ-చింతా, అనుభూతి గీతాలు, విశ్వంభర ఈ మార్గంలో వెలువడ్డ ప్రధాన గ్రంథాలు. క్రమంగా ప్రగతివాద ధోరణీ దీనిలో సంగమిస్తున్నది. శివారెడ్డి నేత్ర ధనుస్సు దీని కుదాహరణ.

అయితే అరవైలలో వేరొక వాదం వచ్చింది. వచన కవితలో కూడా కథా కావ్యం రావాలని. కథాకావ్యమైతేనే పరిమిత వలయంనించి దాటి కవిత్వం ఎక్కువ మందికి చేరువవుతుందని. ఈ వాదాన్ని కుందుర్తి ప్రారంభించగా తిలక్ ప్రభృతులు తిరస్కరించారు. తిలక్ ప్రభృతుల వాదం ఏమంటే - ప్రాచీన కాలంలో కథాకథనానికి వేరే సాహిత్య రూపాలు లేవు. అన్నింటికీ ప్రధాన భూమిక కావ్యమే. కాని, ఈనాడు నవల, కథ. మొదలైన కథారూపాలు విడిగా ఏర్పడ్డవి. అందువల్ల కావ్యంలో కథాకథనం ప్రయోజన రహితమనీ, కావ్యం కేవలం అనుభూతి వ్యంజకంగానే మిగిలిపోవాలనీ.

కాని, ఇతిహాస మహాకావ్యాలకు కథా రూపాలు ప్రత్యామ్నాయం కాగలవా అన్నది ప్రశ్న. కథారూపం మానుషేతివృత్తాన్ని వ్యక్తం చేస్తుంది. రసానుభవానికి భూమిక మానుషేతివృత్తమే. ఇతివృత్త రహితంగా రస స్ఫురణ లేదు. కథ - కవిత్వంలోని భావ శబలతాదుల చేత రసస్ఫోరకం అవుతున్నది. కథారహితంగా కేవల భావ ప్రస్తారం చేసే కవిత్వం - శబ్ద భావ బింబాలతో ఎంత అందంగా తీర్చబడినా రసలోకానికి దూరం కావడంలేదా అన్నది ప్రశ్న. అంటే కవిత్వం - కాల్పనిక యుగం చివరలో కలిగిన వస్తు దారిద్ర్యంవల్ల ఏర్పడ్డ శూన్యంలోకి మళ్ళ ప్రయాణం చేస్తున్నదని తాత్పర్యం. అంతేకాకుండా, భావాన్ని అందుకునే ఆధారంగా మానుషేతివృత్తం వుండటం ఎంత అవసరమో కాళిదాసాదుల కావ్యాలవల్ల తెలియవస్తుంది.

ఆధునిక కవితకు రసలోకద్వారాలను నవ్యసంప్రదాయ వాదం తెరచి గొప్ప ఉపకారం చేసిందని చెప్పాలి. భావోదయంతో కేవలం పరిమిత పాఠకులకు చెందిన నేటి కవిత మానుషేతివృత్త కథనంవల్ల మధ్యతరగతి దాకా దిగివస్తున్నదని చెప్పవలసి వస్తున్నది. మామూలు కథకు కవిత్వం లేనప్పుడు రసదీప్తి ఉండదు. కవిత్వం పరుసవేది లాగా కథను బంగారం చేస్తుంది. 'కవిత్వం ఒక ఆల్కెమీ'.

1970 లో ఏర్పడ్డ విరసం ప్రచార తీవ్రతవల్ల కొన్ని కొన్ని అంశాలను సాహిత్య రంగంలో వ్యాప్తిలోకి తేగలిగింది. వాటిల్లో ముఖ్యమైనవి 'మార్క్సిస్టు దర్శనం పునాదిగా వెలువడే భావాలను ప్రచారంచేస్తూ రచయితలు సామాజిక చైతన్యాన్ని ఉద్దీపింపచేయాలి' 'మార్క్సిజాన్ని శాస్త్రంగానేకాక శస్త్రంగా ఆమోదిస్తూ రాజకీయ మహోద్యమానికి చేదోడు వాదోడు కావాలి' - 'నూతన ప్రజాతంత్ర విప్లవం లక్ష్యంగా - మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం వెలుగులో విప్లవ రచయితల సంఘం సాహిత్య కళా రంగాలను తన కార్యక్షేత్రంగా ఎంచుకుంటుంది'. ఈ వాక్యాలు గమనించితే ఈ వర్గం క్రమంగా సాహిత్యాన్ని రాజకీయ ప్రసవశాలలో మంత్రసానిగా మార్చివేసిన అంశం స్పష్టమవుతుంది.

ఈ ధోరణి క్రమంగా సృజనాత్మక కృషికి సరిహద్దులు గీచి ఆ పరిమితుల్లో ప్రవర్తింప జేయడం వల్ల - నియలికృత నియమరహితాం, హ్లాదైకముఖాం, అనన్య పరతంత్రాం- ఇత్యాదిగా నిర్వచింపబడ్డ కవిత్వం ఒక పార్టీకో ముఠాకో దాస్యం చేయవలెననే ధోరణి హెచ్చింది. ఇతివృత్తమూ, ఛందస్సూ, భాషా అన్నీ క్రమంగా నిర్ణయింపబడుతూ వచ్చాయి. వర్గపోరాటం, గేయరూపం, మాండలికభాషా- ఇది నియమం. ఈ నియంత్రణకు నిబద్ధత అని పేరు పెట్టడం జరిగింది. ఈ విధంగా ప్రగతివాదమూ, విప్లవవాదమూ తెలుగు సాహిత్యంలో ఒక ప్రతిభారాహిత్యానికి మూడు దశాబ్దాలు పట్టం కట్టాయి.

సోమసుందర్ ఒకచోట ఇలా అన్నాడు: 'వ్యాసాలనో, రాజకీయ ఉపన్యాసాలనో నడుములు విరిచి వచనపుతుంటలు పేర్చి ఇదే కవిత్వమంటే అది బలహీనుని ఆక్రందనమే కాని ఆహ్లాద కవిత్వం కానేరదు. ఆరణ్యక ఆక్రోశాలను కవిత్వమనుకునేవారు మయసభలో ప్రవేశించిన దుర్యోధనులు. ఉత్తమ కవిత్వం ద్రౌపది. అట్టివారి భంగపాటు చూసి నవ్వకేం చేస్తుంది? (పే. 136). అభ్యుదయ కథా రచనకు కొన్ని ఇతివృత్తాలు మాత్రమే పనికి వస్తాయని చెప్పే శాస్త్రకారులు కళామర్మజ్ఞులు కారు. ఏ ఇతివృత్తం స్వీకరించి రచన చేసినా జీవితంపట్ల గాఢతర మమతాభిమానాలు ప్రదర్శించగలవాడే ఉత్తమ రచయిత (పే. 107). గతంనుంచి సంక్రమించిన విజ్ఞాన వారసత్వమంతా వెండికూ కొరగానిదని దాన్ని ధ్వంసింపచేయడం ద్వారానే సుఖమయ భవిష్యత్తు నిర్మాణ సాధ్యమని ఊక

శూన్యవాదం విధ్వంసవాదం తలెత్తుతూంది'(పే. 114)-'కవిత్వం కాలాతీత కాంతి రేఖ' (1984). పై వాక్యాలలో దిగంబర కవులు, విప్లవ కవులూ ప్రవర్తింప జేసిన విధ్వంస శూన్యవాదాలపట్ల సోమసుందర్ ఆందోళన వెల్లడి అవుతున్నది.

కవిత్వం గురించిన ఒక మీమాంస తలెత్తింది. అకవిత్వం కవిత్వవేషంతో వందిమాగధులతో కోలాహలంతో కవితారంగం మీద తాండవం చేయడం ఆరంభించింది. కుటుంబరావు వంటివాళ్ళు ఉద్యమాలవల్ల మంచి కవిత్వం రావడంలేదని బాధపడటం జరిగింది. (కవిత్వంలో నిశ్శబ్దం - వ్యాస సంపుటి- ఇస్మాయిల్ 1986, పే. 75).

ఈ సందర్భంలో వెల్చేరు నారాయణరావు కవిత్వాన్ని ఆనంద కవిత్వం అనీ, చైతన్య కవిత్వమని రెండు విభాగాలు చేశాడు:

—ఆనందం అలౌకికమైనది. చైతన్యం భౌతికమైనది.

—సమాజం నుంచి శ్రోతల్ని విడదీసివారి మనస్సు చుట్టూ ఒక సౌఖ్యావరణాన్ని కల్పిస్తుంది ఆనంద కవిత్వం. సమాజ వ్యవస్థపట్ల జాగృతి కల్పించి అందులో భాగస్వామిగా వ్యక్తిని చైతన్యవంతుణ్ణి చేస్తుంది చైతన్య కవిత్వం. ఆనంద కవిత్వంలో జగత్తు విధి ప్రేరితమైన ప్రత్యామ్నాయ రహితమైన ఏకైక మార్గంలో నడుస్తుంది. చైతన్యకవిత్వంలో జగత్తు స్వయం నియతమైన పరిణామాత్మకమైన మార్గంలో నడుస్తుంది. ఆనంద కవిత్వంలో పాఠకుడు కేవల భోక్త. చైతన్యకవిత్వపు జగత్తులో పాఠకుడు భాగస్వామి. పాక్షికకర్త. ఆనంద కవిత్వపు ఫలం విగళిత వేద్యాంతర విషయత్వం. చైతన్య కవిత్వపు ఫలం క్రియాశీలత; జాగృతి; ఆనంద కవిత్వం బాహ్య పరిస్థితులకు నప్పేలా వ్యక్తి ఆవేశాల్ని మలుస్తుంది. చైతన్యకవిత్వం బాహిర పరిస్థితులను మార్చేలా వ్యక్తి అంతరంగాన్ని పిలుస్తుంది. ఆనంద కవిత్వం సుఖదాయకం. యథాస్థితి రక్షకం. చైతన్య కవిత్వం శక్తిదాయకం. ఆందోళన కారకం విప్లవాత్మకం - (తెలుగులో కవితా విప్లవాల స్వరూపం -పే. 178, 1978).

ఈ విభజన జాగ్రత్తగా గమనించితే రచయిత మెలకువతో ప్రాచీన భారతీయ కవిత్వాన్ని సాహిత్యాన్ని తన దృష్టితో పరిశీలించి దాని లక్షణాలను నిర్దేశించి దానికి విరుద్ధమైన లక్షణాలను ఈనాటి ప్రగతివాద కవిత్వంలో ఉన్నాయని చెప్పటం ఉద్దేశించినట్లు తెలియవస్తుంది.

చైతన్య కవిత్వం మార్క్సీయవాద కవిత్వమైతే తదితరమైన దంతా ఆనంద కవిత్వం కావాలి. ఈనాటి మార్క్సిజానికి చెందని ఆధునిక కవిత్వమంతా పైన పేర్కొన్న విధి ప్రేరితమనే సిద్ధాంతాన్ని యథాస్థితి రక్షణనూ, కేవల సుఖావరణతో తృప్తిపడే లక్షణమూ కలిగి వుంటుందనుకోవడం సత్యదృష్టి కాదు. భారతీయ తత్త్వ శాస్త్రం ఎప్పుడూ మానవుని కర్తృత్వాన్నీ, సృష్టి పరిణామ శీలాన్నీ తిరస్కరించలేదు. ఈ పరిణామం పురోగమనం జీవుని సజాగ్రత్ప్రవృత్తి మీద ఆధారపడి ఉంటుంది. 'తస్మాదుత్తిష్ఠ కౌంతేయ' అని గీత చెప్పినా-'ఉత్తిష్ఠ జాగ్రత ప్రాప్యవరా న్నిబోధత' అని ఉపనిషత్తు చెప్పినా మానవుని కర్మశీలుణ్ణి చేసింది.

భారతీయ దృక్పథంలో సాహిత్యం ఎప్పుడూ వ్యక్తి కర్తవ్యాన్ని గురించిన జాగ్రత్తను సంస్కార రూపంలో అందించే సాధనం మాత్రమే. రస సిద్ధాంతం-విశ్వ జనీన మానవీయ చైతన్యంలోకి వ్యక్తిని ప్రవేశపెట్టి-అతని సంస్కార పరిధిని విస్తృతం చేస్తున్నది. ఈ 'మెటమార్ఫసిస్' మనకు తెలియకుండానే కావ్యం నిర్వర్తిస్తున్నది. అందువల్లనే ప్రభుసమ్మిత, మిత్రసమ్మితాలైన సారస్వతాలకంటే - కాంతాసమ్మితమైన సాహిత్యం శివేతరక్షతికి ఎక్కువగా దోహదం చేసింది. అయితే సమాజంలోని పరిస్థితులు మారినప్పుడు తాత్కాలిక సన్నివేశాలలో సార్వకాలీన సాహిత్య ప్రమాణాలను మనం అందుకోలేక పోవచ్చును. 'విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు' అన్నప్పుడు అంతటి ఇతిహాసాన్ని నిర్వహించిన వ్యాసుని చైతన్యం సర్వసమాజాన్ని వ్యాపించి తనదిగా చేసుకోవడం వల్లనే అతడు విష్ణుసన్నిభుడయ్యినాడు.

మొత్తంమీద ఈ శతాబ్దంలో తెలుగు సాహిత్యం - ముఖ్యంగా కవిత్వం యొక్క ప్రధాన ధోరణి పునరుజ్జీవనోద్యమం మార్గంగా- కాల్పనిక వాద, నవ్య సంప్రదాయ మార్గాలలో ప్రవర్తించింది. అప్పుడప్పుడూ దీన్ని ఒరిపిడి పెడుతూ ప్రయోగవాద ప్రగతివాదాలు కొనసాగాయి. అయితే దీన్ని ఒక అంచనా వేసి చూస్తే ఎక్కడా మూలచ్ఛేదం కాలేదని ప్రధాన ధోరణి జాతీయ చైతన్యం పొదల్లోంచి విశ్వజనీన పతాకంతో వివిధ దిశలకు కొమ్మలు, కొమ్మలుగా కొనసాగిందని పేర్కొనవచ్చును.

## ఉపయోగపడ్డ గ్రంథాలు :


| | |
|---|---|
| ఆరుద్ర | ప్రజాకళలూ - ప్రగతివాదులూ, - మద్రాసు (1985). |
| కృష్ణశాస్త్రి, దేవులపల్లి, వేంకట | పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం (వ్యాసం), భారతి; జనవరి (1949). |
| కె. కె. రంగనాథాచార్యులు (సంపా) | ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు, హైదరాబాదు (1982) |
| సుబ్రహ్మణ్యం, జి. వి. (సంపా) | సమాలోచనం, హైదరాబాద్ (1980). |
| సుప్రసన్నాచార్యులు, కోవెల | సాహిత్య వివేచన, వరంగల్ (1971). |
| సోమసుందర్ | కవిత్వం కాలాతీత కాంతిరేఖ, పిఠాపురం (1984). |
| నారాయణరావు, వెల్చేరు | తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, విజయవాడ, (1978). |
| ఇస్మాయిల్ | కవిత్వంలో నిశ్శబ్దం, కాకినాడ (1987). |

# నవీన ప్రబంధములు

వడలి మందేశ్వరరావు

ఆ మధ్య విశ్వనాథకు జ్ఞాన పీఠ బహుమతి లభించినప్పుడు, ఎవరో పాత్రికేయుడులా ఉంది, ఒక ప్రశ్న వేశాడు: "మీ రామాయణ కల్పవృక్షానికి ఈ పురస్కారం లభించడంవల్ల మళ్ళీ పద్యం బలాన్ని పుంజుకుంటుందనుకుంటు న్నారా?" అని. అంటే ఈ ప్రశ్నకు వెనుకనున్న అనుమానం ఛందోబద్ధమైన పద్యం చచ్చిపోయిందనీ అది మళ్ళీ బ్రతికే అవకాశమున్నదా? అనీ అర్థం వస్తోంది.

కాని 'రాణా ప్రతాపసింహ చరిత్ర' నుంచి 'పోతన చరిత్రము' వరకూ, 'ఆంధ్ర పురాణము' నుంచి 'వందేమాతరం' వరకూ వచ్చిన కావ్యాలనూ; 'హేమ మాలిని', 'కుమార భారతి' వంటి కృతులను చూచినప్పుడు, పద్యం కాని, పద్య కావ్యం కాని, సాహిత్య ప్రపంచం నుంచి అంతరించినట్లు కనబడదు. ఈ కావ్యా లకు ఫెల్లున పెద్ద పందిళ్ళు వేయకపోయినా, వీనిమీద వచ్చిన ఆలోచన లేవీ మరీ పరిమితంగా లేవు.

ఈ శతాబ్దం తొలి అర్ధశతాబ్దంలో సాహిత్య ప్రక్రియలలో కొట్టవచ్చినట్టు కొన్ని మార్పులు కనబడతాయి. సంప్రదాయ కవిత్వానికి భిన్నంగా కాల్పనికో ద్యమం ఒకటిన్నర రెండు దశాబ్దాలపాటు దేశాన్ని ఊపివేసింది. ఆ మీద వచ్చిన ధోరణులలో పాశ్చాత్య ప్రభావం మరింత ప్రస్ఫుటమై ఛందస్సు నుండి పద్యం విడివడింది. సాహిత్యానికి సమకాలీన సామాజిక ప్రయోజనాన్ని ఆశించిన అభ్యు దయ ప్రస్థానం దేశాన్ని మరి ఒకటిన్నర దశాబ్దాలు పాలించింది. ఆ మీద వచ్చిన ధోరణులలో కొన్ని విప్లవ పంథాను ఆశ్రయించి ఉన్నాయి; కొందరు ప్రతీక పంథాను గౌరవించారు.

ఇన్ని ధోరణుల మధ్య నుంచి దారిచేసుకుంటూ, ఎవ్వరినీ కాదనకుండా, ఎవరి మీదా ధ్వజమెత్తకుండా, నవీన ప్రబంధ* మొకదారి నేర్పరచుకొన్నది. ఈ దారి నేర్పరచుకొనేటప్పుడు తనది ఫలానా పంథా అని మరీ గరువంగా ఏమీ ప్రకటించుకోలేదు. శ్రీ వానమామలై అభ్యుదయ కవులను కూడ స్తుతియించిన వాడే కాని, ఎవ్వరినీ విరసమైన మాట నొక్కదానినీ అనలేదు. 'వందేమాతరం' కవి ఆధునిక కవిత్వ ధోరణులపట్ల సానుభూతి కలవాడే. 'కీర్తి తోరణం' కృతికర్తకు అటు భావకవులతోనూ, ఇటు అభ్యుదయ కవులతోనూ గాఢమైన పరిచయం ఉంది. కాగా ఈ కవులు కేవలం ఛందోబద్ధపు రాతికట్టడాల్లో కూర్చుని, లోకం వెలుతురును బహిష్కరించినవారు కారు. ఆనాటి సాహిత్య వాతావరణాన్ని అవగతం చేసుకొని కూడా, తమ కావ్యాలకు తత్క్షణ కీర్తి రాదని తెలిసికూడా, ఒక ఆత్మవిశ్వాసంతో, ధైర్యంతో ఈ కావ్య నిర్మాణానికి సంసిద్ధమైనారు.

## సమకాలీన ప్రభావం

ఎంతస్థూలంగా చూసినా ఇవి ప్రబంధాలేకాని, వెనుకటి ప్రబంధాలు కావు. వీట్లన్నింటా సమకాలీన ప్రభావం కనబడుతుంది. 'ఆంధ్రపురాణ' కర్త నూనూగు మీసాల ప్రాయంలో ఆంధ్రోద్యమం పట్ల ఎంతో మక్కువచూపి, ఆంధ్రపత్రికను నడిపినవాడు. 'వందేమాతరం' కవి స్వయంగా స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నవాడు. అది రాజుకొని ప్రజాఉద్యమం ఎలా అయిందో కన్నులార చూసిన కవి. 'కీర్తితోరణం' కవి కావ్యాన్ని ప్రారంభిస్తూ, క్షమార్పణలా కనబడని ఒక సంజాయిషీని ఇచ్చాడు.

"తాతల నేతి మూతి నెఱితావి పసందు పొగడ్తలందు నా
జాతిని మత్తుగొల్పి దిగజార్ప దలంపను గాని- తొంటి శొ

---

*ఇందులో పరిశీలింపబడిన నవీన ప్రబంధాలు: శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి 'ఆంధ్ర పురాణము', శ్రీ వానమామలై వరదాచార్యులవారి 'పోతన చరిత్రము', శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తిగారి 'వందేమాతరం', శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రిగారి 'కీర్తితోరణము'.

ర్యాతిశయమ్ము సంస్కృతి నరమ్ములలో ప్రవహింప బాడెదన్
గీతులు గట్టి ఆంధ్రసిత కీర్తికి తోరణమాల లల్లుచున్."

వెనుకటి కాలంలో కూరుకొని పోవాలని కాదట కవి ధ్యేయం- పరిరక్షించవలసిన సంప్రదాయాన్ని, సంస్కృతిని, అభిజ్ఞతతో, గొప్ప ఆవేశంతో, పోరాడుతూ నిలుపుకోవాలనే కవి ఆకాంక్ష.

'ఫిరదౌసి' మంచి రసవత్తరంగా వ్రాసిన చిన్న కథాకావ్యం. కాని పోతన మన కవి. అందులో వానమామలై వారి ఊరికి మరీ సన్నిహితుడు. అదీ గాక అభ్యుదయ కవిత్వ ధోరణి వచ్చాక, రాజుల కెదురు తిరిగిన వాడని అభ్యుదయ కవులకు పోతనపట్ల ప్రత్యేకమైన అభిమానం. అందుచేత అభ్యుదయ కవిత్వపు గాలులు వీచే కాలంలో పోతన చరిత్ర కొందరు కవులకు ఘాటైన కథావస్తువుగానూ, మరికొందరికి స్వాదువైన ఇతివృత్తంగానూ గోచరించడం సహజం. వానమామలై వారి పోతన ప్రతికూల శక్తుల ప్రాబల్యాన్ని ఎరిగికూడా దానికి తలవంచని ధీరుడు. తాను నమ్మిన సిద్ధాంతాన్ని ఎవ్విధంగానూ కలుషితం చేయడానికి అంగీకరించని ఉద్ధతుడుకాని ధీరుడు.

## ఇతివృత్తం

ఆలంకారికుల దృష్టిలో నుంచి చూస్తే ఈ నాల్గు ప్రబంధాలలోని ఇతివృత్తమూ ప్రసిద్ధమైనదే. అయితే వెనుకటి కావ్యాలలోని ఇతివృత్తాలకూ ఈ నవీన ప్రబంధాలలోని ఇతివృత్తాలకు ఒక తేడా ఉంది. వీటన్నిటా వస్తువు చరిత్రనో, జీవిత చరిత్రనో ఆశ్రయించి ఉన్నది.

'పోతన చరిత్ర' కొక పురాణ గౌరవాన్నియ సంకల్పించి, కవి ఈ చరిత్రను శౌనకాది మహర్షులకు సూతుడు చెప్పాడని అన్నాడు. 'తారాశశాంక' కథను కూడా శౌనకాది మహర్షులకు సూతుడు చెప్పినట్లు వ్రాసాడా ప్రబంధకవి. అంతకన్న నిజంగా 'పోతన చరిత్ర'ను సూతుని చేత చెప్పించడంలోనే ఎక్కువ ఔచిత్యముంది. అంతతో ఊరుకోక పోతన చరిత్రకు భూమికగా లోకాంతరాలలో కొత్త కథ జరిగినట్లు కవి చెపుతూ, సింగభూపాలుడూ, శ్రీనాథుడూ, చిదానందుడూ, భోగినీ-అందరూ వివిధ దేవతల అంశలతో పుడతారని అంటాడు. ఈ ఎత్తుగడ వల్ల కవి సాధించిన ప్రయోజనం లేకపోలేదు.

పోతన చారిత్రక పురుషుడే; కవే, కాని ఆయనను వట్టి కవి అనీ, భాగవతాన్ని నరాంకితం చేయ నొల్లని కవి అనీ అనుకుంటే ప్రజకు తృప్తి లేదు. ఆయన చుట్టూ ఎన్నో కథలను పెంచుకుంది, రాముడు కృతిపతిత్వాన్ని అర్థించడం, కర్ణాటకిరాట కీచకులకు కావ్యాన్ని అమ్మనని వాగ్దేవికి వాగ్దానం చేయటం, 'సిరికిం జెప్పడు' పద్యం చుట్టూ అల్లుకున్న కథ, ఎద్దులు లేకనే నాగలి పొలాన్ని దున్నడం- ఇవన్నీ ప్రజకు పోతనపట్ల గల అభిమానాన్ని ప్రకటిస్తాయి కాని, వాస్తవాన్ని యథాతథంగా ప్రతిబింబించవు. అయితే కవి వీనిని ఉపయోగించుకొని నాయకునికి ఉత్కర్ష కల్గించటానికి ఎక్కువ అవకాశం ఉంది. వీని నుపయోగించుకోవడానికి ప్రాతిపదికను కల్పించడానికీ, కథకు పురాణాని కున్న గౌరవాన్ని కల్గింపటానికీ, సూతుని ప్రసక్తీ, ఇంద్రాది దేవతల ప్రసక్తీ, తీసికొని రాబడింది. కాగా పుక్కిటిపురాణంగా భావింపబడే సంఘటన లన్నింటికీ కవి ఒక అతిలోక భూమికను కల్పించాడు.

ఇక 'వందేమాతరం' నేలమీద నిలద్రొక్కుకుని ఉన్న చరిత్ర. 'పోతన చరిత్రము' దానికి చాల దవ్వున ఇంకోవైపున ఉన్నది. మొదటి దానిలో వాస్తవికత, యదార్థ కథనం కనబడుతుంది. రెండో దానిలో పుక్కిటి పురాణానికి కావ్యత్వాన్ని కల్పించడానికి కవి సంకల్పించాడు. అందుచేత 'వందేమాతరం'లో కావ్యత్వం కన్న పరాయి పాలనను ప్రతిఘటించాలన్న ప్రేరణతో కూడిన ఉత్సాహం ప్రాముఖ్యం వహిస్తుంది. ఈ ఆవేశాన్ని అందుకున్న కార్యశూరుల జీవితంలోని సంఘటనలు, సన్నివేశాలు, వారి ఉద్బోధలు మనలను ఉత్తేజపరుస్తాయి. 'పోతన చరిత్ర'లో భాగవతకవి పోతన ప్రజలమీద అంత ప్రభావాన్ని నెరపగల్గడానికి ఊహాకందని కారణాలకు కవి కావ్యత్వాన్ని కల్పించాడు. దీనికి ప్రాథమికంగా ఉన్న కల్పన తర్వాతి కథకు మనలను సన్నద్ధులను చేస్తోంది. 'వందేమాతరం' లోని కథనాన్ని చరిత్రలో అనుసంధిత మవుతుందో లేదో మనం చూసుకోవచ్చు; 'పోతన చరిత్ర'ను అలా చూసుకోనవసరం లేదనీ, వీలు లేదనీ ఈ కల్పన హెచ్చరిస్తోంది. నీ కున్న సందేహాలనూ, ప్రశ్నలనూ తుడిచి పెట్టి 'పోతన చరిత్ర'ను సమీపించాలి. నీ కున్న చారిత్రక జ్ఞాన సంపత్తి నంతనూ ఉపయోగించుకుంటేనే 'వందేమాతరం' అర్థమవుతుంది.

ఈ రెండింటికీ మధ్యగా ఉన్నది 'ఆంధ్ర పురాణం'. ఇందులో చరిత్రా ఉంది, పురాణమూ (myth) ఉంది.

పురాంధ్ర ప్రభువుల చరిత్ర పురాణీకరింపబడింది కనుక ఇది 'ఆంధ్ర పురాణ' మైంది. అయితే ఆ చరిత్ర 'అణిమణుఁగు మేలి ముసుఁగులో' అందగిస్తూ, కొంత విస్పష్టం గానూ, కొంత అస్పష్టం గానూ ఉంది. చారిత్రక పరిశోధకుడు చరిత్రను సాక్ష్యాధారాలతో సవివరంగా మనకు అందచేస్తాడు. అనుశ్రుతంగా వినవచ్చే కథలలోనూ, పుక్కిటి పురాణాల్లోనూ, కావ్య పీఠికలలోనూ, శాసనాలలోనూ ఉన్న అంశాలను జల్లెడ పడతాడు. ఆయన దృష్టి, 'ఇది అందమైనదా, ఇది ఔచిత్యాన్ని పోషిస్తుందా, ఇది హృదయాన్ని స్పందింప చేస్తున్నదా', అని కాదు. ఇది ఇలా జరిగిందా, లేదా అన్నదే అతనికి కావలసింది. ఇలా జరగడానికి హేతువు నిర్ద్వంద్వంగా తెలుస్తే, దానిని మనముందు ఉంచుతాడు; లేకపోతే తన ఊహ ఇట్టిదని, సాధ్యమైనంతవరకు నిష్పక్షపాత వైఖరితో పరిశీలిస్తాడు.

కవికీ చరిత్ర కావలసిందే. కాని చరిత్రకారుడు పుక్కిటి పురాణమని నమ్మిన దానినుంచి ఎంతో కావ్య సామగ్రిని కవి కొల్లకొట్టుతాడు. పురాణాలలో కనపడే శునశ్శేపుని కథకు అర్థ మిది అయి ఉంటుందంటాడు చరిత్రకారుడు. మధునాపంతులవారు ఆ కథను కథగానే తీసికొని; శునశ్శేపునితో తొలిగా జాలినీ, ఔదార్యాన్నీ, ఆ మీద ఆతని భయాన్నీ, ఆవేదననీ కవిగా చూడగల్గాడు. ఇది చరిత్రగా యదార్థమా అన్న ప్రశ్న 'ఆంధ్రపురాణ' కవికి అక్కరలేదు. ఇట్టి సన్నివేశంలో మానవ హృదయ స్పందన ఇట్టిదిగా ఉంటుందా? ఉండదా? అన్నదే ముఖ్యమైనది. దాని నాశ్రయించే ఆయన కథనం సత్యమైనదా, కాదా అని సహృదయుడు నిర్ణయించుకొంటాడు. చరిత్రకారునికి విజయ రాఘవ నాయకుడు నిరతాన్నదానం చేసే ఉదార స్వభావం కలవాడు మాత్రమే. కాని, కవికి శ్రీరంగనాథదేవి ముంగర మాయమవడం ఎంతో అవసరమైన కథ. దానిలో నుంచి కవి ఎంతో నాటకీయతను సాధించాడు; ప్రభువు దైవభక్తిని ప్రదర్శించగల్గాడు. అన్నదానం ఫలప్రదమవడానికి శ్రీరంగనాథేశ్వరి [illegible] [illegible] నిరూపించడానికి సంఘటన కవికి ఎంతో ఉపయోగపడింది.

'ఆంధ్రపురాణం' అంతర్గించటానికి ఇలా అద్భుతమైన [illegible] ఎన్నో ఉన్నాయి. (అన్నింటినీ కవి ఇలా ఉపయోగించుకోగల్గాడని [illegible]) [illegible]

కవికి చిక్కు గల్గిన తావులన్నీ చరిత్ర మరీ విస్పష్టంగా ఉన్న తావులే. అక్కడ కవి సంయమాన్ని వహించి ఉన్నదున్నట్టుగా ప్రవచించాడు. 'ఆంధ్రపురాణం' చదువుతే ఆంధ్రుల చరిత్ర పట్ల అవగాహన ఏర్పడుతుంది. చరిత్రలో గజిబిజిగా ఉన్న ఘట్టాలు ఇక్కడ విశదంగా ఉన్నాయి. కాని, 'వందేమాతరం' చదివిన వానికి స్వాతంత్ర్యోద్యమ చరిత్ర తెలియడం కన్న, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర తెలిసినవానికే 'వందేమాతరం' పట్ల మంచి అవగాహన కల్గుతుంది.

ఇక 'కీర్తితోరణం' కాకతీయ యుగానికి సంబంధించిన కావ్యం-నిజానికి ఖండకావ్యాల సంపుటి. శౌర్యంలోనూ, శిల్పంలోనూ, సంగీత సాహిత్యాలలోనూ కాకతీయ యుగం ఆంధ్ర చరిత్రలో ఒక స్వర్ణయుగం. అందుకే ఈ భూమి ఖండంలో కాస్త కాలుమోపితే చాలు, శరీరం పుల్కరిస్తుందంటాడు కవి. ఈ తెలంగాణములోని రాయి రప్పయును మనసిచ్చి మాటాడుతాయట! "ఒక గాలి పాయ నూరక పల్కరింపుము వినిపించు నేదొ కమ్మని గళమ్ము!" ఇలా ఆవేశం లోనూ, గొంతులోనూ, ఈ కవి మీద కాల్పనిక యుగ ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. అంటే 'కీర్తితోరణం'లోని వస్తుకిరణం భావకవిత్వపు కటకంలో నుంచి మనోజ్ఞమైన వివర్తనాన్ని పొంది ఇంద్రధనుస్సురంగుల నీనుతోంది. "ఓరుగంటి భాగ్యాలయమందు నీలితెర" యాడగా, "కాకతీయ కథ వ్రాయదలంచు కవీంద్రు కంటిలో రాలెను బాష్పధారలు పరంపరగా, కరుణార్ద్ర ముగ్ధముల్!" అంటే 'ఆంధ్రపురాణ' కర్తలా వస్తువునుంచి దూరంగా, సాక్షి మాత్రునిగా ఉండి, ఇంద్రగంటివారు కావ్యాన్ని నిర్వహించరు. 'హంపీక్షేత్ర' కవికి శిలలు ద్రవించి ఏడ్చినట్టు కనబడగా, ఇక్కడ కవే ఆ ఆవేశానికి లోనయాడు. ఇది కాల్పనిక కవులకు సైజమయిపోగా, ఇతిహాస కవులలో బలహీనతే అవుతుంది.

## శిల్పసమీక్ష

'కీర్తితోరణం' లోని ప్రతీ ఖండాన్నీ ఒక స్వయం సంపూర్ణమైన శిల్పంగా మలచాలని కవి ఆశయంలా కనబడుతుంది. 'ఈశ్వర సంకల్పమ్ము' లో ప్రారంభమునుంచి ముగింపు వరకూ విభిన్న అంశాలు చక్కగా అమరాయి. ఖండారంభములో ప్రభాతప్రద్యుతి భోగము దుర్నిరీక్ష్యంగా కనబడుతుంది. ఆయన భోగ మెట్టిదని? "హంసతూలికాతల్పం బానుపు జేరి శయనించు ... భోగినిపై!" ఆ మీదట కృతిస్వీకారానికి ముగ్ధుడైన రాజు "ఆ వీరా

చల చోళ పాండ్య విజయ ప్రాప్తాంధ్ర సర్వంసహా శ్రీ నేతృత్వము కంటె నీ కృతి యెలర్చెన్ మాకు శశ్వత్ప్రధన్!" అని అంటాడు. అప్పుడే "మాచల్దేవి గొంతెత్తి సంగీతాలాపన కిన్నరుల్" మురిసేటట్టుగా పాడి, కాకతినాథు డెందమును మెప్పించింది. ఇంతకంటె ఏ దేశానికైనా, ఏ ప్రభువుకైనా అదృష్టం ఏముంటుంది అని శ్రోత అనుకున్నంతలో, "ప్రొద్దువాలె నంత!" అంటాడు కవి. అది వెన్నెల రాత్రిగా కించిత్తు సేపు తోచినా, "నమాసరాత్రి పొంచున్నది!" తురుష్కుల దండయాత్రలు ప్రారంభమయాయి. నలువంకల నుంచి దుర్విధి ముసురుకొని వచ్చి, మున్నూరేండ్ల కాకతి పతులపాలన అంతమైంది. కాకతీయ సామ్రాజ్యపు ఉదృష్టాన్ని రేఖాచిత్రంగా చూస్తే, అది క్రమక్రమంగా నింగి కెగబ్రాకి, హఠాత్తుగా, అవ్యవధిలో నేలకొరిగిపోయింది.

తర్వాతి ఖండం 'చీకటి వెలుగులు' మంచి ఆవేశంతో వ్రాసిన ఖండం. తొలిభాగంలో కాకతీయ సామ్రాజ్య పతనానంతరం తెలుగునాట నాటి ప్రజల దుస్థితికి కవి వణికిపోయాడు. ఆమీద రాజుకున్న శౌర్యాగ్నిలో కవికి ఉత్సాహం కల్గింది. ఖండాంతంలో ప్రోలయ తమ్మునికి చేసిన ఆదేశం-ఉపదేశం-తో ఈ ఖండం మంచి ముగింపుకు రావడంతో మనకూ ఊరట కల్గుతుంది.

'ఈశ్వర సంకల్పము'ను నిర్వహించిన తీరు సాహిత్య దృష్టినుంచి చూడగా, అంతటి సామ్రాజ్యపు పతనానికి కేవలము కాలమే కారణమనిపిస్తుంది. కాలపురుషుని వల్ల మహా సామ్రాజ్యాలకే విధి వక్రీకరిస్తే, సామాన్య మానవుని స్థితి ఎట్టిదిగా ఉంటుందో అన్న బెంగ కల్గుతుంది. 'చీకటి వెలుగు'లలో పురుష కారం వల్ల చితికిపోయిన అదృష్టాన్ని కొంతలో కొంతయినా పునరుద్ధరించుకో వచ్చునన్న ఆశ కల్గుతుంది. తన పతనానికి కారణం విధి అనీ, బాగుపడడానికి కారణం పురుషకారమనీ నమ్మడం మానవుని బలహీనత. ఇట్టి బలహీనతకు లోనుగాకుండా, విజయాన్ని సాధించడ మెలాగో 'తిరిగి యెగిరిన తెలుగు జెండా!' నిరూపిస్తోంది.

'ఆంధ్రపురాణం'లో ఆంధ్ర సామ్రాజ్యాల చరిత్ర, చాలవరకు సాహిత్య చరిత్ర సమాంతరంగా నడిచాయి. ఏదయినా, చరిత్రకనుక సంఘటనలను ఒక సరళరేఖలో వరుసగా కూర్చడం తప్పని సరి అయింది. కథనంలో వీటన్నింటినీ

బంధించిన శిల్పం ఏమయినా ఉంటే దానిలోనుంచి కథ పుడుతుంది. కాని, అట్టి శిల్పం ఇక్కడా, 'వందేమాతరం' లోనూ తక్కువ. ఉదాహరణకు 'ఆంధ్ర పురాణం'లోని 'చాళుక్య పర్వం'లో వస్తువు మరీ పల్చపడింది. భారత రచనకు రాజు నన్నయను ప్రోత్సహించడం; నన్నయ రచన మధ్యలో ఆగిపోవడం పెద్ద ఇతివృత్త మవదు. ఆ లోపంవల్లనే ఇది కథగా రాణించలేదు. అందుచేత కవి సంఘటనలలోనే, స్వల్పమైన పరిధిలోనే, శిల్పాన్ని ప్రదర్శింప బూనుకోవాలి. ఉదాహరణకు ప్రౌఢదేవరాయల ముత్యాలశాలలో కవిసార్వభౌముని కనకాభిషేకం ఆంధ్ర సాహిత్య చరిత్రలో మహోజ్జ్వల ఘట్టం. దీనిని కవి సుమారు ఏబదిగద్య పద్యాలలో నిర్వహించాడు. కథకు అవసరమైనంతవరకు పాత్రల రూపురేఖల్ని దిద్దాడు. సమస్తశాస్త్రజ్ఞులకు, తత్త్వ రహస్య విదులకు, ఆలవాలమైన ముత్యాల శాల నేలే రాజరత్నము; ప్రౌఢ దేవరాయలు, పక్షపాతాన్నెరుగని సారగుణజ్ఞుడు. అక్కడ ఉన్నవాడు గౌడ డిండిమభట్టు.

"అతివాక్ప్రౌఢుఁడు గౌడ డిండిముఁడు వాక్యార్థంబుఁ గావింప నీయు
ద్యతుఁడైనప్పుడు మౌక్తికాలయ సభాద్వాః ప్రాంత మందున్న యు
న్నత మౌ ఢక్క యొకండు మ్రోఁగును; నితాంతం బైన యా మ్రోఁతతో
శ్రుతి గల్పెన్; శితికంఠ తాండవ సదస్సున్ నిల్పు రాట్సన్నిధిన్."

-ఆంధ్ర: విద్యానగర: 124.

అట్టి గౌడ డిండిమ భట్టు పేరు దేశానికంతా ప్రాకింది—అనడంలో అందం లేదు; అది "త్రాచు వలెఁ గౌండవీటి పొంతలకుఁ బ్రాఁకె" నట! అక్కడ శ్రీనాథుడున్నాడు. అతనికి ఈ 'త్రాఁచు' కంటికి ఆనలేదు; ఆయనకు "ముత్యాల శాల నోలలాడిన మలయవాయువులు సోఁకె" నట! ఇక్కడ నుండి ప్రౌఢరాయల కొలువులో జరిగిన శాస్త్రార్థచర్చ వరకూ మధునాపంతులవారి రచన మనోజ్ఞంగా ఉదాత్తంగా ఉన్నది. డిండిముడు వృద్ధుడు; శ్రీనాథుడు వయస్సులోనివాడు. శ్రీనాథుడు "స్వీయపక్షంబు శ్లోకానీకమ్ముల వాక్ఛభంగి బుధులియ్యం బోవఁగా, డిండిముఁడత్తా నేర్పున్ మది మెచ్చి యొచ్చుకొనె!" శ్రీనాథ డిండిముల వాదాలకు తీర్పరి చంద్రభూష క్రియాశక్తి మహోపాధ్యాయులు. ఆయన్ను మధునాపంతుల [illegible] శ్రీనాథుని కనకాభిషేకానికి ముత్యాలశాలను [illegible]

"మేలి ముత్యాలశాల యన్ పాలకడలి
నురలి వచ్చిన పుత్తడి సిరులు మోసి
యితఁడు శ్రీనాథుఁ డగును బో యింక ననుచు
వేసికొనె డిండిముఁడు మెల్ల వినపుగుటక." -ఆంధ్ర: విద్యా: 161.

పాలకడలితో పాటు పుత్తడి సిరుల, వినపుగుటకల ప్రస్తావన తేవడంలోని ఔచిత్యం గమనింపదగ్గది.

"జాదులు ప్రసాదములు గాఁగ స్వర్ణకుసుమ
విసరముఁ బరిగ్రహించిన విబుధవరుల
ప్రమద బాష్పాంబువుల మెత్తఁబాఱెనేమొ
యుక్కుసెడి పల్కుదిఁక లోహఢక్క యెపుడు.

-ఆంధ్ర: విద్యా: 176.

అన్న ముగింపులోని ప్రమద బాష్పాంబువులతో, ఆటు అస్తమించిన వృద్ధుడిండిముని కీర్తికి జాలి కూడా కనబడుతుంది.

గమనించవలసింది ఇక్కడ కథ శిల్పసుందరంగా ఉన్నట్లు మనకు భ్రమ కలుగుతున్నా, నిజానికి ఇక్కడ కనబడేది ఔచిత్యం ఎక్కువ, శిల్పం తక్కువ. పాత్రలకు రూపు కల్పించడం ఎక్కువ; పాత్రల అంతస్సులను శోధించడం చాల పరిమితంగా ఉంది. ఈ కథనానికి మధునాపంతుల వారికి బాసటగా నిలిచింది ఆయన కవితాశక్తి. ఔచిత్యంతో కూడిన కవితాశక్తి వల్ల ఇక్కడా, ఇతరత్రా శ్రీ శాస్త్రిగారి 'ఆంధ్ర పురాణం' స్వాదువైన కావ్యమవుతోంది.

'పోతనచరిత్రము'లో వానమామలై వా రొకచోట-

"శిల్పి యులిదెబ్బతోడ శాసింపబడిన
యీ మహీతల స్వర్గ మహీన కళల
జన్మ మృత్యు జరామయ క్షామములను
బ్రహ్మ సృష్టిలోఁ గల్గు లోపములఁ దీర్చె."* -పోతన: [illegible]

---

*అసలు ఈ సీస పద్యాన్నంతటినీ పరిశీలించాలి. ఇది Keats "Ode on a Grecian Urn"లోని రెండో పద్యానికి వ్యాఖ్యానప్రాయమైనది.

అంటారు. ఈ కావ్యంలో కవి చేసిన పనికూడా ఇదే. వృక్కిటి పురాణాలలోని లోపాలనూ, అనౌచిత్యాన్నీ ఎంతో నేర్పరితనంగా వానమామలై వారు సరిదిద్దారు. కథలో కూర్చబడిన ఏ సన్నివేశమూ దేని కది మిగత కథతో సంబంధం లేకుండా వ్రేలాడబడి ఉండలేదు. దేవభాషలో వ్రాయబడిన భాగవతం వంటిది మరో భాషలో రచింపగా దానికి ఆదరం లభిస్తే, అట్టి దాసకు మూడు జన్మలకు దాసుడనవుతానని ఇంద్రుని శపథం. దానిని మరచిపోకుండా తెనుగు భాషకు సింగ భూపాలుడు, కృష్ణరాయలు, రఘునాథరాయలు చేసిన ఊడిగాన్ని కవి మనకు చివర జ్ఞప్తికి తెస్తాడు. ఏ చిన్న విషయాన్నీ కవి తర్వాతి కథలో అనుసంధించక ఊరుకోలేదు. పోతనను చంపాలనుకున్న కాపును పాముకాటు నుంచి పోతన రక్షించేద్దం కథకు అవసరమైనదే అయింది. ఆయన కొడుకే కదా కృతి నపహరింపదలచిన సైనికుల నడ్డుకొన్నది! అలాగే ఆ పందులను తోలుకొనే యువతిని వెనుకటి కథలో పోతన ఆదుకున్నాడు. అంటే కథను కట్టడంలో పింగళి సూరనలా 'పోతన చరిత్ర' కవి కూడా ఎంతో శ్రద్ధ వహించాడన్న మాట! కవి చేసిన కల్పనలన్నీ ఇలా నిర్మాణ దక్షతను ప్రదర్శించేవే. కథనానికి కవిత్వపు బలంకోసం చేసిన వర్ణన లనిపించే చోట కూడా కవి అవధానం సడలలేదు, పూర్వాపరాలను కలుపుతూన్న ప్రయోజనం కనబడుతుంది. భోగినిది 'జంభారి పైఁ గినిసి యంబరము దిగి వచ్చు రంభఁ దలపించు రూపమ్ము!' ఇది వర్ణనే కాదు. ఆమె రంభాంశతో జన్మించిన దని మనకు జ్ఞప్తికి తేవడం.

## పాత్ర పోషణ

వరదాచార్యులవారు కథను నిర్మించడంలోనే గాక, పాత్రపోషణ విషయంలో కూడా ఔచిత్యాన్నెరిగిన కవి. శ్రీనాథుడూ, పోతనా సమకాలీనులా, కారా? అన్న ప్రశ్న ఇక్కడ ప్రధానమైనది కాదు. ప్రజల నోట నలిగిన కథల్లోని శ్రీనాథునితో పోల్చుకుంటే, వానమామలై వారు శ్రీనాథుని పాత్ర నెంత చక్కగా తీర్చారో అర్థమవుతుంది. శ్రీనాథుడు భోగి అన్న దాని నీయన కాదనలేదు కాని, అది ఉదాత్తమైన [illegible] భోగం. శ్రీనాథుని సౌందర్య [illegible] కవి [illegible] లేదు. [illegible] శ్రీనాథుడెలా [illegible] [illegible].

"కలనైన నగపడని హరి
తలవాకిట నిలిచి పిలిచి దర్శన మిడిన
శిలనాగ బొమ్మయై కని
కల నిజమైనట్లు ముదము" -పోతన: 4-42

ను పొందిందట. శ్రీనాథుడు హరి అంశతో జనించాడన్న విషయాన్ని కవి మనకు జ్ఞప్తికి తేవడం అలా ఉండగా, ఇది శ్రీనాథుని పాత్ర కెంతో ఉదాత్తతను కల్పిస్తోంది. అలాగే సింగభూపాలునిలో కూడా మనం సహృదయుణ్ణే చూస్తాము కాని, అతనిలో తీక్ష్ణమైన రాచపగ కనపడదు.

ఈ కావ్యంలో ప్రతిచిన్న పాత్రనూ కవి ఎంతో సానుభూతితో చిత్రించాడు. శ్రీనాథుడు కూతురు శారదను పోతన ఇంటనే ఉంచాడు. ఆమెకు పోతన కొడుకు మల్లనతో చనువే. కాని, ఆతనితో తనకు పెండ్లి ముచ్చట్లు వినబడగానే, ఎక్కడ నుంచో తటాలున సిగ్గు పుట్టుకొనివచ్చింది. "తలెత్తి బావ యని వేమరు బిల్వదు!" తోట నుంచి పూలు తెచ్చుకోవాలని అనుకొంటుంది, కాని "చనదు పొలఁతి తాను" లక్ష్మితో "మీ యన్న నడిగి పూలు తెమ్మటంచుఁ బనుచు."

(పోతన. 8-206, 207)

పోతన గురూపదేశాన్ని అనుసరించి పండ్రెండేండ్లు బ్రహ్మచర్య దీక్షను అవలంబించవలసి ఉంది. పదకొండేండ్లు గడచిపోయాయి. ఇంకొక్క యేడాది మిగిలి ఉండగా, భార్య నర్సమాంబ కాపురానికి వచ్చింది. ఆతనికి నాతిగల బ్రహ్మచర్యం తప్పలేదు. మరి ఆతని భార్యస్థితి కళాపూర్ణోదయంలోని సుగాత్రి స్థితిని జ్ఞప్తికి తెస్తుంది. అక్కడ పూర్వ కథ క్లుప్తంగా మంచి పదునుగా ఉంది. అక్కడ పూర్వభాగంలో అందమెక్కువ కాగా, ఇక్కడ పరభాగంలో (3-152 నుండి) కవి ప్రకాశింప చేసిన శృంగారం ముగ్ధమోహనంగా, పరమ సుకుమారంగా ఉంది.

కాని, పోతన శృంగారనాయకుడు కాడు. ఆయన ధీరశాంతుడే. ఈ పాత్రపట్ల వరదాచార్యులుగారు చూపిన శ్రద్ధాభక్తులు అనన్య సామాన్యమైనవి. శ్రీనాథునితో సింగభూపాలుని చూడడానికి వచ్చిన పోతన "కర్మ వెనుకనె జ్ఞానమ్ము గ్రాలు కరణి" ఉన్నాడట! (4-63) పోతన వ్యాసుని అంశతో పుట్టా

దని చెప్పడంతో కవి తృప్తిపడక, ఆయన శాంత స్వభావంలోనే కాక, లోకజ్ఞతలో కూడ వ్యాసునంతటివాడు అనిపించాడు. కృతిని కర్ణాటరాజున కంకిత మీయకపోవడం నిశ్చయమయాక, ఆ రాజు వాహినీ పతులు, "అలా చేయకపోతే కృతికన్యను మా రాజు రాక్షసమున గ్రహిస్తాడు!" అనగానే, పోతన హృదయం భగ్గున మండిందట. "రాజులు రత్నాపహారులయితే మాత్రం, కవికి కావ్యం మీద అధికారం లేదా? చెలువకు ఇష్టమైన వరుని కోరుకొనే స్వేచ్ఛలేదా? రెక్కకష్టం మీద ప్రజలకు హక్కులేదా?" అని, నిర్భీకుడై—

"తేనెటీఁగ లొసఁగు తేనెఁగైకొని
జంప సాహసించు జడుఁడు తాను
పువ్వు నొవ్వకుండఁ బూఁదేనెఁ గ్రోలెడి
తేఁటి వర్తనమ్ము తెలియఁగలఁడె?" —పోతన 9-24

అని అడుగుతాడు. దీనిని వ్యాసుడు చెప్పిన రాజధర్మాలతో పోల్చి చూచుకుంటే, వరదాచార్యులవారి చేతిలో పోతన ఎంతగా పెరిగాడో అర్థమవుతుంది.

'ఆంధ్ర పురాణం'లోని పాత్రలందరూ చరిత్రలో కనబడేవారే. అందుచేత కవి మరీ స్వాతంత్ర్యాన్ని వహించక చరిత్రలోని సంఘటనలను అనుసరించి, పాత్రలను దిద్దితీర్చాడు. చరిత్ర అస్పష్టంగా ఉన్నచోట కవి తన స్వాతంత్ర్యాన్ని చక్కగా వినియోగించుకున్నాడు. గుణాఢ్యుని 'బృహత్కథ' రచనకు సంబంధించిన కథ చరిత్రనుంచి గ్రహించినదే. కాని, దీనిచరిత్ర అస్పష్టంగా ఉన్న అవకాశాన్ని తీసికొని, కవి గుణాఢ్య, శర్వవర్మల స్పర్థను, రాజు రాణుల పాత్రలను చక్కగా దిద్దాడు. అంతటి 'బృహత్కథ' రచయిత అయినా, మధునాపంతుల వారు గుణాఢ్యుని మరీ ఆదర్శపురుషునిగా చిత్రించలేదు. అతనిలోనూ అలుకా, అసూయా ఉన్నాయి. ఆరుమాసాలలోనే రాజునకు సంస్కృత వ్యాకరణాన్ని బోధింపగలనన్న శర్వవర్మ మాటలకు "గుణాఢ్యసూరి [illegible] బుమిసెన్!"

[illegible]

[illegible] ప్రకోపమొగ, మెప్పు [illegible], వెలి మెచ్చులకోరగడంగి [illegible]
[illegible] మాసములు దాటక శాబ్దము వచ్చునంచు [illegible] .

వీమెయి జేనిముం దుటిమెదే! అదికాదు పవాలు మాసముల్
నేమము నిండఁ బ్రామికొని నేర్పిన నబ్బెడి యల్పశాస్త్రమే?''

సాతవాహన : 106

ఆతడు నిరాశ కల్గినప్పుడు క్రుంగిపోతాడు, కోపగిస్తాడు. హాలుని కొల్వునుంచి నిష్క్రమించిన తర్వాత "భువిన్ ధ్రువతారగ నిల్చియుండగా," ''రుధిరమ్ము నిండు బలియిచ్చి బృహత్కథ లక్షలేడుగాఁ బేర్చి" కూర్చాడు. అంతటి కృతి రాజు ఆదరానికి పాత్రము కాలేదని తెలియగానే, దానినే ఒక్కొక్క ఆకుగా అగ్నిహోత్రునికి అర్పించ తలపెట్టేసరికి, "వగపుతో నగ్నియెడ మూఁడు వ్రయ్యలయ్యె"నట. ప్రపంచ సాహిత్య చరిత్రలోనే అబ్బురమైన యీ సన్ని వేశాన్ని మధునాపంతులవా రెంతో ఆవేదనతో వర్ణించారు.

"చినుకుఁ బూసలు కన్నుఁగొనలు కప్పుచుఁ బొంగఁ
దడవి గద్గదిక శిష్యుఁడు పఠించు;
నరవంచు మొగముఁ దామర మంచు మూయఁగాఁ
గృత గభీరత నాలకించు గురుఁడు;
కతలు కల్పనములు కరఁగింప నచ్చెరు
వడి మెచ్చి వినుఁ బశుపక్షివితతి;
రసపిపాసను నాల్క కొసను చాఁచుకొని, వే
చుకొని యుండును జిత్రప్రకట వహ్ని;

చట్టు చదివిన యాకు నాచార్యుఁ డంది
యాహుతి యొనర్చు నగ్నికుండాంతరమున;
నదియె శామిత్రవహ్ని! అల్లతఁడె శమిత!
యవుర, పశు వగునేమొ కావ్యప్రతిష్ఠ!" -సాతవాహన: 199

## ప్రబోధం - కథనం

ఇక 'వందేమాతరం'లోని పాత్రలు నిజానికి కథల్లో కనబడే పాత్రలు కారు. దాదాభాయి నౌరోజీ, రెనెడే, గోఖ్లే, సావర్కారు, తిలక్, రామకృష్ణ పరమ హంస, వివేకానంద, దయానంద మున్నగువారందరూ ఇంకా చరిత్రలోకి దిగ

జారకుండా మన స్మృతిపథంలో మెలగుతూ మనల నుత్తేజ పరుస్తూన్నవారే. వారు వ్యక్తులుగా గాక, నాయకులుగా మనకు కనబడతారు. వారి నలాగే చూపారు వీరభద్రమూర్తిగారు. ఇందులో పురాణ కథ వచ్చినా, సర్కసు వచ్చినా, అవి ప్రబోధాత్మకంగానే ఉంటాయి. 'కుమార సంభవ ఖండము'లోని కథకు నాటి నవగోపాల మిత్ర కథకుడు. ఇది పురాణాన్నుంచి సంగ్రహింపబడిన కథ. అయినా ఇందులో ఏదో రహస్య మున్నదని తెల్లదొరల అనుమానం. అంచేత ఆ కథను వినడాని కొక తెల్లదొర వచ్చాడు. అతనికి ఈ కథ చెప్పడంలోని ఆంతర్యం అర్థమవుతూనే ఉంది, కాకుండా పోతోంది. పాపం, ఉడుకుబోతు తనంతో-

"తల పంకించుచుఁ జనె నా
తెలిదొర సభమూల నుండి తెలిసె నటంచున్
నిలువుడి కావచ్చిన దన
కలదెంతో కావలసిన కథ ముందనుచున్''   -కుమార సంభవ : 203

ఈ కథలో మన్మథుని పాత్రను కవి ఎంతో స్వతంత్రంగా చిత్రించాడు. అతణ్ణి ఇంద్రుడు పెద్ద చేసి, శివునికి పార్వతి పట్ల అనురాగం నీ వల్లనే కలగాలి అనే సరికి, మదనుడు :

"ఆ జడదారి కెంజడల యందున మబ్బులు గూండ్లు కట్టుకో
నీ జముదేని వానిఁ గని నిక్కిన రోమము నిల్వు గ్రుడ్లు నై
వాజమ గాని తజ్జటిని పట్టి తపం బుడిపింతు వజ్రపా
ణీ! జవరాలి మోవి గొనకే విడమానునొ చూత మాపయునన్"
-కుమార సంభవ : 65

మదను డెంత దిట్టతనంతో వెడుతున్నా, రతికి మనసులో మనసులేదు. "స్వామీ! భంగింతువు హరుని గాని పాయకు మీ యర్ధాంగిని నన్ను!" అన్నదట.

మదనుని ప్రగల్భా లెలా ఉన్నా, అతనికి హృదయంలో ఒక ఆవేదన ఉన్నది. మూడు గుణాల ముగ్ధ రూపమైన త్రిశూలం అతా దూరంగా పాతబడి ఉంది; "రత్నదీపిత భోగరాజ్యముల్ నాగరాజములు మై నున్నవి వచ్చినట్లు;"

వృషభ దేవుడు అంతె వేయడు: ఇంత వైరాగ్యంలో ఉంది ఎవ్వరిని అంగీకరిస్తాడీ స్థాణువు?

"హరుడు యోగి యైన యన్నాళ్ల దేశాన
పరుడు భోగి యగును పలుక నోడి
చావలేక బ్రతుకఁ జాలక యుండు జ
నంబు, వారిఁ బ్రోతు ననియె మరుడు." -కుమార సంభవ : 102

పాలక దైత్యుడు, లోక కంటకుడు, తారకాసురుని అంతమొందించడానికే త్యాగి పనికి పూనుకున్నాడు. చివరకు "హరదృశాగ్ని భసితమై మారుడు తా నాత్మార్పణ దారిన్" దేశభక్తుల కొక మార్గాన్ని చూపాడని, అట్టి దేశభక్తుల భసితం కూడా పవిత్రమైనదే నన్నాడు నవగోపాల్ మిత్ర.

"ఆ భసితమ్ము పుప్పొడిగ నైనది గేదగిలోన, చంద్ర బిం
బాభకు వన్నె తెచ్చినది, భర్గుని మేని విభూతి పూతగా
శోభిలుచున్న, దున్నది యశో విభవమ్ముగఁ ద్యాగమూర్తులం
దై, భరతాంబ దువ్వలువ యందలి వెండి జరీ నిగారమై."
-కుమారసంభవ : 112

ఇలా ఈ కథలో అటు ప్రబోధాన్నీ, ఇటు కమనీయ కథాకావ్యాన్నీ, ముదిగొండ కవి ఎంతో సామర్థ్యంగా సాధించారు.

'ఫాడ్కే ఖండము' లో వసుదేవ బల్వంత ఫాడ్కే ప్రజలను ఉత్తేజితులను చేసిన వైఖరి సూటిగా, దీప్తిమంతముగా నిర్వహించబడింది. తర్వాత 'దయానంద ఖండము' లో ఫాడ్కేకు శిక్షపడ్డాక, ఆతని భార్య మాటలామె ఎంతటి వీర వనితో నిరూపిస్తాయి:

"వందనివార్య నన్ను నినుఁ బాయక నేనె సరించియున్నచోఁ
దలప యేమందు స్వామి! నిను దొట్టి జయింపగలాడు, వాని కిం
కల తెవ్వ్యేయ కుందునా! కుఠారమున న్నిదురింప నీవు [illegible]
[illegible] నేలుకోనా! విధి [illegible]
[illegible]

ఈ సన్నివేశాన్ని కవి ఎంతగానో ఉపయోగించుకోవచ్చు.కాని,వీరభద్రమూర్తిగారికి వ్యక్తులు కన్న ఉద్యమం ప్రధానమైనది కనుక దీనిని పెంచి వ్రాయనొల్లలేదు.

నాయకులను గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు ఉద్యమంలో వారి పాత్ర స్ఫురించేటంత వరకే వీరభద్రమూర్తిగారు చెపుతారు. ఉదాహరణకు తిలక్‌ను గురించి, గోఖలేను గురించి ముదిగొండ వారి తీర్పును చూడండి.

> "కోలాహలమ్మును కోరు నొకడు, దాని
> హాలాహలమ్ముగా నరయునొకడు
> .................... -పరమహంస : ౪౧

'వందేమాతరం' లో ప్రధానంగా కనబడేది ఉద్యమ నాయకుల ఉద్బోధ, భారతీయులను ఉత్తేజితులను చేయడం. వివేకానందుడు దేశానికిచ్చిన సందేశం నాటికీ, నేటికీ యువతరం ఉడుకురక్తాన్ని ఇంకా కుతకుతలాడిస్తుంది.

> "శిరమెత్తుము, కరమెత్తుము
> స్వరమెత్తుము సింహముబలె, భారత సేవా
> నిరతియె భగవత్సేవా
> నిరతి యటంచు మొనగాడ! నీతికిఁ బ్రోడా!" -వివేకానంద : 108

## ప్రబంధం వర్ణనాత్మకం

ఇది కాకుండా అసలు ముదిగొండ వారి ప్రతిభ అంతా వారి వర్ణనలలో ఉంది. అవి కొన్ని వెనుకటి కవులను జ్ఞప్తికి తెస్తాయి.

> "కపిల వర్ణంపు మేఘమున రేఖలు కట్టి
> విడిపోయి యురియాడు జడలుగాగ
> శ్వేత వర్ణంపు జీమూతమందలి చాటి
> తల మెడలో భుజంగములు గాగ
> రక్తవర్ణపు మొయిలంబు వచ్చి గజాజి
> [illegible]నంబుతో నుత్తరీయంబు గాగ
> [illegible] వర్ణంపు చాలిల
> మెఱుపు బెబ్బులి తోలు మడత గాగ

పగటి వర్ణచిత్రముగను పాశ్చాత్యాళి
తాండవంబు సేయ దట్టి గట్టి
అటుగఁ దిరిగి చూచు నధ్వర ధ్వంసి యీ
శాన మూర్తి వెన్నుబాయ రూపు" -స్వరాజ్య : 268

ముదిగొండ వారి వర్ణనలు అన్నింటా స్వాతంత్ర్య సమరానికి ఎక్కడో సంబంధాన్ని ధ్వనిస్తూనే ఉంటాయి. పై వర్ణనా అట్టిదే. 'దయానంద ఖండం'లోని వానల వర్ణన ఆనాటి స్వాతంత్ర్య సంగ్రామానికి కల్గే ఆటంకాలను ప్రతిబింబిస్తూ, వాస్తవాని కెంత సమీపంగా ఉన్నదో గమనించండి.

"ఎంత రాజేసిన నెంచు కంతయు మంది
పోయి నిప్పు చల్లారి పోవుచుండె
మీగడ వలె నుండి రేగడి మోకాలి
లోతున నిడిన కాలు దిగుచుండె
నీ వేళ నీ రాజ్య మెవరిది కాదు మా
దన్నట్లు కీచురా ళ్ళఱచుచుండె
నెటు పోదమన్నను నేఱు లడ్డము వచ్చి
జనుల ప్రయాణమ్ము సాగకుండె

పండు వగుచుండెఁ గొక్కెర తండములకు
చినుకులయి తుంపరలయి చిమ్మ తపు గ్రోవి
చిమ్మినట్లయి మోట తొండమ్ము ధార
క్రుమ్మరించిన జడి ముమ్మరింప." -దయానంద : 2

దీనిని రాయల వర్షర్తు వర్ణనతో పోల్చి చూడవచ్చు. అలాగే చలి (హైద్రాబాదు ఖండం : 78 నుంచి), చీకటి ([illegible] : [illegible]) మొదలయిన వానిని చూచుకోవాలి. వర్ణనలలో విశిష్టమైనవి [illegible]. వీరభద్రమూర్తిగారు చిన్నతనంలో [illegible] జ్ఞాపకాలను, ప్రకృతి దృశ్యాలను ఈ కావ్యం కోసం [illegible] కనబడుతుంది.

"పచ్చె రెక్కలపైని నల్ల మచ్చల 'థ్రష్'ఖ
వాలీన్ బికము తోడు గ్రాలఁ బాడెఁ
గాలియల్ ఛదముగల 'యోరియల్' పక్షి
బంగారు వన్నె, తాన్ పొంగి పాడె
నల్లటోపి పులుంగు తెల్ల బొజ్జది గజల్
తేనెపిట్టల శ్రుతిలోనఁ బాడె
కటిమెడ కావితోక గల 'రెడ్‌స్టార్టు' నా
రింజ రంగెదద, 'టుమ్రీ'సిఁ బాడె

రూకు పరభాగ్యహృతి జాగరూక మగు త
దీయ భగినీ కులంపు 'మాగ్పి'యు జెముడు
కాకి పసి పోలిగాడు ముఖ్యాతిథులుగ
గాన సభలు వనముల నుషఃకాలమందు" -ఇంగ్లాండు : 83

అలాగే 'క్వేక్వే' క్కని ధ్వనించే బాతులూ, 'రాబిన్' పిట్టలూ, 'మేబ్లూం', 'స్వీట్ బ్రెయరు' లతాంతములు మనకు ఈ ఖండములో దర్శనాన్నిస్తాయి. కావ్యం 'వందేమాతర'మే అయినా, ఈ ఖండంలో ముదిగొండ వారు ఇంగ్లాండును తీసికొనివచ్చి, తెలుగు సారస్వతంలో సుప్రతిష్ఠితం చేసి పెట్టారు.

ప్రబంధంలో అష్టాదశవర్ణన ఉండాలన్న నీమం కోసం కాకపోయినా, 'వందేమాతరం'లో వాస్తవికతను ప్రతిబింబించే వర్ణనలు విస్తారంగానే ఉన్నాయి. నిజానికి వీనివల్లనే ఈ కావ్యం విలువైన దవుతుంది. 'కీర్తితోరణం'లో వ్యక్తుల వర్ణనకు ప్రాధాన్య మున్నది. ప్రోలరాజుకు సాక్షాత్కరించిన-:

"పరిపూత రుద్రాక్ష పరికల్పిత కిరీట
శిఖరాగ్ర జలద సుశ్రీ భజించి
పాణ్యంగుళి చలత్ స్ఫటికాక్ష మాలికా
ధిత్యకా చంద్ర దీధితి వహించి

ప్రత్యంగ సువిలిప్త భస్మాంగ రాగ నీ
    హారాక్త తను శోభ నందగించి
నిత్య పంచాక్షరీ నియత ముఖస్థలీ
    ప్రతి రుత శివ పద ప్రదరులంది

శైవ దీక్షానుషక్తశిష్య ప్రశిష్య
ప్రమథగణ సన్నిధాన విభ్రమము ధాల్చి
నడిచి వచ్చెడి కైలాస నగ మనంగ
మహిత కాళేశ్వర క్షేత్రమౌని వచ్చె'' -రాజుతలనవ్వినది.

అలాగే తిక్కనను కవి ఎలా మూర్తి కట్టించాడో చూడదగ్గది. (ఏకశిల ఏమన్నది?) ఇందులో యుద్ధ వర్ణనలూ ఉన్నాయి, క్లుప్తంగా.

## వర్ణనలూ : ఔచిత్యం

'ఆంధ్ర పురాణం' లోనూ వ్యక్తుల రేఖా చిత్రాలు అందంగానే ఉంటాయి. ఇందులో చెప్పుకోదగ్గ సుదీర్ఘ వర్ణన మొకటి ఉన్నది. 'శ్రీకృష్ణ దేవరాయ పర్వ'-మంతా రాయల పట్టాభిషేకానికి అభిముఖంగా నడిచింది. పట్టాభిషేక మహోత్సవాన్ని కవి ఎంతో ఉత్సాహంతో, కావ్యాని కంతటికీ వన్నె తేవాలన్న పట్టుదలతో రచించాడు. వెనుకటి కావ్యాలలో కూడా పట్టాభిషేకోత్సవాలు వర్ణింపబడినా, వాటిల్లో ఇన్ని వివరాలు, అందాలు కనబడవు. రాజు అశ్వారోహణా, గజారోహణా, అశ్వపతుల మీదా, గజపతుల మీదా విజయాన్ని సూచించే టట్టు ఉంది. ఇక్కడే సందర్భశుద్ధితో కూడిన అశ్వ, గజ వర్ణనలున్నాయి. భద్రగజాధిష్ఠితుడైన రాయల రాజధానీ నగర సందర్శనంలో నగర వర్ణన ఉంది. అయితే ఇది చారిత్రక కావ్యం అవడంవల్ల, ఇక్కడ అతిశయోక్తులు లేవు. పురాణాన్ని వర్ణించిన తిమ్మరుసుతో, "అతిశయ విధా విడంబనాన్వితము కాని యథాకృతకము మిత వాణి నీయందుఁ గలదు" అని రాయలన్న మాట నిజం. [illegible] పద్యానికి శోభను తెచ్చేదిగా ఉంది. ఇదే పద్యంలో ఉంటే [illegible] చెడిపోయి ఉండేది. కవి ఔచిత్యాన్నెరిగినవాడు!

ఇందులో యుద్ధ వర్ణనలు ఉన్నాయి. ఈ వర్ణనలలో యుద్ధానికి సన్నద్ధులవడం వివరంగా వర్ణింపబడింది. రాయల రాయచూరు దండయాత్రలో రాయలకు తోడుగా వచ్చిన రాజులు, సామంతులు తొమ్మిది పద్యాలలో (విజయః253-261) వర్ణింపబడ్డారు. కాని, యుద్ధ భూమిలో "శ్రీ కృష్ణదేవరాయ ధరానాయక భాస్కరుండు రణరంగావేశి కాఁగాఁ, గళానిధి చిహ్న ధ్వజుఁడైన యశ్వపతి యున్ వెల్వెల్ల"నై పోయాడు. యుద్ధం అయిపోయింది. వెనుకటి అంత సన్నాహము, ఇంత స్వల్ప విషయానికేనా అని అనిపించడంలో ఆశ్చర్యం లేదు. తర్వాత రాయచూరు ముట్టడి జరిగింది. అది ఇరువది నాళ్ల సంగరం. అందులో కూడా పై వచ్చిన సామంతుల పాత్ర ఎక్కువగా లేదు.

కవి అంటే వర్ణనా నిపుణుడు అని అనుకుంటే 'పోతన చరిత్రము' వ్రాసిన కవి నిక్కమయిన కవి అవుతాడు. ఈ మహాకావ్యంలో వర్ణనలు అసంఖ్యాకంగా కనబడతాయి. పోతన భాగవతంలో 'భక్తి భావ రసావేశ పథకములందు మూలమును మించి' రచనను సాగించాడని వానమామలై వారు అన్నారు. 'పోతన చరిత్రము'లో కూడా అవసరాన్ని మించిన ఆహ్లాదకరమైన వర్ణన లున్నాయి. ఈ కావ్యంలోని చివరి రెండు ఆశ్వాసములు పోతన భాగవతంలో చెప్పిన కథలనే తిరిగి చెప్పడానికి వ్రాయబడ్డాయి. అందులోని పద్యాలకు ప్రతిధ్వని అక్కడ వినబడతాయి. ఇది కవికి పోతన పట్ల, ఆయన కావ్యం పట్ల గల భక్తిని ప్రదర్శిస్తాయి. అసలు భాగవతంలో ద్వాదశ స్కంధాలున్నాయి. కనుక, ఇందులో కూడా ద్వాదశాశ్వాసము లున్నాయన్న అనుమానం కల్గుతుంది. దీనివల్ల కవి సాధించిన ప్రయోజన మొక్కటే: కావ్యం రుక్మిణీ కల్యాణంతో మంగళాంతంగా ముగియడం అనుకోవాలి. అంతకన్న 'ఆంధ్ర పురాణం' లో ముగింపు సహజ సుందరంగా ఉదాత్తంగా ఉంది.

వానమామలై వారి కావ్యంలో లెక్కపెట్టుకొనే ఓపిక ఉంటే అష్టాదశ వర్ణనలూ కనబడతాయి. కాని, ముఖ్యమైన విషయ మేమంటే, వానిని కవి ఎవ్విధంగా ఉపయోగించుకున్నాడని చూచుకుంటే, అవి ప్రధానంగా పోతన వంటి పరమ భాగవతుని, ఈషణ త్రయాలను జయించాలన్న కోర్కెగల వాని చరిత్రకు నేపథ్యంగా ఉంటాయి. ఇందులో పట్టణము వర్ణించినా, శ్మశానము వర్ణించినా, అవి పోతన కంటి కెలా కనబడతాయో, మనకూ అలానే గోచరిస్తాయి. వానిగ

ఆశ్వాసంలో శ్రీనాథ పోతన లిద్దరూ వనశోభను వర్ణించడం ఆ పాత్రల స్వభావాలను వ్యక్తీకరిస్తున్నవి. శ్రీనాథునికి ఆ తోటలో "తొలి మబ్బు తెరనుండి తిలకించు చుక్కల దొర గాంచి కను గీటు తావ పడంతి", "తీఁగల నుయ్యాల లూఁగు సమీరకుమారుతో నగు పూవు మగువ మిన్న" (4-120) కనబడ్డాయి. ఆయన వర్ణన శ్రుతి పర్వంగా, మతికి ఆహ్లాదకరంగా ఉన్నదట. ఇక పోతనకు అదే తోటలోని చెట్లు పవనాంబు భక్షులై ఏ ఫలసిద్ధినోగోరి తలక్రిందుగా తపస్సు చేస్తూన్నట్టు కనబడ్డాయట! అవి "నిశ్చల చిత్తుంబలె సెండ వానల శ్రమల్ స్వాంతంబునల దోర్చి ప్రాణుల కర్పించును దత్ఫలమ్ము లివి యేవో సత్తపో ధ్యేయముల్" (4-125). పోతనకే కాదు, పోతన శిష్యులకు రాచకొండకు వెళ్ళే దారిలో మఱ్ఱి చెట్టు ఎలా కనబడిందో చూడండి :

"వామనుఁడు త్రివిక్రముఁడయి వఱలినాఁడొ!
యణువు బ్రహ్మాండ రూపమై యడరెనేమొ!
యష్టదిశ లాక్రమించి మిన్నంది ప్రేళ్ళ
దట్టిపాతాళ మీ మఱ్ఱిచెట్టు తాను."

–పోతన : 7-48

నరపతి కరుణతో నీకు మంచి చీరను తెస్తానని శ్రీనాథుడు పోతన కూతురు లక్ష్మితో అనగా, "అసలు రాజంటే యీ రాజులు కారు, పరమేశ్వరుడే నిజమైన రాజు, దానశీలి" అంటూ పోతన అన్న మాటలలో వర్ణనా ఉంది, భోగముల పట్ల విరక్తీ ఉంది.

"అవనీ మహారాజ్ఞి కనిపె నే మారాజు పచ్చిక మేల్వన్నె పట్టుచీర,
గగనకాంత కెవండు కట్టఁబెట్టెను రేయి నీలిరంగుల జరీపూలచీర?"

పోతన : 8-170

ఈ వర్ణనలన్నీ ఒక ఎత్తు, భోగిని నాట్యాన్ని వర్ణించిన తీరు ఒక ఎత్తు. సిద్ధేంద్రయోగి భామాకలాపంతో అష్టవిధ నాయికలను, నాయికల అవస్థలను తెలియచేయడానికెంత పని చేసాడో, చతుర్థాశ్వాసంలో [illegible] పని చేయడానికి పూనుకున్నారు భోగిని నృత్యంలో.

"అరమోడ్పు కన్గవన్ బరవశత్వముఁ జూపు
　　కలికి ఱెప్పలఁ గాంక్ష దెలుపు
నాలోల భీతి ముగ్ధా లోకనమ్ముల
　　శృంగార లజ్జలఁ జిల్కరించు
సుడిగొన్న బొమముడిన్ జుఱజుఱ చూచుచుఁ
　　బ్రణయకోప భరమ్ము బ్రకటపఱచు
వాలుఁగన్నుల లోకింతఁ దేలపైచిన చూపు
　　మనలేని విరహవేదనముఁ జెప్పు

మఱియు గనుదమ్ములన్ ధ్యాన ముద్ర గదుర
నగు కనులఁ బ్రియ దర్శనానంద మెదుగ
నాతి నవరస భరిత సౌందర్య ఫణితిఁ
గంటి చూపుల కావ్యలేఖన మొనర్చె." -పోతన : 4-265

ఎన్ని ముద్రలో ఆమె చూపిందట. ఆమె నృత్యంలో ఒదగని భావం లేదు; భంగిమ లేదు; అభినయానికి లొంగని స్థితి లేదు!

"పూలఁ గోయుచు నొడిఁ జేర్చి మాల గూర్చి
సరి నొనర్పదారము పంటఁ గఱచి కొనుచు
సిగనిడిన సూది దారమ్ము స్మృతికి రాక
కుంచిత భ్రూలతలఁ దల గోఁకి కొనును." పోతన 4-251

వరదాచార్యుల వారి కావ్యమంతా పెద్ద చిత్రశాల. అందుకే కొండపల్లి శేషగిరిరావుగారు అన్ని ఘట్టాలను చిత్రించగలిగి ఉంటారు.

## ఉపసంహారం

శ్రీ వానమామలై వారి కవితలో పూర్వ కవుల ప్రభావం స్పష్టంగానే కనబడుతుంది. అందులో పోతన ప్రభావం ఎక్కువ అవడం సహజం. వాన మామలై వారిది అతి కోమలమైన ప్రవృత్తి. వారి రచనలో కూడా ఎక్కడా

కటువైన శబ్దం వినబడదు. అందులోని శబ్దాలంకారాలు కూడా సమ్మోహనకరంగా ఉంటాయి. వరుడు పోతన పేరును వధువు ఎలాగో చెప్పింది, ఎలాగని?

"అరుణారుణ బింబోదయ
కిరణాయిత నవరసాల కిసలయ శోభా
కరమగు నధరపు మఱుఁగున్‌
బరభృతములు కూసె ననఁగ భామిని నుడివెన్."  -పోతన 2-266

అలాగే శ్లేష కనిపించినా అది లలిత లలితంగానే ఉంటుంది. (4-195) కాని, కావ్యం మీద అధికారాన్ని చెలాయించదు. పది శబ్దాలు చేసే పనిని ఒకటి రెండు శబ్దాల చేతనే చేయిస్తూ, శబ్దాలచేత చాకిరీ చేయించుకొనే నిరంకుశత్వం ఈ కవిలో కనబడదు. ఈయన కవితలో శబ్దాలు పరస్పర మైత్రిని నెరపుతూ, సుకుమారమైన అర్థస్ఫురణకు కారణమవుతాయి.

'కీర్తితోరణం' కవి, ఇంద్రగంటి వారి మీద కాల్పనికోద్యమ యుగపు ప్రభావం ఎక్కువ. వెనుకటి పురాణ, ప్రబంధ కవుల ప్రభావాన్ని ఇది కప్పి వేసింది. పూర్వ కవుల నుంచి విడివడి ప్రత్యేక బాణీని కథా నిర్వహణంలోనూ, కావ్య నిర్మాణంలోనూ, సాధించాలనుకోవడం ఈ కవి ప్రత్యేకత.

మధునాపంతులవారిమీద కాల్పనికోద్యమ ప్రభావం బొత్తిగా కనబడదు. పద్యాన్ని ఆదరించి నట్టుగానే వెనుకటి కవుల అలంకార సామగ్రిని కూడా ఆదరిస్తూ, అందులో తన వ్యక్తిత్వాన్ని కనబరచ ప్రయత్నిస్తాడు. కవులు కంఠాన్ని శంఖముతోనూ, కర్ణములను శ్రీకారంతోనూ పోలుస్తారు. కాని, నన్నయ భట్టు "వ్రాసిన యక్షరాక్షరము భారతసార సహోభ్యాసుని కర్ణశంఖముల యందున ముంచరఁ బోసి దీర్థముం" చేసికొనునట! (చాళుక్య : 105). వేమ భూపతి "[illegible] కుంభోద్భవుడట!" (పునఃప్రతిష్ఠ : [illegible]). గజపతిమీద దండయాత్రకు రాయలు బయలుదేరడాన్ని వర్ణించే ఈ సీసపద్యంలో వెనుకటి కవులను కూడా గర్వాన్ని కల్గిస్తుంది.

"మకుటాగ్ర ఘటిత మౌక్తిక మాలికాజ్యోత్స్న ఫాలాగ్నిగోళ
దీప్తత నడంచి
నయనాంత సుమిత సంతతహాస మాధురి గళశంఖ నీల రేఖలను గప్పి,
కరధృతోజ్జ్వల శాతఖడ్గ కాంతిచ్ఛట భూషణ ఫణి మణి స్ఫూర్తి గప్పి,
సమధిష్ఠితాశ్వరాజ తనూ ధవళరోచి నవదాత వృషభవాహనము నొడ్డి
సమదగజపతిఁ గడిమియై సంహరింప
హరుఁడు తాను బహిర్దర్శితాభిరామ
సత్త్వరూపమ్ముతో నున్న చాయ దోఁప
నరుగు రీతిని గృష్ణ భూవరుఁడు కదలె." -విజయ. 45

'వందేమాతరం' కవి నవ్య ప్రబంధ కవులలో ఆధునికుడు. ఆయన వర్ణనలలో కొత్తదనం కోసం, కొత్త చిత్రాలకోసం పడే ప్రయత్నం కనబడుతుంది. ఆయన వర్ణనలలో ఇంగ్లాండును తెలుగు కవితలో ప్రవేశపెట్టాడు. ఆంగ్ల పదాలను యథేచ్ఛగా వాడతాడు. అయితే అధిక్షేపణ కవిత్వంలో ఇది అందగించినట్లు సర్వత్రా అందగించదు. 'రాగాల డజన్'లో ఆంగ్ల పదాలు అందగిస్తాయి. మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రిగారి చాటుపద్యాలలో (ఉదాహరణకు తెనాలిమీద చెప్పిన పద్యాలు) ఇవి బహు పసందుగా అమరుతాయి. కాని ఉదాత్తమైన విషయాన్ని చెప్పేటప్పుడు ఇవి సాధారణంగా అందగించవు. కాని, ముదిగొండవారు అలా అంగీకరించరు. అదృష్టవశాత్తు ఆయనకున్న పరిహాస శీలము, ఆయనకు పలుతావుల్లో సాయపడింది. చిత్రంగా 'ఇంగ్లాండు ఖండము'లో ఈ శబ్దాలు చదువరిని ఇబ్బందిపెట్టవు సరికదా, ఉత్సాహపరుస్తాయి. సమాస ఘటనలోనూ, పద్యాల విరుపుల్లోనూ, విరామ విహ్నలను వాడడంలోనూ కొత్తదనాన్ని తీసికొని వచ్చాడు.

ముదిగొండవారు నవీన ప్రబంధ కవులలో నవీనుడైతే, వానమామలై వారు ప్రాచీనుడు. 'ఆంధ్రపురాణ' కర్త ప్రాచీనులలో నవీనుడు, నవీనులలో ప్రాచీనుడు. కాల్పనికోద్యమ కవుల కావ్య నిర్మాణం ఎలా ఉంటుందో చూపిన కవి 'కీర్తితోరణ' కృతికర్త.

వెనుకటి ప్రబంధ కవులకూ ఈ నవీన ప్రబంధ కవులకూ గల తేడా ప్రధానంగా రసపోషణలో ఉంది. వీరికి శృంగారం ప్రధానమైన రసం కాదు. దేశభక్తి, మాతృదేశానికి పారతంత్ర్యంనుంచి విమోచనాన్ని సాధించడం, గత కాలపు కీర్తి ప్రతిష్ఠలు వీరికి ముఖ్యమైనవి. అందుచేత వీరము, ఉత్సాహము ఎక్కువ చోటు చేసుకుంటాయి. 'పోతన చరిత్ర' వంటి కావ్యాలలో శాంతము, అధ్యాత్మిక భావం, భక్తి ప్రాముఖ్యాన్ని వహిస్తాయి.

ఈ కవుల్ని శిల్పులని అన వీలు లేదు. వీరు ప్రధానంగా అనౌచిత్యాన్ని పరిహరించి, అనుచితమైన వర్ణనల పొంతకు పోకుండా, తమ కవితా శక్తి మీదనే ఆధారపడి ఉంటారు. చదువరుల దేశాభిమానాన్ని ఎలా ఉపయోగించుకోవాలో ఈ కవులకు బాగా తెలుసును. గారడీల జోలికి పోకుండా, కావ్యాన్ని స్వాదువుగా చేయాలన్నదే వీరి ధ్యేయం. అందుకే ఈ ప్రబంధాలన్నీ తొలి పద్యం నుంచి చివరి పద్యం వరకూ అవశ్యపఠనీయాలనిపిస్తాయి అందరికీ!

# నవ్య కావ్య దృక్పథం

## వి. వి. యస్. నరసింహారావు

"పండితవర్యా, రికార్డులా నోరు త్రిప్పకు!
నవసృష్టిని కాలదన్నకు!
భావకవుల నపుంసక హావభావాలకు సవాలు!
అభ్యుదయకవీ నల్లమందు తిని నిద్రపోయావ్!
నయాగరా జలపాతంలో దూకలేకపోయిన అన్నయ్యా! గుడ్‌బై!
మీకందరికీ సలామ్ ఆలేకుమ్
వచనం లేదు, కవిత్వం అంతకంటె లేదు."

1965-68 మధ్యకాలంలో రంగంలోకి దూకి, అప్పటివరకూ వ్యాప్తిలో అన్న వివిధ కవితామార్గాలను నిరసిస్తూ తిరుగుబాటు ప్రకటించిన దిగంబర కవితావాక్కు లివి. పాడిందే పాటగా పాత కావ్య ప్రబంధాలనే తిరగరాస్తున్న పండితకవుల్ని, నవసృష్టిపట్ల మక్కువచూపిన నవ్యసాహిత్య స్రష్టల్ని విశిష్ట సన్నివేశ భావాలకు ప్రాధాన్యమిచ్చి భావకవితా యుగాన్ని, సృష్టించిన భావకవుల్ని నవసమాజాభ్యుదయమే ఊపిరిగా బ్రతికిన అభ్యుదయ కవుల్ని, పద్యంకంటే వచనం ప్రబలసాధన మనుకున్న వచన కవుల్ని - వార్ని వీర్ని అందర్ని కలిపికట్టి తిట్లతో దీవించిన దిగంబర కవులు తాము రంగంలో దూకేవరకూ అన్ని కవితా మార్గాల్ని అగమ్యమైన వాటినిగా భావించి స్తబ్ధతను బద్దలుకొట్టాలని ప్రయత్నిం చారు.

లక్ష్యం సిద్ధించినా సిద్ధించపోయినా కవితాజగత్తులోని స్తబ్ధత వారి తిట్లతో కొంతవరకైనా సడలిందని అంగీకరించవచ్చు.

కవిత్వంలో నిరంతరం నవ్యతకోసమే అన్వేషణ జరిగినట్లు కవితాచరిత్ర నిరూపిస్తున్నది. పాతకాలపు ప్రబంధ ధోరణుల్లోను అభ్యుదయమూ, నవ్యతా లేకపోలేదని వాదించేవారున్నారు. వెనుకటి ప్రబంధాల్లో కథాప్రారంభంతో ప్రకృతి

కవీ అభ్యుదయ పరంపరాభివృద్ధినే కాంక్షించాడు. రామకృష్ణుడు 'నవ్య కవిత్వ కలాప' మన్ కుందనమున్ ఘటించి కడు క్రొత్తగు సొమ్ము తయారుచేస్తున్నా నన్నాడు. అంతమాత్రాన ప్రబంధాల్లో అభ్యుదయ కవిత్వముందని కానీ, పాండురంగ మాహాత్మ్యం నవ్యకవితకు నిదర్శనమనికానీ చెప్పటం సబబు కాదు. ఆ అభ్యుదయ నవ్యతల పరిధి పరిమితం, అనిర్దిష్టం.

నిర్దిష్టమైన లక్ష్యాలతో తమది అభ్యుదయ కవిత్వమనీ, నవ్యకవిత్వమనీ ప్రకటించుకుని కవితారచన సాగించిన కవులు ఆధునికులే. 1946 లో శ్రీశ్రీ వివరించినట్లు "సాహిత్యం ఒక భోగవస్తువుగా పరిగణించే దృక్పథం మీద" తిరగబడ్డవారు అభ్యుదయ కవులు. రచయితకు ప్రజలే ప్రమాణమనీ, సాహిత్యానికి దూరమైపోయిన ప్రజల జీవితాలను సాహిత్యోన్ముఖంగా తిప్పేందుకు రచయితలు పాటుబడుతున్నారనీ ఆయన స్పష్టం చేశాడు. (తెలుగుతల్లి-మార్చి 1946)

ఆత్మాశ్రయమైన భావ కవిత్వం నుండి కవుల దృష్టిని ప్రజాశ్రయమైన అభ్యుదయ కవిత్వం పట్ల మళ్ళించిన గౌరవం అభ్యుదయ రచయితలదే.

సాహిత్యంలో కవి తానే హీరోగా వన్నెకెక్కాలని చేసే వ్యక్తి వాద ధోరణి బూర్జువా కవి లక్షణంగా చెప్పబడింది. ధనస్వామ్యం చేతిలో కీలుబొమ్మయిన కవికి వైయక్తికమైన స్వేచ్ఛ వుండదని లెనిన్ వంటి వారు ఉద్ఘాటించటం అభ్యుదయ కవుల్ని ఆకర్షించింది. కమ్యూనిస్టు మేనిఫెస్టోలో మార్క్స్, ఎంగెల్స్ "బూర్జువా సమాజంలో భూత కాలానికి వర్తమానంమీద పల్లమూలిన అజమాయిషీ ఉంటుం"దనీ, "ప్రజాస్వామికంలో వర్తమానమే భూత కాలాన్ని అదుపు చేస్తుం"దనీ చెప్పిన మాటలు అభ్యుదయ రచయితల్ని బాగా ప్రభావితం చేశాయి. శ్రీశ్రీ అభ్యుదయ ప్రస్థానం మహాప్రస్థానంగా సాగి 'ఖడ్గసృష్టి'గా పర్యవసించటం అభ్యుదయ కవితా పరిణామాల్లో ముఖ్యమైంది.

ఆరుద్ర 'త్వమేవాహమ్', దాశరథి 'అగ్నిధార', సినారె 'చేవ్రాలు [illegible]', కాళోజీ 'నా గొడవ', కుందుర్తి 'యుగేయుగే', సోమసుందర్ 'మిణుగు [illegible]', అనిసెట్టి 'అగ్నివీణ' మొదలైన రచనలన్నీ దిగంబరుల దృష్టిలో [illegible]!

నయాగరా కవులుగా వచన కవితకు వన్నెగూర్చిన బెల్లంకొండ, ఏల్చూరి, కుందుర్తి అజంతా, బైరాగి మొదలైనవారికి దిగంబరులు గుడ్‌బై చెప్పేశారు.

'వచనం లేదు, కవిత్వం లేదంటే,- వచన గేయం, వచన పద్యం, వచన కవిత్వం, స్వచ్ఛంద కవిత్వం, ముక్తచ్ఛందోరచన, ఫ్రీవెర్స్, వెర్స్ లైబర్ ఈ మొత్తం కొట్టుకుపోవలసిందే!

కాని, ఆశ్చర్యమేమంటే కొట్టుకుపోకపోగా నిట్టనిలువుగా నిగిడి నేలలో వేళ్ళని, కొమ్మలు రెమ్మలుగా విస్తరిల్లిన వృక్షమై నిలిచింది వచన కవిత.

దిగంబరులు రాసింది వచన కవిత్వమే అయినా దాన్ని 'దిక్' సంజ్ఞతో పిలవటంచేత అది వారి దృష్టిలో వచనం కాకుండా పోయింది.

"మంచికోసం, మనిషిలోని- నిప్పులాంటి నిజమైన మనిషికోసం, కపటం లేని చిరునవ్వులు చిందే సమాజం కోసం, అహోరాత్రులు ఆరని అగ్నిలో నడచిన ఆత్మల్లోంచి పలుతుతున్న గొంతుకలం" ఆహ్వానించతగిందే అయినా నిందా పూర్వకమైన సిరా మొహంమీద పడుతుంటే భరించలేకపోయింది జనం.

ఏమైనా అభ్యుదయ పథంనుండి విప్లవ మార్గానికి కవుల్ని పయనింపజేసిన శక్తుల్లో దిగంబరుల పాత్ర కూడా లేకపోలేదు. మార్క్సిస్టు దృక్పథాన్ని అంగీకరించినప్పటికీ దిగంబరులు నియంతృత్వానికి దారితీసే మార్క్సిజాన్ని మాత్రం సుతరాము ఒప్పుకోలేదు.

అనంతపురంలో జరిగిన విప్లవ రచయితల మహాసభల్లో దిగంబర కవులు విడిపోయి 'జనసాహితి' స్థాపించుకోవటానికి రాజకీయ కారణాలు కూడా దోహదం చేసి వుండవచ్చు.

అభ్యుదయ కవిత్వ అనంతర ధోరణులలో విప్లవకవితా ధోరణి అతిముఖ్యమైంది. విప్లవకవిగా శ్రీశ్రీ కొత్తరక్తం పుంజుకుని మంటలచేత మాట్లాడించటం, రక్తంచేత రాగాలు పలికించటం మొదలుపెట్టింది 1970 తరువాతి దశాబ్దంలోనే.

విప్లవకవిత్వావిర్భావంతో కావ్యదృక్పథంలోనే నవ్యసంప్రదాయాలు కాలు పెట్టసాగాయి. కవితావస్తువులో మార్పు, కావ్యస్వరూపంలో మార్పు అనివార్య మైనాయి.

ఒక వంక మానవతావాదం, మరోవంక అస్తిత్వవాదం, వేరొకవంక అనుభూతివాదం, ఇంకొకవంక చేతనావర్తవాదం, మరొకవంక కవిసేనవాదం మొదలైనవి కవితా వస్తువుకు సంబంధించిన నవ్యసంప్రదాయాలు. కావ్య స్వరూపానికి సంబంధించినవాటిలో వచనకవితలో సంపూర్ణ కథాకావ్యాలు, కావ్యోపన్యాసాలు, ఊహాప్రహేళికలు, ఉల్లేఖాలు, మినీ కవితలు, మిక్సీ కవితలు, మ్యాక్సీ కవితలు ప్రవేశించసాగాయి.

తిలక్ వంటి కవులమీద మార్క్సిస్టువాద ప్రభావం కంటె మానవతావాద ప్రభావమే ఎక్కువ. గాంధీ నెహ్రూలలో నెహ్రూ వైపుకే ఎక్కువ మొగ్గు చూపే వాడులా కనిపిస్తాడు తిలక్.

'చావు పుట్టుకల మధ్య సందేహం లాంటి జీవితంలో
నలువైపులా అంధకారం,
మంచిగంధంలాగ పరిమళించే మానవత్వం
మాకున్న ఒకే ఒక అలంకారం.'

మనిషిలోని మంచితనానికి మానవత్వానికి పట్టంగట్టి కవిత్వంలో ఆరెంటికీ అర్చన చేసిన ఆర్ద్ర హృదయుడు తిలక్.

మానవత్వాన్ని ఆహ్వానించిన శ్రీశ్రీ దానికి నవ్యత్వం కూడా జోడించి కవిత్వానికి ఒక ఈక్వేషన్ సాధించాడు.

మనిషికోసం కన్నిత్వం మంచికోసం కవిత్వం.
నవ్యత్వం + మానవత్వం = కవిత్వం.

కవిత్వాన్ని సైన్సుగా మార్చే ప్రమాదాన్ని కూడా శ్రీశ్రీ శంకించాడు. "కవిత్వం సైన్సుకారా" దనీ—అయితే "కవిరచన కఠినమైన థీసిస్సు" కావాలనీ '[illegible] ఒయాసిస్సు'గా 'అనుభవాల సరస్సు'గా [illegible] కోరుకున్నాడు.

ఇలా కోరుకోవలసిన ఒత్తిడి కవులే సృష్టించారు. ఆధునిక మానవుడి జీవన సరళి కవితలో యథాతథంగా ప్రవేశించటంవల్లనే అటువంటి ఒత్తిడి ఏర్పడింది. ప్రమాదాన్ని ఆరుద్ర సకాలంలోనే గుర్తించాడు.

> "ఆధునికుడు ఒక జిరాఫీలా తయారవుతున్నాడు
> రోజు రోజుకూ అతని మెదడుకీ హృదయానికీ
> దూరం ఎక్కువైపోతున్నది." —అన్నాడారుద్ర.

ఆధునిక మానవుణ్ణి- భిన్న భిన్న పరిస్థితుల్లో భిన్న భిన్న మనస్తత్వాలలో, ధర్మ - అర్థ - కామములు వశీకరిస్తూండటంవల్ల ఒక పరిస్థితిలో మానవుడు ధార్మికుడుగా, ఇంకొక దశలో ఆర్థికుడుగా, వేరొక దశలో శృంగారిగా దర్శన మిస్తుంటాడు. వీటన్నిటినీ అధిగమించి నిర్లిప్తత చోటుచేసుకున్నప్పుడు ఆధ్యాత్మికత సిద్ధించి మానవుడు ఆధ్యాత్మిక మానవుడుగా దర్శనమిస్తాడని ఆర్. ఎస్. సుదర్శన దర్శనం.

మార్క్సును- బాగా పరిశీలించి చూస్తే- ఆయన ఉత్తమ మానవతావాదిగా దర్శమిస్తాడు. కమ్యూనిస్టు ఉద్యమం గెలుపొందటం కోసం సాహిత్యాన్ని ఒక సాధనంగా స్వీకరించినా, మార్క్స్ త్రికాలాబాధితమైన సృజనాత్మక సాహిత్యపు విలువల్ని విస్మరించలేదు. అంటే- సామాజిక చైతన్యంలో అంతర్భవించే వైయక్తిక ప్రతిభకు ప్రత్యేకమైన గుర్తింపు విస్మరించబడలేదన్న మాట. వైయక్తిక ప్రతిభ వైయక్తికమైన అనుభూతికి సంబంధించి వుంటుంది.

సామాజిక చైతన్యానికి సంబంధం లేని వ్యక్తి ప్రతిభకు శాశ్వతత్వం సిద్ధించటం కష్టం. ఇటీవలి కాలంలోని తెలుగు కవితలో అనుభూతివాదం ప్రాచుర్యం వహిస్తూంది. ఇంద్రగంటి శ్రీకాంత్‌శర్మ వంటి కవులు దీనికి ప్రతినిధులు, ప్రవర్తకులు.

రాజకీయ నినాదాలు, రంగుల జెండాలు, సిద్ధాంత రాద్ధాంతాలు మొదలైన వాటికి దూరంగా నిలిచి అంతరంగ అనుభవాన్ని అక్షరబద్ధం చెయ్యటమే అనుభూతివాదంగా రూపుదిద్దుకుంటూంది.

'భావి నా ఉజ్జ్వల నేత్రం' అనీ-
"జీవితం- జనమయ బాహ్యప్రపంచంలో
సీలింగ్ ఫ్యాన్‌కు పైగా
చిట్టి పిచ్చుకలు కట్టే గూడు" అనీ-
సాహసగరుత్తులు విప్పి సమయానికి రాగల శూరుణ్ణి
—నరుణ్ణి
—హరుణ్ణి" నేననీ

తన్ను తాను ఆవిష్కరించుకుంటున్నాడు అనుభూతివాది.

అయితే "నేను సైతం ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను"

అనే విశ్వచైతన్యంలో అంతర్భవించే ఆత్మాహుతి లక్షణం అనుభూతి వాదంలో అరగొరగానే కనిపిస్తుంది.

ఆత్మాహుతి మాట అట్లా వుంచి ఆత్మానుభూతిలోంచి సమాజ చైతన్యం లోకి మనిషి చేసే ప్రయాణం ఒకటుంది. మనిషి- అంటే- మనిషి అంతరంగ బహిరంగాలు రెండూనని అర్థం.

సమాజం కల్లోలితమైనప్పుడు సమష్టిలోంచి వ్యష్టిలోకి ముడుచుకునే మనుషు లుంటారు; బాహ్యమైన అలజడికి కాళ్లు ముడుచుకుని క్రిందికి పోయే తాబేలులాగా. నీళ్ల సుడులు తిరిగిపోతుంటే తాబేలు సుడులులేని తావుకు తప్పు కున్నట్టు మనిషికూడా కల్లోలితం కాని తావుకు సర్దుకోవాలనుకుంటాడు. ఈ సర్దు బాటులో అంతర్ముఖత్వ బహిర్ముఖత్వాలు రెండూ ఆవృత్త మౌతుంటాయి. ఈ ఆవృత్తి చేతనా జగత్తును ఆశ్రయించినప్పుడు చేతనావర్త విన్యాసం గోచరిత మౌతుంది. కవిత్వంలో ఇటువంటి విన్యాసం ప్రతిఫలింప జెయ్యటమే లక్ష్యంగా సాగింది చేతనవర్త కవిత.

[illegible]

మనిషి మనస్సు కాలంతో ప్రయాణిస్తుందంటాడు చేతనావర్తకవి. ఈ ప్రయాణమే అతని దృష్టిలో చేతనావర్తం.

ఈ కవులు కేవల తాత్త్విక దృష్టితో మాత్రమే కాక నేలమీదనిలిచి సాము చెయ్యాలనే దృష్టితో కూడా రచనలు చెయ్యటం విశేషం.

పశువులు మేతలేక చావటానికి కారణం — గడ్డి మొలవకపోవటంకాదు, మొలిచిన నానాగడ్డీ గరస్తున్న నాయకుల వల్లనే ఇక్కడంతా క్షామ మట!

సుప్రసన్న, సంపత్, నరసింహారెడ్డి, పేర్వారం పెద్ద ఎక్స్పెరిమెంట్లుచేసి ఫలితాలు సాధిస్తున్నారు. పేర్వారం "సెటైర్" ప్రళయాంతకంగా ఉంటుంది.

"చలితో పోరాటంచేసి ఫుట్‌పాత్‌పై పడున్న
మూడుకాళ్ళ ముసలివాడి గోచిపేగు కరుచుకపోయింది కుక్క."

కనకపుసింహాసనంమీద కూర్చోబెట్టినా వెనుకటి గుణం మానలేందికదా!

"దౌర్భాగ్యనగరంలో దిగంబరమానవుడి అవతరణ
అవలోకించండి; దర్శనం చేసుకోండని ప్రబోధిస్తూ
'Non అయ్య'కు నమస్తే" అన్న పేర్వారం
ఉద్దేశించిందేమిటి?

టి. యల్. కాంతారావన్నట్లు "దిగంబర కవితోద్యమానికి కౌంటర్ రియాక్షన్ చేతనావర్త కవితా సంకలనాలు. ఇజాలు కీకారణ్యాలంటూనే తాము ఆ అరణ్యంలోకి ప్రవేశించటం లాంటిది కాదా?

అయితే జగన్నాథంగారి సెటైర్, సమాజక్షాళనకు ఉక్తి చమత్కారాన్ని తోడు చేసుకున్నది కనుక ఉత్తమజాతి రచనగానే గ్రాహ్యం.

వస్తువుతోపాటు రచనారీతికూడా మారటం ఇక్కడ గుర్తించతగ్గ అంశం. వస్తుగ్రహణంలోనే కాక రచనారీతితో కూడా పూర్తి భిన్నంగా కావాలని ముందుకు వచ్చిన కవిసేన కొత్తదారులు తొక్కినమాట వాస్తవం.

కవిత్వం రాజకీయ నినాదాల్లో బందీకావటం సహించలేక కవిసేన ముందుకు దూకింది. కవిసేనానాయకుడు శేషేంద్రశర్మ. "సామాజిక చైతన్యం ముసుగు క్రింద వీరవిహారం చేస్తున్న శిల్పరహిత అకవిత్వ మలినాన్ని క్షాళనం చెయ్యటం" వీరి లక్ష్యం. నాయకుణ్ణి అనుసరించే కవిసేన, సంఖ్యాబలం ఇంకా పుంజుకోవలసి వుంది. 'కొమ్మలు చీల్చుకువస్తున్నపూలు' పరిమళం వెదజల్లటానికి పట్టేకాలం పడుతుంది.

'నా దేశం నా ప్రజలు'లో నాయకుడు కర్షకుడు. అతడు శ్రమకు మరో రూపం. ప్రకృతి అతని రంగస్థలం. అతడు జగత్ స్థితికారకుడు. కావ్యం ప్రతీకాత్మకంగా నడిచింది. ప్రతీకలు అలంకారస్థాయినికూడా అధిగమించి సార్థక్యం సంతరించుకోవటం విశేషం.

ఇస్మాయిల్ 'చెట్టు నా ఆదర్శం' అన్నప్పుడూ ప్రతీకాత్మకతే ప్రాధాన్యం వహిస్తోంది.

"సగం పురుగు సగం పిట్ట
ధరను చొచ్చి దివిని విచ్చి
వింట తాల్చు తరువు"

—ఇందులో ప్రాణి అస్తిత్వం కోసం చేసే పోరాటం ధ్వనితం.

"నరకబడ్డచెట్టే ఒక నవవిప్లవ విరాటుగా
విజృంభించింది, విక్రమించింది"

అని అన్న సినారె "మంటలూ మానవుడూ" కూడా ప్రతీకాత్మకతనే పొదువుకుంది. వ్యంగ్యార్థం వ్యంగ్యధర్మాన్ని దాటిపోయింది.

నగ్నముని కొయ్యగుర్రం - కదలలేని ప్రభుత్వ వ్యవస్థకు ప్రతీకగా నిప్పులాంటి [illegible] విధ్వంసం చెయ్యగల కవిత, [illegible] ప్రతీతమైన [illegible] ప్రతిఘటనామూర్తి నగ్నముని. రమణారెడ్డి [illegible] 'సృజన' విప్లవప్రసవిత్రులు...

వస్తువుని ఎంచుకోవటంలోనేకాక వాడే శబ్దాల్లోకూడా ఏ శబ్దాన్ని ఎంత పుటంపెట్టి వాడుకోవాలో తెలిసిన కవులు కొద్దిమంది మాత్రమే. శివారెడ్డి కవిత్వం గూర్చి రాస్తూ "భ్రష్టుడు శబ్దంతో కూడా వ్యభిచరిస్తా" డని అన్నాడు. ఏ భావానికి ఏ శబ్దం ఉచితమో తెలియనివాడు శబ్ద-భావ-ఉభయభ్రష్టుడన్నమాట! గద్దర్ శబ్దాల్లోని పల్లెయాస, వంగపండు శబ్దాల్లోని శ్రీకాకుళం మాండలికం, రంథి సోమరాజు రాజీభాష కవిత్వాన్ని సామాన్యభాష ఎంతగా అందగింప జేస్తుందో సూచిస్తుంది.

సమాజాన్ని ఆశ్రయించిన జీవన పద్ధతులు, భావాశ్రితులైన ఆశయ దృక్పథాలు కావ్య ప్రక్రియంకు దోహదక్రియలు చేసి సంప్రదాయార్థ్యం సమకూరుస్తాయి. అంటే ఒక ప్రక్రియ సంప్రదాయంగా బలపడాలంటే అది సాధించే సామాజిక ప్రయోజనాలు కూడా పరిగణనకు రాకతప్పదు. కావ్యదృక్పథంలో నవ్యసంప్రదాయాలు స్థిరపడటానికూడా ఆయా సంప్రదాయాల సామాజిక ప్రయోజనాలు కారణభూతా లౌతాయి.

వచన కవితల్లో కథాకావ్యాలుకూడా విధిగారావాలనీ మహాకావ్యాలు మరెన్ని రావాలనీ భావించిన వారిలో కుదుర్తి గణనీయుడు. 'తెలంగాణా' కావ్యాన్ని అష్టాదశ పర్వ నిర్వహణ సంభృతంగా మలిచాడు. కథాకావ్యాలను సమర్థంగా రూపొందించిన గౌరవం శీలా వీర్రాజుది. ఊహకందని ఉజ్జ్వలమైన మలుపుతో కథ ముగించటం ఆయన సొత్తు. దృశ్యచిత్రణ కూడా విలక్షణమే.

"ఊరిత్రోవ్ల మీద బాల్యాన్ని పారేసుకున్న
పదేళ్ళ నగ్నపాదాల్ని చూడు!
అరికాళ్ళనిండా ఆక్రమించుకుని ఎర్రపత్రాలదృశ్యం!"

"పడగెత్తిన ఉదయం"లో మాదిరాజు చేసిన తత్త్వచింతన కావ్యదృక్పథంలో నూతన సంప్రదాయ స్ఫూర్తిని కల్గిస్తుంది.

వచన కవిత్వపు రచనారీతుల్లో నూతన ప్రయోగాలు చేసిన సందర్భాలు [illegible] విప్లవ కవుల్లో ప్రముఖుడైన రమణారెడ్డి 'కావ్యోపన్యాస' మనే కొత్త

ప్రయోగం చేశాడు. వచన కవితా రచనలో ఎడనెడ గీత సమిశ్రణం ఉంటుంది. అయితే, ఇది కూడా ఉపన్యాస ధోరణిలో సుదీర్ఘమై సంక్షిప్తతలో వుండే మేలి గుణాలు కొన్ని లుప్తం కావటానికి వీలిచ్చింది. ఎంతో సంయమంతో నిర్వహిస్తే కాని రచన రక్తి కట్టదు. యస్వీ జోగారావు పద్యవచన సంభాషణలు సంధించి, 'ఊహాప్రహేళిక' ప్రయోగించటం జరిగింది. బెజవాడ గోపాలరెడ్డి 'ఉల్లేఖాలు' సంక్షిప్త సూక్తుల్లా మినీకవితను తలపింపజేస్తున్నాయి.

మినీ కవితాప్రక్రియ నవ్యకావ్య సంప్రదాయంలో బహుళవ్యాప్తి పొందింది. జింబో సెలవిచ్చినట్లు "గొప్ప అర్థాన్ని విషయాన్ని అతితక్కువ పరిధిలో చెప్పడం, ఆవేశాన్ని,ఆనందాన్ని హృదయానికి హత్తుకునేట్లుగా చెప్పడం" మినీ కవిత.

"బస్సులు ప్రాకని గొంద్రాలు ఈ రోడ్డు;
ఈ బల్బు బతుక్కి కనెక్షన్లన్నీ వున్నాయి, కరెంటు లేదు.

ఇది దేశప్రగతిని గూర్చి దేవరాజు మహారాజు మనీ కవిత. సెటైర్‌లో ఝుడితి స్ఫూర్తి ఉంది.

కాళోజీ జె. పి. మీద రాసిన మినీకవిత సంక్షిప్తతకు చక్కని ఉదాహరణ.

"పుటక నీది; చావు నీది; బతుకంతా దేశానిది"

'మినీ కవిత'కి 'మాక్సివాక్యం' చేసిన సర్దేశాయి తిరుమలరావు ఆరుద్ర చేసిన నియమం పేర్కొన్నాడు.

"ఎన్నిగజాలు రాశాడన్నది కాదు
ఎన్ని నిజాలు చెప్పాడన్నది ముఖ్యం."

అయితే ఈ లెక్కప్రకారం అత్యంత మినీకవిత "ఓం" అనే ఏకాక్షరం కావాల్సి వస్తుందనీ - ఉత్తరగీతం మీదనే అనంతసత్యం ఉండాల్సివస్తుందనీ వ్యంగ్య గర్భంగా మినీకవితను సర్దేశాయి వ్యాఖ్యానించటం జరిగింది. ఎవరేం చెప్పినా సూక్ష్మంలో మోక్షంగా మినీకవిత ఆధునిక కవితాజగత్తుని ఆకట్టుకుంటోందనేది అపూర్వసత్యం.

పత్రికల్లో 'స్పేస్ ఫిల్లర్స్' కోసం పుట్టింది మినీకవిత అనేది కూడా ఒక సత్యమే అయినా సాధిస్తున్న ప్రయోజనం అంతకంటే విశిష్టమైంది కనుక మినీకవిత కావ్యదృక్పథంలో నవ్య సంప్రదాయంగా అంగీకరించవచ్చు.

తెలుగులో అతినవ్యమైన కావ్యదృక్పథం సంప్రదాయంగా స్థిరపడటానికి కొంతకాలం పట్టింది. సంప్రదాయం ఒకరకమైన ఘనీభూతస్థితి. ద్రవస్థితి నుండి ఘనీభూతస్థితికిరావటానికి వేడిచల్లారి వాతావరణం ప్రశమనం పొందాలి. అభ్యుదయ కవిత్వ అనంతర ధోరణుల్లో విప్లవ కవిత్వ ధోరణి - దిగంబర కవితా ధోరణి - మానవతావాద - అనుభూతివాద - చేతనావర్త వాద - కవిసేనా వాదాదులు వస్తు స్వీకార విషయంలో కవితా విభ్యక్త ధర్మాల విషయంలో నవ్య సంప్రదాయాన్ని పుణికి పుచ్చుకున్న కావ్యదృక్పథాలే. రచనా రీతుల్లో కథాకావ్యాలు, కావ్యోపన్యాసాలు, ఊహాప్రహేళికలు, ఉల్లేఖాలు, మినీకవితలు మొదలైనవి కూడా నవ్యపద్ధతులు పుణికి పుచ్చుకున్న కావ్యరీతులే, నవ్యసంప్రదాయాలే.

ఇక్కడ ఒక్క అంశం గుర్తుంచుకోవాలి. కవిత్వంలో ఒకనాటి పద్యం నేడు పక్కకు తప్పుకుని వచన కవితకు చోటిచ్చినట్లే - నేటి వచనకవిత కూడా రేపటి సామాజిక వైజ్ఞానిక ప్రయోజనాలు సాధించలేకపోవచ్చు. కవిత్వం అనేది రాయాల్సిన పనిలేకుండా చెబితేనే సరిపోవచ్చు.

మైక్రోఫిల్మింగ్ సాధనాలు సమకూరిన తరువాత గ్రంథాలయాల్లోని లక్షల పుస్తకాలన్ని ఓ చిన్న పెట్టెలోని మైక్రోఫిల్ముల్లోకి ఒదిగి పోతున్నట్లు అనంత కవితాభావన అద్భుత ప్రణవనాదంలో ఇమిడిపోవచ్చు. అటువంటి దశ ఒకటి వచ్చి, అదే నవ్య సంప్రదాయంగా పరిణతమైతే ఆశ్చర్యపడనక్కర్లేదు. సాహిత్యం, టెక్నాలజీ, కమ్యూనికేషన్లు - అన్నీ కలిసి రేపటి కవిత్వాన్ని శాస్త్ర శిశువుగా రూపొందించినా అబ్బురంలేదు. ఆ చిన్నెలిప్పటికే పొడసూపాయి. ఏమైనా మనిషికోసం మంచికోసం నవ్యత్వ మానవత్వాలు కవిత్వాన్ని అంటిపెట్టుకొని వుండక మాత్రం తప్పదు. శ్రీశ్రీ అన్నట్లు కవి ప్రజాస్వామ్యాన్ని అంగీకరిస్తూనే మెజారిటీకి అందని వూహలు వెదకాలి. ఆ వెదకులాటంతా మనిషి మంచికోసమే కనుక అది నవ్యకావ్య దృక్పథంలో అంతర్భాగమే అవుతుంది; ఆధునికానుకూలమైన పరిణామ శీలమై సత్కవితా సంప్రదాయమూ అవుతుంది. సత్సంప్రదాయానికి ప్రయోజనాత్మక అన్వేషణ ప్రచ్ఛన్నబీజం.

# ప్రయోజన దృక్పథం

అద్దేపల్లి రామమోహనరావు

ఆధునిక కవిత్వంలో సుమారు 1934 నుండి 1955 దాకా 'అభ్యుదయ యుగం' అని పిలుస్తాం. ఈ యుగం ముఖ్యంగా మార్క్సిస్టు మూల సూత్రాల అవగాహనతో రాయబడిన కవితాయుగం. కవిత్వానికి 'సామాజిక ప్రయోజనం' అనే దృక్పథాన్ని ఆధునిక సాహిత్యంలో బాగా కలిగించింది అభ్యుదయ కవిత్వమే. **కవిత్వాన్ని కేవలం మార్క్సియ రాజకీయాలతో నింపి రాస్తేనే అది అభ్యుదయ కవిత్వమని, ఆనాటి అభ్యుదయ రచయితలెవరూ అనలేదు.** అందుచేతనే అభ్యుదయ కవితా ప్రారంభకుడుగా గురజాడను పేర్కొనడం జరిగింది. అందువల్ల, తన నాటి సమాజాన్ని పట్టించుకునేది, ఆర్థిక - రాజకీయ సాంఘిక సాంస్కృతిక వ్యవస్థలోని అసమానతలను వ్యక్తీకరించేది, వర్గ స్పృహతోకూడి భవిష్యత్సమాజాన్ని సమసమాజంగా ఏర్పరచే దృక్పథం కలిగిందీ అభ్యుదయ కవిత్వమని అర్థంచేసుకోబడింది. బీదరికాన్ని వాస్తవికంగా వర్ణించటం దగ్గరనుండి, వర్గ పోరాటంవరకూ ఒక విశాల పరిధిలో అభ్యుదయ కవిత్వం నిర్వచించబడింది. 1953 లో, అభ్యుదయ కవితా రీతులకి దర్పణంగా ముద్రించబడిన 'కల్పన' అనే సంకలనంలోని 'చింతన' అనే ముందు మాటలో ఆనాడు అభ్యుదయ కవిత్వం ఎలా అవగాహన చేసుకోబడిందో స్పష్టంగా గమనించవచ్చు. అనిసెట్టి యిలా అంటాడు :

"సాహిత్యం ఉద్వేగమార్గాన జరిపే సత్యాన్వేషణ. ఈ యుగంతో మన కవిత్వం జీవితాన్ని వాస్తవ దృక్పథంతో పరిశీలించి, ఎదుర్కొని ఆత్మతో భాగస్వామిగా పాల్గొనే యౌవన దశ ఆరంభమయింది. వెంటనే ఈ యుగపు ప్రభావ లక్షణాలైన ఆందోళనా భయాలు, ఆకలి, ఆశ, ముందు చూపు, విప్లవం సహజంగానే సాహిత్యంలో ప్రవేశించాయి. జాతులన్నీ ఏక కుటుంబంగా ఏర్పడటంచేత జాతీయ అంతర్జాతీయ జీవితాలు పెనవేసుకుపోవడంచేత సాహిత్యంలో

మానవ వ్యక్తి అంతర్జాతీయ వ్యక్తిగా రూపొందాడు. అంతేకాదు. అంతర్జాతీయ సాహిత్యంలోని సంప్రదాయాలు, మార్పులు ఆంధ్ర సాహిత్యంలో ప్రవేశించాయి.

నేటి కవులు ప్రస్తుతంలో నిలిచి భవిష్యత్స్వరూపాన్ని దర్శించడానికి యత్నిస్తున్నారు. దీనికి పురిగొల్పే సమస్య 'లేమి'. భౌతిక ఆధ్యాత్మిక కల్లోలం ప్రస్తుత జీవితం దుస్సహమనీ, మార్పు అత్యవసరమనీ స్పష్టం చేస్తున్నది. ఆ మార్పు పేరు 'విప్లవం'. 'ఆశ' ప్రగతికి వెన్నెముక. మృత్యువును జయించాలనే చిరవాంఛా సాఫల్యానికి యుద్ధ నివారణ, 'శాంతి' సాధన ప్రథమ సోపానాలు. 'స్వేచ్ఛ' నరుల నిత్యాదర్శం. 'శాంతి' సుఖమయ స్వేచ్ఛాయుత జీవనానికి ప్రాతిపదిక. ఇవి నేటి సత్యాలు. అయినప్పుడు ఈ మాటలు మన కవితలో తరచు వినిపించడం, చైతన్య జ్యోతులుగా వెలిగి మన కవిత్వాదర్శానికి మార్గ దర్శకాలు కావడం ఆశ్చర్యం కాదు."

ఈ సందర్భంలోనే 'రామదాసు' చెప్పిన మాటలివి :

**"ఈ యుగంలో వ్యక్తి చైతన్యం సాంఘిక చైతన్యంగా విస్తరిల్లింది** వికలమైన సంఘ వ్యవస్థ ఫలితంగా శకలాలై చెదిరిన జీవిత చిత్రణకు ప్రాధాన్యత కనిపిస్తుంది. ఈ యుగాన్ని ఆవరించిన ప్రధాన తత్వదృష్టి 'మార్క్సిజం'. నేటి సాంఘిక విషబంధంలో చిక్కిన మానవునికి మార్క్సిజం గొప్ప నిష్కృతి మార్గంగా కనిపించింది. అందుచేత వివిధ అంతర్వైరుధ్యాలతో సంఘర్షితమౌతున్న సంఘసంగీతం ఈ యుగంలోని కవితలో వినిపిస్తుంది. **నేటి కవులు యుద్ధాన్ని**, పరపీడనను, ఆర్థిక అసమానతను ద్వేషించి, విశ్వ **శాంతిని, నవమానవ ప్రాదుర్భావాన్ని ఆశిస్తున్నారు."**

పై విషయాల్నిబట్టి కేవలం మార్క్సిస్టు రాజకీయ అవగాహన కూడిన కవిత్వాన్ని మాత్రమే అభ్యుదయ కవిత్వంగా పరిగణించ లేదనీ, సంప్రదాయాల మీద తిరుగుబాటు దగ్గిరనుండి విప్లవం దాకా విశాల పరిధిలోని కవిత్వాన్ని **'మార్క్సిస్టు' లేదా 'అభ్యుదయ'** కవిత్వంగానే పరిగణించారనీ **వ్యక్తమవు తుంది. అంతేగాక నూతనమైన వ్యక్తీకరణల్ని, ప్రయోగాల్ని, వైవిధ్యాన్ని కూడా అభ్యుదయ పరిధిలోకి అంగీకరించారు. అభ్యుదయ కవితా సంపుటం** 'కల్హాన'లోని కవితలన్నీ చదివితే ఈ అభిప్రాయం స్పష్టమవుతుంది. **అంతే**

గాక 1962లో కె. వి. రమణారెడ్డి 'అడుగుజాడ గురజాడది' అనే కవితా సంకలనాన్ని ప్రచురించాడు. ఇందులోని కవితలు చదివితే అభ్యుదయ కవిత్వపు విశాల పరిధిగా ఆనాటి రచయితలు ఎంత భావ, ప్రక్రియ, ప్రయోగ వైరుధ్యాన్ని పరిగణించారో వ్యక్తమౌతుంది. కాని,రానురాను 'అభ్యుదయ యుగ' అనంతరం కేవలం అభ్యుదయ పరంగా 'సామాజిక చైతన్యం' మాత్రమే తీసుకోబడింది. వస్తు ప్రాధాన్యం హెచ్చింది. ప్రయోగమూ, వైచిత్రి మొదలైనవన్నీ గొప్పగా పరిగణింపబడలేదు. నేటికాలానికి వచ్చేటప్పటికి ఈ 'వస్తు' ప్రాధాన్యం చాలా ముఖ్యంగా భావించబడుతోంది. ఈ దృష్టితో పరిశీలన చేస్తే, ఈనాడు వస్తున్న కవితా సంపుటులలో, సంకలనాల్లో, వివిధ పత్రికలలో కవులు రాస్తున్న కవితల్లో 'అభ్యుదయ భావన' ప్రధానరేఖగా ఉంది. కాబట్టి అభ్యుదయ యుగానంతర కవిత్వ ప్రయోజన సమీక్ష, ప్రాధాన్య వివక్షచేత చెయ్యబడిందే గాని, ఈనాడు అభ్యుదయ సాహిత్యం ప్రధాన ధోరణిగా లేదని భావించ నవసరంలేదు. **సమాజంలో ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక సంఘర్షణలు ప్రధానంగా ఉన్నంతకాలం అభ్యుదయ కవిత్వం ప్రధాన కవితా ధోరణిగా ఉండక తప్పదు.**

1955 నుంచి 1965 వరకూ ఏ ధోరణీ ఉధృతంగా, ఉద్యమరూపంగా రాలేదు. కాని, ఆ కాలంలో యిద్దరు మహాకవుల కవితారూప తపస్సు ఆ కాలాన్నీ తర్వాతికాలాన్నీ ప్రభావితంచేసేటంత ఉన్నతంగా కొనసాగింది. ఆ ఇద్దరూ **తిలక్, కుందుర్తి.** సుమారు 1955 నుండి 1965 వరకూ తన వినూతనమైన శైలిచేత, పదప్రయోగంచేత, భావనా సౌకుమార్యంచేత, అనుభూతి విశేషంచేత, అభ్యుదయ వస్తువుచేత, ఒకే ఒక్క కవిగా అందరి మన్ననలు పొందినవాడు తిలక్. వచన కవితకు కూడా చదవగానే పద్యాల్లా మాత్రాచ్ఛందస్సుల్లా అప్పచెప్పే గుణాన్ని నేర్పింది మొదటిసారిగా తిలక్ అని చెప్పవచ్చు. తిలక్, కుందుర్తి- సామాజిక ప్రయోజనాన్ని ఎలా సాధించారన్నది పరిశీలింపవలసిన విషయం.

తిలక్ ప్రధానంగా అభ్యుదయ వస్తువుని స్వీకరించలేదు. కొన్ని కవితలు అభ్యుదయ వస్తువులో రాసినప్పటికీ అతని కవిత్వంలో వినూతనంగా దర్శనమిచ్చిన లక్షణం అనుభూతులకి అతిరమ్యమైన అక్షర రూపాన్నివ్వడం. తిలక్‌లోని ఈ ప్రత్యేక లక్షణాన్ని 1967 ప్రాంతాల్లోనే నేను 'అనుభూతివాది తిలక్'

అనే వ్యాసంలో విశ్లేషించి ఉన్నాను. ఉదాహరణకి 'నేను కాని నేను' అనే కవితని తీసుకోవచ్చు. అందులో తాను కవిత్వం రాస్తున్న సమయంలోని అనుభూతిని ఎంతో లీనం చేసుకోగలిగినట్లు రాస్తాడు.

"ఒక నిరార్ధభాగంలో నక్షత్రనివహ గగనం
ఓరగా భూమ్మీదకు వొంగి ఏదో రహస్యం చెబుతున్న వేళ
ఒంటరిగా నా గదిలో నేను మేల్కొని రాసుకుంటూంటాను
నా హృదయస్పందన మాత్రం నాకు వినిపిస్తూ ఉంటుంది
ఎదురుగా గోడమీద బల్లి ఏకాగ్రంగా నా కేసి చూస్తూ ఉంటుంది
కిటికీ అవతల ఫెరన్ మొక్క క్రీగంట కనిపెడుతూ ఉంటుంది
కీచురాళ్ళ చప్పుడు అప్పుడప్పుడు వినిపిస్తూ ఉంటుంది...."

ఇలా క్రమంగా కవితా సమాధిలోకి వెళ్ళి రచనా కాలపు అనుభూతివి వర్ణించి, ఆ అనుభూతి జారిపోవడాన్ని మొదట్లో తీసుకున్న వస్తువుల్నే మరో విధంగా చెప్పి, సాధిస్తాడు.

"గోడమీది బల్లి విసుగ్గా వెళ్ళిపోయింది
ఫెరన్ మొక్క నిద్రపోయింది
ఆకాశం నక్షత్రాల్ని జారవిడిచి అంత ఎత్తుకు ఎగిరిపోయింది
నా చుట్టూ ఉన్న తెరలు జారిపోయాయి నాకు నిజంగా మెలకువ వచ్చింది.."

గోడమీదబల్లి, ఫెరన్ మొక్క- మొదట్లో తననే చూస్తున్నట్టు అనిపించిన చైతన్యం కవిత జారిపోవడాన్ని బల్లి విసుగ్గా వెళ్ళిపోవడం, ఫెరన్ మొక్క నిద్రపోవడం- వ్యక్తీకరిస్తున్నై. ఇలా అనుభూతులకు అక్షరాకృతి నివ్వడం తిలక్ ప్రత్యేకత. అంతేగాక, ఎన్నో భావ కవితా లక్షణాల్ని గూడా వచన కవితలో ప్రదర్శించాడు తిలక్. అయితే అభ్యుదయ వస్తువుని చెప్పడంలో కూడా ఎంతో శక్తిని సాధించాడు. ముఖ్యంగా మనస్సు పట్టి లాక్కుపోయే శైలి అతని ప్రయోజనాన్ని నెరవేరుస్తుంది. ఆ శైలిలో ఎక్కువగా సంస్కృత శబ్దాలుండడం కూడా అందుకు సహకరించడం విశేషం. యిలాటి పద్ధతిని అతనికి పూర్వం అభ్యుదయ కవులెవరూ వచన కవితలో సాధించలేదు. ఉదాహరణకి 'ఆర్తగీతం' నుండి క్రింది పంక్తుల్ని చెప్పవచ్చు.

"నేను చూశాను నిజంగా పిల్లలకు గంజి కాచి పోసి
తాను నిరాహారుడై
రుద్ధ బాష్పాకులితనయనుడై ఆఫీసుకు వచ్చిన వృద్ధుని
ప్యూన్ వీరన్నని-
నేను చూశాను నిజంగా క్షయగ్రస్త భార్య యిక బతకదని
డాక్టరు చెప్పినప్పుడు
ప్రచండవాతూలహతనీపశాఖవలె జగజ
వణకిపోయిన అరక్త అశక్త గుమాస్తాని
అయిదారుగురు పిల్లలు గలవాణ్ణి-
నేను చూశాను నిజంగా మూర్తీభవత్ దైన్యాన్ని హైన్యాన్ని
క్షుభితాశ్రు కల్లోలినీ రథుల్ని, గచ్ఛత్ శవాకార వికారుల్ని...."

తిలక్ అభ్యుదయ వస్తువుని తీసుకున్నప్పుడు, సమస్యల్ని సాధ్యమైనంత బలంగా పాఠకుని హృదయం మీద ముద్రించడమే ప్రధానం. తిరుగుబాటు, వర్గచైతన్యం మొదలైనవి అతనికి ప్రధానం కాదు. అందుకే తాను ఏ వాదానికీ సంబంధించిన వాణ్ణి కాదనీ, ఇజాలకు అతీతుణ్ణనీ చెప్పుకున్నాడు. అభ్యుదయ వస్తువులతో సామాజిక ప్రయో జన దృక్పథంతో అతను రాసినవి కొద్ది గేయాలే ఐనా, వాటికి తమ శైలీ ప్రత్యేకతవలన హృదయంలో హత్తుకునే గుణం ఉంది. తిలక్ యొక్క స్వతంత్రమైన ముద్ర ఉంది.

ఒక విధంగా ఆధునిక కవిత్వంలో 1955-65 మధ్య కాలంలో నన్నయ లాటివాడు తిలక్ అనుకుంటే, తిక్కన లాటివాడు కుందుర్తి. శైలి, రాశి, పలుకుబడి, నాటకీయత మొదలైన అనేక లక్షణాలకి ఈ పోలిక సరిపోతుంది.

కుందుర్తికి ప్రజలు కావాలి. కవిత్వం ప్రజలదాకా వెళ్ళి ప్రయోజనాన్ని సాధించాలంటే, వచన కవిత చాలా గొప్ప వాహిక అనీ. ఆ వచన కవిత ఎంత సులభంగా ఉంటే అంతగా ప్రయోజనాన్ని సాధిస్తుందనీ ఆయన దృక్పథం. అందుకే వచన కవిత్వానికీ, అభ్యుదయ దృక్పథానికీ ఒక సమగ్ర సమన్వయాన్ని భావించాడు. ప్రజలంటే కుందుర్తి దృష్టితో సామాన్య ప్రజలు. వారిదాకా కవిత్వం వెళ్ళాలనీ, అందుకు వచన కవిత్వమే కావాలనీ ఆయన తీవ్రంగా

సమిష్టి, తాను సమ్మిన భావాలకి తగినదైన ఒక ప్రత్యేక స్వరూపాన్ని సాధించ గలిగాడు. ఆయన 'స్పందన' సంకలనానికి ముందు మాటలో యిలా అంటాడు:

"అందుకే నా ఊహలో వచన కవిత్వం అంటే ప్రజల కవిత్వం. నా కవిత్వానికి వ్యాకరణం ప్రజలు, అంటే వారుపయోగించడం ద్వారా సాధువులైన శబ్దాలనే నేను ప్రయోగిస్తాను. నాకు నిఘంటువు ప్రజలు. అంటే వారుపయోగించినప్పుడు కలుగుతున్న అర్థస్ఫూర్తినే కల్పిగిస్తాను గాని, శబ్దాలకు కావ్య భాషలోని అర్థంతో నాకు పనిలేదు. నాకు అలంకారాలు ప్రజలు. అంటే ప్రజల భాషలో వాడే అలంకారాలే గాని కేవలం అలంకార శాస్త్ర ప్రదర్శనం చెయ్యడానికి మనసొప్పదు. ఒక్క మాటలో చెప్పాలంటే నా వూహలో కవితకు శరీరం ప్రజల వ్యవహార భాష; ఆత్మ వారి అభ్యున్నతి."

ప్రజలు ఎక్కడ ఏ రీతిలో మేల్కొని తిరుగుబాటు చేసినా అది తన కవితా వస్తువుగా తీసుకుంటాడు కుందుర్తి. అందుకే దండియాత్రలో గాంధీజీ పిలుపుకు మేల్కొన్న ప్రజోద్యమాన్ని, తెలంగాణా ఉద్యమంలో పీడిత వర్గాల తిరుగుబాటుని ఒకే ఆవేశంలో వర్ణిస్తాడు.

అభ్యుదయ కవులంటే కుందుర్తిది చాలా విశాలమైన దృక్పథం, ప్రజల సమస్యల్ని వర్ణించడం దగ్గరనుండి వర్గ పోరాటం దాకా ఆయన అభ్యుదయ భావాలుగా గ్రహిస్తాడు. మార్క్సిజానికీ, అభ్యుదయ వాదానికీ గల సంబంధాన్ని ఆయన యిలా చెప్తాడు :

"అభ్యుదయ కవులందరూ పార్టీలలో సభ్యులు కారు. మార్క్సిజానికి సంబంధించిన ఊహలు వారికి ఉండవచ్చు. అందులోని కరుణవాదానికి మాత్రమే వారు బద్ధులై మిగిలిన పార్టీ వ్యవహారాలకి దూరంగా ఉండవచ్చు. అభ్యుదయ కవి కావడానికి ఆమాత్రం చాలు. సమకాలీన సమాజ స్పృహతో కూడిన రచనలు చేసేవారు, పురోగామిదృక్పథం కలవారు అందరూ అభ్యుదయకవులే!"

కుందుర్తికి సమకాలీన ఆర్థిక రాజకీయ సామాజిక సమస్యల్ని అనేక విధాలుగా వర్ణించడం ప్రధానం. ఆయన కవిత్వంలో సామాజిక సమస్యలన్నీ దర్శనమిస్తై. సమస్యల్ని సూక్ష్మమైన అంశాలతోసహా వర్ణించడం ఆయన పద్ధతి.

కవిత్వంలో తెచ్చిన గొప్పమార్పు. ఐతే ఈ లక్షణం అభ్యుదయ కవిత్వంలో అంతకుముందే బయలుదేరింది. కాని, అది కుందుర్తిలో విశ్వరూపం ధరించింది. 1962 లో 'అడుగుజాడ గురజాడది' అనే సంకలనంలో కె. వి. రమణారెడ్డి ముందుమాటలో ఇలా అంటాడు:

"కావ్య స్వరూపంలో వచ్చినట్లే కావ్య వస్తువులో కూడా తొలి మార్పు వచ్చి ఇప్పటికే పాతికేళ్ళు కావస్తోంది. ఆ మార్పు అప్పటి రూపంలో ఇప్పుడిక లేదు. శ్రీశ్రీకి దూరంలో స్థూలరేఖా చిత్రంగానే దర్శనమిచ్చిన భావి పరిణామ రూపం, నేటి కవికి సూక్ష్మాంశ సహిత చిత్రంగా, మరింత దాపుగా, మరింత సమగ్రంగా కనిపిస్తూ ఉంది. ఒక కృష్ణపక్షి వినువీధిలోనుండి భూమి విశాల స్వరూపాన్ని మాత్రమే చూడగలిగినట్లు, శ్రీశ్రీ మానవ సమస్యల ప్రాథమిక (ఎలిమెంటరీ) రూపాలను చూసి, ప్రాకృతిక (ఎలిమెంటల్) నిర్భరత్వంలో గానం చేశాడు. ఆ తర్వాతి కవులు ఇంకా కిందకి దిగివచ్చారు. ఇంకా ఎక్కువ చూశారు. ఇంకా లోతుగా చొరబారినారు. సమస్యల ఉప (సెకండరీ) రూపాలను కూడా చూసి, మానవ మనోనుభూతులను చిత్రకోటి పద్ధతులలో గానం చేశారు...."

కుందుర్తి యిలా గానం చేసినవారిలో ప్రథముడు. విశిష్టుడు. ఆయన కవితా రీతుల్లో ముఖ్యంగా చెప్పుకోవలసింది గొప్ప వ్యంగ్యశక్తి. అందుకే ప్రజల ముందు కుందుర్తి తన కవిత్వాన్ని వినిపించినప్పుడు వారు ఆయన కవిత్వంలో మమేకం కాగలరు. ఉదాహరణకి 'ఇది నా దేశం'లో యిలా అంటాడు:

"దేశమంటే మనుషులన్నాం.... మట్టి మాత్రం కాదన్నాం
అదెబ్బతో మట్టి కోపంవచ్చి పంటలు పండడం మానేసింది
మనుషులందరి బుర్రల్లోదూరి మఠం వేసుకు కూచుంది
అందరు జీవంలేని బొమ్మల్లా నడుస్తున్నారు
కృత్రిమ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు విడుస్తున్నారు."

వచన కవితలో కథాకావ్యాన్ని ప్రతిపాదించిన కుందుర్తి భావన ప్రయోజన దృక్పథానికి బాగా సహకరించేది. ఎలా సహకరిస్తుందో కుందుర్తి యిలా చెప్తాడు:

"కథలోని సన్నివేశాల్ని బట్టి కవి ఎంతో వైవిధ్యం ప్రదర్శించవచ్చు. కల్పనలే అనేకమైన సొగసులు చేసుకోవచ్చు. పాత్రల మనస్తత్వాలను పరిశీలించ వచ్చు. నాటకీయత సాధించవచ్చు. తన ప్రతిభలోని ప్రతి అంశాన్ని ప్రకటించు కోవచ్చు. ఈనాటి ఖండికల రూపంలో ఇదంతా సాధ్యంకాదు."

ముఖ్యంగా ఒకే అభిప్రాయాన్ని రోకటిపాటగా చెప్తున్న ఈ కాలానికి కుందుర్తి చెప్పిన కథాకావ్య ప్రతిపాదన చాలా ఉపయోగిస్తుంది. అంతేగాక, కవిత్వం శిల్పరహితంగా వస్తున్న కాలంలో కుందుర్తి చెప్పిన పైమాటలు ఎంత శిల్పమైనా ప్రదర్శించే అవకాశాన్ని కలిగిస్తై. ఇలా కుందుర్తి ప్రజాసమస్యలకీ, ప్రజాపోరాటాలకీ కవిత్వంలో ఎంతో విస్తృతమైన అవకాశాన్ని కల్పించి, అభ్యుదయ పదానికి విశాలమైన పరిధిని కల్పించి, వచన కవితని అతి సులభంగా చేసి, సామాజిక ప్రయోజనవాదంలో ఒక నూతనాధ్యాయాన్ని నిర్మించాడు.

1965 లో దిగంబరకవులు తమ మొదటి సంపుటాన్ని ప్రకటించారు. వీళ్ళు నగ్నముని, నిఖిలేశ్వర్, జ్వాలాముఖి, చెరబండరాజు, భైరవయ్య, మహాస్వప్న - అనే ఆరుగురు. ఈ మొదటి సంపుటం వెలువడగానే ఆంధ్ర దేశంలో ఒక సంచలనం కలిగింది. ఆ సంచలానికి కారణం ఈ కవితలో యింతకు ముందెప్పుడూ లేని ఒక 'కసి' అతి తీవ్రంగా వ్యక్తం కావడం. రెండోది ఈ ఆరుగురిలోనూ మంచి కవిత్వం చెప్పగల ప్రతిభ ఉండడం. మూడోది వీరు వెలువరించే 'కసి' సరిహద్దులు దాటి అసభ్యతలోకి అడుగుపెట్టడం. చాలా మంది యువకులకి ఆ అసభ్యత ఆ కవిత్వాన్ని మెచ్చుకోడానికి అభ్యంతరం కాలేదు. కొందరికి ఆ అసభ్యతవలన, ఉన్న కవిత్వాన్ని కూడా మెచ్చుకోలేని పరిస్థితి ఏర్పడింది. ఏమైనా దిగంబర కవిత్వం ఒక సంచలనం మాత్రం తీవ్రంగా కలిగించింది. అంతకు ముందునించి వస్తున్న మార్క్సిస్టు కవిత్వధారలో భాగమూ కాదు, అనుభూతి కవిత్వధారలో భాగమూ కాదు, ఇదొక వినూతనమైన 'కసి'. ఆ కొత్తదనం వల్ల కూడా ఆ సంపుటికి వెంటనే ఒక **Response** కలిగించి. కొందరు దీన్ని ఒక ఉద్యమం బయలుదేరిందని పత్రికలలో రాశారు. ఉద్యమమౌనో కాదో తరవాత పరిశీలిద్దాం. ముందు వీరి ప్రయోజనదృక్పథ మేమిటన్నది ఆలోచించవలసి ఉంది. మొదటి సంపుటపు ఉపోద్ఘాతానికి వీరు 'దిగంబరశకం

లోకి' అనే శీర్షిక పెట్టి తమ లక్ష్యాల్ని రాశారు. అందులో ముఖ్యమైన లక్ష్యాలు ఇవి :

"కీర్తి, డబ్బు యినప బూట్లకింద పడి నలిగి కొనవూపిరితో గిలగిలా కొట్టుకుంటున్న మీ అసలు స్వరూపాన్ని ఎన్నడైనా, ఒక్కనాడైనా చూసుకున్నారా?

మీరు జీవిస్తున్నది మీ జీవితం కాదు. మీ ముసుగు, నటన జీవితం. అధికార - జీవితం. డబ్బు జీవితం. గౌరవ జీవితం. వాటి కోసం పడిచచ్చి వాటి కోసం ఏదయినా సరే, చివరికి మిమ్మల్ని సైతం చంపుకునే దిక్కుమాలిన జీవితం.

ఏం? ఈ ముసుగులేక పోతేనేం? స్వేచ్ఛగా అసలు స్వరూపంతో బతక దానికి యత్నిస్తేనేం?

నువ్వు రేపు. నీ అధికారం లేదు. నీ హోదా లేదు. నీ పంచ జరీఅంచు లేదు. నువ్వు 24 గంటలూ పదిలంగా మేకప్ చేసుకుంటున్న నీ ముసుగు లేదు. నీ పెళ్ళాం బిడ్డలు నీచుట్టూ గుమిగూడినవాళ్ళు, నీ చివరి ఒంటరి బిక్కు బిక్కు మనే క్షణాల్లో నిన్ను fool చేస్తారు.

దేన్నీ నమ్మకు. నీలోపల, ఈ ముసుగులోపల, యీ వంచన అంచుల కింద ఉన్న నీ అసలు స్వరూపాన్ని, నీ 'తనాన్ని' నమ్ముకో. ఈ నాలుగు నిమిషాలూ హాయిగా బతుకు. అవి తెలుసుకున్నప్పుడు యింతకాలం యీ ముసుగు నిన్ను ఎంత వ్యర్థుడిగా చేసిందో తెలుస్తుంది. ఒక్కటి గుర్తుంచుకో. ఇందరిమధ్య, యిన్ని ప్రపంచ - ప్రకృతి కార్యకలాపాల మధ్య, నిన్ను నువ్వు చీల్చుకున్న యిన్ని వేల ముసుగు ముఖాల మధ్య, ఊపిరి సలపనీని బతుకుపోరాటం మధ్య నువ్వెప్పుడూ ఏకాకివి. జననమరణయాతనల మధ్య పోరుసల్పే సైనికుడివి."

పై పంక్తుల్లో ఈ కవుల లక్ష్యం స్పష్టంగా తెలుస్తుంది. Hypocrisy లేని స్వచ్ఛమైన చిత్తశుద్ధిగల ఉన్నత మానవుణ్ణి తయారుచేయటం. ఈ లక్ష్యాలతో పాటు existentialist trend కూడా కనిపిస్తుంది. కొంత ఆధ్యాత్మిక స్పర్శ ఉంది.

లోకంలో కనిపిస్తున్న అవగుణాలుగలవా ళ్ళందరినీ తీవ్రంగా తిట్టి మార్పు తెద్దామని ఈ కవుల ప్రయత్నం. దాన్నే Shock-treatment అని కూడా పేర్కొన్నారు.

కాబట్టి వీరి ప్రయత్నం వైయక్తిక దృక్పథం కలది. గురజాడ నుండి అభ్యుదయ కవులకి అనూచానంగా వస్తున్న సామాజిక చైతన్యం వీరి లక్ష్యం కాదు. వారి రెండవ మూడవ సంపుటాల్లో క్రమక్రమంగా సామాజిక దృష్టి పెరుగుతూ వచ్చింది. ఈ మూడు సంపుటాల్నీ చదివితే, ఆ కవిత్వం నుండి ఒక నిర్దిష్టమైన, నిర్మాణాత్మకమైన ఒక ప్రణాళిక ఏర్పడదు. అందుకే దిగంబర కవిత్వం ఒక ఉద్యమం కాలేకపోయింది. 1968 లో ప్రకటించబడిన మూడో సంపుటంలో మాత్రం కొంత కొంతగా మార్క్సిస్టు తీవ్రవాదానికి మొగ్గే సూచనలు కనిపించినవి.

ఎంత అసభ్యత, ఎన్ని పరస్పర వైరుధ్యాలూ, ఎంత అస్పష్టత కనిపించినా, కొందరు ఈ సంపుటాల్లో అక్కడక్కడ మంచి కవిత్వాన్ని గ్రహించక పోలేదు. ఉదా. కి-

"కలియుగం రేడియో గ్రామ్‌లో
గిరగిర తిరుగుతున్న క్రీ. శ. ఇరవయ్యో శతాబ్దం రికార్డు మీద పిన్నునై
మానవత రెండు కళ్ళూ మూసుకపోయినప్పుడు
విప్పుకుంటున్న మూడో కన్నునై
కాలం వాయులీనం మీదం కమానునై
చరిత్ర నిద్రాసముద్రం మీద తుఫానునై
నేను వస్తున్నాను దిగంబర కవిని
రాత్రి ఉదయిస్తున్న రవిని-"

అలాగే. మరోచోట-

"పరిణామం పెట్టిన ఆశాశాపం భిక్షను నేను
నాగరికతా అవహేళనలో
కన్నీళ్ళను అడుక్కుంటున్న యుగభిక్షువును నేను
విజ్ఞానం విసరిన విషకిరణానికి చెడిపోయిన చక్షువును నేను

వ్యధా శోకాల పీడిత లోకాంలో
విరిసిన కారుణ్య మహాబోధి వెలుగులో
మెరిసిన తథాగతుణ్ణి నేను
అహంకారం సిలువపైన నవ్విన నెత్తురు గులాబీని నేను-"

కవిత్వంలో ఎన్ని మంచి లక్షణాలున్నా ఒక సమగ్రమైన దృక్పథాన్ని ప్రదర్శించ లేకపోతే, పైగా ఒక నిర్దిష్టమైన లక్ష్యం లేకపోతే ఆ కవిత్వం ఉన్నత స్థాయికి వెళ్ళి, ఒక ఉద్యమాన్ని నిర్మించలేదు. అందుకే దిగంబర కవిత్వం, 'కసి'కి ఫలితంగా రాబోయే ఒక తీవ్రవాదానికి వేగుచుక్కలా కనిపించి తెరమరుగు కావడం జరిగింది.

1970 నుండి సుమారుగా 1980 దాకా విప్లవరచయితల సంఘం **Dominate** చేసిన సంవత్సరాలు. విప్లవ కవిత్వంగురించి మొట్టమొదటగా చెప్పుకోవలసిన విశేషం, అది యింతకుముందు ఉద్యమాల వలె ఏవిధమైన పాశ్చాత్య ప్రభావమూ ఉన్నటువంటిదికాదు. సరాసరి జరుగుతున్న ఉద్యమంలో నుండి ఊపిరి తీసుకున్నది. అందుకే విప్లవ కవిత్వం సంపూర్ణంగా రాజకీయ మైనది. ఈ కవిత్వానికి అభ్యుదయ కవిత్వంవలె విశాల పరిధి లేదు. వర్గపోరాటం లక్ష్యంగా పెట్టుకున్నది. యింతకుముందు వర్గ స్పృహ, వర్గ చైతన్యం మొదలైన వాటి ఆవిష్కరణ జరిగిపోయింది కాబట్టి యిప్పుడు వర్గపోరాటం సాయుధంగా సాగాలని కోరుతుంది. కవితలో రాజకీయం వెన్నెముకగా ఉండాలని, సందేశం కర్షక కార్మిక విద్యార్థి మేధావుల్ని విప్లవోద్యమం వైపు మళ్ళించడం కావాలని తీవ్రంగా చెప్తుంది. అందుకే కవిత్వంలో పరిష్కారం చెప్పడం ముఖ్యమంటుంది. రాజకీయం కవిత్వంలో ఉండాలా అక్కర్లేదా అన్న చర్చలో రాజకీయం నెగ్గిం దనీ, యిప్పుడు మనకు కావలసింది ఏ రాజకీయం కావాలన్నదే అనీ యీ ఉద్యమ కవిత ప్రకటిస్తుంది. కవితా వస్తువు తక్కువ పరిధి కలిగింది. కాబట్టి ఎవరో ఒకరిద్దరు గొప్పకవులు రాసిందాంట్లో, వ్యక్తీకరణలో వైవిధ్యం ఉండవచ్చుగాని, చాలావరకు చదివిన భావాల్నే మళ్ళీ చదువుతున్నామనే భావం కలుగుతుంది.

విప్లవ కవిత సరాసరి అట్టడుగు వర్గాలకి దగ్గరగా వెళ్ళి వాళ్ళని పోరా టానికి ఉన్ముఖం చెయ్యాలనే లక్ష్యం కలది. అందుకే వచన కవితయే కాకుండా

పాటని చాలా ఎక్కువగా ఆదరించింది. యింతకుముందు తెలంగాణా ఉద్యమంలో కూడా ఎన్నో పాటలు రచించబడ్డై. కాని,విప్లవోద్యమంలో పాటలకున్న ప్రాధాన్యం యింకా ఎక్కువయింది. వందలాది జానపద బాణీలు సేకరించి, ఆ వరసలో విప్లవానికి సంబంధించిన పాటలు రాయడం జరిగింది.

విప్లవోద్యమం సాహిత్యరంగంలోకి తెచ్చిన మరొక ప్రధాన విషయం **Commitment** సిద్ధాంతం. ఈ సిద్ధాంత ప్రభావం తర్వాతి సాహిత్యం మీదా సాహిత్యకారులమీదా బాగా కనిపిస్తుంది. ఎవరు ఏ సిద్ధాంతానికి చెందుతారో స్పష్టంగా తెలియడం ఈ సిద్ధాంత లక్ష్యం. అందుకే ఒకప్పుడు అభ్యుదయాన్నీ, అనుభూతుల్నీ, ప్రయోగాల్నీ అన్నిటినీ కలిపి కవులు రాయగా, విప్లవోద్యమం తర్వాత స్పష్టంగా విడివడిపోవడం జరిగింది. సమాజాన్ని గూర్చి రాసే కవి, సమాజం కంటె యితరమైన భావాలతో కవిత్వం రాయడంలేదు. అసామాజికంగా రాసే కవి సామాజిక చైతన్యాన్ని స్వీకరించడంలేదు. ఒకవేళ ఎవరైనా అలా రాసినా ఎవరూ పట్టించుకోవడంలేదు.

1980 తర్వాత, విప్లవోద్యమ ప్రభావ తీవ్రత తగ్గిపోయిన తర్వాత, ముఖ్యంగా కవుల్లో నాలుగు మార్గాలు ప్రచలితంగా ఉన్నై, కొందరు కవులు అనుభూతివాదాన్ని స్వీకరించారు. మరి కొందరు సామాజిక ప్రగతిని గూర్చి రాస్తున్నారు. కొందరు మార్క్సిస్టు పునాదితో సామాజిక చైతన్యం సృష్టించే వారున్నారు. విప్లవోద్యమం గూర్చి రాసే వారున్నారు. యింకా కొందరు ఎక్కువగా మినీకవితలు రాస్తున్నారు. అందులోనూ దాదాపు మినీ కవితలన్నీ సామాజిక చైతన్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి. ఎవరెన్ని విధాలుగా రాసినప్పటికీ, ఒక్కొక్క కాలానికి ఒక ప్రధాన ధోరణి ఉంటుంది. ఈనాడు సామాజిక ప్రగతివాదం ప్రధానమైనది. మార్క్సిస్టు పునాది లేకపోయినా, సమసమాజ దృష్ట్యా ప్రగతి కవిత్వం రాసే వాళ్ళందర్నీ అభ్యుదయ కవులనే అనాలి. వ్యాసం మొదట వివరించినట్లుగా ఒక విశాల పరిధిలో అభ్యుదయ కవిత్వాన్ని అంగీకరించాలి. రేపు రాబోయే సమసమాజానికి ఈనాడు బాటలు వెయ్యాలి.

* * *

(ది. 16-3-1986 నాటి సదస్సులో చదివిన వ్యాసం.)

# మానవతావాద దృక్పథము-
# సామాజిక చైతన్యము

ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

వ్యక్తికీ, సమాజానికీ వున్న సంబంధం ఓడకీ సముద్రానికీ వున్న సంబంధం లాగ నాకనిపిస్తుంది. సముద్రపు ఆటుపోట్లన్నీ ఓడ గమనాన్ని నిర్దేశిస్తాయి. ఇంతకు మించి ఈ పోలికను నేను పొడిగించి వివరించబోవడం లేదు. ఎందుకంటే, ఏ పోలికైనా కొంతవరకే మన ఆలోచన చెప్పడానికి సహకరిస్తుంది. పట్టుకు వ్రేలాడితే మనకే ఎదురు తిరిగి చిక్కుల్లో పెడుతుంది.

వ్యక్తి సమాజాన్ని దాటి, దానిలో ఒడుదుడుకుల్ని ఉపేక్షించి, ముందుకు నడక సాగించడం, అసంభవం అవుతుందని మాత్రమే ఇక్కడ నా తాత్పర్యం.

వ్యక్తి తాను పెరిగిన పరిసరాలలోంచి, తన కాలపు సామాజిక పరిస్థితుల నుంచీ, తాను చదివిన గ్రంథ పరంపర నుంచీ తనదంటూ ఒక సంస్కారాన్ని ఏర్పరచుకుంటాడు. తన ఆలోచన వెళ్ళగలిగినంత దూరం తర్కించుకుని, ఈ సమాజంలో తన గమనపథాన్ని నిర్దేశించుకుంటాడు. తనకంటే ముందు పుట్టి— ఈ ప్రపంచం గురించి ఆలోచించి, సంఘర్షించి, ప్రశ్నించి, అనుమానించి కొందరు వ్యక్తులు—వారు కవులు కావచ్చు; తత్త్వవేత్తలు కావచ్చు; శాస్త్రజ్ఞులు కావచ్చు;—చేసిన ప్రబోధాల సముదాయం అతగాడికి దిక్సూచిగా పనిచేస్తుంది.

అయితే-ఈ ఆలోచనాపరులకి కూడా పరిమితులుంటాయి. పరిధులుంటాయి. వారు పరిశీలించిన సామాజిక పరిమితులుంటాయి. వీరు భవిష్యత్తులోకి చూసే చూపుకి ప్రసరణశక్తి కొంత దూరమే వుంటుంది. ఎప్పుడైనా ఈ ప్రపంచంలో సాపేక్ష సత్యాలు తప్ప, ఎల్లలు లేని పరమ సత్యమంటూ వుండదు

ఇవాళ మనం మాట్లాడుకునేది సాహిత్యం గురించి; సమాజంలో మనుషుల గమనానికి పనికి వచ్చే అనేక అంశాలలో ఏకదేశమైన ఒకానొక విషయం గురించి——

అంటే-, పెద్దగ్రూప్ ఫోటోలో ప్రముఖంగా కనిపించటానికి గాను ఒక ముఖాన్ని 'క్లోజప్'లోకి తెచ్చి పరిశీలిస్తున్నామన్నమాట.

ఏమిటీముఖం? భౌతికంగా దీనివంశం పరిస్థితి ఏమిటి? ఈ గ్రూప్ ఫొటోలో చేరడానికి దీనికి వున్న ప్రతిష్ఠ ఏమిటి? మిగతా ముఖాలపట్ల దీని దృక్పథం ఏమిటి?——ఇలా ప్రశ్నలు అనంతాలు——, ఇక్కడితో ఈ పోలిక కూడా ఆపుతాను.

వ్యష్టి-, సమష్టి; మనిషి-సంఘం-; కవిత్వం - కవి పాఠకుడు, - ఇటువంటి ఆలోచనలు ముసురుకొన్నప్పుడు నాలో నడిచే విచికిత్స ఇలా వుంటుందని చెప్పడానికే ఇంతదూరం చెప్పాను.

నేను చదివినంతలో, నా తర్కసహాయంతో, నా ఆలోచనలు సాగినంతలో, నా కర్థమైనది, ఈ సమాజం సక్రమంగానో, అక్రమంగానో, ముందు యుగాల్లోకి నడవటానికి కారణం 'వ్యక్తి'——అంటే గతాన్ని, భవిష్యత్తునూ సమన్వయపరచుకుంటూ వర్తమానంలో తార్కికంగా ఆలోచించే "వ్యక్తి". ఇతడు ఒక తరంలో, సమూహాలను బాగా పరిశీలించి, తాను సముపార్జించుకున్న జ్ఞానంతో తాత్త్విక జీవన సూత్రాలను రూపొందించి, ప్రభావితం చేస్తాడు. ఈ సూత్రాల ప్రభావం, ఈ వ్యక్తి వ్యక్తిత్వపు ప్రభావం, అతని తరువాత కాలంలో శక్తిమంతంగా నిలిచి సమాజాన్ని ముందుకి నడిపించవచ్చు. లేదా అనేక కారణాల వల్ల సార్థక్యం కోల్పోయి నిరర్థకాలై పోవచ్చు. ఇంకొకటి కూడా జరగవచ్చు. ఒక బలవత్తరమైన ఆలోచనాశీలి ఏర్పరచిన సూత్రాలకు, భిన్నరీతుల్లో వ్యాఖ్యానాలు అవతరించి, మూలసూత్రాల మౌలికార్థం ఛిన్నాభిన్నం కావచ్చు. ఇవన్నీ మనం నమ్మిన, నమ్మదలుచుకున్న సర్వసిద్ధాంతాలకూ వర్తిస్తాయి.

'మానవతావాద దృక్పథం', పరతత్త్వం, ప్రభుతత్త్వం స్థానంలో మానవత్వానికి మకుటం పెట్టిన అంశం. మానవ మేధ, మానవ కృషి, మానవ స్వేచ్ఛ

సౌహార్దం, సౌభ్రాత్రం.- ఇవే ఈ మానవ సమాజం సుందరమూ అర్థవంతమూ కావడానికి ప్రధాన మంటుందీ దృక్పథం. మన దేశంలో రాజా రామమోహన రాయలు ఈ ధోరణికి ప్రాతినిధ్యం వహిస్తే-, ఆంధ్ర దేశంలో వీరేశలింగం నాయకత్వం వహించారు. కవుల్లో భారతీయపీఠంమీద ప్రతినిధిగా రవీంద్రనాథ్ టాగోర్ అధిష్ఠిస్తే, ఆంధ్రలో దేవులపల్లి కృష్ణశాస్త్రి తన కవితాగానం చేశారు. రేపటి మనిషి కోసం, రేపటి ఉజ్జ్వల ప్రతిభా వికాసంకోసం;- మనిషి మనిషి తనాన్ని కోల్పోరాదనీ, సాటిమనిషి ఉనికిని మరచిపోరాదనీ, చేయీచేయీ కలిపి, సంకుచిత ధోరణులు - అవి ఏరూపంలో వున్నా మలిపేసి - ఒకే ఒక్క మానవ సంఘం ఒకే ఒక మానవాత్మగా మనగలగాలనీ మానవతావాద సారాంశం.

ఇది గాంధీయుగంలోకంటా ప్రసరించి సమాజపరంగా ఒక తరాన్ని తరాన్ని ఊరేగించింది; సంస్కరించింది; పలికించింది; పాడించింది. ఈ వాదంలో 'వ్యక్తి' ఆధారభూమిక. వ్యక్తి వ్యక్తితో, వ్యక్తిగురించి, చెపుతాడు. ఇలా ఒకళ్ళ కొకళ్ళుగా చెప్పుకుంటూపోతే, ఈ వాద సందేశం సమాజమంతా ప్రసరిస్తుందని దీని భావం.

"సామాజిక చైతన్యం" అనే పదబంధం మార్క్సిస్టు ఆలోచనా బీజం నుంచి మన దేశంలోకి వచ్చింది. ఈ వాదం ప్రకారం స్థూలంగా చెప్పాలంటే, సమాజ చైతన్యమే వ్యక్తి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది. ఇక్కడ సమాజమే సూర్యుడు, వ్యక్తి కిరణం. ఇది క్రమంగా సాహిత్యానికీ అన్వయించింది. అభ్యుదయ సాహిత్యోద్యమానికి తల్లివేరు ఈ సామాజిక చైతన్యమే.

మానవతావాద దృక్పథం, సమాజం, అనేవి రెండుదృశ్యా లనుకుంటే, సమాజం వైపు కెమేరా వుంచి చిత్రిస్తే అది సామాజిక దృక్పథం అవుతుంది.

ఇక్కడొక సంగతి చెప్పాలి. మౌలికమైన, కేవల వ్యక్తిపరమైన, మానవతావాదం, గాంధీయుగంలో వేరే విశాలమైన రీతిలో వెలుగులు ప్రసరించింది. మరి కొంతముందుకి- అంటే కమ్యూనిస్టు ఉద్యమ ప్రభావంలో నడిచి, దాని అభివ్యక్తి స్వభావం మారింది. సామాజిక చైతన్యం అనే అంశం కూడా, ఆర్థిక రాజకీయ కారణాల వెలుగులో కొత్త అర్థాన్ని సంతరించుకుంది. రామరాను

సామాజిక చైతన్యం అనేది-"పేద ప్రజల అభ్యున్నతి కోరుకునే రాజకీయమైన అవగాహనతో- అదికూడా కమ్యూనిస్టు రాజకీయ అవగాహనతో"-ప్రత్యేకార్థాన్ని సంతరించుకుంది. 'మానవతావాద దృక్పథం' 'సామాజిక చైతన్య దృక్పథం' అనే పదబంధాలు మౌలికంగా మానవ శరీరంలో గుండె, శరీరం అనే రెండు భాగాలు అయినా, వాటికి ప్రత్యేకార్థాలతో చీటీలు అతికించిపున్నాయి. మానవతా వాదం అనుభూతివాదమంది; సామాజిక చైతన్యవాదం ప్రజా రచయితలదని- మాన మార్గం యిదీ అని ఇతరులకు తెలియడానికి ఈ చీటీలు పెరునామాలు చెప్తాయేమోగాని, ఇవి సమగ్ర దృక్పథం చెప్పవు. సమగ్రత అంటే చీటీలను మించిన అర్థాలని ఇక్కడ నా వుద్దేశం.

ఏ సూత్రాలైనా, సిద్ధాంతాలైనా, సంస్థాగతంగానో, వ్యవస్థాగతంగానో, బోధకు ఉద్యమించినపుడు తర్క-వితర్కాలూ తప్పవు; వ్యాఖ్యానాలూ తప్పవు; నిందారోపణలూ తప్పవు. సూత్రానికి ఆచరణకి నడుమ యివన్నీ అగాధాలు సృష్టిస్తాయే తప్ప చేరవలసిన రీతిలో చేరవలసిన వారికి పరమార్థం చేర్చవు.

చీటీలు తీసేసిన వేళ మానవతావాది కృష్ణశాస్త్రి, సామాజికవాది శ్రీశ్రీకి దగ్గర.

అభ్యుదయ కవిత్వోద్యమం ఫలానాచోట ముగిసిందనడం నా కిష్టం లేదు. మనిషి మానవౌన్నత్యం కోరడమే అభ్యుదయం. సాహిత్య చరిత్రలో ఒక సౌకర్యం కోసం, రాజకీయ సిద్ధాంతావగాహనలో తర్వాత ఏర్పడిన అభిప్రాయ భేదాల దృష్ట్యా, ఒక గీత అవసరమే అనుకుంటే—అది పంచాంగంలో తిథి వారాల మధ్య మార్పు సూచించే గీత వంటిది మాత్రం కాదు. అందుకే అభ్యుదయ కవిత్వోద్యమంలోంచి వచ్చిన దేవరకొండ బాలగంగాధర తిలక్ పరిమిత ఉద్యమ మార్గానికి లొంగలేదు.

మానవ దుఃఖానికి పరిష్కారం కోసం పరితపించిన బైరాగి తన కవితలన్నిటా మనిషి గురించే కలవరించాడు.

మనుషుల్లో మాయముసుగుల భయంకర ఆవరణాల్ని ఛేదించి, దిగంబరంగా మనస్సుల్ని బయటకి లాగటానికి ఉద్ఘోషించి, దిగంబర కవులు కేకలు వేశారు.

శేషేంద్ర, 'కవిసేన' అంటూ కలతపడుతున్నాడు. మానవ స్పందనలకు ఆకృతి యివ్వవలసిన కవిత్వంలో ముద్రలూ-సరిహద్దులూ, ఆలోచనా విధానాల బిగింపులూ, వద్దంటున్నాడు అనుభూతివాది.

"ఈ కబుర్లన్నీ వట్టి బూటకాలు, రాజకీయ కార్యాచరణకు లక్షల ప్రజల్ని మేలుకొలిపి ముందుకు నడిపించజాలని కవిత్వం నిరర్థకం" అంటున్నారు విప్లవ కవులు—

ఎవరైనా, ఏ తీరునైనా, మనిషి మనిషిగా బ్రతికేలోకం కావాలంటున్నారు. కవి, ఎక్కడో పీఠం మీద కూర్చుని ప్రబోధిస్తే మిగతావారు చేతులు కట్టుకుని అనుసరించాలనడం లేదు.

"సమాజం నుండి కవి వేరు కాడు" అని గాని—"మనిషి దీవికాడు" అని గానీ—కొత్తగా జ్ఞాపకం చెయ్యక్కర్లేదు. మొదట్లోనే మనవి చేసినట్లు—ఈ సమాజంలో మనిషిని స్పృశించే అనేక విషయాల్లో సాహిత్యం ఒకటి; అందులో ఏకదేశ వ్యవహారం కవిత్వం—, మనిషి మనిషితో ఏకాంతంగా మాట్లాడటం మానవతా దృక్పథం అనుకుంటే– మనిషి సమాజంలో సమూహం మధ్య నిలబడి ప్రసంగించటంలాగ సామాజిక చైతన్యవాదం-సాహిత్యపరంగా నాకు అనిపిస్తుంది.

చివరిగా—అభ్యుదయ కవిత్వోద్యమం అనే ఒక చోట గేటు పెట్టక తప్ప దంటే—తెలుగు కవిత్వంలో ఆ తర్వాత కొనసాగిన తిలక్, బైరాగి, దిగంబ రులు, అజంతా; 'చితి-చింత' మోహన ప్రసాద్, శేషేంద్ర, ఇంకా కొందరు కొత్త కవులు, విప్లవ కవుల్లో 'గద్దర్', 'శివసాగర్', కె. వి. రమణారెడ్డి, చెర బండరాజు, మరి కొందరూ; అక్షర సముద్రం మీద నా కళ్ళకు ప్రముఖంగా కనిపిస్తున్నారు.

మానవతావాదం, సామాజిక చైతన్యం అనే పదబంధాలకు ఏర్పడిన చట్రాలను వ్యతిరేకిస్తున్నాను. ఒకానొక రాజకీయ అవగాహన మాత్రమే సంకీర్ణ సమాజంలో మనిషిని ఉద్ధరిస్తుందనే ఆలోచనను వ్యతిరేకిస్తున్నాను.

నిరవధికమైన సమాజంలో నివాత దీపమై కాపాడవలసింది మానవత్వమనీ, దానికి ఏ రూపంలో కేతనాలెత్తినా అది మంచి కవిత్వమనీ, ప్రతిపాదిస్తున్నాను.

అటువంటి ఉత్తమ కవులు అభ్యుదయ కవిత్వోద్యమం తర్వాత గత ఇరవై ఏళ్ళుగా దృఢంగా నిలిచి మాట్లాడుతున్నారని నమ్ముతున్నాను.

# అధిక్షేపక కవిత

## అక్కిరాజు రమాపతిరావు (మంజుశ్రీ)

స్వాతంత్ర్యం గనకవస్తే అన్నికష్టాలు ఈడేరుతా యనుకున్నారు భారత ప్రజలు. చిరకాలంనుంచి రోగశయ్య మీద క్రుంగిపోతున్నవ్యక్తికి, ఆరోగ్య స్నానం రేపొద్దున చేయొచ్చు ననగానే కలిగే ఆనందాన్ని, స్వాతంత్ర్యాన్ని తలచుకొని ఊహించారు. క్రమక్రమంగా కోలుకోవచ్చునని ఆశించారు. కాంతికవాటాలు తెరవవచ్చుననుకున్నారు. సొంత ఇల్లు కట్టుకొని గృహప్రవేశముహూర్తం కోసం ఆరాటపడే అనుభూతి పొందారు. మధ్యతరగతి బడుగు వర్గాలు తమ బతుకులు బాగుపడతాయని కలలు కన్నారు. రైతు, కార్మికుడు, విద్యార్థి, ఉద్యోగి స్వాతంత్ర్యోదయం కోసం ఎదురు తెన్నులు చూశారు. 'నాదీ స్వతంత్రదేశం. నాదీ స్వతంత్రజాతి' అని ముందుగానే పాటలు పాడుకున్నారు. 'స్వాతంత్ర్యమె నా జన్మహక్కనీ చాటండీ' అని ఒకరినొకరు హెచ్చరించుకున్నారు. 'ఉదయంబాయెను స్వేచ్ఛాభారతి ఉదయంబాయెనొహో, తూరుపుఖండపువాసుల కోరిక లీడేరెనొహో' అని కళాశాలల, పాఠశాలల, వార్షికోత్సవాలలో తారుణ్య హృదయాలు ఉల్లాసగీతిక లాలపించాయి.

మహానాయకుడినుంచి మట్టిమనిషివరకు ఎప్పుడు ఎప్పుడు స్వాతంత్ర్యం అని ఆరాట పడ్డారు.

మోక్షగుండం విశ్వేశ్వరయ్య జీవితచరిత్రలో ఒక ఆసక్తికరమైన ఉదంతం సమోదై ఉంది. ఆయన ఉద్యోగ జీవితంలో తొలి సంవత్సరాలు పూనాలో పురపాలక పారిశుద్ధ్య కార్యక్రమ నిర్వహణ శాఖలో పనిచేశారు. రహదారులు, మురికినీరు పోయే జలదారులు నిర్మించేశాఖ అన్నమాట. అప్పట్లో ఆయన బొంబాయి రాష్ట్రంలో పదిహేను సంవత్సరాలు పనిచేశారు. అక్కడి పెద్దలందరితో ఆయనకు పరిచయం లభించింది. ఒకరోజున మహాదేవ గోవింద రానడె గారింటి కెందుకో వెళ్ళారు విశ్వేశ్వరయ్య. రానడె మహాశయుడికి విశ్వేశ్వరయ్య అంటే ఎంతో అభిమానం. తరచు ఆయన్ను ఇంటికి ఆహ్వానిస్తూ ఎన్నోవిషయాలు

చెపుతూఉండేవారు. ఆ రోజున విశ్వేశ్వరయ్య తమ ఇంటికి రాగానే రానడే మహాశయుడు ఎంతో గంభీరంగా 'రాండి. నేను చిరకాలంగా ఎంతో అభిమానిస్తున్న నా మిత్రుణ్ణి పరిచయం చేస్తాను' అని పక్కగదిలోకి తీసుకొనివెళ్ళాడు విశ్వేశ్వరయ్యగారిని. అక్కడ ఆయన చూసినదృశ్యం ఒళ్ళు జలదరింపచేసింది. పక్షవాతంతో ఒక రోగి ఇంచుమించు అపస్మారస్థితిలో ఉన్నాడు. ఇద్దరూ గదివెలుపలికి వచ్చిన తరవాత రానడే మహాశయుడు ఎంతో పరితాపకరంగా నిశ్వసిస్తూ 'మన దేశం ఇప్పుడు ఇట్లాఉంది. ఎప్పటికి మనం కోలుకోగలుగుతామో'-అని నిర్వేదం చెందారట. ఆ దృశ్యం నా మనసులో చెరగని ముద్రగా అయిపోయింది అంటారు విశ్వేశ్వరయ్య. *

ఇరవయ్యో శతాబ్ది మొదటి నాలుగుదశాబ్దాలు జాతీయచైతన్యం పరమోత్తేజకరంగా ప్రకాశించింది. ఒక గొప్ప లక్ష్యంకోసం, మహదాశయంకోసం కష్టసహిష్ణుతకు అలవాటు పడ్డారు భారతప్రజ. పారిశ్రామికంగా ఆధునికంగా భారతదేశం చాలా వెనుకబడి ఉందని రానడే అభిప్రాయం అయినప్పటికీ, తిలక్, గోఖలే, రానడే వంటి పెద్దలు పరాధీన దేశంప్రజలు పడే బాధలుగూర్చి నిరంతరం తలపోస్తూ ఉండేవాళ్ళు.

స్వాతంత్ర్యం వచ్చింది. నిజమే.

ఈ స్వాతంత్ర్యోదయంగూర్చి తమిళకవి వెలువరించిన వ్యంగ్యం బాధాకరమే అయినా ఇవాల్టి పరిస్థితులను చూస్తుంటే యథార్థమేనన్న భావన మనల్ని నిలదీసి ప్రశ్నిస్తుంది.

'రాత్రివేళ వచ్చింది
ఇంకా తెల్లారనే లేదు.'**

---

* 'Builders of Modern India'-By V. Sitaramiah, (page No. 13) publications Division, Government of India-(1971)

** తమిళాంధ్ర నవ్య కవిత్వములు-ఆచార్య చల్లా రాధాకృష్ణశర్మ (1988) ఆంధ్ర విశ్వవిద్యాలయ సదస్సులో సమర్పించిన వ్యాసం.

శ్రీ శర్మగారిట్లా వ్యాఖ్యానించారు, ఈ రెండు పంక్తులను
"ఒక తమిళ రచయిత మన స్వాతంత్ర్యాన్ని వ్యాఖ్యానించిన తీరు ఇది. ఈ రెండు చిన్న పాదాలలో గంభీరార్థం ఇమిడివుందని వేరుగా చెప్పనవసరంలేదు.

రానురాను స్వాతంత్ర్యం రాత్రించరులదా అన్న సందేహం కలిగే పరిస్థితులు దేశంలో ఎదురవుతున్నాయి. స్వాతంత్ర్యంతో పాటే దేశంలో స్వార్థం కూడా పుట్టిందని మరో ఆధునిక తమిళకవి కమలా మణెశన్ బాధ పడ్డారట. ప్రజాస్వామ్యం ఏదేశానికైనా గొప్పవరం. కాని, ప్రజాస్వామ్యానికి కవల పిల్లలు పుట్టారు మనదేశంలో. ఒకరు ఓటు, మరొకరు దొంగఓటు, అని యీ తమిళ కవి చమత్కార విచారంగా వ్యాఖ్యానించా రని శ్రీ రాధాకృష్ణ శర్మ పేర్కొన్నారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ప్రతి ఐదు సంవత్సరాలకూ ప్రజాస్వామిక వ్యవస్థ బలపడుతూనే ఉన్నది. ఎన్నికలు జరుగుతూనే ఉన్నాయి. అయినా దేశం స్వయం పోషకం కాలేదు. స్వయం సమృద్ధం కాలేదు. స్వయం శక్తిమంతం గాలేదు. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత పుట్టిన తరానికి కూడా నడివయస్సు దాటు తున్నది.

దేశంలో ఎన్నోచోట్ల అశాంతికర పరిస్థితులు తాండవిస్తున్నాయి. అల్ల కల్లోలాలు చెలరేగుతున్నాయి. అభిప్రాయ భేదాల కలహాలు రోజురోజుకూ రాజు కుంటున్నాయి.

బడుగువర్గాల సముద్ధరణం, సోషలిజం, అని పుట్లకు పుట్లు నినాదాలు మాత్రం కారుకారునా పండుతున్నాయి. దేశానికి వేలు, లక్షలు, కోట్లు అప్పులు మాత్రం సాలుసాలుకూ పేరుకుంటున్నాయి. ఇప్పటికి అప్పు రెండు వేల లక్షల కోట్లట. ఇది ఎంతముప్పుగా పరిణమించేనో! ఇంత విశాలమైన దేశంలో ఇంత జనవనరులుగల, ప్రాచీన కాలంనుంచీ అత్యంత మహిత సంస్కృతిగల దేశంలో స్వాతంత్ర్యం వచ్చిన నాలుగు పదుల కాలంలోనే ఇంత అనర్థకం ఎందుకు సంభవించింది? ఈ దుర్దశ ఎందుకు చుట్టుకుంది? అని మనసున్న వారెవ్వరైనా బాధ పడక తప్పదు. పాలకులు అధికారం కోసం అవినీతి నాశ్రయించటం వల్లనే క్రమక్రమంగా యీ విషమ పరిస్థితులు సంప్రాపించాయి.

న్యాయంగా ఈ పరిస్థితులను బేరీజువెయ్యవలసిన కర్తవ్యం కవులదీ కళాకారులదీ రచయితలదీ కదా! దేశంలో జాతి జీవనంలో జరిగే సంఘటనలకు వ్యాఖ్యకవ్వా స్పందించే దెవ్వరు?

స్వాతంత్ర్యం రాకముందు కన్నకలలకూ అటుతరవాత దేశంలో నెల కొన్న పరిస్థితులకూ చాలా దారుణమైన ఆశాభంగ వ్యత్యయం ఎందుకు కలిగింది అన్న ఆలోచన వచ్చినప్పుడు కవులు సహజంగానే స్పందించారు.

సత్యాగ్రహ సమరంలో వేలకొద్దీ జైళ్ళలో మగ్గిందీ, దేశభక్తులు చెర సాలలు, ఉరికొయ్యలు ధిక్కరించిందీ ఇందుకా అన్న నిర్వేదం సహజంగానే కవులను ఉద్రిక్త పరచింది.

స్వాతంత్ర్యం రాకముందు ప్రజల కష్ట సహిష్ణుతకు, మనోనిబ్బరానికి, ఆశా పరత్వానికి, దేశ దాస్య శృంఖలా విచ్ఛేదన కర్తవ్యతత్పరతకూ రెండు చిన్న ఉదాహరణలు పేర్కొని, అటు తరువాత స్వాతంత్ర్యానంతరం తెలుగు కవుల కవితా ప్రతిస్పందనలు ప్రస్తావించడం జరుగుతుంది.

ఉప్పు సత్యాగ్రహంకాలంలో గుంటూరులోని ఒక ఉన్నత పాఠశాలలో హిందీ పేస్టారుగా పనిచేస్తున్న నెమలికంటి మృత్యుంజయుడు గారి వంటి అతి సాధారణవ్యక్తి చూపిన స్థైయిర్యత్యాగం అత్యంత ఉత్తేజకరం. గుంటూరులో ఒక సత్రం ముందు ఉప్పుసత్యాగ్రహం చేస్తున్న మృత్యుంజయుడుగారిని పోలీసులు లాఠీలతో చితకగొట్టారు. ఆయన అసలే స్థూలకాయుడు. ఆ దెబ్బలన్నీ కిమ్మనకుండా భరించారు. ఒంటిమీద పరమ కిరాతకంగా వాళ్ళ దెబ్బలు తగిలి నప్పుడల్లా 'మారోభాయి, మారో' అని రొప్పుతూ అనగలిగేవారుట ఆయన. పోలీసులచేతులే నొప్పిపుట్టాయి. సిగ్గుపడ్డారు. ఆయన్ను కొట్టికొట్టి అలసిపోయినారు.

ఇంకొక సంఘటన.

రాజమండ్రి జైలు నుంచి తిరుచినాపల్లి జైలుకు సత్యాగ్రహులను తరలి స్తున్నారు. ప్రతి స్టేషన్‌లోనూ సత్యాగ్రహవీరులకు ప్రజలు జేజేలు చెపు తున్నారు. స్వాతంత్ర్యోద్యమంకోసం తమ శక్తికొద్దీ సహాయం చేస్తున్నారు. తెనాలి స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఒక రైల్వే పోర్టర్ స్వాతంత్ర్యవీరుల దళానికి ఒక అణా చందా ఇస్తే, ఆ పోర్టరు దీనస్థితిని చూసి ఆ అణా తీసుకోలేదుట దళంవారు. వెంటనే ఆ పోర్టరు కన్నీళ్ళతో ప్రాధేయపడటం చూసి వాళ్ళ ఆ అణా (ఇప్పుడు ఆరు పైసలు) తీసుకొంటే ఆ పోర్టరు ఆనందం ఇంతా అంతా

కాదు, అని ఈ రెండు ఉదంతాలను 'స్వాతంత్ర్యోద్యమంనాటి స్మృతులు' అనే ప్రశస్తమైన వ్యాసంలో శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు ప్రస్తావించారు.

స్వాతంత్ర్యం రాకపూర్వం దేశంలోని ఆ వితరణ భావం, స్వార్థ త్యాగం, సహిష్ణుత, జాతీయాభిమానం క్రమంగా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కాలంలో నశించిపోయాయనిపిస్తుంది. పరిపాలకమ్మన్యులే జాతికి దుర్బుద్ధులు నేర్పారు. కలహశీలతను ప్రేరేపారు. తాము పదవులలో భద్రంగా ఉండటానికి అనేకమైన కపటాలను ఆశ్రయించారు. వర్గ, వర్ణ, ప్రాంత, మత, భాషా విభేదాలను ప్రోది చేశారు. ఎన్నికలలో విచ్చలవిడిగా ధన వ్యయం చేయవలసిన పరిస్థితులు సృష్టించి అందుకోసం ధనార్జనకై అవినీతి పద్ధతులు ఆశ్రయించారు.

ఇరవైయేడు సంవత్సరాల కిందట ఆనాటి భారతదేశ ఆర్థిక సామాజిక రాజకీయ నైతిక పరిస్థితులను గురించి వేలూరి సహజానంద ('హసజ') ఎంతో గాఢమైన విశ్లేషణ చేశారు. జాతీయదృష్టి లేకపోవడం తలచుకొంటూ ఎంతో బాధపడ్డాడాయన. ఆయన ఆనాడు స్వతంత్ర పత్రికలో వ్రాసిన వాక్యాలు గమనార్హాలు.

"నీవు కాయాని నిలబడి జీవించటానికి ఆవకాశం ఇచ్చిన భూమి పవిత్రతను గుర్తించి దాని భద్రత నీ బాధ్యత అని గ్రహించలేకపోతే, ఈ ప్రాథమిక కర్తవ్యాన్నే నెరవేర్చలేకపోతే, ఇంక మహోన్నత ఆదర్శాలను నువ్వు సాధించగలిగేదేముంది?"

దేశస్థాయిలో సరైన క్రియావిధానాన్ని రూపొందించుకోలేకపోతున్నాం కాబట్టే ప్రజల శక్తి సృజనాత్మకంగా ప్రకటితం కావటం లేదు. మరి అనేక విచ్ఛిన్నకరమైన ఆత్మహత్యాసదృశమైన ప్రక్రియలలో ప్రజలు తగుల్కొంటున్నారు. రాజకీయపార్టీలే, అన్నీ కూడా ఇలాంటి వ్యర్థకర్మకాండల్లోకి ప్రజానీకాన్ని పురిగొల్పుతున్నై. పంజాబ్‌లోని సిక్కుల రభస, మహారాష్ట్రంలో గంధరగోళం.... ఇవన్నీ రేచీకటితో బాధపడుతున్న రోగి లక్షణాలు.

చైనాలో చియాంగ్ కై షేక్ ప్రభుత్వం, పూర్వ శతాబ్దాల్లో మహమ్మదీయ ఈ "గడ్డి తినే కత్తుల్లో" అలవాటువల్ల కాదా పతనమైంది?

'స్వరాజ్యం అయితే వచ్చింది. కాని, జాతీయ భావన ఎంతవరకు అబ్బింది? స్వరాజ్య ఉద్యమంలో ఒక నినాదానికి ప్రతినిధించిన ప్రాముఖ్యం వచ్చినట్టుదిం.... స్వరాజ్యానికి మానవ ఔన్నత్యం కాక, ఆర్థిక-అభివృద్ధి ప్రేరణ అయింది." ఇరపై ఏడేళ్ల కిందటే పంజాబ్ చిచ్చును ప్రస్తావించారు 'హసజ'. దేశంలో సోషలిజం గూర్చి కలలు కన్నవారు, నినాదాలకే దాన్ని పరిమితం చేశారని పై వ్యాసంలో రచయిత ఆవేదన చెందారు. 1960ల నుంచి కొత్త తరంలో వ్యవస్థపై తిరుగుబాటుచేస్తేగాని ఏమీ ఫలితం ఉండదనే ధోరణి క్రమంగా బలం పుంజుకో సాగింది. సాయుధ విప్లవం ఫలిస్తుందని కొంతమంది, గొంతెమ్మ కోరికలతో కొందరు ప్రజలను తప్పుదారి పట్టించారు. హింస, ప్రతిహింసల వలయంలో కుమ్ములాడుకునే సిద్ధాంతాలను ప్రచారం చేయటం సాగించారు. అందువల్ల స్వాతంత్ర్యానికి అర్థమే లేకుండా పోయింది.

'ఇంచుమించు
ఇరవై ఐదేళ్లనించీ చూస్తున్నాను
ఠంచన్‌గా రోజూ టైముకి వస్తాడు
పాడుతూ మా ఇంటికి పాత బిచ్చగాడు
ఏటేటా వచ్చే స్వాతంత్ర్య దివసం
ఎంచక్కా ముస్తాబై వస్తుంది....
ఇప్పుడు మనం
బతుకుతున్నది బతుకు కాదనీ
ఈ స్వాతంత్ర్యం స్వాతంత్ర్యం కాదనీ
ఎట్లా చెప్పాలి నీకు' - అని వ్యధితుడై నాడు స్వర్గీయ వే. నరసింహారెడ్డి. రజతోత్సవ స్వాతంత్ర్యదిన దీన ఆర్తగీతం ఇది.

అభ్యుదయ కవితోద్యమం సుమారు మూడు దశాబ్దాలు యువకవులపై తన ప్రభావం చూపింది. సమసమాజ నిర్మాణానికి ప్రబోధం చేసిందే కాని సాయుధ హింసాయుతమైన అవ్యవస్థలోంచి మాత్రమే అనివార్యంగా సకల జనావళి సుఖించే వ్యవస్థ రూపొందుతుం దనలేదు. రాశిమీద అభ్యుదయ కవితోద్యమం. ఈ తిరుగుబాటు కవిత్వపు విరగబాటు అనేది 1960ల తర్వాత వచ్చిన ధోరణి. తెలుగు సాహిత్యంలో దీనికి నేపథ్యం కూర్చినవారు దిగంబరకవులు.

పిశ్చే ఆ తరువాత విప్లవకవులైనారు. దిగంబర కవితోద్యమం స్వాతంత్ర్యా నంతర తెలుగు సాహిత్యంలో వచ్చిన ఒక ఊపే కాని, అది తిట్లతోను దీవెనల తోను, శాపనార్థాలతోనూ కనుమరుగైపోయింది. ఆర్భాటం కన్పించినంతగా ఔచిత్యం కన్పించలేదు. ఒగుడాకుల మంటలా గుప్పుమని ఆరిపోయింది. ఒక క్రోధతీక్షత, ఒక దుస్సహవేదన, పరాభూత ప్రతీకార తిరస్కారం, కొన్ని పంక్తులలో కవితాకళ సంస్పందనలను వెలార్చాయే కాని మొత్తంమీద మేధావి వర్గాన్నికాని బడుగువర్గాన్ని కానీ ఈ ఆర్భాటం ప్రభావితం చెయ్యలేకపోయింది.

ఇంచుమించుగా 1970 ల నుంచీ కవితావస్తువు అపూర్వంగా మారి పోయింది. పోలీసులు, మంత్రులు, తుపాకులు, జైళ్ళు, దోపిడి, తిరుగుబాటు, యువరక్తం కవితాసమయాలైనాయి. ప్రజలను సమీకరించకుండా, వాళ్ళను విద్యావంతులను చేయకుండా, ప్రజల తాదాత్మ్యం లేకుండా రాజకీయ ఉద్యమం ఏదీ సఫలం కాదు. ఆనాడు అల్లూరి సీతారామరాజు పరప్రభుత్వంపై చేసిన తిరుగుబాటే విఫలమైంది.అయితే ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛను,చైతన్యాన్ని-ఆయన నడిపిన విప్లవం ఉద్బుద్ధం చెయ్యకపోలేదు. కాని, ప్రజలను చిరకాల త్యాగాలకు సంసిద్ధం చేయకుండా, సుసంఘటితం చేయకుండా, నైతిక లక్ష్య నైశిత్యం గల వాళ్ళను చేయకుండా నినాదాలతో, కాలజ్ఞాన తత్త్వాలవంటి సూక్తులతో వాళ్ళ దృక్పథంలో మార్పును ఎవరూ తేలేరు. ఒకవేళ ఏకాస్తో వాళ్ళను కదిలించినా అది కేవలం తాత్కాలికమే అవుతుంది. సమాజంలో చైతన్యవంతులైన శేముషీ వర్గంవాళ్ళు తమలో తాము వివదించుకున్నంత మాత్రంచేత, బృందాలుగా చీలి పొగడుకున్నంత మాత్రంచేత, తెగడుకున్నంత మాత్రంచేత ప్రజలంతా ప్రభా వితులవుతారనుకోవడం భ్రమ. అగ్ని కురిసినా అమృతం చల్లినా కవిత్వం పరమావధి ఆనందం అని ఒప్పుకుంటే కళాత్మక విలువలకే ఎక్కువ ప్రాధాన్యం కాని, ప్రచార ధోరణికి కాదని తేలిపోతున్నది. తరవాత కవితావస్తువు కూడా ప్రజలను ఉత్తేజపరచేదిగా ఉండాలి. వాగాడంబరంగా ఉండకూడదు. శిల్పం ప్రధానంగాని వస్తువు ప్రధానం గాదనే ధోరణి సరిఅయింది కాదు. మల్లెపువ్వు పరిమళాన్ని బట్టే సంసేవ్యమవుతున్నది. కాని, ఉమ్మెత్త పువ్వులాగా అది పెద్దదీ కాదు, అందమైనదీకాదు. అభివ్యక్తి శిల్ప సుందర సమన్వితం కావాలి. నిజమే. కాని ఏం చెపుతున్నామనేది కూడా ముఖ్యం. చెప్పేది మంచి విషయమై అందంగా చెప్పగలగాలి.

'పుటక నీది

చావు నీది

బ్రతుకంతా దేశానిది' - అని కాళోజి చెప్పిన సద్యఃపరనిర్వృతి కవిత జయప్రకాశ్ నారాయణను గూర్చి చెప్పింది కాబట్టి ఎంతో హృద్యంగా ఉంది. ఉత్తేజకరంగా ఉంది. కాబట్టి ఎట్లా చెపుతున్నారు అనేదికాక ఉత్తమ కవిత్వాన్ని జేరీజు వేయడంలో ఏం చెపుతున్నా రన్నది కూడా ప్రాధాన్యం వహిస్తుంది. స్వాతంత్ర్యానంతర కాలంలో జాతి ఎదుర్కొంటున్న సంక్లిష్ట పరిస్థితులవల్ల ఆత్మహనన మార్గం ఒకటి, ఆత్మాన్వేషణ మార్గం ఒకటి రెండు మార్గాలు ప్రధానంగా ఆవిష్కృతమైనాయి. మార్క్సిస్టు దృక్పథపు అవగాహనా, వర్గ కలహ నిబద్ధత ఉత్తమ కవిత్వం రాయదలచుకొన్నవాళ్ళకు అవసరం అనేవాళ్ళ వర్గ మొకటి; అవి అక్కర్లేదు, మానవత్వం, జాతీయతాదాత్మ్యం ప్రధానం అనే వర్గం ఇంకొకటి అని వీళ్ళను వింగడించవచ్చు. మార్క్సిజమే సర్వ సామాజిక రోగ నివారిణి అని గాఢంగా నమ్మేవాళ్ళ భ్రమలను కాలమే కొంతవరకు తేల్చి అప్పుడే రుజువుపరుస్తూనే ఉన్నది. రష్యాలో, చైనాలో భూతాలస్వర్గం నెల కొంటున్న దాఖలా లేమీ లేవు. ఈ దృష్టితో, జాతీయ ప్రజా జనాలను కాపాడు కోవాలనే తపనతో, నేలవిడిచి సాము చేయకూడదనే తత్త్వావలోకనంతో సమాజంలో అన్ని రంగాలలో నెలకొనివున్న అస్తవ్యస్త పరిస్థితులను అపహాస్యంచేసే కవిత వ్రాస్తున్నారు కొందరు. అధిక్షేప ధోరణి సాహిత్యంలో తరతరాలనుంచీ కొనసాగుతున్నదే.

స్వాతంత్ర్యానంతరం తెలుగు కవులలో చెప్పుకోదగినవాడు కుందుర్తి. మౌలికమైన ప్రజ్ఞ, ఉపజ్ఞాశీలమైన ప్రతిభాకల కవి కుందుర్తి. సమాజానికి వెన్నెముకవంటి మధ్య తరగతి జీవనాటి ఈయనకు తెలిసినంతగా ఇతరులకు తెలియ దని చెప్పాలి. వాళ్ళను గూర్చి ఈయన కవితా స్పందనలు స్వభావోక్తి సౌందర్యతుందిలాలు. కటువ్యంగ్యం కాక కారుణిక హాస్యం ఈయన అధిక్షేపానికి వన్నెలు దిద్దుతుంది. 'భగవంతునికి బహిరంగ లేఖ' లాంటి ఖండికలలో ఇది మరింత స్పష్టంగా కనపడుతుంది.

"అన్నింటిలో నీ వున్నావని ఆస్తికు లంటారే కాని

తమలోనే వున్న నిన్ను

తప్పుకునే తిరుగుతుంటారు
గుళ్ళో నిన్ను చూసినట్లుగా
గుండెల్లో చూసుకోలేరు" అని చురకలు తగిలిస్తారు కుందుర్తి.
సమాజంలోని ఆత్మవంచనాపరత్వాన్ని ఆయన సుతిమెత్తగా మందలిస్తాడు. "చైతన్యానివైతే నీవు భూలోకంలోనే లేవు, సత్యస్వరూపానివైతే నీవు మాలోకంలో లేనేలేవు, మనిషిలోని మంచితనానికి మరోరూపమైతే నీవు, అణుబాంబుల పరీక్షలకు బెదరి, అవనిస్థలికి రానేరావు" అని భగవంతు డున్నాడనే విశ్వాసాన్ని అధిక్షేపిస్తున్నాడు కవి.

"ఇక్కడ భూలోకంలో యిప్పుడు కలి మొదటి పాదం
తలక్రిందుగా నడుస్తుంది నీతి
బ్రతుకుబాధల యుద్ధాలకు భయపడి ఎక్కడో
తలదాచుకుంది శాంతికపోతి
ధనం పుష్కలంగా వుండి చీకూ చింతా లేనివాడికి
తనూజులు తినటాని కుండరు
తండులాలు నిండుకున్న అదృష్టహీనుల అర్ధాంగులు
ఆఫీసు వేళకు అన్నం వండరు" వంటి పఙ్క్తులు ఎప్పుడూ హృద్యాలే.
ఈ కవిత కుందుర్తి 1972 లో రాశాడు. వర్తమాన సమాజ వికృతస్వరూపం ప్రతిభావంతంగా ప్రదర్శించా డాయన. ఆధునిక కవిత్వంలో అధిక్షేపం రాశిమీద రాజకీయ సంబంధిగానే కనపడుతున్నది. సర్వసాధారణంగా రాజకీయ సిద్ధాంతాలు వాటి కొమ్ము కాసే రాజకీయ పక్షాలు, ప్రభుత్వం పనిచేసే తీరుతెన్నులు, అది ఆశ్రయిస్తున్న, ప్రోద్బలపరుస్తున్న ఆర్థిక విధానాలు, ఏదోవిధంగా అధికార పదవులను, ఆకర్షణలను అంటిపెట్టుకోవటానికి రాజకీయ పార్టీలు, వ్యక్తులు అనుసరిస్తున్న అవినీతికర, అసభ్య, మానవతా వ్యతిరేక పద్ధతులు కవిత్వాధిక్షేపానికి గురి అవుతున్నాయి. అది సహజమే. ఏమంటే గత రెండు దశాబ్దాలుగా సమాజమే కవితావస్తువైంది. మానవుడి ఇరుకు ఇబ్బందులకు పాలకవర్గమే, అది పెంచి పోషించే అధికార అనధికార చట్టమే ఉత్తరవాదిత్వం వహించవలసి ఉంటుంది. కాబట్టి, పార్టీలు, పార్టీ రాజకీయాలు, ఎన్నికల్లు, మంత్రులు, అధికారయంత్రాంగం కవిత్వంలో ప్రవేశించక తప్పదు. నగరం కూడలిలో నిలుచున్న ఎద్దును ఇట్లా

కవితామయం చేశాడు శ్రీశ్రీ. కాని, ఈ అధిక్షేపంలో కుపిత్వం తప్ప కవిత్వం లేదు. 1955 ప్రాంతంలో రాసిన కవిత ఇది.

"భద్రంసుమీ ఎద్దు నిన్ను తప్పుకోదు
యంత్రవిరోధి అహింసావాది శాఖాహారి
మద్యనిషేధ ప్రజ్ఞాశాలి
నగరం నడివీధిలో
నాగరికత గమనాన్ని నిరోధిస్తూ
ఇలా యెంతసేపయినాసరే
ఈ యెద్దు నిలబడగలదు
ఎప్పుడికి లేకపోతే బుద్ధి
మనిషికేనా ఉండొద్దా?"

ఇది చాలా మౌలికమైన ప్రశ్న.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ నలభై ఏళ్ళలో నూటికి నూరు పాళ్ళు మద్యపాన ప్రీతి పెరిగిందని, ప్రభుత్వం అబ్కారీ ఆదాయంతోనే నడుస్తున్నదనీ ఈ మధ్య పత్రికలలో కొందరు ఘోషించారు. దేశంలో ఏ మూల చూసినా మంచినీళ్ళు దొరకని అస్తవ్యస్త పరిస్థితు లేర్పడ్డాయి. దేశంలోని జీవనదులను వినియోగించుకోలేకపోతున్నాం కాని, అన్ని రాష్ట్రాలలోను అబ్కారీ ఆదాయం అంచెలంచెలుగా వృద్ధి చెందుతూనే వచ్చింది.

ఆంధ్ర రాష్ట్రం ఆవిర్భవించిన సందర్భంగా "ముక్కుపచ్చలారని నవ్యాంధ్ర రాష్ట్ర శిశువు, మూలుగుతూ మూలనున్న ముసలాడికి వధువు" అని చమత్కరించాడు శ్రీశ్రీ. కాని, ఆ ముసలాడి పరిపాలనమే సర్వోత్కృష్టంగా సాగిందనీ, ప్రజాస్వామికమైన విలువలన్నిటినీ పదిలంగా ఆయన పరిరక్షించాడనీ తర్వాత చరిత్ర ఋజువు చేసింది. ఆయన్ను అన్యాయంగా కుచ్చితంగా కుట్ర పూరితంగా రెండుసార్లు అధికారంలోంచి తొలగించడమే ఆధునిక ప్రజా ప్రాతినిధ్య పరిపాలన చరిత్రలో పతన ఘట్టానికి బీజావాపం జరిగిందని గమనార్హం. ఈ భావుకత 1960 లకు ముందునాటిది. ఆటు తర్వాత ఒక దశాబ్ద కాలం దిగంబర కవుల కోలాహలంతో పరిపోయింది.

గజ్జెల మల్లారెడ్డిగారి గేయాలు 1961 లో వచ్చాయి. గమకత్వం ముందు కవిత్వం తక్కువ. జానపద బాణీలు, కారమైన చమత్కారం చూపి అధిక్షేప కవిగా ఈయన కొన్నాళ్ళు ప్రసిద్ధిలోకి వచ్చాడు.

"భారతాన్ని స్వర్లోకపు
పంచల్లో నిలపాలని
పండిజ్జీ పూరించే
పాంచజన్య శంఖధ్వని
అరణ్యమున రోదనమై
అంతరించి పోయెనేమొ?" అని సంతాపిస్తూ,

"మన స్వరాజ్య లక్ష్మి
మాచకమ్మ కాదుకదా?" అని సందేహం వెలిబుచ్చారు గజ్జెలవారు.

"ఈనాడు అవినీతే గద్దె యెక్కి రాజనీతి అయి, అవినీతిని హతమారుస్తా నని గావుకేకలు వేస్తుంటే నీతి ఏదో అవినీతి ఏదో సామాన్యులకు అంతుబట్టడం లేదు" అంటున్నారు ఈ గేయ సంపుటికి పరిచయం రాసిన రాచమల్లు రామచంద్రా రెడ్డి గారు. ఈ గేయ సంపుటిలోని తారకమంత్రం, కాంగిరేసు—కన్నెపడుచు, ఎం.ఎల్.ఏ., అభయ హస్తం, అమాత్య సుభాషితమ్, మహర్షులు మొదలైన గేయాలన్నిటా సామాజిక రాజకీయాధిక్షేపమే కనపడుతుంది. "సిఫారసులు లేకుండా, దఫేదారుగిరి సైతం దక్కనట్టి రాజ్యం" 'ఈ ఎద్దు మార్కు పాలన అనీ, దేశ సౌభాగ్యం మీద పోటీపడి దారిద్ర్యం గెలిచిందనీ' సాహిత్య అకాడమీలు 'పేకిగాడి దర్బారులైనాయని', కాంగ్రెసు ప్రభువుల కావలి కంచెలు చేలనే మేస్తు న్నాయని, ఐతర నేర్చుకోవాలంటే 'మాటల నిచ్చెనల మీద కోటల కెగబ్రాకి పోవాలనీ 'వ్యక్తి స్వేచ్ఛ కరువైందని నెత్తి నోరుగా గొట్టుకుంటూ, కలం కుదువ బెట్టి కపట వృత్తిని పట్టుకోవాలని" "అంతరాత్మ సంగడిలో అమ్మి సొమ్ము జేసుకోవాలని" యీ గేయాలలో మల్లారెడ్డిగారు ఎత్తిపొడిచారు.

1967 లో 'మురారి' కవి ధూర్తాయణం వెల్వడింది. రామాయణంలో 7 కాండలే ఉంటే ఈ గేయ సంపుటిలో 28 కాండలున్నాయి. అందే [illegible]

లెక్కచేయ్యవే చదివాడన్న మాట ఈ కవి! ప్రతి శీర్షికా ఒక కాండంగానే ఈయన రూపొందించారు ఈ సంపుటిలో. దేశమంతా అకాండ తాండవంగా కనపడింది.

"ప్రగతి పథంలో దేశం
ప్రతి అడుగూ ముందుకేసి
సారా సారా దగ్గర
జారెందెందుకు పాదం?" అని పాపం అమాయకంగా ఈ కవి ప్రశ్నిస్తున్నాడు. 'సారా' మతులు ఎందరో పైకి వచ్చినప్పుడు ఆ పథంలో కూడా దేశం వెనకబడలేదని ఈ కవి తెలుసుకోవాలి. స్వతంత్ర భారతదేశంలో పాలక పక్ష రాజకీయ వాగ్దానాలకు, వాటి అమలుకు సంభవించిన అఘాతాన్ని ఈ కవి చమత్కారంగా చెప్పిపోడిచారు.

'జాతీయపుటాదయం
ఐపఁబరీతుల వృద్ధిగాంచి
ధనవంతుల గుప్పెటకే
దాసోహమ్మెనదేమి?' అని బాధపడ్డా డీ కవి. చెప్పేదొకటి చేసేదొకటి ఎక్కడ చూసినా అని ఈ కవి వర్తమాన సమాజాన్ని పరిహసించారు.

ఆధునిక సాహిత్యంలో అధిక్షేపం అనగానే ముందుగా గుర్తొచ్చే కవి కాళోజి. 1966 వ సంవత్సరంలో ఆయన కవితలు చిన్న చిన్న సంపుటాలుగా 'నా గొడవ' పేరుతో వెలువడ్డాయి. కాళోజి కవితలో అనవసరమైన అలంకారాలకు చోటుండదు. సూటిగా తేటగా కవితాస్పర్శతో చెపుతాడాయన ఏ విషయాన్నైనా. సామాజిక రాజకీయ విషయాలన్నీ ఈయనకు కవితా వస్తువే.

"సార్వభౌమ ప్రజాసత్తయుక్తంబగుగణరాజ్యం
సూటికి ఎనుబదియైదు మేటికాపులున్న పుడమి
'మాధ్యాకబళం' అనుచూ
అ-ర-దేశాల ముందు
దోసిలొగ్గి దేవురింప
అమ్మయ్యో అభ్యుదయం" అంటూ దేశం సాధించిన అభ్యుదయాన్ని ఎద్దేవా చేశారు కాళోజి.

"దొంగతనము బైటబడిన
వెంగలేదు లోటులేదు
దొంగల గుంపులో గజ
దొంగ పెద్దరికము పోదు" అని నాయకుల దురాగతాలను చీదరించుకున్నారు కాళోజి.

'బానిసత్వ లక్షణాలు
పోని స్వరాజ్యం బోసిడి' అని ఈనాడు దేశంలో ప్రతిరంగంలోనూ కనపడుతున్న బానిసత్వాన్ని తలచుకొని బాధపడ్డారు కవి.

'ప్రజాస్వామ్యము చపటసిద్ధాంతమనెడి
పరిసరాలందరికి ఉరిసరాలంటి' అని ఇరవై సంవత్సరాలనాడే హెచ్చరించారు. ఇట్లా అవుతుంది ఈ స్వతంత్ర భారతం అని ఎవరనుకొన్నారు? అని కాళోజి చెప్పిన గీతం గుండెలోతుల నుంచి పెల్లుబికిన విలాపగీతం.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ దేశం ఎటువంటి మోసానికి గురి అయిందో 'మోసం' అనే గీతంలో కాళోజి పరిభవఖిన్నమనస్కతతో వినిపించారు.

"ప్రజాస్వామ్య రాజ్యాంగపు
పరిపాలనగల దేశము
'మజా' చేయు పదిమందికి
'ఇజారా'గ ఎట్లుండును?
దగాకోరు దుండగీడు
దర్జాగా బ్రతుకుచుండ
సక్రమమార్గాయాసము
సహియించెడి వాడెవ్వడు?" అని ప్రశ్నిస్తూ పెద్దలు తాము పాటించని నీతిసూత్రాలను పిన్నలకు బోధించడం ఎట్లా ఉంది అంటే "గురువు కోడి తిని శిష్యుల, గ్రుడ్డు ముట్టరాదు" అనుటతో సాదృశ్యంగా ఉందంటున్నారు కాళోజి. గుడ్డు అంటే అంతటితో అయిపోతుంది. తొందరపడకు శిష్యా, కోడి అయిందాకా

ఓపిక పట్టుకుంటే మరెన్ని గుడ్లు, దాంతో కోడీ కూడా తినవచ్చని పరమార్థ బోధ అని ఎందుకనుకోరాదు?

కాళోజి రాసిన కవిత్వంతో నాలుగింట మూడుపాళ్ళు రాజకీయాల రభసలను ఎత్తిపొడవడమే కనిపిస్తుంది.

'రాజకీయములు 'సట్టా
బాజా' రనుకొనువారికి
చేటిక్కెను కాని కాదు
రాజేయుటే కర్తవ్యము' అని రాజకీయాల గుట్టు రట్టుచేస్తూ "ఓటిచ్చునప్పుడే ఉండాలె బుద్ధి, అనుచుంటి నీ మాట అనుభవము కొద్దీ" అని భారత దేశంలోని ఎన్నికలతీరు చూసి పరితాపంతో ప్రబోధించారు.

రెండు సంవత్సరాలలో ఆరు చిన్న చిన్న సంపుటాలుగా 'నా గొడవ' కవితలు వచ్చాయి. ఆర్తి, అధిక్షేపం, సామాన్యుడి వెతలు కలిపితే కాళోజి కవిత పలుకుతుంది.

1979లో 'సమాజానందస్వామి' ఉవాచలుగా 'దేవీప్రియ' కవితాసంపుటి వచ్చింది. దీన్ని ఆయన కార్టూన్ కవితలన్నారు.

'పులుల సంఖ్య పెంచాలని
సూచన లొస్తున్నాయట
మనలో మనమాట,
పులుల సంఖ్య తగ్గిందా
అరణ్యాల పెద్దపులులు
నగరాలకు రాలేదా
అసలు చారలు తుడిచేసుకుని
పేర్లు మార్చుకోలేదా?'

... అంటున్నాడీకవి. అంతేకాదు, ఆస్పత్రులలో, ఆఫీసులలో, దుకాణాలలో, రవాణాలలో, లాబీల్లో, సూట్లల్లో పొంచున్నాయ్, దాగున్నాయ్ అంటున్నాడీకవి. అరణ్యంలో అయితే క్రూరమృగాలకు వేటి వేటి నియతస్థానాలు వాటికుంటాయి. సభ్య సమాజంలో అట్లాకాదే - అని ఆక్షేపం. ఆక్షేపం కన్నా అధిక్షేపం కవితకు అందాన్నిస్తుంది. ఎమర్జన్సీ రోజుల గురించి మంచి కవిత రాశాడు దేవీప్రియ. ఆ రోజుల్లో కనిపించని కటకటాలమధ్య పడివున్నాం అని ఆయన తీర్పు: భరత

ఖండం ఒక బందిఖాన అన్నారు స్వాతంత్ర్యం రాకముందు ఒకమూర్తి. కాని, ఇప్పుడు ఉన్మాద వైద్యశాలలాగా ఉందనుకోవాలి, ఇవాల్టి పరిస్థితులు చూస్తుంటే. మేధావులకు, పాత్రికేయులకూ, సినిమావాళ్ళకు, విద్యావేత్తలనుకుంటున్నవాళ్ళకు, విప్లవ సాహితీ వేత్తలకు ఎవరి పిచ్చి వాళ్ళకానందంగా ఉంది.

ఆధునిక కవిత్వంలో అధిక్షేపం అనగానే మాచిరాజు దేవీప్రసాద్, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి వెంటనే జ్ఞాపకం వస్తారు. విస్తృతంగా పారడీలు రాసి మెప్పించినవాళ్ళు మరి కనపడరు. 'పఠాభి' ధోరణివేరు. దానికాశ్రయం ఆయన హాస్యం. కేవలం పదాలు, పదాల విరుపులు ఆలంబనంగా పరిహాసం సృష్టిస్తాడు పఠాభి. వికటకవిని సాహిత్య సర్కస్‌లో బఫూన్ లాంటివాడన్నాడు దేవీప్రసాద్. కాబట్టి వికట కవిత్వంలో గాంభీర్యం ఉండదు. వెక్కిరింత, వేళాకోళం మాత్రమే ఉంటాయి.

"ఆపి కావ్యాలు, చేసి పద్యాలు హోల్టు
శారదాశాప కలివిమోచనము పొంది
తింగనేట్టు నిలిచి ఒక్క ఓటింగు గెల్చి
మంత్రినౌదును నేను అమాంతముగను

అట్లౌక అమాత్యుగాణ్ణైతె అమలు పెడుదు
లిప్తలో ప్రణాళికల మాలికలు వేలు
"ఆ" అనే ప్రతిపక్షు లాహాయనంగ
జనులు సుఖడోలికా ఝుమం ఝుమం పొంగ."

ఇది 1950 నాటి దేవీప్రసాద్ ధోరణి. అప్పటికే 'మంత్రాంగం'గురించి ఆయన తెలుసుకున్నాడు. అభ్యుదయ కవిత్వం తర్వాత కాలంలో దేవీప్రసాద్ పారడీలు ఎక్కువగా రాసినట్లు కన్పించదు. 1958 ప్రాంతంలో జయంతిలో ఆయన సంపాదకీయ లేఖలు వంటి చక్కటి పారడీలు ప్రకటించారు.

జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి అచ్చం పారడీ కవి. ఆధునిక కవిత్వంలో ప్రథితమైన మార్గాలన్నిటికీ ఆయన పారడీలు రాశాడు. అప్పటి కవితా రీతులను హాస్యం చెయ్యడమే ఆయనకు కావల్సింది. సంఘమూ, సామాజిక

జీవనము కాదు. అసలు సత్యాశ్రయుడి కంద శిలా శాసనం, దేవయ్య స్వీయ చరిత్ర, గాజుపాలెంగాంధీ-వంటి రచనలు రాసి, వికటకవి ధోరణిలో ఆయన పరిహాసరసోత్పాదనం చేశాడు. రుక్మిణీనాథశాస్త్రిగారు కవిగా కవితోద్యమాలలో వేటిలోనూ పాల్గొనలేదు. అభ్యుదయ కవిత్వానంతరం ఆయన పేరడీలు కూడా రాసినట్లు కనపడదు.

అభ్యుదయ కవిగానూ, అచ్చమైన కవితాత్మగల ప్రియంభావుకుడుగానూ ప్రసిద్ధుడైన దాశరథి కూడా వర్తమాన సామాజిక పరిస్థితులను తలచుకొని బాధాధిక్షేప కవిత్వం చెప్పాడు, అభినవ దాశరథీ శతకంలో.

'రొట్టెయొకింత లేక కడు రోజెడు
కోట్ల జనమ్ము లుండ రా
లెట్టును సృష్టిచేతురు సుఖించెడు
జాతులమారు; దానితో
కొట్టికొనంగ జూచెదరు
కోట్ల జనమ్ము నశింప; వీరినిన్
తట్టుకొనంగ నెట్టులగు ?
దాశరథీ కరుణాపయోనిధీ !'

ఇది కరుణార్ద్రమైన అధిక్షేపం. ఇంతకన్నా తీక్షమైనదీ విషాదతీవ్రమైన అధిక్షేపం కూడా దాశరథి కలం నుంచి జాలువారింది.

''చిత్తను మెత్తగా ఎరువుచేసి యొసంగిన చాలు ప్రీతిమై
ఉత్తమమైన పండ్ల నిడుచుండును వృక్షములట్లె ఏవియో
రిత్తలు పల్కగానె 'బళిరే'యని మాప్రజ మంత్రిపీఠముల్
దత్తము చేయుచుండెదరు దాశరథీ కరుణాపయోనిధీ !

రంథి సోమరాజు చేసే అధిక్షేపం కారుణ్యోద్బోధకంగా ఉంటుంది.

'సెద్దోల్లెక్కు వైన గడ్డమీద
వొక్క మంచోడేటి సెయ్యి గల్గా
అడికి సేత్రితే

సెడ్డోళ్ళి మార్సడం తప్ప
య్యేటిసెయ్యనేడు' అని ప్రాంతీయ మాండలికయాసలో ఆయన చింతా క్రాంతులవుతున్నారు.

కవిత్వం కసినిపెంచి వర్గకలహాన్ని బోధించి సంఘాన్ని సాధించే దేమీ ఉండదు. సంఘంలోని ఆలోచనా పరులను ఆత్మావలోకనం చేసుకోగలిగేట్లుచేస్తే అంతకన్న కవిత్వం సాధించగల పరమార్థం ఇంకొకటి ఉండదు. తెలిసో తెలి యకో కొంతదూరం వెళ్ళిన తర్వాత అది సరైనదారి కాదని తెలిసినా నిర్వేదపు కార్పణ్యపు అహమిక చాలామందిలో పట్టుదలను కసినీ పెంచిరే వాళ్ళను చూసి బాధపడాల్సిందేతప్ప గత్యంతరం ఏముంది? పదిమందిలో ఎనిమిదిమంది దొంగలై నప్పుడు దొంగల్ని ఎవరు సరైనదారిలోకి మళ్ళించగలరు?

ఈనాటి సామాజిక స్థితిగతులు ఎందుకిట్లా తయారైనవి? వీటి విషబీజాలు ఎక్కడ ఎప్పుడు ఎట్లా పడ్డాయి? అవి ఎలా మొలిచి ఇలా పండుతున్నాయి? అని విశ్లేషించాలికాని నేలవిడిచి సాముచేస్తే ప్రయోజనం ఏమిటి? సామూహిక వ్యాధులో, సాంక్రామిక రోగాలో ఒక నగరంలో ప్రబలితే నగరానికంతా నిప్పు పెట్టుకోముకదా! ఆ నగరాన్ని పూర్తిగా పాడుబెట్టి కొత్తగా నగరానికి శంకుస్థాపన చేస్తామా? అది సాధ్యమా? మానవనాగరకత వికాసోన్ముఖంగా సాగాలికాని వినా శోన్ముఖంగా లాగకూడదుకదా! బలహీనుడి పక్షాన పోరాడాల్సిందే. అన్యాయా లను అక్రమాలను ఎదిరించాల్సిందే. కాని, హింస ప్రతిహింసను ప్రోత్సహిస్తుంది. దీనివల్ల దీర్ఘకాలిక ప్రయోజనా లుండవు.

ఈ అవగాహనతో అభ్యుదయ కవిత్వం తర్వాత ఆధునిక తెలుగు సాహి త్యంలో కవితాధోరణి ఒక కొత్తమలుపు మళ్ళింది. ఈ దేశపు సామాజిక జీవనా డిని చైతన్యవంతం చెయ్యడం, దేశీయమైన సాంస్కృతిక విలువలను బలపర చడం, ప్రచారంచేయడం ఈ కవులు తమవంతు కర్తవ్యంగా స్వీకరించారు, చేతనా వర్త కవులుగా తమ ప్రయత్నం తాము చేశారు. ఈ కవులలో శ్రీ సుప్రసన్న, శ్రీ సంపత్కుమారాచార్యుల వంటివారు తాత్విక వివేచనతో కవితాత్మను పట్టుకో వాలని ప్రయత్నం చేయగా, స్వర్గీయ వే. నరసింహారెడ్డి సామాజిక [illegible] అవ్యవస్థను కవితాత్మ చేసే ప్రయత్నం చేశాడు. ఆ చేతనావర్త కవులలోవారే

శ్రీ పేర్వారం జగన్నాథం. ఈయన ధోరణి విశిష్టమైనది. వేమన, కాసుల పురుషోత్తమ కవి, గువ్వల చెన్న; ఆధునికులలో గురజాడ, కాళోజిల సంప్రదాయానికి చెందిన కవిలా ఈయన కన్పిస్తారు. పరిహాస కుశలతతో పాటు పద చిత్రపేశలతకూడా శ్రీ జగన్నాథం కవితలో జాలువారుతుంది. ఈయన ఖండికలు ఆనందవర్ధనాలు. అంటే ధ్వని పూరితాలు. విషాదకలితమైన భావాన్ని కూడా యేడ్వలేక నవ్వే ధోరణిలోనైనా హసించకుండా ఉండలేము, ఈయన కవితలు చదువుతున్నప్పుడు. లోకం పట్ల జాలి, కరుణ, కపటంలేని కోపం, సమాజ ధార్మిక విచ్యుతి పట్ల అనుతాప తీవ్ర నిరసన ఈయన కవితల్లో కనబడతాయి. ఎత్తిపొడుపును-సమర్థంగా నిర్వహించగల కవి శ్రీ జగన్నాథం. ఇటువంటి కవిత ఆధునిక సాహిత్యంలో అతి తక్కువగా కనబడుతుంది కాబట్టి, శ్రీ జగన్నాథం బాణీ విలక్షణంగా కూడా కనబడుతుంది. రెండు దశాబ్దాల కాలంలో రెండు మంచి కవితా సంకలనాలు ప్రచురించారీ కవి. సాగర సంగీతం 1960 ప్రాంతంలో తొలిసారిగా వెలువడి, మళ్ళీ 1981 లో పునఃప్రచురితమైంది. 1984 లో వృషభ పురాణం వెలువడింది. ఈ రెండు కవితా సంకలనాలలో కూడా జగన్నాథీయమైన పదచిత్రాలు, చిత్రపదాలు పుష్కలంగా చోటుచేసుకున్నాయి. సహజంగా, సరళంగా ఉంటాయి శ్రీ జగన్నాథం ప్రయోగించే అన్యాపదేశాలు. బహురూపుల వేషాలు అనే ఖండికలో "ప్రజల ఎముకలు పేర్చి మేడలను లేపిన" ప్రబుద్ధుడొకడు ఊసరవెల్లిలాగా 'లాలూచీ'ని వీడలేక, 'లాల్చి' ఒకటి బిచ్చమెత్తి, అచ్చమైన ఖద్దరుతో వచ్చి ప్రజలను మోసగించడం వర్ణించాడీయన. శ్రీ మహావిష్ణువుకు సుస్తీ చేసిందని తెలియగానే "వైకుంఠంలో ఏ మూల చూసినా, గుసగుసలు ప్రారంభమయ్యాయి, పొలిటీషియనులు అత్యవసర సమావేశాలు ఏవో జరుపు కుంటున్నారు, తగిన వారసునికోసం అప్పుడే ప్రారంభమైంది గాలింపు" అనే ఈ పంక్తుల ద్వారా 1960 ల నాటికే జగన్నాథం భవిష్యద్దర్శనం చేయగలగటం అతడి అధిక్షేప కవితాత్మను పట్టి ఇస్తున్నది. అటుతరవాత దేశరాజకీయాల చిత్రవిచిత్ర ఘట్టాలలో ఇది ఎన్నోసార్లు నిరూపితమైంది. "మోసం కోరమీసాలు పెంచి, దబాయిస్తున్నది పరిసరాలను, అధికారుల హస్తముద్రలు, అమ్ముడు పోతున్నాయి అంగట్లో" అనే కవితా పంక్తులను దినచర్య అనే శీర్షికతో వ్రాయడం వ్యంగ్య విలసితంగా ఉంది. జగన్నాథం కవితోద్యానంలో దివాంధాలు ఆదిత్య హృదయాన్ని జపిస్తాయి. అగ్రరాజ్యాలు చంద్రమణ్ణి కూడా పంచుకుంటాయి.

వృషభ పురాణం కావ్యఖండికా సంకలనంలో కవితలు మరింత మెరుగు తేరాయి. ప్రౌఢత సంతరించుకున్నాయి. స్వతంత్ర భారత రాజకీయ ధురంధరుల నెంతగా ఈసడిస్తున్నాడీ కవి అంటే ఈ పంక్తులే ప్రమాణం. "ఛీఛీ!! పెంచిన వాళ్ళను కరిచే కుక్క, దొంగలు పడితే మొరగని కుక్క, అదేం కుక్క?" అంటున్నాడీయన. "గారడీవాడు చూపించే మామిడి చెట్టు, పూలు పూయదు కాయలు కాయదు. ఎవ్వడికీ నీడ నివ్వదు. చివరకు తనకు తానే నిలువదు" అనేది అందమైన అభివ్యక్తి. గాంధీగారు నాటిన వటవృక్షం దయ్యాలమర్రి అయి, ఆయన పవిత్రాత్మమూలుగును పోల్చుకోగలడీ కవి. నలుగురికీ తెలిసిన, సంప్రదాయ సిద్ధమైన, జ్ఞేయమైన ప్రతీకలతో, ఉక్తిబింబాలతో కవిత వినిపించడం లోనే శ్రీ జగన్నాథం ప్రత్యేకత ఉన్నదనిపిస్తుంది. "అజ్ఞాతవాసం నేటితో ఐపోయింది. ఇంకా ఈ బృహన్నల వేషం ఎన్నాళ్ళు, ఈ విరాటరాజు కొలువు చాలించు" అని సామాజిక మేధావితను జాగృతం చేయగలడు శ్రీ జగన్నాథం. "ఎండమావుల్లో నీళ్ళుతాగడానికి విమానంలో పరిగెత్తడం" లాయకైన పనా అని ప్రశ్నించడంలో వక్రోక్తి సొగసంతా పొదవుకొని ఉంది. ఇదీ నేటి సమాజ దుర్భర పరిస్థితి. "బ్రహ్మరాక్షసికి పూలమాలలు వేసి, బ్రహ్మాస్త్రం పిచ్చుకపై వదలటం, బుద్ధి పైవాడికి తాకట్టుపెట్టి, బురదగుంటలో అభ్యంజనం చేసివచ్చి, పడకగదిలో పగటికలలు కనటం" నీ వినాశనానికి దారితీస్తుంది అని స్వతంత్ర భారత సామాన్య పౌరుణ్ణి హెచ్చరిస్తున్నాడు శ్రీ జగన్నాథం. "అధికారుల హస్తముద్రలు, అమ్ముడుపోతున్నాయి అంగట్లో" అనటంలో కాకువు మనోహరం. రాక్షసులంటే ఎంత భయంకరులో అని ఇన్నాళ్ళు హడిలిచచ్చాం, ఇప్పుడు వాళ్ళతో సహజీవన సౌభాగ్యం అనుభవించటం లేదా అని ఆధునిక భారతదేశపు నుదుటి 'గీతా' భాష్యం చెపుతున్నాడు ఈ కవి. దయ్యాల కొంపను చిత్రించిన వైనం దయనీయంగా ఉంది. "ఈ ఇంట్లో దీపం వెలుగదు, పోనీ చమురైనా మిగులదు. నా ప్రేయసి నాతో పలుకదు, ఇంట్లో ఎప్పుడూ కనిపించదు, ఇచ్చట పచ్చగడ్డి మొలవదు, రచ్చకెక్కని వాడు రాణించడు, క్రౌర్యం కార్పణ్యాలకు, హెచ్చవేత కూడికలు తప్ప, తీసివేత భాగారాలు లేవిచ్చట." ఇది వర్తమాన సమాజ నిజ స్వరూపం.

నూరేళ్ళ క్రిందట వీరేశలింగం పంతులు ప్రహసనాన్ని చురుకైన, బలమైన సాహిత్య సాధనంగా రూపొందించుకున్నాడు. ఆయన అన్ని రచనలలోను అవే ప్రశస్తమైనవి అన్నాడు గురజాడ అప్పారావు. ఇప్పటి సమాజంలోను అధిక్షేప కవిత ఆనాటి ప్రహసనంలాగా ఉద్దిష్ట ప్రయోజనాన్ని సాధించాలనీ, సాధిస్తుందనీ ఆశిద్దాం.

# ప్రజాస్వామ్య కవిత్వం

మాదిరాజు రంగారావు

ఈనాటి స్వేచ్ఛా కవిత్వంలో ఆధునికత, ప్రధానంగా 1. సామాజిక చరిత్రగతికీ 2. అభిప్రాయాల సిద్ధాంతాల ప్రకటనకూ దార్శనికతకూ 3. జీవితంలో భౌతిక మానసిక స్థితి చిత్రణకూ 4. కళాత్మకమైన నూతనాన్వేషణలకూ పర్యాప్తమైంది. ఇది వేరువేరు స్థాయిలలో పనిచేస్తున్నట్లు కన్పించినా మొత్తం మీద కవిత్వానికి సంపూర్ణతను చేకూరుస్తాయి. వర్తమానకాలంలో ఈ కవిత్వం 1. ప్రజాస్వామ్యభావన 2. మార్క్సియ-విప్లవ దృష్టి 3. కాల్పనిక-అనుభూతి గుణం 4. చేతనావర్త-సంప్రదాయ రూపంలో ప్రధానంగా నాలుగు విధాలుగా పరివ్యాప్తమై కన్పిస్తుంది. మార్క్సియ - విప్లవ దృష్టితో వెలువడే విమర్శనా సాహిత్యాలకు ఉన్న వ్యవస్థాగతమైన అవకాశాలు తక్కిన వాటికి లేవు. సంప్రదాయ సాహిత్యానికీ పరంపరాగతమైనదో, ఏదో ఒక విధంగా వ్యవస్థా రూపం ఉంది. స్వేచ్ఛా కవిత్వంలో కన్పించే ప్రజాస్వామ్య నిబద్ధత గురించీ, రచనా శిల్పం గురించీ-దీనిలోని ఆధునికత గురించీ పర్యాలోచన చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

కవి తనకు తాను సృజన సమయంలో ఏర్పరచుకొన్న నియమాలచేత ఆవిష్కృతమవుతూంది ఈ కవిత్వం. స్వేచ్ఛ ఎక్కువగా ఉండటంతో బాధ్యత కూడా అధికంగానే ఉంటుంది. ఇది సమయ సమయానికీ కొత్త కొత్త మార్పుల్ని రచనలో సులభంగా ప్రవేశపెట్టేందుకు బహుల విస్తృతమైన అవకాశాన్ని ఇస్తోంది. ఈనాటి ఆధునికతకు సర్వతోముఖంగా ప్రాతినిధ్యం వహిస్తోంది. ఇది జీవితాన్ని స్వేచ్ఛగా రూపొందించుకొనే స్వాతంత్ర్యంతో గతిక్రమాన్ని నిర్ణయించుకొనే అవకాశం కలిగిన సామాజిక రూపానికి ప్రతిబింబం అనవచ్చు. రాజకీయమైన ఆధారతలం సమాజంలో వ్యక్తి ఆలోచనల స్వేచ్ఛా సంచారానికీ క్రియా శక్తుల స్వతంత్ర వికాసానికీ ఎంతగానో ఉపకరిస్తుంది. ప్రజాస్వామ్య ప్రతిబింబమైన

ఈ రూపం ఎందరికో ఎందరికో ఆమోదయోగ్యమైందీ విస్తృతమైన ప్రచారాన్ని పొందిందీ. కవిత్వ చరిత్రలో స్వేచ్ఛా రూపానికి సంబంధించిన ఈ అంశం, చారిత్రక పరిణామంలో సామాజిక గతిపై పరివర్తనపై దృష్టిని ప్రసరింప జేస్తుంది. దీనికి పూర్వరంగాన్ని ఈ సందర్భంలో తావన్మాత్రంగా స్పృశించి అన్వయానికి ప్రయత్నించడం అవసరం.

మానవ సమాజం పరివర్తనాశీలం కలిగింది. మార్పు నిరంతరమైంది. సాధారణంగా మందమందంగా విశేష పరిస్థితుల్లో వేగాన్ని అందుకుని ప్రత్యేకతను కలిగిస్తుంది. ఉన్న స్థితికీ రాబోయే మార్పుకీ మధ్య ఎన్నో విధాలైన సంఘర్షణ అనివార్యమౌతుంది. అప్పటి పరిస్థితుల అవసరం మేరకు మార్పు వచ్చి తీరు తుంది. ప్రస్తుతం సాహిత్యంలో చారిత్రక కారణాలవల్ల రాజకీయ ప్రభావంచేత మౌలికమైన మార్పులు చాలా వేగవంతంగా వచ్చాయి. భారతదేశంలో వలస పాలనవల్ల, పైనుంచి యూరోపియన్ సాంస్కృతిక పునరుజ్జీవన ప్రభావంవల్ల క్రమంగా తదితర రాజకీయ సాంఘిక ఆర్థిక సిద్ధాంతాలు కారణంగా కొత్తగాలులు వీచడం మొదలైంది. నిఖిల మానవీయ తలంపై మానవతాస్పందనతో కొత్తశక్తి క్రియారూపం ధరించింది, కొన్ని దశాబ్దాలుగా జరుగుతూ వస్తున్న మార్పులవల్ల ఆస్తిరూపంలో సంపద వినిమయంలో ఉత్పత్తి సాధనాల్లో ఆలోచనా విధానంలో అభిరుచుల్లో అనుభవస్పందనలో పరస్పర సంబంధాల్లో లక్ష్యాల్లో ఇంకా వివిధ కార్యకలాపాల్లోనూ, ఇట్లా జీవితంలో అనేక క్షేత్రాల్లో సంచలనం మొదలైంది. అసాధారణమైన పరివర్తనమూ కలిగింది. ఆధునికత అనేది అప్పటికపుడు ఏదో పరిమితమైన కాలంలో హఠాత్తుగా వచ్చేది కాదు. ఇది క్రమించే స్థితులూ, స్పృశించే అంశాలూ రూపొందే పార్శ్వాలతో అనేకంగా ఉంటాయి. స్థూలంగా విశ్లేషిస్తే ఇది చారిత్రకంగా సాంఘిక రాజకీయ సంస్కరణ పరివర్తనం శాస్త్ర సాంకేతిక వికాసం-జీవితంలో తెచ్చిన గుణాత్మకమైన విలువలతో ఆధునిక భావన కవకాశం లభించింది. ఇవి పరస్పరం ఎంతో సంబంధం కలిగి అన్యోన్య ప్రభావంతో కాలం గడిచే కొద్దీ సంస్కరణం-పరివర్తనం-నవ్యతతో ఆధునిక రూపాన్ని ఆవిష్కరిస్తూ పోతాయి.

ఏ దేశంలోనూ రాజకీయ స్వాతంత్ర్యం లేకుండా వ్యక్తి దేనితోనూ తృప్తి పడడు. ఇక్కడ దేశీయమైన భావనాకేంద్రంగా దేశ స్వాతంత్ర్యం కోసం జరి

గిన పోరాటానికి జాతిసాంస్కృతికరూపం ఎంతోదోహదం చేసింది. స్వాతంత్ర్యం వచ్చాక ఆర్థికమైన అసమానతలపై సత్వరం జరుగ వలసిన సాంఘిక న్యాయంపై దృష్టి ప్రసరించింది. దీనితోపాటు అనేక సామాజిక దుస్థితులూ సత్వర చర్యల్ని అపేక్షించే దశలో ఉన్నాయి. భారతీయ భాషల్లో వచ్చిన కవిత్వంలో ఆధునికతను గురించి మాట్లాడేప్పుడు చారిత్రక పరిణామంలో వచ్చిన పరివర్తనా దశలను గుర్తుపెట్టుకోక తప్పదు. దేశం స్వాతంత్ర్యం పొందాక పరిష్కారానికి వేచిఉన్న అనేక సమస్యలతో పాటు మార్పుకోరే సమాజంలో ఆధునికత పోనుపోను క్షేత్ర విస్తృతిని పొందింది, ప్రగతి శీల వ్యక్తిత్వాన్ని పొందుతూ వచ్చింది.

1. సంప్రదాయ తత్వాన్ని ప్రస్తుత సమాజానికి అన్వయించడంలో ప్రయోజన తత్పరత కలిగి ఉండడం.
2. సంకుచితమైన ధోరణులు వదలి, విశాల దృక్పథంతో ఎక్కువ మంది ప్రజల ఆమోదానికి విలువ ఇవ్వడం.
3. సమస్యలను హేతుదృష్టితో చర్చించి, సమాజ శ్రేయస్సుదృష్ట్యా ఉపయోగపడని వాటిని నిరాకరించడం.
4. ప్రజల ఆలోచనల్లో స్పందనలో పరస్పర సంబంధాల్లో మార్పు రావడం.
5. కొత్త అనుభవ క్షేత్రాల్లో, కొత్త కొత్త అన్వేషణంతో క్రియా కలాపాలెక్కువ కావడం.
6. ప్రత్యర్థుల అభిప్రాయం ప్రకటనకూ, వాటిపై చర్చకూ అవకాశంతో తగిన స్థానాన్ని ఇవ్వటం.
7. గతంపైకన్నా వర్తమాన సుస్థితికీ, భవిష్యత్ దర్శనంతో ప్రజాస్వామ్య భావనకు ప్రచారవ్యాప్తి.
8. మానవుని ఉన్నతిపై విశ్వాసంతో ప్రాంతాన్ని దేశాన్నిదాటి ప్రపంచ స్థాయిలో అన్ని రంగాల్లో పరస్పర సంబంధాలు నెలకొనడం, ఆదాన ప్రదానం జరగటమూ.
9. భగవంతుని పొందడం - ముక్తికోరడం కన్నా, సమాజ శ్రేయస్సుకూ, నైతికవ్యక్తిత్వానికీ ప్రాధాన్యం ఇవ్వడం.

10. శాస్త్ర సాంకేతిక విద్యా ప్రగతితో స్వాయం, సంపద అవకాశం అందరికీ సమానంగా లభించే ప్రయత్నం.

11. ప్రాచీన సంస్కృతిలోని వారసత్వ సంపదను అఖిల మానవ సంస్కృతిలో భాగంగా, కొత్త దృష్టితో పరిశీలనంతో పాటు మార్క్సీయ సిద్ధాంతం పట్ల కూడా ఇదే విధంగా ఈనాడు దాని అవసరాన్నీ, ఉపయోగాన్నీ, విలువనూ గుర్తించడం.

12. స్త్రీ పురుషుల సంబంధాల స్థాయిలో మార్పు- సమాజంలో స్త్రీ వ్యక్తిత్వ వికాసానికి ముఖ్యంగా ఆర్థిక స్వాతంత్ర్యానికి ఉపకరించే విధానంతోపాటు సమానమైన స్థితి కల్పనకు ప్రయత్నం-అనేవి;

సమాజ ప్రగతికి వేగంతో పాటు సమస్థితినీ కలిగించడానికి ఉపకరించే పై అంశాలతో ఏర్పడిన క్షేత్ర విస్తృతీ, కార్యకలాపవైవిధ్యం సమాజ పరిణామ క్రమంలో ముఖ్యమైంది. స్వేచ్ఛా కవిత్వంలో దీని స్వరూపం ఆధునిక రేఖలతో స్పష్టంగా బింబిస్తుంది. అన్ని రంగాల్లోనూ కొత్తను అన్వేషించే ప్రయోగ పరంపర జీవిత ప్రమాణాలను పెంపొందిస్తూ సమాజాన్ని సౌభాగ్యమయం చేసేందుకు ఉపకరిస్తుంది. దీనికి ప్రజాస్వామ్యంలో ఎక్కువ అనుకూలత ఉంది. ఆధునిక మానవునిలో నిహితమైన శక్తుల్ని బయటికి తీసి ఆవిష్కృతం చేయడానికీ సమ సమాజ వికాసానికీ యోగ్యమైన వాతావరణం నెలకొల్పడం జరుగుతూన్నప్పటికీ సమాజంలో ఇంకా ఏదో ఒక విధంగా అన్యాయాలకూ అక్రమాలకూ గురి అయ్యే పీడితులూ ఉన్నారు. వారి పక్షాన నిరసనకూ, ప్రతిఘటనకూ, సంఘర్షణకూ ప్రతినిధిత్వం వహించే అవకాశం తప్పనిసరిగా ఉంది. వివిధ సమస్యల్ని గురించి అన్ని పక్షాలకూ ఆమోదయోగ్యమైన పరిష్కారాన్ని రూపొందించడానికి నిర్మాణాత్మకమైన ధోరణిలో వర్తిస్తుంది. ఇది మరో వ్యవస్థలో లేని దీని ప్రత్యేకత. ఏ వ్యవస్థలోనైనా కనీసస్థాయిలో నైతికమైన విలువలకు స్థానం ఉన్నపుడే దాని సత్ఫలితాలను పొందగలం. దీనితోపాటు హేతుసహితమైన మానవతాపూర్ణమైన దృష్టి అవసరం. సమాజంలో నిరంతరం జరిగే ఈ కృషిలో దేశీయ భావనతో పాటు ప్రపంచంలో వచ్చే ధోరణుల్ని వాటి ప్రభావాల్ని ఆకళించుకొని నిర్మాణ క్రమంలో విశ్వశాంతినీ, మానవ సౌభాగ్యాన్నీ కాంక్షించడం ఆధునికతలో భాగమే. ఆధునికత అనేది సమాజ చరిత్రగతికి సంబంధించింది, ఎప్పటికప్పుడు పరిణామ క్రమంలో చివరి సోపానంగానే వర్తిస్తూ ఉంటుంది.

ప్రస్తుతం కవిత్వానికి వస్తే-రాజకీయమైన అవగాహనతో సైద్ధాంతికమైన అభిప్రాయ మూలకమైన నిబద్ధతపట్ల 'అభిలాష' ఈనాటి కవుల్లో పాఠకుల్లో ఎక్కువగా కన్పిస్తుంది. ఇది ఒక్కొక్కప్పుడు కళాత్మకతనూ రచనాశిల్పాన్నీ కూడా పక్కకు నెట్టివేసి ఆధిపత్యం నెరపేంతటి శక్తిమంతంగానూ ఉంటూంది. ప్రజాస్వామ్య కవిత్వంలో సామాజిక స్పందనతో పాటు వైయక్తికమైన అన్వేషణమూ ఉంటుంది. సమష్టి మరియు వ్యష్టిస్థాయిలో ఉండే భేదాన్ని గుర్తిస్తుంది. వైవిధ్యాన్ని అనుమతిస్తుంది. కళాత్మకతను భంగం చేసే లేదా తక్కువ చేసే స్థితి రానీయదు. సమాజంలో సమభావాన్ని సృజిస్తూ ప్రగతి కెంత ప్రోత్సాహ ముంటుందో వ్యక్తి వికాసానికీ అంతటి అవకాశం ఉంటుంది. సామాజిక చైతన్యం వ్యక్తిపై ఎంతటి ప్రభావాన్ని నెరపుతుందో వైయక్తిక ప్రేరణ కూడా సమాజంపై అంతే గుణాత్మకమైన స్థితిని నెలకొల్పుతుంది. కార్మికలోక కల్యాణంతో పాటు వివిధ రంగాల్లో పనిచేసే వివిధ వర్గాల ఆరోగ్యకరమైన అభ్యున్నతినీ కాంక్షిస్తుంది. ప్రజాస్వామ్య కవిత్వంలో ఉండే ప్రాతిపదిక కూడ ఇదే. స్వేచ్ఛా కవిత్వంలో ఈ సామాజిక తత్త్వం ముఖ్యంగా ప్రజాస్వామ్య భావనతో వ్రాసే రచనల్లో స్ఫుటంగా కన్పిస్తుంది. ఇది ఇట్లా ఉంచి భౌతిక మానసిక తలాలపై అన్వేషణ, పరిశీలనంతో కొత్త రూపమూ ఆవిష్కృతమౌతూంది. ఇది చేతన (Consciousness)కు సంబంధించి మనస్తత్త్వ పరిశీలనంతోనూ ఉంటూంది. దీనికి వేరే సమాలోచనం అవసరం. ఈ రచనల్లో పారిశ్రామికంగానే కాక రాజకీయ వ్యవస్థా పరిపాలనాపరంగానూ నిత్యజీవితంలో విభిన్న పరిస్థితులూ వాటి ఒత్తిడులకు గురి అయ్యే మానసిక రీతుల చిత్రణం విశ్లేషణం పరిశీలనం ఉంటూంది. ఈ విభిన్నతకు కారణం వివిధ క్షేత్రాల్లో జరిగే పనుల్లో మార్పు రావడమే. ఇంతకు ముందెన్నడూ లేని కార్యక్షేత్రాలు, ప్రవేశమార్గాలూ ఏర్పడి జీవితంలో వైవిధ్యంతో పాటు వేగాన్నీ కలిగింపజేసింది, స్పర్థనూ పెంచింది. మెరుగైన ఆర్థికస్తోమతతో పాటు అవసరాలూ ఎక్కువైనాయి. మానసికమైన ఒత్తిడీ ఎక్కువైంది. సమస్యలూ జటిలమైనాయి. భౌతిక మానసిక తలాలపై వచ్చిన ఈ మార్పు, ఆధునిక యుగ ప్రభావంవల్ల సిద్ధించింది, ఆధునిక స్వేచ్ఛా కవిత్వంలో ప్రతి ఫలించడం సహజం. ఈ దృష్టితో స్వేచ్ఛా కవిత్వాన్ని పరిశీలిస్తే వీటితో అవతరించే రచనా రూపమూ- వ్యక్తిత్వమూ పూర్వంకన్నా సంపూర్ణంగా భిన్న మైంది. వీటి స్పర్శచేత భావనచేత అనుభవంచేత దర్శనంచేత వస్తువు శాస్త్ర

స్థితులతో యోజితం అవుతూంది. జీవితానికి సన్నిహితమౌతుంది. కొత్తగా అన్వేషించదగిన స్థలాలను దృష్టికి తెస్తూంది. గతంలోని ఉదాత్తమైన విలువలూ, వర్తమానంలో ప్రమే జనాత్మకమైన పార్శ్వాలూ, భవిష్యత్తులో దర్శించే ఆదర్శమూ సంయోజితమై పరిహరింపరాని సామాజిక ప్రగతిపై వ్యక్తి వికాసంపై విశ్వాసంతో జరిపే ప్రయాణ రూపం ఇది.

ఈ వెలుగులో కవిత్వంలో ఆధునికత - 1. చరిత్రగతిలో పరివర్తనా పార్శ్వాలనూ 2. వాస్తవ తలంపై పీడిత వస్తు స్థితుల్ని - భావింపజేసే శక్తిమంతమైన ప్రసార రూపంగా కన్పిస్తుంది. ప్రస్తుత పరిధిలోకి రాకపోయినా, వీటితో పాటు ఉల్లేఖనీయమైనవీ, అనివార్యమైనవీ 3. పైకి అవిదితంగా ఉండే మానసిక లోకం - మనస్తత్వ ధోరణి 4. ఆవిష్కార శిల్పమూ కళాత్మకత అనేవి. మొదటివి ప్రత్యక్షంగానో పరోక్షంగానో అనుభవాత్మకమైన జీవితంలో వాస్తవ తలంపై సూక్ష్మస్థితుల్ని వివిధ సంఘటనలూ ప్రవర్తనలూ ఆధారంగా చిత్రణ కలిగినవి. అభిరుచి నిలిపేందుకూ ఆకర్షణ కలిగించేందుకూ, ఇతరమైన అంశాలతో, సంవిధాన రీతులతో యోజితమై కొత్త రూపాలను ధరిస్తూ ఉంటుంది.

అభ్యుదయ కవిత్వంయొక్క ఉగ్రవాద విస్తరణరూపమే విప్లవ కవిత్వం. అభ్యుదయ విప్లవ కవిత్వాలకి మధ్య వచ్చింది దిగంబర కవిత్వం. సమాజంలోని వైక్లబ్యాన్నీ నైరాశ్యాన్నీ విషాదాన్నీ ఎత్తిచూపుతూ మానసికమైన దుస్థితినీ భౌతిక తలంపై దారిద్ర్యాన్నీ చిత్రిస్తూ జుగుప్సా బీభత్స దృశ్యాలతో చిత్ర పరంపరవలె వచ్చిపోయింది. ఇది సామాజిక పరివర్తనకు తీవ్రమైన చర్యల్ని అభిలషిస్తూంది. దీనిలో విధ్వంసక ధోరణితో పాటు నిర్మాణాత్మకమైన భావన కూడా ఉంటే బాగుండేది. దీని వెంటనే వచ్చిన చేతనావర్త కవిత్వం - సంప్రదాయ శక్తికీ - వర్తమాన స్థితికీమధ్య చేతనా (Spiritual) అనుబంధాన్ని స్థాపిస్తూ లక్ష్యంలో దివ్య భూమికల్ని దర్శింపజేస్తుంది. మార్క్సీయభావనతో సమాజంలో వర్గపోరాటాన్ని తీవ్రతరం చేసే ఉగ్రశక్తిగా విప్లవ కవిత్వం ఒక ఆయుధ పాత్రను వహించింది. వీటికి సమాంతరంగా అటు ఉగ్రవాదానికీ ఇటు ముక్తివాదానికీ అప్పుడప్పుడూ తలఎత్తే అనుభూతి - కాల్పనికవాదానికీ భిన్నంగా విశిష్టంగా సామాజిక ప్రగతి లక్ష్యంతో వ్యక్తి వికాస లక్షణంతో ప్రజాస్వామ్య కవిత్వం వెలువడుతూనే ఉంది.

# 2

కవీ పాఠకుడూ కవిత్వమూ సమాజమూ అనేవి పరస్పరం ఆధార సంబంధం కలిగినవి. ఆధునికయుగంలో పూర్వం కన్నా బాగా విస్తరించిన క్రియా కలాపాలతో కనిపిస్తాయి. కవి తనకు తానేర్పరచుకొన్న నియమాలతో ఏ అంపైర్ అవసరం లేకుండా ఆడే ఆట వంటిది. దీనితో ప్రత్యేకమైన బాధ్యతలూ ఏర్పడతాయి. ఒక వైపు కవీ మరొకవైపు పాఠకుడూ (విమర్శకుడూ) చెరో ఒక వైపున ఉంటారు. ఈనాటి పాఠకునిలో ప్రతిదాన్నీ ప్రశ్నించి విమర్శించే ధోరణి ఆధునికతవల్ల వచ్చింది. ఇతనిలో హేతుబుద్ధీ చర్చా లక్షణమూ ఉండడమే దీనికి కారణం. ఇరువురికీ అభిరుచిగల సాధారణక్షేత్రం కవిత్వం. అయితే చెరో ఒక వైపునుంచే బయలుదేరతారు. రచనచేసేప్పుడు కవిలో ఉన్న విమర్శనా రూపం నిర్వహించే పాత్రవేరు. రచన వెలువడిన తరువాత స్థితి వేరు. రచనా కార్యం సమాప్తి కావడంతో రచన ప్రమేయంలో ప్రధాన దశ పూర్తి ఐనట్టే. సృజనశీలంగల పాత్ర తొలగిపోతుంది. మరో పాత్ర మొదలౌతుంది. అది విమర్శనాత్మకమైంది. తాను వ్రాసినదాన్ని విమర్శకుల విమర్శల నుండి సమర్థించుకోవడమో, వ్యాఖ్యానించడమో వివరించడమో సమాధానాలు చెప్పడమో జరుగుతుంది. రచనతో కవికి ఉండే ప్రత్యక్ష సంబంధం తెగిపోతుంది. పరోక్ష సంబంధం ఉండనే ఉంటుంది. అక్కడినుండి రచనతో పాఠకుని ప్రత్యక్ష సంబంధం మొదలౌతుంది. కవీ-పాఠకుడూ ఇరువురూ చేరుకునే శిఖరాలూ ఉన్నాయి. అవి అనుభవస్థితీ-ఆలోచన-ఆదర్శం అనేవి. పాఠకునిలో నుండి విమర్శకుడు తన కర్తవ్యాన్ని నెరవేర్చడం మొదలుపెడతాడు. ఆధునిక యుగంలో అనుభవ శీలం కలిగిన సహృదయ లక్షణమే కాకుండా నిశితమైన విమర్శకుడుగా పాఠకుని వ్యక్తిత్వంలో విస్తరణ రూపం కన్పిస్తుంది. 'సహృదయ' కర్తవ్యంలో బాధ్యత గుర్తుకు వస్తుంది. వీటి ప్రయోజనం వేరు. ఇది ముఖ్యంగా కవిలో తన రచన గురించి ఏర్పడిన పరిమితుల్ని తెలియజేస్తుంది. భ్రమల్ని తొలగిస్తుంది. లేదా మరొకమార్గ ఆలోచన చేసేందుకు ప్రేరేపిస్తుంది. మరో రచన చేసేప్పుడు రాబోయే విమర్శలను భావింపజేసి మెలకువతో ఉండేందుకు మనస్సును సిద్ధం చేస్తుంది. సృజన రూపంపై వచ్చే విమర్శ - అది ఎటువంటిదైనా కవిత్వానికి మొత్తం మీద ప్రయోజనకారే అవుతుంది. కాలం గడుస్తూన్నకొద్దీ రచనతో పాఠకుల విమర్శకుల అనుబంధం పెరుగుతూపోతుంది. ఒక్కొక్కప్పుడు తాము

విశ్వసించిన రాజకీయ సాంఘిక తాత్త్విక దృష్టికి, అభిమానించే కళాత్మక ధోర ణికి రచన భిన్నంగా ఉన్నపుడు అతిశయించిన ఉద్రేకంతో విమర్శకునిలో సంయమనం లోపిస్తుంది. ఈ రోజుల్లో తటస్థ ధోరణికన్నా ఒక సిద్ధాంతం లేదా అభిప్రాయాంపు నిబద్ధమైన లక్షణానికే ఎక్కువ ప్రశస్తి ఉంది.

స్వేచ్ఛా కవిత్వంలో అస్పష్టత గురించి ఇంతవరకు చెప్పిన రెండు మాటలు మరొక్కసారి వివరించవలసి ఉంది. ఒకవిధం- రచనలో వాక్యాల మధ్య, విభాగాల మధ్య, భావ పరంపర మధ్య పూర్తిచేయవలసిన స్థానాలు మిగిలిఉంటాయి. ఒక్కొక్కప్పుడు వీటిని ఆలోచనతో పూర్తిచేసుకోవలసి ఉంటుంది. కొన్ని సందర్భాల్లో వాటంతట అవే సహజంగా ఏ శ్రమ లేకుండా పూర్తి అవుతాయి. మరోవిధం - భావావిష్కా రంలో పల్చని మంచుతెరవలె అస్పష్టత ఉంటుంది. ఈ రెండువిధాలూ సంక్షిప్తత, గుప్తతను దృష్టిలో పెట్టుకోవడంవల్ల ఏర్పడినవే. ఇంకోవిధం ఉంది. కథ లేని చోట స్థితి యోజనకూ, భావ విన్యాసానికీ సంబంధించింది. ఒక క్రమంలో ముందుగా ఉంటుందనుకొన్న నిర్మాణం అనుకోకుండా మరో క్రమంలో ఏర్పడినపు డిది ఉత్పన్నమౌతుంది, ఈ పద్ధతి వర్ణనంకన్నా భిన్నమైంది. ఈ ఆధునికత అలవాటు పడేందుకు సమయం పడుతుంది. ఇది రచనలో స్థితి యోజనకూ, భావ నిర్మితికీ సంబంధించింది. సంప్రదాయ కవిత్వంలో శబ్దం తెలీకపోవడమో సమాసం క్లిష్టంగా ఉండడమో అన్వయక్లేశమో ఉంటుంది. దీన్ని సులభంగా అధిగమించ వచ్చు. కాని, పైన పేర్కొన్నది ఈ విధమైందికాదు. ఇంకా ప్రతీకం ప్రయోగం, భావ రూపాల నిర్మాణం, చైతన్య స్రవంతి మొదలైన నవ్య సంవిధానాల ఉప యోగం ఉండనే ఉన్నాయి.

స్వేచ్ఛా కవిత్వంలో ఆధునికతకు మరో ముఖ్యభాగమైన ఆవిష్కార రూపాన్ని ఈ విధంగా పరిశీలనలోకి తీసుకొని రావచ్చు.

1. కథ లేని వస్తువును స్థితి యోజనంతో, భావ విన్యాస క్రమంతో నిర్వ హించడం.
2. కథను సూక్ష్మ స్థితిలో భావించి లేదా మధ్యమధ్య సూత్రప్రాయమైన రూపాన్ని ఇస్తూ సంఘటన - చర్య - ప్రతిచర్యలతో తీర్చడం.
3. కథాంశాలు, సంఘటనలు, చర్య ప్రతిచర్య-వీటి గతిక్రమాన్ని పరిణామ దృష్టితోకాక హేతుదృష్టితోనో లేదా ప్రయోజనాన్నిబట్టి రూపొందించడం.

4. శబ్దాడంబరానికి సమాసవిన్యాసానికీ స్థానం లేకపోవడం.
5. కవికి నచ్చినవిధంగా సమయ సమయానికీ తగినట్లుగా గతి విశేషాన్ని ఏర్పాటు చేసుకోవడం, లయ విన్యాసాన్ని సాధించడం.
6. రచన మొత్తంమీద లేదా భాగాల్లో వాక్యాల ఆరంభం విన్యాసం, ముగింపుతో వీన్ని అందుకునే తరువాతి వాక్యాల విషయంలో - ఇట్లా మొత్తమీద తరంగ విన్యాసమో లేదా ప్రవాహ ప్రసారమో లేదా మరో విధం కలిగి ఉండడం.
7. భావనలో లోతు ఔన్నత్యం ఉదాత్తత కోసం ప్రతీకల్ని, భావచిత్రాలనూ ఆశ్రయించడం, చైతన్య స్రవంతి వంటి సంవిధానాలు నుసరించడం.
8. సంప్రదాయ ఛందస్సులోకన్నా ఎక్కువ ఆవేశ స్థాయినీ భావంయొక్క ఉచ్ఛలన, నిశ్చలన, అవతరణల్ని నేర్పుగా జాగ్రత్తగా అవిచ్ఛిన్నతకు భంగం రాకుండా నిర్వహించడం.
9. ప్రతి సంఘటనకూ ప్రవర్తనకూ ఆలోచనకూ వెనుకనున్న శక్తిమంత మైన భావం లేదా అభిప్రాయంగురించి మన స్తత్వంపై వెలుగుప్రసరించడం.
10. సైద్ధాంతిక లేదా తాత్త్వికమైన లక్షణాన్ని కళాత్మకమైన రూపంతో సంయోజించి రచనకు రామణీయకతను ఉదాత్తతను కలిగించడం.

ఈ యుగంలో స్వేచ్ఛాకవిత్వం ఎప్పటికపుడు ఆధునికతను సంత రించుకొని ఎంతో వైవిధ్యంతో వెలువడుతోంది. విప్లవ లక్ష్యం ఉంటేనే ఆధునికత ఉంటుందనుకోవడం ఉచితం కాదు. ఇందులో సమాజంలోని సంక్షోభం-నిరసన-ప్రతిఘటన-సంఘర్షణతో క్లిష్టస్థితులు తిరస్కృతం కావు. వీటి చిత్రణకూ ప్రాధాన్యం ఉంది. కాని, అంతిమలక్ష్యంమాత్రం శాంతి-సహజీవనంతో క్రాంతిబంధుర మైంది. పల్లెనుండి పట్టణానికీ, అమాయకంనుండి లౌకికానికీ, మందమంద స్థితినుండి సంచలన స్థితికీ, మౌర్ఖ్యం నుండి వివేకానికీ, మరో ప్రక్కనుండి ఆర్థిక రాజకీయ సాంఘిక వలయాల నుండీ సమాజం ముందుకు క్రమిస్తున్నప్పుడు సంక్షోభం, సంఘర్షణ ఏదో ఒక రూపంలో తప్పనిది. ఈ క్లిష్ట స్థితుల్ని వివిధ దశల్లో పరస్పర సహభావంతో సమన్వయ పరచే నిర్మాణాత్మకమైన వ్యవస్థకు ప్రాతినిధ్యం వహిస్తూంది ప్రజాస్వామ్యం. దీన్ని సంపూర్ణంగా ప్రతిఫలింప జేసుకునేది ప్రజాస్వామ్య కవిత్వం. ఇది స్వేచ్ఛా కవిత్వయుగం అని వ్యవహరించే స్థాయిలో ఆధునికతను సంతరించుకొని, ఆవిష్కృతమౌతూంది.

# భాషా శైలి

తంగిరాల వెంకట సుబ్బారావు

ఈ 20 వ శతాబ్దిలో అతిముఖ్యమైన సంఘటన భారత దేశం స్వాతంత్ర్యాన్ని పొందడం. ఏ సాహిత్యోద్యమాన్నైనా ఈ సంఘటనతోనే కొలంవాల్సి ఉంటుంది.

స్వాతంత్ర్యానికి పూర్వం భావకవిత్వం అభ్యుదయ కవిత్వం విజృంభించాయి. స్వాతంత్ర్యానంతరం కూడా అభ్యుదయ కవిత్వం ఏడెనిమిదేళ్లు కొనసాగి, 1955లో వచన కవిత్వంగానూ, 1965 లో దిగంబర కవిత్వంగానూ, 1970 లో విప్లవ కవిత్వంగానూ పరిణమించింది. భావకవిత్వం అనుభూతి కవిత్వంగా మారింది. తిలక్, శేషేంద్రలు భావ, అభ్యుదయ కవిత్వాల సమన్వయం కోసం కృషి చేశారు. సాంప్రదాయిక కవిత్వం మాత్రం 1947 కి ముందూ తరవాతా కూడా వ్యాపించి వుంది.

ఈశతాబ్ది ప్రారంభంలో సాంప్రదాయిక కవిత్వానికి తిరుపతివేంకటకవులూ, భావకవిత్వానికి రాయప్రోలు సుబ్బారావుగారూ, అభ్యుదయ కవిత్వానికి గురజాడ అప్పారావుగారూ పునాదులు వేశారు. విశ్వనాథ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీలు ఈ మూడు పాయలకూ ముగ్గురు భగీరథులై తెలుగు నేలను పునీతం చేశారు. భావకవిత్వం 1910 నుండి 1940 వరకూ, అభ్యుదయ కవిత్వం 1935 నుండి 1955 వరకూ తెలుగు సాహిత్యం మీద తమ తమ ప్రభావాలను చూపాయి. అందువల్ల 1955 తర్వాత వచ్చిన వచన కవిత్వం, దిగంబర కవిత్వం, చేతనావర్త కవిత్వం, అనుభూతి కవిత్వం, కవిసేన కవిత్వం (శేషేంద్ర కవిత్వం), మినీ కవిత్వం, నిరసన కవిత్వం-అభ్యుదయ కవిత్వానంతర ధోరణులుగా గుర్తించాలి.

తెలుగు కవిత్వం నన్నయతో ప్రారంభమయిందని భావిస్తున్నాం. నన్నయ గారు తెలుగు కవిత్వానికి భాషా స్వరూపాన్ని తీర్చి దిద్దిన 'వాగనుశాసనుడు'; గురుపద్య విద్యకు ఆద్యుడు. (పద్యానికే కాదు గద్యానికి కూడా ఆయనే ఆద్యుడని విశ్వనాథవారి అభిప్రాయం). 11 వ శతాబ్దిలో నన్నయ వాడిన కావ్యభాష ఆనాటి శాసన భాషకు దగ్గరగా ఉందని (నందంపూడి శాసనంతోపోల్చి) గిడుగు వారూ, తాతా సుబ్బరాయశాస్త్రిగారూ భావించారు. కాని, భద్రిరాజు కృష్ణమూర్తి గారు ప్రాఙ్నన్నయ శాసన భాషనూ, తెలుగు భాషా వికాసాన్నీ పరిశీలించి, నన్నయ కావ్యభాష క్రీ. శ. 9 వ శతాబ్ది నాటికే రూపుదిద్దుకుందని నిరూపించారు. 6-7 శతాబ్దాల్లోని శాసనభాష తెలుగు దేశ్యపదాలతో నిండి వుంటే 9-10 శతాబ్దాల నాటికి శాసనభాష సంస్కృత పదభూయిష్ఠంగా కావ్యశైలిని సంతరించుకుంది. ఈ శైలినే 11 వ శతాబ్దిలో నన్నయ తన కావ్యశైలిగా స్వీకరించాడు. తన కాలంనాటి శాసన భాషనూ, ప్రజల వ్యావహారిక భాషనూ, రాజభాషయైన సంస్కృతాన్నీ, కన్నడంలోని పంపాదుల కావ్యశైలినీ పరిశీలించి తన కావ్యశైలికి ఇంకా మెరుగులు దిద్దుకున్నాడు. ప్రసన్నతనూ అక్షరరమ్యతనూ సాధించాడు. ఈ విధంగా తెలుగు కవిత్వ భాషకు శాసకుడయ్యాడు. అప్పటినుండీ ఇప్పటి వరకూ తెలుగు కవిత్వం పురాణాలు, కావ్యాలు, ప్రబంధాలు, ఖండకావ్యాలు, గేయకావ్యాలు, వచనగీతాలు- అనే అనేక రూపాలను ధరించినా భాష మాత్రం 90% నన్నయ తీర్చి దిద్దిన భాషే. నన్నయ భాషలో మూడు వంతులు తత్సమ పదాలు, ఒక వంతు తెలుగు పదాలు వుంటే, ఈనాటి కావ్యభాషలో కూడా అదే పరిస్థితి వుంది. (నేను వ్రాస్తున్న ఈ వ్యాసభాషను పరిశీలించినా నేటి శిష్టవ్యావహారిక భాషాస్థితి మీకు అవగత మవుతుంది.)

నన్నయగారి ఇతివృత్తం మీదా, ఛందస్సు మీదా, భాష మీదా మొట్ట మొదటిసారి విప్లవం లేవదీసినవాడు పాల్కురికి సోమనాథుడు. సమకాలీన మహా పురుషుల జీవితాల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి, దేశిచ్ఛందస్సులో, జానుతెలుగులో బసవ పురాణం, పండితారాధ్య చరిత్రలు రచించాడు. ఇతడు రెండు వంతులు దేశి పదాలూ, ఒక వంతు తత్సమ పదాలతో రచన చేశాడు. దేశిశైలికి నాంది పలికాడు. తరవాత వచ్చిన తిక్కన - నన్నయమార్గశైలికీ పాల్కురికి సోమనాథుని దేశి శైలికీ ఒక సమన్వయం సాధించాడు. దేశిశైలిని ఇంకా ముందుకు తీసుకెళ్ళాడు.

మూడు వంతులు దేశీ పదజాలం, ఒకవంతు తత్సమ పదజాలంతో కావ్యశైలిని కొనసాగించాడు. తెలుగులో దేశి పదజాలానికి గొప్ప శక్తి ఉందని నిరూపించాడు. కాని, తరువాత వచ్చిన కవులెవ్వరూ శివకవుల్ని కాని, తిక్కనను కాని అనుసరించ లేదు. నన్నయ్యనే మార్గదర్శకంగా పెట్టుకున్నారు. ఒక్క వేమన్న మాత్రం శివ కవుల దేశిశైలిని ఇంకా ప్రజల దగ్గరకు తీసికొనిపోయి, జానపద శైలిలా భాసింపజేశాడు. జానపద గేయాల కున్న జనరంజకత్వం తన కవిత్వానికి కూడా వచ్చేలా చేసుకున్నాడు. కాబట్టి మనకు ప్రాచీన కాలం నుంచీ మూడు భాషా శైలులున్నాయి : 1) నన్నయ మొదలుపెట్టిన **మార్గశైలి** 2) పాల్కురికి సోమ నాథుడు, తిక్కన మొదలుపెట్టిన **దేశిశైలి** 3) ప్రజాకవిత్వంతో వున్న **జానపద శైలి**. 20 వ శతాబ్ది కవిత్వంలో కూడా ఈ మూడు శైలులే ప్రధానంగా కనబడుతున్నాయి. ఈ మూడింటిలోనూ నన్నయ మార్గశైలిదే ఈనాటికీ పైచేయిగా ఉంది.

ఆధునిక యుగంలో తిరుపతి వేంకట కవులు, విశ్వనాథ, గడియారం, వానమామలై, మధునాపంతులవంటి సాంప్రదాయిక కవులు నన్నయ మార్గ భాషాశైలిని అనుసరించడంలో ఆశ్చర్యం లేదు. కాని, భావకవులూ, అభ్యుదయ కవులూ కూడా ఎక్కువగా నన్నయ మార్గాన్నే అనుసరించడం వింత! నన్నయ భారత శైలికీ, కృష్ణపక్షం శైలికీ, మహాప్రస్థానం శైలికీ ఏ విధమైన తేడానూ లేదు. భావకవులు భావప్రకటనలో మార్పు తీసుకువచ్చారు కాని, భాషా శైలిలోనూ, అభివ్యక్తిలోనూ నన్నయ పంథానే అనుసరించారు. ఒక్క బసవరాజు అప్పారావు గారు మాత్రం తిక్కన దేశిశైలిని ఆశ్రయించారు. ఒక్క నండూరివారు మాత్రం జానపద శైలిని అనుకరించాలి. ఈ అనుకరణం (సరళత) భాషకు మాత్రమే పరిమితం. భావాల్లో శంకరాద్వైతం వరకూ పెరిగిపోయిన క్లిష్టమార్గ ధోరణే. జానపదుల్లో భాష, భావం రెండూ కూడా సారళ్యంతో భాసిస్తాయి!

అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీది అచ్చంగా నన్నయ మార్గమే. శ్రీరంగం నారాయణబాబు, దాశరథి, నారాయణరెడ్డి మొదలైనవారు ఇదే ధోరణిలో వెళ్లారు. ఒక్క పఠాభిమాత్రం భాషలో అభివ్యక్తిలో నిజమైన నవ్యధోరణిని ప్రదర్శించాడు. అతడొక్కడే అభ్యుదయకవుల్లో నిజమైన నవ్యుడు. ఆరుద్ర అతన్ని అనుసరించాడు.

వచన కవుల్లో కుందుర్తిని ముమ్మూర్తులా తిక్కన మార్గమే. తిలక్‌ది ఎక్కువగా నన్నయ మార్గం. దిగంబరకవుల్లో కొందరు నన్నయమార్గాన్నీ, మరి కొందరు తిక్కన మార్గాన్నీ, మరికొందరు మధ్యేమార్గాన్నీ అనుసరించారు. చేతనావర్తకవుల్లో ఇద్దరు నన్నయ శైలిలోనూ, ఇద్దరు తిక్కన శైలిలోనూ వ్రాశారు. విప్లవకవుల్లో చెరబండరాజు, కె.జి. సత్యమూర్తి (శివుడు, శివసాగర్, రెంజిమ్) జానపద బాణీలనే అనుకరించ గలిగారు కాని, జానపద భాషాశైలిని అనుకరించ లేకపోయారు. ఒక్క గద్దర్ మాత్రం జానపద బాణీని శైలినీ కూడా చక్కగా పట్టుకున్నాడు. కాని ఈ పల్లె పాటలవలె వ్రాయబడ్డ విప్లవకవిత్వంలో భావాలు మాత్రం మార్క్సిజంతోనూ, గతితార్కిక భౌతిక వాదంతోనూ బరువెక్కి జానపదుల తలలమీంచి దూసుకుపోయేవే! ఏ ఉద్యమాలకూ చెందని రంధి సోమరాజు, పులికంటి కృష్ణారెడ్డి అనే కవులు కూడా జానపద బాణీల్లో కవితలు వ్రాస్తున్నారు. వీరి జానపదం కూడా బాణికీ, కొంతవరకూ భాషకూ మాత్రమే పరిమితం. భావాలు శిష్టమైనవే! అనుభూతి కవులలో అటూ ఇటూకూడా ఉన్నారు. శేషేంద్రది ముమ్మూర్తులా నన్నయశైలే. కాని, ఇటీవల ఆయన సామాన్యప్రజలను దృష్టిలో పెట్టుకుని మామూలు మాటలలో (దేశిశైలిలో) కవితలల్లుతున్నారు. ఇటీవల వచ్చిన మినీ కవులు, నిరసన కవులూ కూడా నన్నయ మార్గశైలీ ప్రభావంలోంచి తప్పించుకోలేకపోయారంటే, నన్నయ సృజించిన కావ్యశైలి ఎంత బలమైనదో వేరే చెప్పనక్కరలేదు!

## వచన కవుల భాష

కవిత్వంలో భావాలూ భాషా ప్రజలకు దగ్గరగా ఉండాలి అనే శివకవుల నినాదాన్ని మళ్ళీ చేపట్టిన అభ్యుదయ కవి, వచన కవితా పితామహుడు కుందుర్తి. ఈయన మధ్యతరగతి ప్రజల శిష్టవ్యావహారికాన్ని కవిత్వ భాషాశైలిగా స్వీకరించారు. సాధ్యమైనంతవరకూ సంస్కృత సమాసాలనూ తత్సమ పదాలనూ (తిక్కనలాగా) పరిహరించారు.

"రతనాల పూలతోటలో
తంతున్న మొక్కలు నాటను

భావనలో సామాన్యుని
జీవిత వలయాలు దాటను" అని ప్రతిజ్ఞ చేశాడు. ఇంగ్లీషులో పద ప్రయోగాన్ని కూడా కుందుర్తి నిరసించారు. వాడుకలో వున్న, చదువరులకు చిరపరిచితమైన మాటలతోనే కవిత్వం అల్లారు కుందుర్తి :

"మూడునాళ్ల పసిపాపను ముద్దుగా వొడిలో గుండెల కద్దుకుంటూ
వెచ్చగా ఆస్పత్రినుండి వచ్చగా ఇంటికి వెళ్లే పచ్చి బాలెంతరాలిమీద
పూల జల్లులా గా
ఆగస్టు పదిహేనున బారుగ తీర్చినించున్న పసిబాలురమీద
జాలిగా సన్నని తుంపరగా వర్షం పడుతుంది."

వచనకవుల్లో కుందుర్తి తిక్కన అయితే, తిలక్ నన్నయగారు. (కుందుర్తి గుంటూరు వాడూ, తిలక్ తణుకు వాడూ కావడం కూడా విచిత్రమైన సాదృశ్యం). తిలక్ నన్నయగారి శైలిని ఆశ్రయించడమేకాక, అల్లసాని పెద్దనగారి అలంకృత శైలిని కూడా వచన కవిత్వంలో ప్రవేశపెట్టాడు.

"నీ క్రొత్త సింగారమ్ము వలదు, ఉదాత్త సురభిళాత్త
శయ్యాసజ్జితమ్ము వలదు, రసప్లావితము వలదు,
చిత్రశిల్ప కవితా ప్రసక్తి వాంఛింపను,
తత్వసూత్ర వాదోక్తి చలింపను,
సుందర వధూ కదుష్ణ పరిరంభముల రసింపను,
గత చారిత్రక యశఃకలాపమ్ము వివరింపకు
బహుళ వీరానేక గాథా సహస్రమ్ము వినిపింపకు
ఇంక నన్ను విసిగింపకు."

'తపాలా బంట్రోతు' గేయం మామూలు తెలుగు మాటలతో వ్రాస్తూ వ్రాస్తూ, మధ్యలో (వేళాకోళానికే అనుకోండి) అచ్చంగా పెద్దన శైలిని చూపిస్తాడు :

"మృదుమాధ్వీ పదలహరీ
తరంగ మృదంగ విలసద్భంగీ
మనోహరాలౌ కావ్యాల్ గేయాల్
కొల్లలుగా వ్రాస్తాను."

'అమృతం కురిసిన రాత్రి'లో 75% గేయాలు ఇలాగ నన్నయ పెద్దన్నల మార్గ శైలిలో వ్రాసినవే. శివకవుల దేశిశైలిలో వ్రాసినది చాలా తక్కువ. 'గొంగళి పురుగులు', 'తపాలా బంట్రోతు', 'అమ్మా! నాన్న ఎక్కడికి వెళ్లాడు?' మొద లైన దేశిశైలి గేయాలను వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు, ఒక్కొక్కప్పుడు ఇతివృత్తాన్ని బట్టీ, సందర్భాన్ని బట్టీ, సంస్కృత శబ్దాలకు బదులు ఆంగ్ల శబ్దాలు విరివిగా వాడటం కనబడుతుంది :

"ట్రెంచెస్‌లో దాగాలి
పైన ఏరోప్లేను, చేతిలో స్టెన్‌గన్
కీయిస్తే తిరిగే అట్టముక్క సైనికులం
మార్చ్!
వన్ టూ త్రీ షూట్ డెడ్ ఎవడ్
నువ్వా నేనా
కేబుల్‌గ్రాం యిప్పించండి కేరాఫ్ సోఅండ్‌సో
(మీవాడు డెడ్)" (- సైనికుడి ఉత్తరం)

ఛందోబద్ధమైన కవిత వ్రాయడంలోకూడా చేయి తిరిగిన కవి తిలక్. అందువల్లనే కానోలు, ఒక్కొక్కసారి పద్యాలకు ఉపయోగించే గ్రాంథిక శైలిని వచన గీతా లకు ఉపయోగిస్తారు.

"ఇన్ని నే బ్రతికిన దినాల పన్నిన వ్యూహాన
నిన్నెక్కడ కలసికొనినానొ స్మృతికి రాదుగాని నీవు లే
వనునట్టి కాలమే నాకు లేదు; నాదారినుండి నిన్ను
విడదీయు వేరు మార్గమే లేదు;"

కొన్నిచోట్ల జటిల సంస్కృత సమాసాలుకూడా వాడారు:

"జ్వలితాక్రాంతమిలాతలం శతప్తధాత్రి నిర్జనమై పరచుకొనెను
సుప్తదేవ హృదయ సృణ్ణాళము లెగిరిపడెను."

వచన కవులలో కుందుర్తిలాగే మామూలు మాటలలో కవిత్వం చెప్పిన షుకోకవి అజంతా. కాని, ఈయనకు శిల్పంమీద పట్టింపు ఎక్కువ. అందువల్ల

మధ్యమధ్య తత్సమ పదమిశ్రితమైన మిశ్రమశైలికూడా తొంగిచూస్తుంది. కాని, కుందుర్తిలాగ ఇంగ్లీషు మాటలు వాడకూడదనే పట్టింపుమాత్రం ఈయనకు లేదూ?

"ఎక్కడా ఎవరూ లేరు
అంతా ఇళ్లకు చేరుకున్నారు
విద్యార్థి పుస్తకాలు మూసేశాడు
విమాషకుడు వేషం మార్చేశాడు
వీధిగాయకుడు పాట ఆపేశాడు
గుడిసెలో వెన్నెట్లో కార్మికులు కన్నీళ్లు ఆరబెట్టుకున్నారు
కటకటాలమధ్య శూన్యంలో ఖైదీలు ఆకాశయానం చేస్తున్నారు
పేవ్మెంటుమీద భిక్షకులు వాల్‌పోస్టర్లు కప్పుకున్నారు". (-సుషుప్తి)

బైరాగి గారిది ఎక్కువగా మార్గశైలి. మధ్యమధ్య మిశ్రమ శైలి. ఈయన వచన కవితల్లోని పాదాలు పద్యపాదాలలాగ గ్రాంథిక వాసన కొడుతూవుంటాయి కాని, సహజంగా వుండవు. సోమసుందర్ గారిది పూర్తిగా మార్గశైలి; సమాస భూయిష్ఠ ప్రబంధమార్గం. మామూలు మాటల్లో ఈయన కవిత సాధారణంగా నడవదు. పాల్కురికి సోమనాథుడిలాంటి మరో అచ్చమైన దేశికవి కాళోజీ నారాయణరావుగారు. ఈయన ప్రజల బాధల్నిగురించి ప్రజల భాషలోనే కవిత అల్లిన అచ్చమైన ప్రజాకవి. పట్టుపట్టి దేశిశైలిని సాధనచేసిన కవులలో ఆరుద్రను ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

## దిగంబర కవుల భాష

ఒక్క చెరబండరాజు పేరు తప్ప తక్కిన ఐదుగురు కవుల కలంపేర్లూ సంస్కృత సమాసాలతో ఏర్పడ్డవే. ఇంచుమించు ఈ పేర్లవంటిదే వీరి శైలి కూడా. కొంచెం సూక్ష్మంగా పరిశీలిస్తే నగ్నముని, నిఖిలేశ్వర్ కొంతవరకూ దేశి శైలిని పాటించారని తెలుస్తుంది.

"సూర్యుని కడ్డంగా నుంచున్న
ఆ మబ్బుతునక పేరేమిటి ?
అర్థంకాని అనంత శూన్యం అంచుమీదకి

ఆకాశంతేసి కుర్చీ నొకటి లాక్కొని
అర్థవంతమైన బ్రతుకు వెన్నెల చుక్కల్ని కప్పులో వొంపి
ఒక్కొక్క క్షణం పెదవుల కానించి
విషాదాన్ని ఆరాధిస్తూ వుంటానా" (నగ్నముని-జైల్లోసముద్రం)

"ఇక్కడ
ఎవరూ హీరో కాదు, విలన్ కాదు
మంచాడు కాదు - పిచ్చాడు కాదు
నిస్సారతను పిండేస్తున్న
ఖాళీటిన్ను మానవులు
మరి
రేపు తాజమహల్ కూలిపోయిందంటే
నీ సోమరితనం ముక్కలైపోతుందా ?
( నిఖిలేశ్వర్ - 'నీరవ నిఖిలేశ్వర' )

ఆంగ్లభాష ఆధునిక సంస్కృతిలో ఒక భాగం కాబట్టి దిగంబర కవులు ఆంగ్ల పదాల్ని అవసరమైనచోట వాడటంలో వెనుకాడలేదు.

"ఆ విగ్రహం బ్రతికున్నప్పుడు చుట్టూ ఎన్ని గ్రహాలు
కోడిపుంజు కొట్లాటలు సిమెంటు కాంట్రాక్టులు
ప్లేట్లలో ఫోర్కుల కింద అలగాజనాలు
జైళ్లలో బండరాళ్ళు కప్పుకుని అమాయకులు"
( నగ్నముని - 'దాహం' )

"ప్రక్కనే ప్రాణంలేని నేరస్థుడిలా నిలుచుని వుంది లారీ
స్టీరింగ్ ముందు వేగానికి బానిస అయిన
డ్రైవర్ పాపం! పోలీసు స్టేషన్‌లో లాకప్పులో"
( - నిఖిలేశ్వర్ - 'నీవు చెప్పింది అబద్ధంకాదు' )

కవితను మొదలుపెట్టేటప్పుడున్న దేశిశైలి మధ్యలోనూ చివరలోనూ వుండదు. ఆవేశం హెచ్చినప్పుడు అందరి కవుల్లాగే వీళ్ళు కూడా మార్గశైలిలోకి దూకి పోతారు.

మహాస్వప్న, జ్వాలాముఖి ఎక్కువగా తత్సమ పద భూయిష్ఠమైన మార్గశైలినే ఆశ్రయించారు. అయినా సందర్భానుసారంగా కొన్ని దేశ్యాలూ అన్యదేశ్యాలూ దొర్లిస్తూనే వుంటారు.

"కలియుగం రేడియోగ్రాంలో
గిరగిర తిరుగుతున్న క్రీ.శ. ఇరవయ్యో శతాబ్దం రికార్డు మీద పిన్నునై
మానవత రెండు కళ్ళూ మూసుకుపోయినప్పుడు
విప్పుకుంటున్న మూడో కన్నునై
కాలం వాయులీనం మీద కమానునై
చరిత్ర నిద్రాసముద్రం మీద తుఫానునై
నేను వస్తున్నాను దిగంబరకవిని
రాత్రి ఉదయిస్తున్న రవిని"
( - మహాస్వప్న: 'గ్లానిర్భవతి భారత')

"మరణ జననాలు లేకుండా
వ్యాధీ వార్ధక్యాలు రాకుండా
అణ్వమృత కాసారంలో
మానవులంతా ఒక్కసారిగ
"సూర్య-స్నానం" చేశారని
యమలోకంలో దిగంబరదేవుని ఉవాచ
నరకం రద్దుకు ఆర్డినెన్సు జారీ" (–జ్వాలాముఖి : 'సూర్యస్నానం')

భైరవయ్య, చెరబండరాజు తత్సమరాజులూ దేశ్యపదాలూ కలిపిన మిశ్రమశైలిని పాటించారు. ఈ శైలిలో ఆంగ్లపదాలు కూడా కలుస్తూ ఉంటాయి. (ఆంగ్లపద ప్రయోగం దిగంబర కవులందరికీ వర్తించే సాధారణ సూత్రం) :

"నిలుచున్నాను
అబద్ధాల కత్తి అంచులమీద నిజంలా
మిన్నంటుతున్న జ్వాలల కొనలపై పొగలా
చూస్తున్నాను
రుద్రఫాలంమీది నేత్రంలా

చిక్కటి ఇరుల ఉడుపులవెనుక దాగిన
తొగరు అందాల తేజంలా" (-భైరవయ్య : 'అగ్నిప్రవేశం')

"ఏయ్! సుఖీ!
ఇన్నే ముసుగులు తన్నేయ్
వెయ్యేండ్ల కలల తత్వంలో
వేసారిపోతున్న నీకు
క్షణం గ్యారంటీ లేని
జీవితం మిగిల్చేదేమిటి?" (-చెరబండరాజు : 'చితిపేర్చుకుందాం')

మొత్తానికి దిగంబరకవులందరూ నన్నయ ప్రవేశపెట్టిన మార్గశైలికి అతీతంగా కవితలు వ్రాసినట్టు సాక్ష్యాలు తక్కువ. ఆయన తీసినగోతిల్లోనే పడ్డారు!

## 'చేతనావర్తం' కవుల భాష

వీరిలో ఇద్దరు కవులు, ఇద్దరు పండిత కవులు ఉన్నారు. పండిత కవులు (సుప్రసన్న, సంపత్‌కుమార్) తమకు సహజమైన ధోరణిలో మార్గశైలినే ఆశ్రయించారు :

"స్వార్థానికి రంగులు పూసి
భాషలపేర మతంపేర జాతిపేర
దేశంపేర చేసిన మారణ హోమాలకు
చరిత్రకారులు తొడిగారు మారువేషాలు
శవగంధం కొడుతున్న ఈ పట్టుతెర్లని
శ్మశానానికి పంపించండి" (-సుప్రసన్న)

తక్కిన కవుల్లో, ముఖ్యంగా పేర్వారం జగన్నాథంగారిలో మామూలు మాటలతో చమత్కార పూరితమైన ధ్వనిలో దేశిశైలి కొట్టవచ్చినట్టు కనబడుతుంది :

"స్వామీ! ఈ మగడు నాకొద్దు
నీ దసలే తుమ్మ మొద్దు...
వీడా సత్యవంతుడు కాడు
అందుకే నేను పాతివ్రత్యంగా నటించలేను"

## విప్లవ కవుల భాష

'మహాప్రస్థానం'లో నన్నయ మార్గ శైలిని పాటించిన శ్రీశ్రీ, 'మరో ప్రస్థానం' లోనూ, 'ఝంఝ' లోనూ దానినుంచి తప్పించుకోవాలని విఫల ప్రయత్నం చేశాడు. నన్నయ మార్గ శైలిలో వ్రాయడమే శ్రీశ్రీకి సహజంగా వంటబట్టిన శైలి. ఆ శైలిలోనే ఆయన తన కవితోద్రేకాలను సమర్థవంతంగా వెల్లడించగలడు. 'ఝంఝ'లో ఈ సహజ శైలిలో వ్రాసిన గేయాలే బాగున్నాయి :

"సాయుధ విప్లవ బీభత్సుని సారథినై
భారత కురుక్షేత్రంలో
నవయుగ భగవద్గీతా ఝంఝుని ప్రసరిస్తాను
మంటలచేత మాట్లాడించి
రక్తంచేత రాగాలాపన చేయిస్తాను."

'ఝంఝ'లో 'సన్నటి జట్కావాలా' అనే గేయంలో శ్రీశ్రీ తన సహజ మార్గ శైలిని వదిలి జానపద శైలిలో వ్రాయడానికి ప్రయత్నించి ఘోరంగా పరాజయాన్ని పొందాడు. "ఈ శైలి శ్రీశ్రీకి సహజం కాదు. తెచ్చిపెట్టుకున్నట్లే వుంది. కాని, యీ మార్గంలో తర్వాత గద్దర్, వంగపండు ప్రసాదరావు, చెరబండరాజు మొదలైనవారు రసవంతమైన, ఉత్తేజకరమైన గీతాలు రచించి ఉద్యమానికి బలం చేకూర్చారు" (—కడియాల రామమోహనరాయ్, తెలుగు కవితా వికాసం, పుట 345).

'మరోప్రస్థానం'లో 'తుది పయనం - తొలి విజయం' అనే గేయంలో తన మార్గ ధోరణిని బలవంతంగా అణిచిపెట్టుకుని మామూలు మాటలలో దేశి శైలిలో కవిత్వం చెప్పడానికి ప్రయత్నించాడు శ్రీశ్రీ. కాని, ఉద్రేకపూరితమైన ముగింపులో తిరిగి తన సహజ శైలినే ఆశ్రయించక తప్పలేదు :

"తెల్లవాడు నిన్న నాడు భగత్సింగు అన్నాడు
నల్లవాడు నువ్వు నేడు నక్సలైటు వన్నాడు
ఎల్లవారు నిన్ను రేపు వేగుచుక్క అంటారు

శివాజీకి వారసుడా! శ్రీశ్రీ కవిత్వ లాలసుడా!
నీ ధాటికి అడ్డులేదు, నీ త్యాగం వృథాకాదు!"

విప్లవకవుల్ని రెండు వర్గాలుగా విడదీయాలి: (i) వచన కవిత్వంలో విప్లవ భావాలు వ్యాపింపజేసినవాళ్లు (ii) పాటల్లో, జానపద బాణీల్లో విప్లవాన్ని ప్రబోధించినవాళ్లు. శ్రీశ్రీ, కె. వి. రమణారెడ్డి, వరవరరావు, కె. జి. సత్యమూర్తి (శివుడు, శివసాగర్, రెంజిమ్), చెరబండరాజు, అజ్ఞాత సూరీడు వచన కవితలు వ్రాసిన కవులు. సుబ్బారావు పాణిగ్రాహి, కె. జి. సత్యమూర్తి, చెరబండరాజు; వంగపండు ప్రసాదరావు, గద్దర్ మొదలైనవారు పాటలూ, జానపద గేయాలూ అల్లిన కవులు. మొదటి వర్గంలో కుందుర్తి మార్గానుయాయులూ ఉన్నారు; తిలక్ మార్గానుయాయులూ ఉన్నారు.

"అన్నా!
నీ గాయాల మీంచి వీచి
గాలి ఎరుపెక్కింది.
నువ్వాసరా చేసుకున్న బొడ్డుమల్లె
ఇపుడెర్రగా పూస్తున్నది.
నువ్వు పడిపోయినచోట
భూమి ఎరుపెక్కింది
నీ పాదాలను తాకి
చెలమ ఎరుపెక్కింది
నీ చితి నిప్పులేకనే మండింది!
మరొక్కటి వినన్నా!
నువ్వు కొట్టిన బాణం దెబ్బకు గాయపడి
చీకటి ఎరుపెక్కింది!"

ఇది 'ఝంఝ' లో ప్రకటింపబడిన టంకసాల అశోక్ అనే యువకవి రచించిన 'చీకటి కూడా ఎరుపెక్కింది' అనే కవిత. ఇది [illegible] మాటలతో దేశీశైలిలో వెలువడిన చిక్కని కవిత్వం. [illegible] కవులు కొందరు తత్సమ పదబాహుళ్యంతో మార్గశైలిని ఆశ్రయించారు.

"ఆకలి హింస కాదు
అధికధరలు హింస కాదు
దుర్భర దారిద్ర్యం హింస కాదు
బూతు యుగళ గీతాల
సాంస్కృతిక దుర్గంధం హింస కాదు"
(— 'మట్టికాళ్ళ రాక్షసి', అరుణతార, ఏప్రిల్ 1984)

కె. శివారెడ్డి, చెరబండరాజు, సత్యమూర్తి మొదలైన కవులు మిశ్రమ శైలిని పాటించారు.

జానపద బాణీలలో పాటలు వ్రాసిన విప్లవ కవులు కూడా నన్నయ మార్గ శైలీప్రభావంనుంచి తప్పించుకోలేకపోయారు.

"ఓ భారత కార్మికుడా!
భావియుగం నాయకుడా!
సాగరా సాగరా వెనువిరగక సాగరా! ॥ఓ॥
మాతృభూమి పెదవులపై
సామ్యవాద దరహాసం
నీ రుధిరం చిందకుండ
నీ త్యాగం లేకుండా
కనిపించదు దీపించదు
నీ స్వప్నం ఫలియించదు" (—చెరబండరాజు:'ఓ భారత కార్మికుడా')

ఒకవేళ పట్టుపట్టి భాషలో జానపద శైలిని తీసుకొచ్చినా భావాలు మాత్రం విశిష్టులకూ, బుద్ధిజీవులకూ, మార్క్సిస్టు మేధావులకూ పరిమితమైనవేకాని, సామాన్యులకూ జానపదులకూ సంబంధించినవి కావు. చెరబండరాజులాగే, కె. జి. సత్యమూర్తి, వంగపండు ప్రసాదరావుల జానపద బాణీలు కూడా మార్గ శైలి లోనే సాగుతాయి. ఒక్క గద్దరు పాటల్లో మాత్రం అచ్చమైన జానపద శైలి కనబడుతుంది :

"అర్థమోలె మెరిసెటట్టు
నో ఖ్యాట్లు తొడిసినోల్లు

గంజిలో బట్టలుతికి
కడకిస్త్రీ జేసినోల్లు
నీ కాళ్ల గోల్లు దీసి
గడ్డాలు జేసినోల్లు
సెయ్యంత నూనె రాసి
మాలీసు జేసినోల్లు
పిడికిండ్లు ఎత్తినారు
పండేసి తొక్కుతారు!"

## అనుభూతి కవుల భాష

అనుభూతికవులలో ప్రధానులు నలుగురు: వేగుంట మోహన్‌ప్రసాద్, ఇస్మాయిల్, ఇంద్రగంటి శ్రీకాంతశర్మ, కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ. వీరిలో మోహనప్రసాద్, శ్రీమన్నారాయణ స్వచ్ఛమైన దేశిశైలిని ఆశ్రయించారు: అంటే పూర్తిగా అచ్చతెనుగు కావ్యాల్లా వ్రాశారని కాదు. సాధ్యమైనంతవరకూ దేశ్యపదాలనే వాడారు. తత్సమపదాలు తక్కువవాడారు.

"అట్లా అని
పెద్ద బాధా వుండదు
వెల్లవేసిన గోడలేమో తెల్లబోతూ ఉంటాయి
విద్యుత్కాంతికి మహా అయితే ఏటల్లో ప్రాకుతూంటుంది
గోడమీద దానినీడ ఒక్కటే ఛాయామాత్రంగా మెసుల్తుంది."

ఇలాగ మోహన్ ప్రసాద్‌లో శిష్టవ్యావహారికం కనబడుతుంది.

"చీకటి కాకి
చుక్కల గుడ్లని
రాత్రల్లా పొదుగుతుంది
ఒకే ఒకటి
సూర్యకోకిలర పోతుంది
మిగిలినవన్నీ
కాకిపిల్లలై
చీకటిలో కాకితో
ఎగిరి పోతాయి."

(—శ్రీమన్నారాయణ)

ఇందులో 'రాత్రి' 'సూర్యకోకిలం' అనే రెండు తత్సమ శబ్దాలు తప్ప తక్కినవన్నీ తెలుగు పదాలే.

ఇంద్రగంటి శ్రీకాంత శర్మ మాత్రం బరువుగా వుండే భావాలను బరువైన తత్సమ శైలిలోనే చెప్పారు. (తిలక్ గారి మార్గశైలిని ఈయన అనుకరించినట్లు కనబడుతుంది).

"కిరణంలోంచి
వాతావరణంలోంచి
కేలెత్తి అవతరిస్తున్న నవపరిరంభని
సమతావిపంచిని
సాహసగరుత్తులు విప్పి
సమయానికి రాగల సూరుణ్ణి, నరుణ్ణి, హరుణ్ణి."

ఇస్మాయిల్ మాత్రం తత్సమ పదాలు తెలుగు శబ్దాలు కలిసిన మిశ్రమ శైలిని పాటించారు :

"అకస్మాత్తుగా
ఒక రోజు
మృత్యువృక్షం
వ్యత్యస్తంగా
తలకిందుగా
మొలిచింది.
మూగిన బంధుమిత్రులు
మోసుకుపోయి అతణ్ణి
విత్తనంలా పాతారు.
జనాల
మనోగగనంలో
చాపుకున్న జ్ఞాపకాల కొమ్మల్ని
గాఢానురాగాల
ఊడల్ని వెనక్కి పీల్చేసి

ఈ మృత్యు బీజం
ఏమీ తిరిగి ఇవ్వదు."

ఈయన మిశ్రమ శైలిలో కూడా తత్సమ పదాలదే పై చేయిగా ఉంది. కొంత తగ్గించి ఒక మిశ్రమ శైలిని పాటించినట్లుగా కనబడుతుంది.

## శేషేంద్ర శైలి

శేషేంద్ర శర్మగారి కవిత్వంలో ఆధునిక కవిత్వంలో వున్న అన్ని ధోరణులూ అన్ని దశలుగా కనబడతాయి.

1. సాంప్రదాయిక పద్య కవిత్వ దశ (పక్షులు, ఋతుఘోష),
2. భావకవిత్వ దశ (శేషజ్యోత్స్న, ప్రేమలేఖలు),
3. అభ్యుదయ కవిత్వ దశ (మండే సూర్యుడు),
4. అనుభూతి కవిత్వ దశ (నీరై పారిపోయింది, సముద్రం నా పేరు),
5. విప్లవ కవిత్వ దశ (నా దేశం: నా ప్రజలు, గొరిల్లా, అరుస్తున్న ఆద్మీ)

వీరి భాషా శైలి కూడా ఆయా దశలకు అనుగుణంగా పరిణామం చెందుతూ వచ్చింది. మొదట సాంప్రదాయిక మార్గ కవితా శైలి ఉంది. తర్వాత భావ కవిత్వంలోనూ అభ్యుదయ కవిత్వంలోనూ కొంచెం మార్పులతో అదే శైలిని కొనసాగించారు.

"తొలి ఋషులు అగ్నికీలల్లో మంత్ర గ్రామాలు
దర్శించినట్టు
నీ కౌగిట్లో ప్రేమ జ్యోతిని చూశాను
నేను నీ భౌతికమూర్తికోసం రాలేదు
వచ్చానొక కిరణంకోసం
ఒక కవితాచరణంకోసం
కిరణాల్లో స్నానం చేశాను
మృదుమధుర స్మరణల్లో గానం చేశాను
మమ్మల్ని నేను చేరుకున్నాను"

(శేషజ్యోత్స్న)

మిగిలిన కవులందరూ పతాకస్థాయిలో మార్గశైలిని ఆశ్రయిస్తే, ప్రతిభావంతుడైన శేషేంద్ర "నన్ను నేను చేరుకున్నాను" అనే మామూలు మాటలతో ఎంతో తాత్త్వికమైన లోతుల్ని ప్రదర్శించారు.

అనుభూతి కవిత్వ దశలో తత్సమ పదబాహుళ్యాన్ని కొంత తగ్గించి ఒక మిశ్రమ శైలిని పాటించినట్టుగా కనబడుతుంది.

"పాలజాటి ఉషఃప్రవాహాల్లో మునిగిపోయిందో లేదో గుల్మొహర్ తన ప్రథమ వర్షాగమం ఇచ్చి నూతన ఋతువును ప్రకటించింది. ఏవేవో స్మృతులన్నీ మూల మూలాలనుంచి నా రక్త ప్రవాహాల్లోపడి కొట్టుకొచ్చాయి.

(-నీరై పారిపోయింది)

శేషేంద్ర కవిసమ్మేళనాల్లో ఎక్కువ పాల్గొన్నారు. దీనివల్ల ఆయన శైలి మారింది. ఎలా చెపితే ప్రజల గుండెల్లోకి దూసుకుపోతుందో గ్రహించారు. ప్రజల నాడిని అర్థం చేసికొని తన మార్గశైలిని చాలాభాగం తగ్గించుకుని దేశి శైలిని పెంచారు. ముఖ్యంగా విప్లవ కవిత్వదశలో ఈ మార్పు ప్రత్యేకంగా కనబడుతోంది.

"నేనింతా ఒక పిడికెడు మట్టే కావచ్చు. కానీ, కలమెత్తితే నాకు ఒక దేశపు జెండాకున్నంత పొగరుంది." (-గొరిల్లా)

"మట్టి పిసుకుతాను. మట్టిలోనే చెట్లతో, పైర్లతో పెరుగుతాను. పళ్ళలో, ధాన్యంతో బ్రతుకుతాను. నా దేశంలో చేతులనిండా పని ముంచిపోస్తాను. తెల్లవారగానే మళ్ళీ పనికోసం ఖాళీగా ఉంటాయి నా చేతులు."

(-నా దేశం - నా ప్రజలు)

"సూర్యుడ్నించి సూర్యుడికి
ఇరవైనాలుగు గంటల దూరం
మనిషినుంచి మనిషికి
రెండు గుండెలే దూరం" (-'అరుస్తున్న ఆద్మీ')

ఒక్కొక్క వాక్యాన్ని తీసికొని సంపూర్ణంగా పరిశీలిస్తే, శేషేంద్రలో తత్సమ పదాలు, తెలుగు మాటలు సమపాళ్లలో కలిసిన మిశ్రమ శైలియే కనబడుతుంది. శ్రీశ్రీలాగే శేషేంద్రకు కూడా తత్సమ పద బాహుళ్యంతో కూడిన మార్గశైలే స్వతస్సిద్ధమైన శైలి. ఆయన ప్రయత్న పూర్వకంగా దానిని ఇటీవల కొంత తగ్గించుకున్నారు.

శేషేంద్రలో ఇంకో విశేషం ఏమిటంటే, తత్సమ పదాలు వాడుతూనే మధ్యలో సహజంగా ఉంటుందని తోస్తే ఇంగ్లీషు మాటలు, ఉర్దూ హిందూస్తానీ మాటలు గుప్పించడానికి వెనుకాడరు. ఈ అన్యదేశ్య ప్రయోగం ఆరుద్రలో లాగ కృతకంగా ఉండకుండా చాలా సహజంగా అందంగా, ఆ మాట తీసివేసి ఇంకో తెలుగు మాట వెయ్యడానికి వీలులేదన్నంత పకడ్బందీగా ఉంటుంది : కవిత్వం 'తాపీగా లేని గుండెల్ని **కాపీ** కొడుతుం'దనడం, '**అరుస్తున్న అదీక్ష**' అనడం, ఇంకా-

"ఈ **దునియా** ఏమనుకుంటే నాకేమి?"
"నీ కిటికీలో **బుల్బుల్లు** పూస్తాయి"
"సంతోషపూరిత **బెలూనులా**"
"ఈ దేశం శరీరం మీద
**లారీలు, లౌడ్‌స్పీకర్లు, ప్రెస్సులు, బస్సులు**"
"గుండెలతో నాకు **దోస్తీ**
నేనుండేది బాధల **బస్తీ**"
"**లిల్లీలు** పెదవులు విప్పాయి నీ కథలు చెప్పడానికి"
"కవిత్వం **ఆల్కిబ్రాలో**కి ప్రవహించలేదు
**విస్కీ** దేవత భుజం తర్కాన్ని మోయలేదు"
"**ఓ జిందగీ!** నన్ను సుఖం మీద సిలువవెయ్యకు"
"దోమల సామ్రాజ్యంలో
ఈగలు **డిక్టేటర్లు**"
"నీ గుండె ఒక గాయాల **లైబ్రరీ శేషేన్!**"
బాధల **ఊళ్లో** నల్చుని
వర్ణించు జీవితాన్ని"

"కలం వర్తకపు క్యాపిటలిస్టువు"
"మనిషి డబ్బుతో మారడమన్నది మటుకి శతాబ్ది జోకు సుమీ!"
"స్త్రీలో ఉన్న ప్రేమమీద/**పోలీసు** ఎంక్వయిరీ జరపకు"
"పర్వతం ఎవడికీ వంగి **సలాం** చెయ్యదు"
"నీ **ఛాతీ బందూకుల కార్ఖానా**/నీ పవిత్రం గాయాలకు **దవాఖానా**"
"నేనే మీర**స్తానై** కలలు కంటున్నాను" మొదలైనవి.

ఈ అన్యదేశ్యాలశైలి ఆయన ఇటీవలి కావ్యాల్లో ఎక్కువయింది. శేషేంద్ర గొప్ప పండితులని. అయినా దుష్ట సమాసాలు వాడడంలోనూ, స్పెల్లింగులు తప్పుగా వ్రాయడంలోనూ వెనుకాడరు. బహుశా ఆధునికత్వం అని ఆయన భావన కాబోలు. ఎన్నో అద్భుతమైన రమ్యమైన తెలుగు పదాల సమాసాలూ, తత్సమ పదాల సమాసాలూ వాడిన ఈ ప్రతిభావంతుడు ఒక్కొక్కప్పుడు దుష్ట సమాసాలు దొర్లిస్తాడు:

(a) **తత్సమం + దేశ్యం** : జీవన కోరలు, కాంతి రేపులు, ఊహోయాస ముఖాణం, యౌవన్మంది, బాలక్రైస్తులు, దేశద్రిమ్మరి మొ॥
(b) **దేశ్యం + తత్సమం** : ఒంటరి బాష్పం, ఇనపరంగు ప్రత్యూషాలు, తుపాకి మందు గంధాలు మొ॥
(c) **తెలుగు + అన్యదేశ్యం** : (ఇంగ్లీషు/ఇందూస్తానీ) :
పెద్ద బిల్డింగు
కొత్త బిల్డింగు
పూలమేళా
వెన్నెల జెండా
**అన్యదేశం + తెలుగు** : లక్స్ బిళ్ల
(d) **తత్సమం + అన్యదేశ్యం**: సంతోషపూరిత బెలూను, విప్లవ జెండా
(e) **అన్యదేశ్యం + అన్యదేశ్యం**: స్కూళ్ల జైళ్లు, పోలీసు ఎంక్వయిరీ

'ఎడు' లాంటి అపదాన్ని ఇంగ్లీషుమాటకి చేరుస్తారు శేషేంద్ర : "**వాజెడు పూలతో**...."

కావాలనే శేషేంద్ర వర్ణక్రమాలు తప్పుగా వ్రాస్తారు. 'స' వ్రాయవలసిన చోటల్లా 'శ' వ్రాస్తారు క్రియా పదాల్లో : చేశిన, కోశే, రాశిన, చదివేశిన, మోశే మొ॥

ఇతర వర్ణక్రమ దోషాలు : వెదజల్లు ( = వెదచల్లు)
రుతువు ( = ఋతువు)
రుజురేఖ ( = ఋజురేఖ)
రాస్తుంది ( = వ్రాస్తుంది) మొ॥

## మినీకవితల భాష :

1980 నుంచి 'మినీ కవిత'ను ఒక ఉద్యమంగా లేవదీయాలని కొందరు విఫలప్రయత్నం చేశారు. దీన్ని 'విప్లవం' అని కూడా అన్నారు. విప్లవం భావ సంబంధి కాని, ఛందోసంబంధి కాదు కదా! దీంట్లో రెండు మూడు పాదాలకన్న ఎక్కువ ఉండవు. ఒక్కొక్కసారి రెండు దళాలతో కూడిన ఒకే పాదం కూడా ఉంటుంది. శీర్షిక కూడా సాభిప్రాయంగా వుంటుంది. అంత్యప్రాసలు విధిగా వేస్తారు. స్వరూపాన్నిబట్టి మినీకవితను పూర్తిగా తత్సమపదాలతో నడపడం సాధ్యం కాదు. కొందరు శీర్షికలు తత్సమ పదాలతో పెడతారు, (తత్సమ పదం ఇముడ్చుకోగలిగినంత అర్థాన్ని దేశ్యపదం ఇముడ్చుకోలేదు). కొందరు అంత్యప్రాసలు తత్సమాలుగా వేసుకుంటారు. (దేశ్యపదాల్లో రైముకు పనికి వచ్చేవి కూడా తక్కువే ఉంటాయి). మొత్తం మీద మినీకవితను మిశ్రమశైలిలో నడపడానికే సాధ్యమవుతుంది. పట్టుపడితే దేశిశైలిలో కష్టపడి నడపవచ్చు. (ఆసు రాజేంద్ర వంటింటి సాహిత్యాన్ని ఇలా దేశిశైలిలో నడిపారు. మినీ కవితా రచనలో ఈయన చేయితిరిగిన కవి).

అ) మిశ్రమశైలికి ఉదాహరణాలు :

1. కంటి తెలివి

"కన్ను తెరిస్తే జననం
కన్ను మూస్తే మరణం
రెప్పపాటేగద ప్రయాణం" (- చంద్రసేన్)

దీంట్లో అంత్య ప్రాసలకు మాత్రం తత్సమ పదాలు వాడబడ్డాయి.

2) **విప్లవ వీరుడు**
ఒక అగ్గిపుల్ల
**మరణిస్తే**
**కోటి** పిడికిళ్లలో
కాగడాలు లేస్తాయి. (-ఆసు రాజేంద్ర)

ఈ కవితలో శీర్షిక, 'మరణిస్తే', 'కోటి' అనే పదాలు తత్సమాలు.

b) **దేశిశైలికి ఉదాహరణాలు :**

1) జై జైలు
పులి
మేకను చంపితే
జై జైలు.
మేక
పులిని చంపితే
జైలు.

2) కవ్వం
కితకితలు పెడితే
మజ్జిగ
పకపకా నవ్వుతుంది!

3) కాలికాలని
కట్టెలు
పొయ్యి నోట్లో
చుట్టలు (-ఆసు రాజేంద్ర)

c) **అన్యదేశ్యాలు ప్రయోగించిన శైలి :**

1) కిరోసిన్
"మందు" కొట్టిస్తేనే
స్టౌ ముఖం వెలుగుతుంది.

2) కిరోసిన్ లేని స్టవ్‌ని
పాపం
ఏ అగ్గిపుల్లా
లవ్ చేయదు. (-ఆసు రాజేంద్ర)

## నిరసన కవుల భాష :

1983 లో అబ్బూరి గోపాలకృష్ణ, అత్తలూరి నరసింహారావు, భైరవయ్య (మాజీ దిగంబర కవి), కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ-అనే నలుగురు కవులు కలిసి తమ్ము 'నిరసన కవులు'గా ప్రకటించుకొని 'నిరసన' అనే కవితా సంకలనాన్ని ప్రకటించారు. మూర్ఖత్వాన్ని, దగుల్బాజీతనాన్ని, కాలకూతల సాటు ఏమరుపాటుల్ని, కవిత్వ రుచిని చంపటాన్ని, రచయితలు రాజకీయ కార్యకర్తలుగా

మిగిలిపోవటాన్ని, పార్టీ సాహిత్యాన్ని, ఫ్యూడల్ మార్క్సిస్టుల్ని నిరసించి వీరు నిరసన కవులయ్యారు.

"ప్రగతి మా ప్రాణం
ప్రయోగం మా శరీరం
కవిత్వం మా దైవం
కవి చిరంజీవి" అని ప్రకటించుకున్నారు.

ఆధునిక కవులెవరైనా సరే ఆవేశం మిన్నుముట్టినప్పుడు, తమ భావాల్ని వ్యక్తం చెయ్యడంకోసం తత్సమపదాల్నే ఆశ్రయిస్తున్నారు. విప్లవకవులు తమ మొట్ట మొదటి సంకలనానికి "ఝంఝ" అని పేరుపెట్టడంలోనే ఈ విషయం రుజువవు తోంది-ఈ మాట తీసి ఇంక ఏ తెలుగుమాట వేసినా రసాభాసం అయిపోతుంది. అసలు అన్ని భావాల్ని వ్యక్తంచేసేశక్తి అచ్చతెలుగు భాషకి లేదనిపిస్తుంది. నిర సన కవులు వర్తమాన సాహిత్యాన్ని, సమాజాన్నీ, నిరసిస్తున్నారు కాబట్టి ఆ ఆక్రోశాన్ని వెల్లడించడంలో ఎక్కువగా మార్గశైలినే ఆశ్రయించారు:

"నగరాల, గ్రామాల ముఖాల మీద
నిశ్శబ్దాన్ని ముద్రించే యత్నం
మిట్ట మధ్యాహ్నం నక్షత్రాలను కూడా
మింగివేసే అమావాస్య చీకటి అయితేనేం
కారాగారపు కటకటాల వెనుకనుంచి
స్వేచ్ఛాసూర్యుడి అదృశ్యకిరణాల అభయహస్తం"
(—అమావాస్య చంద్రుడు)

మిశ్రశైలి, దేశిశైలి చాలా తక్కువగా ఉంది.

## అభివ్యక్తి :

ఇక అభివ్యక్తి చరిత్ర తీసుకుంటే, నన్నయ మార్గశైలిలో ప్రసన్న కథాకలితార్థయుక్తితో, మెత్తని సంస్కృత సమాసాలతో, అనుప్రాసలతో అక్షర రమ్యతను సాధించి, శ్రోతల హృదయాలను ఆకర్షిస్తాడు. తిక్కన దేశి శైలితో, నాటకీయ చిత్రణతో, సంఘటనలతో శ్రోతల బుద్ధిని ఆలోచింపజేసి, వికసింపజేస్తాడు. పెద్దనాదులు కథా ప్రాధాన్యాన్ని తగ్గించి వర్ణనా చమత్కారాలను పెంచారు. భావకవులు శబ్దార్థాలకన్నా భావాన్ని రమ్యంగా ఆవిష్కరించడంలో

కృతకృత్యులయ్యారు. వీరి భాష, ఛందస్సు మాత్రం పాతవే. అయినా వీళ్ళు హృదయవాదులు కావడం వల్ల ప్రజల్ని ఆకర్షించారు. అభ్యుదయ కవులు తిక్కన ధోరణిలో బుద్ధిగమ్యంగా రచనలు చేశారు. కాని, శ్రీశ్రీ అభివ్యక్తిలో ఎక్కువగా ప్రాచీన పురాణ ప్రతీకలనే వాడాడు. ఒక్క పతాధి మాత్రం అభివ్యక్తిలో చాలా నూతనత్వాన్ని ప్రదర్శించాడు. ఆరుద్ర ఈయన్ని అన్ని విధాలా అనుకరించాడు. కుందుర్తి మధ్యతరగతి జీవితంలోంచి కొన్ని అలంకారాలనూ, భావ చిత్రాలనూ, అనుభూతులనూ గ్రహించాడు. తిలక్ భావ కవుల ధోరణిలోనే అభ్యుదయ కవిత్వం చెప్పాడు. దిగంబర కవులు వర్తమాన సమాజంలోని లోపాలను చూసి ఆక్రోశం చెంది, దానికి అనుగుణంగా తిట్లు తిట్టారు. వీరి అభివ్యక్తి నూతనమైనదే కాని, నిందాత్మకమై జుగుప్సావహంగా ఉంటుంది. తెలుగు కవిత్వంలో ప్రతీకలు, భావ చిత్రాలు వీరితోనే అధికమయ్యాయి. విప్లవ కవులు శ్రీశ్రీ మార్గంలోనే ప్రాచీనాభివ్యక్తినే పాటించారు. గద్దర్‌లాంటి కవులు ఆశు కవులు కావడంతో సహజోక్తులతో ప్రజల నుడికారంతో అభివ్యక్తిని చూపారు. చేతనావర్తం కవులు, అనుభూతి కవులు, భావ కవులలోని మార్మికాంశాన్ని (మిస్టిసిజమ్) గ్రహించి, కవిత్వంలో తాత్త్వికాంశాన్ని పెంచుతూ, తమ అనుభూతుల్ని స్పష్టాస్పష్టంగా ఆవిష్కరించారు. వీరిలో కొందరిది ట్రాన్స్‌పరెంటు చీకటి అయితే మరికొందరిది చిమ్మచీకటి! శేషేంద్రలో 1975 వరకూ ప్రాచీనాభివ్యక్తే కనబడుతుంది. ఆ తర్వాత అది పరిపక్వమై నూతనాభివ్యక్తి, చమత్కారం, నూతన కల్పనలు, ఆధునిక జీవితానికి సంబంధించిన ప్రతీకలు, ఆంగ్ల పదాలతో, హిందూస్తానీ పదాలతో కూడిన విచిత్ర శైలి చోటు చేసుకున్నాయి. ఆధునిక కవిత్వాభివ్యక్తి అంతా నూటికి తొంభై పాళ్లు రూపకాలంకారంతోనే జరుగుతుంది. తరవాత ఎక్కువగా వాడబడేది ఉపమాలంకారం. శేషేంద్ర వచ్చేవరకూ నూతనాభివ్యక్తి రాలేదనే చెప్పాలి. ఈ శతాబ్దిలో యువతరాన్ని ప్రభావితం చేసిన కవులు ముగ్గురే: శ్రీశ్రీ, తిలక్, శేషేంద్ర.

## ఆధునిక భాషాశైలి-నన్నయ ప్రభావం

నన్నయ తెలుగు కవులకు ఒక భాషాశైలిని తీర్చిదిద్ది ప్రసాదించాడు. తన కాలంనాటి శాసనభాషను పరిశీలించాడు. ప్రజా వ్యవహారంలో ఉన్న తెలుగు పదాలు తీసుకున్నాడు. ఆ పదజాలం తక్కువగా ఉంది. అప్పటి రాజభాష, సాంస్కృతిక భాష సంస్కృతం. అందువల్ల సంస్కృతపదాలు విరివిగా స్వీకరించాడు. అందులోనూ కఠినమైన పదాలు కాకుండా, మెత్తని శబ్దాలూ, తెనుగు

పదాలేమో అని భ్రాంతిగొలిపే సంస్కృత పదాలూ గ్రహించాడు. అక్షర రమ్యతమీద దృష్టి ఉంచాడు. సామాన్యుడు కూడా వినగానే, అర్థం తెలియక పోయినా ఆనందించే సంగీతంలాంటి శైలిని సాధించాడు. 11 వ శతాబ్దంలో నన్నయ ఏర్పరచిన ఆ శైలి, 20 వ శతాబ్ది నాల్గవ పాదంలోని శేషేంద్రదాకా కొనసాగుతూనే ఉంది. దానినుంచి బయటపడాలని ప్రయత్నించిన ఏ కవీ ఇంత వరకూ కృతకృత్యుడు కాలేదు. అంత సహజమైన, -అక్షర రమ్యమైన, పండిత పామరజనరంజకమైన భాషా శైలిని సృష్టించిన నన్నయ నిజంగా వాగను శాసనుడే!

నన్నయ ప్రారంభించిన మార్గశైలి తెలుగు కవుల్లో ఎంతగా జీర్ణించుకు పోయిందంటే, దేశిశైలి ప్రయోగిస్తే, కొన్ని సందర్భాల్లో కవిత ఉదాత్తతను కోల్పోయి, పేలవంగా హేయంగా అయిపోయేటంతగా జీర్ణించుకుపోయింది. తిక్కన దేశిశైలి ఈనాడు మనకు ఠిక్కుఠిక్కుగా కృతకంగా కనబడటం దీని వల్లనే. 'జ్ఞానం' అనేమాటే తెలుగు భాషకి సహజం కాని, 'ఎఱుక' ఎంతో అసహజం. నేటి విప్లవ కవులకు కూడా 'యుద్ధం, విప్లవం, ఉద్యమం, యోధుడు, వీరుడు' అనే పదాలు చాలా సహజమైన పరిచయమైన శబ్దాలు. ఇవి తత్సమ శబ్దాలుగా అనిపించవు. వీటికి బదులుగా 'పోరు, జగడం, పూనిక, జోదు, మొనగాడు' అనే అచ్చ తెలుగుపదాలు వాడితే, అవి ఏవో పాతకాలపు గ్రాంథిక పదాలుగా భాసిస్తాయి. 'పాదాలు' 'హస్తాలు' అనే మాటలు కవిత్వంలో ఎంతో ఉదాత్తతను కలిగిస్తాయి. 'కాళ్లు' 'చేతులు' అని ప్రయోగిస్తే నీచంగా ధ్వనిస్తాయి-కవిత్వ భాషలో. 'అర్ధరాత్రి' అనే తత్సమ పదమే తెలుగువాళ్ళకి సహజమైన పదం. 'అర్ధమరేయి' 'నడిరేయి' అనే మాటలు కృతకాలు.

కన్నడంలో పరిస్థితి దీనికి వ్యతిరేకంగా ఉంది. కన్నడ ఆధునిక కవులు సాధ్యమైనంతవరకూ అచ్చ కన్నడ పదాలనే వాడుతారు. సహజంగా వచ్చే తత్సమ పదాలను ప్రయత్నపూర్వకంగా పరిహరిస్తారు. ఇది వారిలో ఉన్న ఒక భాషోన్మాదం. (ఇక్కడ బేంద్రేలాంటి మహాకవులు కూడా జానపద శైలిని వరించి అందులో కవితల్లల్లారు. మన శేషేంద్రలాంటి ప్రతిభావంతులైన కవులకు జానపద శైలి అంటే పరమ అసహ్యం!). మనం తత్సమ శబ్దాలను పరిహరించక పోవడంవల్ల మన భాష ఇప్పటికీ మధురమైన భాషగా నిలిచివుంది. తెలుగు భాషకు మాధుర్యం సంస్కృతంతో చక్కగా కలవడం వల్లనే వచ్చింది. ఈ మేళవింపు 11 వ శతాబ్దిలోనే నన్నయ చేశాడు. అది ఇప్పటికీ కవులకు శిరోధార్యమై వర్ధిల్లుతోంది!

# ఆధునిక కవుల వైచిత్రి

ఎం. కులశేఖరరావు

తెలుగు సాహిత్యంలోని ఆధునిక యుగంలో, అభ్యుదయ కవిత్వం వ్రాసే వారి సంఖ్య తగ్గిన తరువాత, గడచిన పదిహేను ఇరవై సంవత్సరాలుగా, తెలుగు కవులు చాల రకాల కవితలను చేపట్టి వెలయించినారు. ఈ కవితలను విమర్శకులు విప్లవ కవితలని, అనుభూతి కవితలని, మినీకవితలని, వచనగేయా లని, ఇంకెన్నో పేర్లతో వ్యవహరిస్తున్నారు. ఈనాడు పరిస్థితి ఎట్లాఉన్నదీ అంటే, ఒక కవిని మనం, పూర్వం, ఒకర్ని భావకవిగా, మరొకర్ని అభ్యుదయకవిగా, పేర్కొన్న విధంగా, ఈ కవులను ఒక నిర్దిష్టమైన విభాగంలో కూర్చోబెట్టి వారికి నామకరణం చేయలేము. ఈనాటి సంక్లిష్ట సాంఘిక వాతావరణంలో ఉన్న కవి, అనేక విధాలైన ప్రభావాలకు లోనౌతున్నాడు. అనేక సంఘటనలచేత - అవి జాతీయం కావచ్చు,అంతర్జాతీయం కావచ్చు-ప్రభావితుడై దానికి స్పందిస్తున్నాడు. అతని హృదయం ఆయా పరిస్థితులకు లోనై చలించగా, కవిత్వరూపాన అతని వాక్కులు బహిర్గతం అవుతున్నాయి. ఇటువంటి స్థితిలో ఒక కవి, ఒకేరకమైన కవిత్వం వ్రాయాలనే కమిట్‌మెంటు చేసుకున్నట్లుగా కాన్పించదు. సామయికమైన స్థితిగతులకు అనుగుణంగానే వీరిలో కలిగిన సంచలనం, వారి కవితలకు ప్రేరణ కాగా, నిత్యనూతనమైన కవిత్వం ఆవిర్భవిస్తున్నది. అందుచేత ఈనాడు తెలుగులో ఎన్నడూలేని వైవిధ్యం కవితలో దర్శనీయం కావడం ఒక విశేషంగా చెప్పవచ్చు.

ఈనాటి కవుల్లో (కవయిత్రుల్లోకూడ) చాలమంది వచన కవిత్వాన్నే, తమ వాహికగా స్వీకరిస్తున్నారు. అప్రయత్నంగా వచ్చే భావాలను (Spontaneous ideas) చక్కగా వచనంలో రూపొందించవచ్చును అని వారిలో చాలమంది భావిస్తున్నట్లు కనిపిస్తుంది. అయినా, పద్య, మాత్రాచ్ఛందస్సులకు ఉండే శిల్ప లక్షణం దీనికి కూడ ఉంటుందని కొందరికి తెలుసు. స్వరూపంలో చాల చిన్నదిగా

ఉండే ప్రక్రియకు కొంతమంది గ్రహిస్తున్నారు. కొందరు కవులు మాత్రా చ్ఛందస్సును, పద్యరచనను వాహికలుగా చేసికొని ఆధునితను పదర్శిస్తున్నారు. అందుచేత స్వభావంలో, నేటికవిత ఎంతటి వైవిధ్యాన్ని ప్రదర్శిస్తున్నదో స్వరూపంలోను అంతటి విభిన్నత్వాన్ని కలిగి ఉన్నది.

సమకాలీన సమాజం, దానిలో జరుగుతున్న అన్యాయాలు, అక్రమాలు, ఈ కవుల్లో చాలా మందికి కవితా వస్తువు లవుతున్నాయి. ఎక్కడ ఏ అక్రమం జరిగినా, ఈనాటి కవులు, ముఖ్యంగా యువకవులు స్పందించి కవిత్వాన్ని తమ సాధనంగా పట్టుకొంటున్నారు. ఈ విధంగా చూస్తే, ఈనాటి కవులందరికీ సమ కాలీన సమాజమే సాముగరిడీలకు రంగంగా ఉన్నది. అందుచేత, ఈ కవు లంతా చక్కని సామాజికస్పృహ ఉన్నవారు అని నిస్సందేహంగా చెప్పవచ్చు.

పద్యం వ్రాసినా, మాత్రాచ్ఛందస్సును గ్రహించినా, శబ్దగతమైన చమత్కారం చేసి పాఠకులను ఆకర్షించే ఒక సౌలభ్యం ఆ కవులకు ఉంటుంది. కాని, వచన కవిత్వం వ్రాస్తున్నవారికి ఇది మృగ్యమనే చెప్పాలె. భావగతమైన చమత్కారమే. కాని, శాబ్దిక చమత్కారం వారికి పట్టుపడదు. అందుచేత ఈ కవు, లందరు సామాన్యంగా, వైచిత్రిని ఆలంబనంగా చేసికొంటువ్నారు, వ్యంగాన్ని సాధించడానికిన్నీ, వారికి వైచిత్రియే సాధనంగా ఉంటుంది. వైచిత్రి అనే దాని స్వరూప స్వభావాలు తెలిసికొంటే, దాన్ని, ఈ నాటి కవులు ఏ విధంగా ఉపయో గించుకొంటున్నారో వివరించడం తేలిక అవుతుంది.

వైచిత్ర, వైచిత్ర్య, అనే పదాలకు రూపాంతరం వైచిత్రి. ఈ పదానికి మోనియర్ విలియమ్స్ పండితుడు తన సంస్కృతం - ఆంగ్లం - నిఘంటువులో **wonderfulness, marvellous beauty, veriety**అనే అర్థాలను వ్రాసినాడు. ఇటువంటి శబ్దకోశాన్నే కూర్చిన ఎ.ప్. ఆప్టేమహాశయుడు కూడ ఇవే అర్థాలతో ఏకీభవించినాడు. దిగ్భ్రాంతిని కలిగించేది, అపురూపమైంది, పరమ సుందరంగా భాసించేది, వైవిధ్యాన్ని ఇంపుగా ప్రదర్శించేది వైచిత్రి అవుతుందని మనం స్థూలంగా భావించవచ్చు. కావ్యాన్ని చదివే పాఠకులకు కవులు అనేక విధాలుగా ఈ భావాన్ని కలిగించవచ్చు కథన శిల్పంలో, శాబ్దిక విన్యాసంలో, ఉపమాన గ్రహణంలో, అలంకార ప్రయోగంలో, ఇంకా ఇటువంటి యితర సందర్భాల్లో

ప్రజ్ఞావంతులైన కవులు వైచిత్రిని ప్రదర్శించే అవకాశం ఉన్నది. ఈనాడు కవిత్వం వ్రాస్తున్నవారు ఈ మార్గంలో ఏ విధంగా అనుగమించినారో పరిశీలిం రాము.

సి. నారాయణరెడ్డి ఓటర్లను గురించి ఒక వచన కవిత వ్రాసినాడు.[1] ప్రజాస్వామ్యంలో ఓటర్లు కాకపోతే ఇంకేమి ఉంటుంది? ఆ విషయాన్ని చెబుతూ,

'అమాయకులు కారు ఓటర్లు
అచ్చమైన న్యాయానికి బరామీటర్లు
అప్పుడప్పుడు వాళ్లు అన్నలను మింగిన తమ్ముళ్లు
అమ్మలను మించిన కూతుళ్లు'

ఈ మాటల్లో ఓటర్ల శక్తి ఎటువంటిదో చాల శక్తిమంతంగా కవి స్పష్టం చేసినాడు. వారిని బరామీటర్లతో పోల్చడం ఉపమాన వైచిత్రి. ఈ ఉపమానం చూసినప్పుడు పాఠకునిలో క్షణకాలం దిగ్భ్రాంతి కలుగకుండా ఉండదు. వాళ్లను గురించే చెబుతూ, 'అన్నలను మింగిన తమ్ముళ్లు - అమ్మను మించిన కూతుళ్లు' అనేటప్పటికి అన్న-అమ్మ అనే శాబ్దికమైన వైచిత్రితో పాటు ఆ పదాల్లో ఉన్న వ్యంగ్యార్థాలు స్ఫురించి, పాఠకుణ్ని ఊహాలోకాల్లోనికి లాగుకొనిపోయి 'ఓహో' అనిపిస్తాయి. ఈ కవే ఇంకొక ఖండికలో[2]

'ఇంటికప్పుమీద వాగి
ఎంగిలాకులమీద వాలి
నానా రభస చేసే కాకీ!
కోటి జన్మలెత్తినా నువ్వు
కోకిలవు కాలేవు'

కాకి, కోకిల అనే రెండు ప్రతీకలను గ్రహించి వైచిత్రిని ప్రదర్శించినాడు. స్వాతిశయాన్ని గొంతెత్తి అరచి చెప్పేవాడు, ఎక్కడ ఏమి దొరుకుతుందో అనే దురాశతో ఇతరులను ఆశ్రయించేవాడు నీచస్వభావం కలవాడు. ఇతరులకు

1. కాలం అంచుమీద- p. 47.
2. కాకీ కాకీ కలవరకాకీ-కాలం అంచుమీద- p. 43.

కనిపించకుండా గుప్తదానాలు చేసేవాడు, స్వాతిశయం లేకుండా మంచిమాటలు పలికేవాడు సజ్జనుడు, మొదటిరకం వాడికి కాకి, రెండోరకం వాడికి కోకిల వ్యంగ్యంగా గ్రహించిన ఉపమానాలు. కాకి ఏనాటికి కోకిల కానట్టే దుర్జనుడు సజ్జనుడుగా మార్పుచెందే అవకాశం లేదనే భావం, దాని ప్రాణం ఇదే రీతిలోని ధ్వనిగర్భితమైన వైచిత్రి. 'నిత్యదుఃఖిత' అనే ఖండికలో నాయని కృష్ణకుమారి ఇటువంటి వైచిత్రిని ప్రదర్శించినారు.[3] రత్నగర్భగా, హిమాలయాలను మణికిరీటంగా, కాశ్మీరం కస్తూరి రేఖగా, గంగా యమునలు కంఠ హారాలుగా భాసించిన మనదేశం ఇప్పుడు ఎట్లా ఉందో ఈ మాటల్లో చెబుతున్నారు:

'చుట్టూ గంపెడు పిల్లల్ని చేర్చుకొని,
చెరొక ముద్దా
చేతికందించలేని
అరిపేద అమ్మలాగా
ఉంటుంది.
బొల్లిగద్దల చూపులేవీ
పిల్లలమీద పడకుండా
రెక్కలు చాచిన
తల్లి కోడిలా
తల్లడిల్లుతూ వస్తుంది.'

ఈ పదాలు చూచినప్పుడు దేశదౌర్భాగ్య స్థితిని చెప్పడానికి, వాస్తవానికి సన్నిహితంగా ఉండే ఉపమానాలను కవయిత్రి గ్రహించినారనిపిస్తుంది. కాని, అంతటితో ఆమె దాన్ని ముగించలేదు.

'ఆవిడ గుండెల్లో
ఉండీలేనట్లు కునుకుతున్న
ఆశల చితుల త్తిని
ఎగసన తొయ్యాలనుకొంటాను

3. అగ్నిపుత్రి - P. 31, 32.

ఆవిడ ముఖాన వెలుగుకోసం
నేనే
కర్పూరంలా కరిగిపోతూ
ఎర్రగా మండాలనుకొంటాను.'

ఈ శబ్దాల్లో దేశం మీద కవయిత్రికి ఉండే గాఢమైన అభిమానమే కాక, ఏదైనా ఎంతటి సాహసకార్యమైనా చేసి దాని దీనస్థితిని తొలగించాలనే ఆకాంక్ష ఎంత శక్తిమంతమైందో వ్యక్తం అవుతుంది. 'కర్పూరంలా కరిగి' పోవడం, 'ఎర్రగా మండాల'నుకోవడంలోని వైచిత్రి, ధ్వని, చదివేవాళ్ల ఆలోచన అగాథాల్లోనికి లాక్కొని పోతాయి.

ఈనాటి కవులు ఎంత కాదన్నా, ఏదో సందర్భంలో మానవుల మధ్య ఉండే పరస్పర ప్రేమ వారి కవితా వస్తువుగా పరిణమిస్తూనే ఉన్నది. ఇదే కవయిత్రి ఒక చోట-

'సన్నజాజులు
కలకలా విరిసే సమయం
నిన్ను కూడా మేల్కొలపలేదా?
ఆర్ద్రతాపాటూ, ప్రేమా
అన్నీ నీకోసమే చూస్తున్నాయి
పైన నల్లగా గాఢంగా
ఆకాశంలో మబ్బులు
బలంగా వియోగంతో అరిచే
నీటి పిట్టల బొబ్బలు
నా గుండెల్లో గూడుకట్టుకున్న
నాశంలేని ప్రేమ
..................
ఇంతకూ ఎక్కడ ఉన్నావు నువ్వు?
వానాకాలపు కమ్మని
తొలివాటి చుక్కవైన నువ్వు!'

ఈ పంక్తుల్లో ఆమె మనస్సులోని పొరలను స్పందింప జేసిన ప్రేమ భావం ఎంత స్పష్టంగా కనిపించిందో చూడవలసిందే. గుంటూరు శేషేంద్రశర్మ కవిత్వం కూడ ఒక్కొక్కసారి ఈ విధంగానే ప్రయాణిస్తుంది.

'కొబ్బరి మట్టల్లో కురిసిన వెన్నెల ఇంకా బొట్లు బొట్లుగా
కారుతూనే ఉంది
రాత్రి మనం కలిసి పాడినపాటలు ఇంకా పొదల్ని వదల్లేదు
కొమ్మల్నించి నేలకు రాలిన పువ్వులు కొమ్మల్లోకి తిరిగిపోనేలేదు'

వెన్నెల, మంచు, కొబ్బరిమట్టలు, రాలిన పూలు, పాడిన పాటలు ఈ ప్రతీకలు ప్రణయాన్ని, ప్రేమను వ్యక్తం చేస్తున్నాయని ప్రత్యేకంగా చెప్పపనిలేదు. ఇంత మాత్రంచేత వీరు ప్రణయ కవులు అయిపోయారనే భావం కాదు. కవి హృదయం స్పందించినప్పుడు, కవితాత్మలో లీనమైనప్పుడు, ఇటువంటి కవిత వెలువడడం అసహజమేమీ కాదు.

శేషేంద్రశర్మ వైచిత్రిని ప్రదర్శించి, చక్కని భావాలను చెప్పడంలో మంచి నేర్పు కలిగినవారు.

'అక్టోబరులో నేను పుట్టాను
అక్టోబరులోనే విప్లవం పుట్టింది
అందుకే నేనంటే భయపడుతుంది
తిమిరం
రష్యా కాదు; చైనా కాదు
విప్లవం మాత్రం అజరామరం'

విప్లవం అంటే కవికి అభిమానం. దాన్నిగురించి, ఆత్మాశ్రయంగా చెప్పడమే దీనిలోని ఉక్తి వైచిత్రి. విప్లవానికి 'అక్టోబరు' అనే ప్రతీకను పెట్టుకొని, దానికి తన సుముఖత్వాన్ని వెల్లడించినారు. ఇంకొకచోట తనలోని విప్లవభావాన్ని ఇట్లా తెలుపుతున్నారు:

నీ కెందు కింత అశాంతి; నీ కెందు కింత ఆవేశం? అంటే ఏంచెప్పను?
సముద్రాన్ని అడుగు నీ కెందు కింత అశాంతి అని.
ఝంఝామారుతాన్ని అడుగు నీ కెందు కింత ఆవేశం? అని.'

దేశాన్ని చూచి, దాని దౌర్భాగ్యాన్ని చూచి, నిశితమైన దృష్టి ఉన్న కవి నేడు అశాంతికి పాల్పడక ఉండలేడు. ఈ విషయాన్ని చెప్పడానికి సముద్రాన్ని, ఝంఝామారుతాన్ని ఉపమానప్రతీకలుగా గ్రహించినాడు. ఇవి నూతనత్వాన్ని ప్రదర్శించి వైచిత్రిని కలిగిస్తున్నాయి. ఇటువంటి వైచిత్రి మరొకచోట కనిపిస్తుంది. చూడండి:

'మీరు పలకా పుస్తకాలు పట్టుకొని పోతుంటే బాబూ!
మీరు ఓలువలు మోసుకుపోతున్న బాల క్రైస్తుల్లా కనిపిస్తారు.'

దేశంలో విద్యావిధానాన్ని, దాని పతనావస్థను, దాన్ని అనుసరిస్తున్న పసివాళ్ల స్థితిగతుల్ని ఇంతకన్నా విభ్రాంతి కలిగించేవిధంగా చెప్పడం సాధ్యమా? సమాజంలో ఒక సగటు మనిషి జీవితాన్ని చిత్రించడానికి, 'గోపి' సైకిల్ గీతం అనే ఖండిక వ్రాసినారు.[4] డబ్బును ఖర్చుచేసే శక్తిలేక, వాహనాల్లో తిరుగలేక, ఈ సామాజికుడు సైకిలు సంపాయించుకొన్నాడు. ఎక్కడికి వెళ్లినా అది అతనికి సాహచర్యం చేసింది.

'దాన్ని నడుపుతూ నలువైపులా వెదజల్లాను స్వప్నాలు
ఏడ్వలేక నే పాడుతున్న గీతాలకు
అపశ్రుతులు పాడాయి దీని చక్రాలు'

ఎన్నటికైనా సుఖసంతోషాలు కలుగుతాయేమోనన్న సామాన్య మానవుడి ఆశ 'స్వప్నాలు వెదజల్లడం'; కష్టాలన్నీ సహించి తన దైన్యాన్ని చెప్పుకోలేక పోవడమే 'ఏడ్వలేక పాడుతున్న గీతం'. పాతబడిన చక్రాలు తిరుగుతూ ఉంటే చేసే చప్పుడు ఈ బీదవాని పాటలాగా ఉన్నది అనడంలో వైచిత్రి కనిపించి వ్యంగ్య విలసితమైన భావం తొంగిచూస్తూ ఉన్నది. ఈ సైకిల్ సాహచర్యంలో

4. మైలురాయి - ఎన్. గోపి - p. 10.

మధుర జ్ఞాపకాలు కూడ ఉన్నాయి. అవి 'గుడిసె హోటల్లో టీపి మజిలీలు' అక్కడ టీ ఇచ్చే ఆడపిల్ల ఈతనికి మధుర స్మృతి. దాన్ని ఇట్లా అన్నాడు:

'ఈ జీవితం ముడుపు కడతాను
ఆమె చేతిలో ఇచ్చిన చాయ
అంతే! ఇప్పటికీ అదో మాయ'

ఈ సంఘటన క్షణకాలంలో ముగిసింది కాబట్టి 'అదోమాయ' అట. ఇన్ని అను భవాలను కలిగించిన తన వాహనాన్ని గురించి ఈ కవి అభిప్రాయం వింటే కలిగేది ఆనందమో విషాదమో చెప్పలేని ఒక అనుభూతి.

'నా సైకిలు జ్ఞాపకాల ఖని
పంచకళ్యాణి'

'నాలో ప్రవహిస్తోంది నది' అనే పేరుతోను, అదే మకుటంతోను మూది రాజు రంగారావు ఒక దీర్ఘవచన (కవితా) కావ్యం వ్రాసినాడు. నదిని మానవ జీవితంలోని చైతన్యానికి ప్రతీకగా చేసికొన్నాడు. అతని జీవితంలో జరుగుతున్న అనేక విశేషాలను కావ్యవస్తువుగా మలచుకొన్నాడు. ఈ సంఘటనలు వ్యక్తంగా ఉండేవి. చాలచోట్ల అవ్యక్తంగాను సుప్తంగాను ఉండేవి. ఈ అవ్యక్తమైన విషయా లను చెప్పినప్పుడు, రవంత అస్పష్టత ఏర్పడినప్పటికి, పాఠకుణ్ణి ఆలోచనా తరంగాలలోనికి లాక్కొని పోతుంది కవిత.

'ఎన్ని యుగాలైనా పాతపడని ఉదయంవలె
ఎన్ని తరాలైనా మాసిపోని త్యాగంవలె.'

నదీ ప్రవాహాన్ని చెప్పడంలో ఎంతటి ఉపమాన వైచిత్రి ఉన్నదో కొట్టవచ్చి నట్లుగా కనిపిస్తుంది.

'బిందువుల మర్షణలో విద్యుదగ్ని ప్రభవిస్తూ
తరంగాల పోరాటంలో పరివర్తన కాంక్షిస్తూ'

కవితలో నది ప్రవహిస్తుందనడంలో, నేటి సమాజంలో ఉండే విద్యుత్తువంటి చంచలనం, దానివలన ఈనాటి సమాజం కోరుకొంటున్న మార్పు ఎదుటకు దూకి నట్లుగా కనిపిస్తాయి. అన్నిటికి మించి, సమాజంలోని ఉద్వేగం, ప్రవాహ సదృశంగా ఉన్నదనడంలో నూతనత్వం గోచరిస్తుంది.

ఈ పది, పదిహేను సంవత్సరాలుగా వచ్చిన కవితలో, వచన కవిత్వం వ్రాసిన వారికే సాంఘిక స్పృహ ఉన్నదని, పద్యాలు, ఛందోబద్ధంగా వ్రాసేవారు ఇంకా ఊహాలోకాల్లో విహరిస్తున్నారని చాలమంది భావించడం ఉన్నది. కాని, దీనిలో పూర్తి యథార్థం ఉన్నట్లు కన్పించదు. ఉత్పల సత్యనారాయణాచార్యులు పద్య కవిత్వం చక్కగా వ్రాయడమే కాక, బాగా చదవడంలోను నేర్పు ఉన్నవాడు. 'స్వప్నాలయప్పటి' అనే కథాకావ్యంలో ఒక సన్నివేశం ఉన్నది. దానిలో మన సమాజంలో దిక్కులేనివాళ్లు అనుభవిస్తున్న బాధలను కవి చక్కగా చెప్పినాడు. ఒక ఉదాహరణ చూడవలసిందే.

'అక్కడ చెత్తకుండికడ
ఆదిమవాసి కుటుంబమంతయున్
కుక్కల పారద్రోలి తమకున్
లభియించిన యెంగిలాకులన్
మక్కువ నారగించుచు అ
నారత మీ మహరాజు నింటిలో
అక్కరలిట్టె కల్గవలె
నంచు శుభం బెద గోరుచుండగన్.'

ఈ శబ్దచిత్రం చూస్తే కళ్లు చెమ్మగిల్లకుండా ఉండవు. ధనికుల ఇంటికి ఆనుకొని ఉన్న చెత్తకుండి దృశ్యం. వారు తినగా పారవేసిన వస్తువులను ఒక బీద కుటుంబం తినే సంఘటన. 'అనారత మీ మహరాజు నింటిలో అక్కరలిట్టె కల్గవలె' అని ఆ బీదకుటుంబంవారు అనుకోవడం వారు ఎంతటి హీనస్థితిలో ఉన్నారనే మాటను వ్యక్తం చేయడమే కాక, వారు ఆ ధనికులను దీవిస్తున్నారా, నిందిస్తున్నారా అనే మాటకూడ మనకు తెలియనీయని ఒక నిశ్చేష్టితమైన స్థితి మనస్సును ఆవరిస్తుంది. ఈ వాక్యమే ఈ పద్యానికి ప్రాణసదృశమైందని నేను చెప్పనక్కరలే దనుకొంటాను.

వచనంలోను, ఛందస్సులోను కాక, మాత్రాచ్ఛందస్సులో కూడ ఈ కాలంలో చాల కవితలే వచ్చాయి. నేను ఒక చోట-

'అరస మెందు? విరస మెందుకు
అసలు కవులకు సంఘమెందుకు?

సరసమైన కవిత చాలదే?
సార సాఽహా, శ్రీనివాసా!'

లనే ముక్తకం వ్రాసినాను.5 దీనిలో అరసం, విరసం అనే మాటల్లోని వివిధార్థాల్లో ఉండే వైచిత్రిని ప్రదర్శించడం కనిపిస్తుంది. 'అసలు కవులకు సంఘ మెందుకు?' అనడంలో కూడ అసలు అనే మాట ఊత పదమా, లేక యదార్థమైన కవులు అనే అర్థమా అనే భావంలోనికి తీసుక వెళ్ళుతుంది. ఇటువంటి భావ చిత్రాలు ఈనాడు మినీకవితల్లో చాలమంది కవులు చేస్తున్నారు.

ఇక్కడ ఒకమాట చెప్పి ముగిస్తాను. కవులు కథాకావ్యాలు వ్రాసినా, ఖండకావ్యాలు వ్రాసినా వాటికి సార్వజనీనత, సార్వకాలీనత అనే లక్షణాలు ఉండడం సదా వాంఛనీయమే. కానీ, ఈనాటి వచన కవిత వ్రాసే కవులయితేనేమి, యితరులైతేనేమి, సమాజంలో తమ ఎదుట ఏ అసంబద్ధ విషయం కనిపించినా; దాని ప్రతిక్రియగా కవిత్వం వ్రాస్తున్నారు. సమాజంలో జరుగుతున్న సంఘటనలకు శాశ్వతమైన స్థితిలేకపోవడంచేతను, వాటికి లోకం అంతటితోను సంబంధం అంతంత మాత్రంగా ఉండడం చేతను, వాటిపై వెలువడిన ఈ కవితలు పై లక్షణాలను సంతరించుకొనలేకపోతున్నాయి. అంతమాత్రంచేత ఈ కవితలకు సామాజిక ప్రయోజనం లేదని అనడం సాహసమే అవుతుంది. సమకాలీన ప్రజలను ఇవి కదిలించే ప్రయోజనాన్ని సాధిస్తున్నవి కాబట్టి వీటి ప్రయోజనం నెరవేరినట్లే.

పరిమిత పరిధిలో, ఈ కవితల్లోని వైచిత్రిని దృష్టిలో పెట్టుకొని వ్రాసిన వ్యాసం కాబట్టి, దీనిలో అనేక యితర విషయాలు చర్చింపబడే అవకాశం కాక పోయింది.

ఈనాడు చాలమంది కవులు అనేక విధాలైన కవితలు వెలయిస్తున్నారు. ఇవి ప్రతినిత్యం పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్నవి. ఇపుడు నేను పరిశీలించిన కవితలు వీటిలో అణుమాత్రమే. విశేషమేమంటే, వైచిత్రిలాంటి చిన్న కవితా గుణాలు కూడ లేని ఖండికలు ఇపుడు అనంతంగా ఉన్నాయి. వాటిని మనం విమర్శించడం కష్టమే. కారణమేమంటే, విశృంఖలంగా నినాదప్రాయంగా ఇది ఉండడం చేత వీటిని మనం ఏ పరిధిలోనికి గ్రహించలేము. ఈ కవితలు వాటి విలువను కాలమే నిర్ణయించాలి.

---

5. శ్రీనివాసశతి.

# అభ్యుదయ యుగానంతర కవిత్వంలో మనిషి

ఆర్వీయస్. సుందరం

కాల్పనికవాదం, అభ్యుదయవాదం, హేతువాదం, అస్తిత్వవాదం, విప్లవ వాదం, మానవతావాదం మొదలైనవి ఆధునిక తెలుగు సాహిత్యం మీద ఎంత వరకు ప్రభావాన్ని చూపాయి అన్న విషయాన్నిగూర్చి కొంతమంది పరిశీలిం చారు. ఈ వాదాలన్నిటికీ ఏదో ఒక రకమైన సంబంధం ఉంది తీరుతుంది. ఇవన్నీ ప్రత్యక్షంగానో పరోక్షంగానో సమాజంలో మనిషి స్థానాన్ని నిర్ణయించేవే. వాదాల జోలికి పోకుండా, అభ్యుదయ యుగానంతర తెలుగు కవిత్వంలో మనిషికి ఎలాంటి స్థానం లభించిందో పరిశీలించడం ప్రస్తుతం వ్యాసోద్దేశం.

సాహిత్యంలో మనిషి కాక మాను ఉంటుందా అని ప్రశ్నించవచ్చు. కాని, సాహిత్యంలో మనిషి చిత్రణ ఒక్కోకాలంలో ఒక్కోవిధంగా ఉంటూ వచ్చింది అన్న విషయం మనందరికీ తెలుసు. ప్రాచీన సాహిత్యాన్నీ ఆధునిక సాహిత్యాన్నీ మానవ చిత్రణ ఆధారంగా విభజించి చూడవచ్చా అని పరిశీలించవలసి ఉంది. ప్రాచీన సాహిత్యంలో ధీరోదాత్తాది నాయకులుగా, సుగుణావగుణ ప్రతీకలైన పాత్రలుగా, మానవ ప్రకృతిని ప్రతిబింబించే పాత్రలుగా రూపొందిన మనిషి ఆధునిక కవితా రీతులకు అనుగుణంగా పొందిన మార్పేమిటని పరిశీలించవలసి ఉంది.

కాల్పనికవాదం, అభ్యుదయవాదం మొదలైనవి మనిషిని ఏ విధంగా తీర్చి దిద్దాయని పరిశీలించినపుడు ఒక్కో కాలంలో, ఒక్కో సామాజిక, సాంస్కృతిక నేపథ్యం సాహిత్యాన్ని ఏ విధంగా ప్రభావితం చేసింది అన్నది బోధపడుతుంది. వస్తు ప్రధానంగా, కథనాత్మకంగా, రసప్రధానంగా, ధ్వన్యాత్మకంగా వెలువడ్డ ప్రాచీన కావ్యాలకూ వైవిధ్యమయంగా. మానవ జీవన పరిశీలన ప్రధానంగా,

అనుభూతి ప్రధానంగా, సంక్షిప్తంగా, సరళసుందరంగా వెలువడ్డ ఆధునిక కావ్యా లకూ భేదం ఉంది. అతి దీర్ఘమైన గేయం, వచన కవిత, మినీకవితవంటి ప్రక్రియల్లోనే మనిషి స్వరూప స్వభావాలను చిత్రించాల్సిన అవసరం ఆధునిక కవి దృష్టిలో మార్పును తెచ్చింది. కొన్నిసార్లు మనిషిని చిత్రించడంలో విప్లవ వాదం, హేతువాదం వంటివి కవికి కొన్ని నిబంధనలు విధించాయి. మనిషి నిర్వచ నాన్నే నియమబద్ధం చేశాయి. మానవతావాదం వంటివి మనిషిలోని మనిషిని వెదుక్కునేట్లు చేశాయి. మతమౌఢ్యం, అణ్వాయుధాల కోసం పైపోటీ, వివిధ రాజకీయ తత్వాలు మనిషి మనుగడకే ముప్పు తెస్తున్న ఈ తరుణంలో మానవతా వాదం వంటివి తప్పనిసరి ఔతున్నాయి. ఈ విధంగా వివిధ వాదాలకు లోబడుతూ కొన్నిసార్లు, వాదాలకు అతీతంగా మరికొన్నిసార్లు ఆధునిక కవులు మనిషిని గురించి ఏ విధంగా ఆలోచించారు, అన్వేషించారు, విశ్లేషించారు, విమర్శించారు అన్నదాన్ని పరిశీలించాల్సి ఉంది.

## అభ్యుదయ యుగం వరకు

భావ కవితాయుగం, అభ్యుదయయుగం అనే రెండూ కావ్యాన్ని కథ నుంచి మానవ మనోభావాల ఆవిష్కరణకు ప్రాధాన్యమిచ్చాయి. భావకవిత్వం మనిషి భావాల లోతుల్లోకి పయనించింది. ప్రకృతి కవిత్వం, ప్రణయ కవిత్వం, దేశభక్తి కవిత్వం వంటి అన్ని రకాల కవితాభివ్యక్తుల్లో వ్యక్తి అంతరంగాన్ని అద్దంపెట్టి చూపింది.

అభ్యుదయ యుగంలో వచ్చిన పెద్ద మార్పును ఇక్కడ ప్రస్తావించవలసి ఉంది. ఎందుకంటే, తెలుగు కవిత్వంలో మనిషిని గూర్చిన అభిప్రాయాన్ని అభ్యుదయ యుగంలోనే ఒక నిర్దిష్టపథం వైపు మళ్ళించడం జరిగింది. సాహిత్యం ఎందుకు, ఎవరికి అని ప్రశ్నవేసుకున్న అభ్యుదయకవి ప్రజలంటే ఎవరు అనే ప్రశ్నకుకూడా సమాధానం చెప్పడానికి ప్రయత్నించాడు. ఆర్థిక పరంగా సామాజిక పరంగా ఇరువర్గాలవా రుంటారని విప్పి చెప్పాడు. ప్రజలు వేరు ప్రజా శత్రువులు వేరు అన్నాడు. ప్రజాశక్తిని గురించి చెప్తూ "ఇన్ని యుగాలుగా అణచిపెట్టబడిన ఈ శక్తి ఇప్పుడు విజృంభిస్తోంది. బలప్రయోగం వల్లగాని, మాయోపాయంవల్లగాని ఎవ్వరూ దీనిని అరికట్టలేరు. ఈ శక్తిని

ఉద్దీపింపజేసే రచనలు సాగించడమే సాహిత్యపరుల కర్తవ్యం" (శ్రీశ్రీ, వ్యాస క్రీడలు, పు. 11) అని నిర్దేశించడం జరిగింది.

## అభ్యుదయ యుగానంతరం

తిలక్‌ను వచన కవితాయుగకర్తగా, సమన్వయ కవిగా, అభ్యుదయ భావాలున్న భావకవిగా, సకల జగన్మిత్రుడైన ప్రజాకవిగా విమర్శకులు వర్ణించడం జరిగింది. భావకవితా యుగంలోని మనిషిని, అభ్యుదయ యుగంలోని మనిషిని కాకుండా ఆధునిక కాలానికి చెందిన, వివిధ సమస్యలకూ అశాంతికీ అంకితమైన సగటు మనిషిని గురించి ఆలోచించడంలోనే తిలక్ నవీన దృక్పథం కనిపిస్తుం దనిపిస్తుంది. "తిలక్ ఖచ్చితమైన మానవతావాది. కేవలం వ్యక్తిగత మైన అనుభూతికి సంబంధించిన మానవతా భావనకు, సమాజపరమైన మానవ కారుణ్య భావనకూ చాలా తేడా వుంటుంది. తిలక్ నిశ్చయంగా యీ రెండవ పద్ధతికి చెందినవాడే" అంటూ కుందుర్తిగారు మెల్లగా తిలక్‌నూ అభ్యుదయ కవుల పట్టీలోకి తోసెయ్యడానికి ప్రయత్నించారు ('అమృతం కురిసిన రాత్రి' పీఠిక).

అభ్యుదయ యుగానంతర కాలంలో తిలక్ రచించిన 'అమృతం కురిసిన రాత్రి' గీతం "జీవితాన్ని ప్రేమించినవాడు జీవించడం తెలిసినవాడు, నవనవాలైన ఊహావర్ణార్ణవాల మీద ఉదయించిన సూర్యుడు" అయిన మనిషిని వర్ణిస్తుంది. రెండు ప్రపంచయుద్ధాలు మిగిల్చిన అశాంతి, రష్యా చైనాలలో విప్లవాల వేడి, స్వాతంత్ర్య సమర ఫలితంగా అవతరించిన బాల భారతం, కొత్త సమస్యలతో కొత్త వస్తువుగా రూపొందిన మధ్యతరగతి ప్రజ- ఇవన్నీ తిలక్‌కవిత్వంలో ఏదో ఒక విధంగా దర్శనమిస్తాయి. అయితే అభ్యుదయ కవితా వస్తువుకూ భావ కవితా శైలికీ అతీతంగా మానవతాదృక్పథాన్ని నిరూపించే కొత్త శైలిని రూపొందించుకోకపోవడంవల్ల 'ఆర్తగీతం' వంటివి కృత్రిమంగా కన్పిస్తాయి. వస్తువుకూ శైలికీ పొంతన కుదరక తికమక పెట్టిస్తాయి. 1956లో రాసిన 'ఆర్తగీతా'నికీ 1964లో రాసిన 'నీడల'కు ఎంతో తేడా కనిపిస్తుంది. 'ఆర్తగీతం' బలవంతంగా తెచ్చిపెట్టుకున్న శైలిలాగా, కన్పించగా 'నీడలు' మధ్యతరగతి ప్రజల సహజ చిత్రణలాగా కనిపిస్తుంది.

అభ్యుదయానంతర కవిత్వంలో మొదటి మెట్టుగా మధ్యతరగతి ప్రజలు సజీవ చిత్రణను పేర్కొనవచ్చు. తిలక్ 'అమృతం కురిసిన రాత్రి'లో 'సి.ఐ.డి. రిపోర్టు', 'గొంగళి పురుగులు', 'తపాలా బంట్రోతు' మొదలైనవి ఈ కోవకు చెందుతాయి. మానవతావాదానికి పట్టంకట్టి, మనిషి సర్వతోముఖాభివృద్ధినికాంక్షిస్తూ చేసిన రచనలు ఎక్కువగా కన్పించబట్టే తిలక్‌ను 'ఖచ్చితమైన మానవతావాది'గా వర్ణించడం జరిగింది. తిలక్ కవిత్వ రచనలోని రెండవ ఘట్టం అభ్యుదయ యుగానంతర ధోరణికి ప్రారంభ సూత్రాలుగా కన్పిస్తాయి. అప్పటికి సంప్రదాయ కవిత్వం, భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం ఏ దశకు చేరుకున్నాయో తెలిపే గీతమే 'త్రిమూర్తులు.' సంప్రదాయకవి "మావాడే, మహాగట్టివాడు." కాని "ముసలిదాన్ని, మూలకూర్చున్నదాన్ని మనువాడాలన్న తొందర" అతనిది. అందువల్ల "మరి పనికి రాడు." భావకవి "మల్లెపూలమీద పరుంటాడు, మంచి గంధం రాసుకుంటాడు, మరి ఎందుకేడుస్తాడు?"అతడు"వధ్యశిలమీద విరహగీతం రాస్తాడు." అభ్యుదయ కవి "చిచ్చర పిడుగు. ముందుకు వేసిన అడుగు ఎండలో నడిచే మనుషులకి గొడుగు. కాని, "మత్తుగా పరుండి నిద్రపోయాడు. మరి యిప్పట్లో లేవడు."

## కవులూ కావ్యాలూ

దిగంబర కవులు తమకంటూ ఒక దారిని ఏర్పరచుకునేవరకు, తెలుగు కవిత్వం నిస్తేజంగా, నీరవంగా, సత్వహీనంగా, ప్రజల్నిగాని పాలకుల్నిగాని ఏ మాత్రం కదల్చలేనంత చైతన్య రహితంగా ఉందని చెప్పడం జరిగింది. అభ్యుదయానంతర యుగంనుంచి దిగంబర కవిత అవతరించేవరకు ఉండిందని చెప్పిన ఈ స్తబ్దత మానవతావాద సంబంధికాదు, అభ్యుదయ వాదానికి సంబంధించింది మాత్రమే. తెలుగు కవిత్వం నిద్రపోతుండిన కాలమని విమర్శకు లెందరో వచించిన ఆ పదేళ్ళ (1956-65) కాలంలోనే తిలక్ అత్యుత్తమ కవితాఖండికల్ని రచించారు. అభ్యుదయ యుగంలోనే రచనా వ్యాసంగం ప్రారంభించి, అనంతర కాలంలోనూ కొనసాగించి, ఇప్పటికి ప్రసిద్ధులుగానే మిగిలి ఉన్న కవులు మనిషి దృక్కోణం నుంచి పరిశీలించారు, మానవతా వాదానికి ఎంతవరకు ప్రాధాన్యం ఇచ్చారు అన్నది పరికిద్దాం.

## శ్రీశ్రీ

అభ్యుదయ యుగకర్తగా భావి కవులమీద అపరిమిత ప్రభావాన్ని చూపిన శ్రీశ్రీ సినిమాల్లోకి వెళ్ళిపోయాడు. శ్రీశ్రీ తాను రాసింది ఎప్పుడూ మానవతా వాదానికి విరుద్ధమని అనుకోలేదు. ఆయన రచనల్ని అర్థంచేసుకున్నవారూ అనుకో లేదు. కె.వి. రమణారెడ్డి గారిలా అంటారు: "తన దేశాన్నీ ప్రజనీ తన కొక సంప్రదాయ మనేది ఉంటే దాన్ని వదులుకోకుండానే శ్రీశ్రీ లోకకుటుంబి కాగలి గాడు. మానవతావాద మంటే చైతన్య భరితమైన క్రియోన్ముఖమైన చారిత్రక కార్యోత్సాహియైన ఇలాంటి జీవవైఖరే గాని, కండబీళ్ళు తుడిచి ఊరడించి సహనం బోధించి మనుషుల్ని నిస్తేజుల్ని చేసే నాటకీయ వైఖరి కాదు ........ మార్పు....ఇదే సిసలైన మానవతా వాదానికి ఊపిరి కావాలి" (శ్రీశ్రీ సాహిత్యం -మూడు పు. 19). శ్రీశ్రీ మానవతాదృక్పథం నాలుగు ముక్కల్లో చక్కగా వెల్లడైంది.

'సరిహద్దులు లేని
సకల జగజ్జనులారా!
మనుష్యుడే నా సంగీతం,
మానవుడే నా సందేశం!'

అంతేకాదు- 'నా ఇంటిపేరు ప్రపంచం, ప్రజలే నా కుటుంబం' అన్నాడు. అయితే 1955 తర్వాత శ్రీశ్రీ రేడియోకు, సినిమాలకూ, అనువాదాలకూ, ఆంధ్రరాష్ట్రావ తరణవంటి సందర్భాలకూ, ప్రాస్తావిక పద్యాలకూ అంకితమైపోయాడు.

విరసం ఆవిర్భావంతో శ్రీశ్రీ మరో ప్రస్థానం ఆరంభమయింది. 'నిన్నటి జట్కావాలా' (ఝంఝ) శ్రీశ్రీ శైలికి భిన్నంగా, తెచ్చిపెట్టుకున్న జానపద శైలిలో రచితమైంది. ఈ శైలిని తర్వాతి కవితల్లో శ్రీశ్రీ వదిలేసినా గద్దర్, వంగపండు ప్రసాదరావు మొదలైనవారు ముందుకు తీసుకుపోయారు. శ్రీశ్రీ జట్కావాలాను వస్తువుగా తీసుకున్నా అది మానవతావాదమని చెప్పడానికి వీలు లేదు. శ్రామిక వర్గానికి ప్రతినిధిగా మనిషిని చిత్రించేటప్పుడు జట్కావాలావంటి సామాన్య వ్యక్తి దృష్టికి తగిలాడు, అంతే. 'భూమ్యాకాశాలు' అనే గీతంలో "ఒద్దు కన్నీటికవిత్వం రాయొద్దు" అనికూడా కవి శాసించాడు. 'తుది పయనం,

తొలివిజయం'లోని విప్లవవీరుడు శ్రీశ్రీ మరో ప్రస్థానంలో చిత్రించిన మనుషులలో పురుషోత్తముడై కనిపిస్తాడు. ఉరికొయ్య అందుకొని ఊగుతున్న నాయకుని దృశ్యం గగుర్పాటు కలిగిస్తుంది.

"ఊగరా ఊగరా, ఊగరా! ఉరికొయ్య అందుకొని ఊగరా!....
నెత్తురు కార్చిన కళ్ళే నిప్పులు చెరుగుతాయి....
ఎల్లవారు నిన్ను రేపు వేగుచుక్క అంటారు!
శివాజీకి వారసుడా! శ్రీశ్రీ కవిత్వలాలసుడా!
నీ ధాటికి అడ్డులేదు, నీ త్యాగం వృధాకాదు!"

చైతన్యభరితమైన, క్రియోన్ముఖమైన జీవవైఖరే మానవతావాదమనే అభిప్రాయానికి శ్రీశ్రీ కవిత్వం నిదర్శనంగా ఉంది. శ్రీశ్రీ కి, ఇతర విప్లవ కవులకూ సమాజానికి దూరంగా అంతర్ముఖుడైన మనిషికాక, సమాజంలో ఒకడినని భావించే మనిషి ముఖ్యుడన్న విషయాన్ని ఇక్కడ మనం గమనించాలి.

## కుందుర్తి

అభ్యుదయయుగానంతర కాలంలో వచన కవిత్వానికి నిర్దిష్టమైన స్థానా నిచ్చి జీవితాంతం దానికోసం శ్రమించిన కుందుర్తిగారి పాత్ర ముఖ్యమైంది. 1956 లో 'తెలంగాణ' కావ్యాన్ని సుదీర్ఘ వచన కవిత్వంగా మలచిన తర్వాత 'నగరంలో వాన', 'నాలోని నాదాలు', 'హంస ఎగిరిపోయింది', 'తీరా నేను కాస్తా ఎగిరి పోయాక' వెలువడ్డాయి. అభ్యుదయవాద ప్రభావం కుందుర్తి మీద బలంగా ఉంది. వర్గ సంఘర్షణ, విప్లవ ప్రబోధం సమసమాజ నిర్మాణంతోబాటు యుద్ధ విముఖత, శాంతి ప్రియత, విశ్వమానవతావాదం కుందుర్తి రచనల్లో పుష్కలంగా చోటు చేసుకున్నాయి.

"మళ్ళీ నరజన్మ ఎందుకంటే
మనుషులంటే యిష్టం నాకు
దేవుని కంటే మనిషి యిష్టం"

అని చెప్పుకున్నా రాయన. "నరుణ్ణి వదలి ఏనాడూ నా చూపు నక్షత్ర సంగీతాన్ని వినాలని ఆకాశంలోకి దూకలేదు" అన్నారు. 1978 లో రాసిన ఒక కవితలో (చావని సత్యం, ఆంధ్రపత్రిక 19-1-1978).

'నేంమీది కోట్లాది జనుం దుర్భర దీనావస్థలు చూసి
నా గుండె చెరువై సిరుగా మారింది నిజమే........
ఒక్క జోసినోటి చిరునవ్వు వెలుగుల విసురుతో
ముసుకున్న ఆకాశంలో ఉషస్సు తెల్లని
గొడుగులా విప్పుకున్నది నిజమే" అన్నా రాయన.

## దా శ ర థి :

తెలంగాణ అగ్నిజ్వాలల్లోంచి నిప్పురవ్వలా ఉదయించి, కవితల్తో కాగడాలు వెలిగించి, తెలంగాణా ఉద్యమం చల్లారిన తర్వాత శాంతికపోతాలు ఎగురవేసిన కవి దాశరథి. ఈ కవి రచించిన మానవతావాద కవితలు 'కవితాపుష్పకం'లో చోటు చేసుకున్నాయి. రాజకీయ దురహంకారులపై ఒకప్పుడు రాజీలేని యుద్ధం ప్రకటించిన కవి ఇందులో ఇలా అంటారు ;

"గగనంలో చుక్కలు,
తోటలోని పూవులు
కలహించక కలిసుందును;
మనుషులేల కలహించుట?"

'తిమిరంతో సమరం' దాశరథి మానవతా దృక్పథాన్ని మరింత విస్తృతంగా చూపింది. "దయాహీన మానవ మనోమరుభూమిలో కృపావృష్టి కురిపిస్తాను కవితాంభోధర గణాలతో" అన్నారు. అంతేకాదు, హింసకు వ్యతిరేకంగా పోరాడదలచిన తమ నిశ్చయాన్ని తెలిపారు.

"తుపాకుల నోళ్లు మూయిస్తాను
బాంబుల చెంపలు వాయిస్తాను;
నా అరుణారుణ హృదయ శకలాల తోరణాలతో
అవనిని ఆనందభవనంగా కళకళలాడిస్తాను."

ఈ సంకలనంలో రకరకాల మనుష్యుల్ని చిత్రించారు దాశరథి. "తెల్లవాణ్ణి హత్యచేసే తెల్లవాని ప్రల్లదంవలె చీకటి నా మీద దాడిచేస్తున్నది" అన్న ఉపమ

అపూర్వం. నమ్మిన సిద్ధాంతం కోసం వమ్మయిపోయిన అజ్ఞాతయోధుణ్ణి వర్ణిస్తూ ఇలా అంటారు :

"తుపాకీ గురిపెట్టిన వాని ముఖాన
తుపుక్కున ధైర్యంతో ఉమ్మిన
మృత్యుభయం ఎరుగని వాడు
సత్యాన్నే నమ్మినవాడు....
వాని కానరాని సమాధి
స్వాతంత్ర్య సౌధానికి పునాది
అతన్ని గౌరవించిన నాడే శుభోదయం
అతన్ని మరువని నాడే మనకు జయం."

## సి నా రె

స్వాతంత్ర్యం వేగుబోకలో కవితా వ్యవసాయం మొదలుపెట్టి నేటికీ నిరంతర కృషి చేస్తున్న ప్రముఖులు సినారె. మధ్యతరగతి మందహాసాన్ని, మంటలలో మనుగడ సాగిస్తున్న మానవుణ్ణి మధురంగా చిత్రించి చూపారు. సి. నారాయణరెడ్డిగారు చూపిన మనిషి చిత్రాలు అసంఖ్యాకంగా ఉన్నాయి. "నారాయణరెడ్డి కవితలో నూటికి తొంభైపాళ్ళు మానవతాప్రబోధం కనిపిస్తుంది" అన్న అభిప్రాయం గమనించదగింది (డా. తిరుమల శ్రీనివాసాచారర్య, నారాయణ రెడ్డి సాహితీమూర్తి, పు. 66).

"మనిషి నశించినా
నశించదు మానవత్వం
అదే ఈ లోకానికి మణిసోపానం
అనంతంవైపు దాని ప్రస్థానం"

అంటారు 'మానవుడు' అనే కవితలో.

'మంటలూ - మానవుడూ' సినారె గారికి సాహిత్య అకాడెమీ బహుమతిని ఆర్జించిపెట్టింది.

"శ్రమజీవి చెమట బిందువులో
ఆణిముత్యమూ ఉంది
అగ్నిగోళమూ ఉంది"

అని శ్రమజీవన సౌందర్యాన్నీ, సామ్యవాద దర్శనాన్నీ సమన్వయ దృష్టితో పరికించారు. 'చిరునవ్వు' అనే కవితలో-

"అంతుపట్టని చిరునవ్వులుంటాయని
అసలు చిరునవ్వుకే ఎసరు పెట్టరాదు"

అనడంలో ధ్వన్యాత్మకంగా మానవతావాదానికి పట్టం కట్టడం జరిగింది.

మానవుని గూర్చి, మానవతావాదాన్ని గూర్చి సినారె ప్రవచించని కవితా సంకలనం ఒక్కటికూడ లేదంటే అతిశయోక్తి కాదు. ప్రతి దానిలోనూ కొత్త కొత్త దృక్కోణంతో మనిషిని పరిశీలించి కవిత్వంగా మలిచారాయన. 'ఒకేఒక్క దీపం' అనే కవితలో (ముఖాముఖి) సూర్యుడు, చంద్రుడు, తారలు మొదలైనవి అసలు దీపాలు కావని, వీటిని మించిన దీపం ఒక్కటే ఉందని చెప్తూ-

"ఎక్కడో లేదు
మరేదీకాదు
మహోజ్జ్వల చైతన్యమూర్తి
మనిషే ఆ దీపం" అన్నారు.

'మనిషీ - చిలక' అన్న సంపుటిలోని సుదీర్ఘ కవిత సగటు మనిషిని అత్యంత సహజంగా చిత్రించి చూపింది. సినారె మానవతా పతాకాన్ని రెపరెప లాడిస్తూ వచన కవితా ప్రక్రియలో అందించిన కావ్యం 'విశ్వంభర'. ఈ కావ్యానికి మానవుడే నాయకుడు, మనిషికథే ఇతివృత్తం. మనిషి జీవితాన్ని సమగ్రంగా దర్శించి కావ్యరూపంగా మలిచిన సినారె అభినందనీయులు.

''మనిషి జీవితం
అనుభవాంకితం" అన్న కవివాక్కు గమనించదగింది.

## దిగంబర కవులు

అకవిత్వం, అసంగత నాటకం అనేక భాషల్లో ఉద్యమాలుగా రూపొందాయి. ఉద్యమాలుగా కాకున్నా బలమైన సాహిత్య ప్రక్రియలుగా ప్రభావం చూపాయి. అందమైన వేషంతో అసలైన అకవిత్వం కూడా ఉత్తమ కవిత్వంగా చెలామణీ గావడాన్ని సాహిత్య చరిత్రలో చూస్తున్నాం. ఇలాంటి వేషాలమారి కవిత్వం మీద తిరుగుబాటుగా తెలుగులో వచ్చింది దిగంబర కవిత్వం. మనిషిలోని నైచ్యాన్ని, స్వార్థాన్ని దానికి తగ్గ భాషలోనే చెప్పింది ఈ కవిత్వం. చెప్పిన విధానం ఎలాంటిదైనా మానవత్వపు విలువల్ని ప్రతిష్ఠించడమే దిగంబర కవుల లక్ష్యం. క్రూరమైన, హేయమైన లైంగిక చిత్రాలతో, అశ్లీల పదాలతో మానవత్వాన్ని ప్రబోధించడంవల్ల తదితర పద్ధతులకు అలవాటుపడ్డవారికి 'షాక్' తగిలినట్లయింది. అయితే దిగంబర కవుల రచనల్లో అంతస్సూత్రంలా కనిపించేది మానవత్వమే.

జ్వాలాముఖి అంటారు: "సంకుచితత్వాన్ని మనమంతా సంప్రదాయబద్ధం చేసేసుకున్నాం, కాబట్టే మనకింకా అర్థం కానిది సర్వ మానవ కల్యాణం." నిఖిలేశ్వర్ అంటారు:

"ఇక్కడ
ఎవడూ హీరో కాదు-విలన్ కాదు
మంచాడు కాదు-పిచ్చాడు కాదు
నిస్సారతను పిండేస్తున్న
ఖాళీ టిన్నులు మానవులు."

భైరవయ్య ఎముకల కేకలను గురించి రాస్తూ-

"మనిషీ
మానవతా నిగమాగమ ఋషీ
మేలుకో" అంటారు.

మహాస్వప్న 'మేం మనుషులం కాదు ఇంకేదో పేరుంది మాకు' అన్న గేయం రాస్తూ, బాపూజీని సంబోధించి

“నీ అభయహస్తంలాంటి ఆకాశంలో ఇంకిన కన్నీటి చుక్కలు
చావు బ్రతుకుల మధ్య నెత్తుట్లో తడిసిన సరిహద్దురేఖలా మానవత
బావురుమంటున్నాయి కూలిన దిగ్భ్రాంతికా శిథిలాలు
నవ్వుకుంటున్నాయి పాతాళంలోంచి మేరు శిఖరాలు
ప్రసవవేదన పడుతున్న ధరణిగర్భంలో
అర్థం తెలిసిన మృత్యువు శాంతి....” అన్నారు.

నగ్నముని మనిషి ‘బాధ్యత’ను గుర్తుచేస్తూ ఇలా అంటారు :

“జుట్టుపట్టి ఈడ్చుకొచ్చి
చెట్టుకట్టి నాగరికత ఒళ్ళంతా చిట్లగొట్టి
మానవత్వం మంటపెట్టు.”

చెరబండరాజు ‘ఫో’ అంటూనే మానవత్వానికి సమున్నతస్థానం ఇచ్చారు:

“ నీ ఆశయం సూర్యుణ్ణి మాత్రం
పిడికిట్లోంచి జారవిడువకు
ప్రాణాన్ని పణం పెట్టయినా
ఈ జగతికి మానవతాభిక్ష పెట్టు
ఫో.”

విప్లవ రచయితల సంఘం ఏర్పడిన తర్వాత కొంతకాలం దిగంబర కవుల్లో కొందరు చేరడం, బయటికి రావడం, తమ వ్యక్తిత్వం నిలబెట్టుకొని కవులుగా కొనసాగడం మనకు తెలిసిందే. ముఖ్యంగా చెరబండరాజు, నగ్నముని, నిఖిలేశ్వర్ ప్రముఖ కవులుగా దిగంబర కవిత్వానంతరం కూడా కొనసాగారు. చెరబండరాజు విప్లవ కవిగానే జీవితాంతం గడిపి తరుణ వయస్సులోనే కన్ను మూశారు. ఆయన రచనల్లో విప్లవవాద నేపథ్యంతోనే విశ్వమానవతా దృక్పథం వెల్లివిరిసింది. నగ్నముని ‘కొయ్యగుర్రం’ విలయతాండవం చేసిన ఉప్పెనను మానవతా దృక్పథంతో మాత్రమేకాక సామాజిక దృక్పథంతో విశ్లేషించింది. నిఖిలేశ్వర్ ‘మండుతున్న తరం’, ‘ఈనాటికీ’ మొదలైన కవితా సంకలనాలను ప్రచురించడమేకాక అవిచ్ఛిన్నంగా కవితా వ్యవసాయాన్ని కొనసాగిస్తున్నారు.

విప్లవకవిత్వం మనిషిని అభ్యుదయ యుగంలోలాగే సామాజిక దృక్పథంతో పరిశీలించింది. ముఖ్యంగా పోరాటంలో పాల్గొనే వీరునిగా, వర్గశత్రువును నిర్మూలించే కార్యకర్తగా, సమసమాజాన్ని కాంక్షించే అభ్యుదయ వాదిగా చిత్రించింది. విప్లవకవిత్వ పంథా ఏర్పడడానికి పూర్వమే ఇంకా కొన్ని కవి వర్గాలు ఆధునిక తెలుగు కవితకు వైవిధ్యాన్ని ప్రసాదించాయి. అలాంటివాటిలో కొన్నిటిని పరిశీలించవచ్చు.

## చేతనావర్తం కవులు :

అభ్యుదయయుగం తర్వాత ఆధునిక తెలుగు కవిత్వానికి వైవిధ్యాన్ని సమకూర్చిన కవి వర్గాలలో చేతనావర్తం కవులను ప్రముఖంగా చెప్పుకోవాలి. "ఏకాకిగా జీవించలేక గమ్యం తెలియక శూన్యంవైపు ప్రయాణం చేస్తున్న" మనిషిని గురించి వీరు తెలిపారు. సుప్రసన్న, పేర్వారం జగన్నాథం, సంపత్కుమార, నరసింహారెడ్డిగార్లు 1967లో తమ వచన కవితా సంకలనాన్ని ప్రకటించారు. సమకాలిక సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని మనిషి పడుతున్న బాధల్ని, వేస్తున్న వేషాల్ని, చైతన్యవంతుడు కావలసిన అవసరాన్ని కవిత్వ రూపంలో ప్రవచించారు. వీరి కవిత్వంలో ఆవేశం తక్కువ, ఆలోచన ఎక్కువ. ఏ కవితా వాదానికీ లొంగకుండా మానవ జీవిత పురోగతిని కాంక్షించి రచనలు చేయడం వీరి ధ్యేయం.

"ఇది తీరే సమస్య కాదు
ఎవరికి వారే యమునాతీరే
కాలం చెరసాలలో ప్రతివాడూ
బందీ అయిన అస్వతంత్రుడు"

అని ఆధునిక సమాజంలో మనిషి ఎదుర్కొంటున్న సమస్యల్ని శ్రీ పేర్వారం జగన్నాథంగారు చక్కగా ప్రతిపాదించారు. గ్రామంలోని సన్నకారు రైతును జగన్నాథంగారు చిత్రించిన తీరు వారి కవితా సామర్థ్యాన్ని తెలుపుతుంది:

"ఆ గ్రామంలో అనగనగా
ఒక్క సన్నకారు రైతు
నిండు బండిని లాగే ఒక్కెద్దులాగా
సంసారం ఈడుస్తున్నాడు.
తేనెటీగల వ్యాపారం వలె
వ్యవసాయం సాగిస్తున్నాడు
ప్రొద్దస్తమానం మోటకొట్టినా
దోసె అరడు దొయ్య బారడు
అతని చెమటబొట్లే ఇంతకన్న
నయమనిపించేట్లు ప్రవహిస్తున్నవి...."

## తిరగబడు కవులు

"ఎన్నేళ్లు గడచినా తొలగిపోని ఆర్థిక అసమానతలపట్ల అసంతృప్తులైన ప్రజలు అలజడి ఆరంభించే తరుణంలో" దాన్ని నీళ్ల కార్చే వారిపైన తిరుగబడుతూ కొందరు కవులు కవిత్వం చెప్పనారంభించారు. "ఈ నిజాన్ని పీడిత, తాడితులకు తెలిపి గాఢనిద్రనుంచి మేల్కొల్పి చైతన్యవంతులుగా చేయటం యీరోజు అభ్యుదయవాదుల కర్తవ్యం" అన్నారు. వరవరరావు, లోచన్, అశోక్ మొదలైనవారు 'తిరుగబడు' అన్న కవితాసంకలనాన్ని ప్రచురించారు. 'మనిషి కన్నా ఎక్కువ పెరగకు' అన్న కవితలో లోచన్ ఇలా అంటారు:

"ఆదర్శ శిఖరాలపై కూర్చుండి
అలౌకికానుభూతిలో
ఆకాశానికేసి చూసే మనిషీ!
దిగువన దీనులున్నారు
ఆకలి ఉంది అవమానం ఉంది
అశ్రువులున్నాయి అన్యాయం ఉంది
దిగిరా...."

తర్వాతి కాలంలో వీరిలో వరవరరావుగారు విప్లవ కవుల్లో ప్రముఖులయ్యారు.

## పైగంబరులు

1970లో 'యుగసంగీతం' వినిపించిన పైగంబరులు యం.కె. సుగమ్‌బాబు, దేవిప్రియ, ఓల్గా, కిరణ్‌బాబు, కమలాకాంత్. "మా కవిత్వం సమస్యల కీకారణ్యంలో మానవతాపథం పథం చూపించే టార్చిలైటు" అన్నారు. "మేము మానవతావాదులం. కాని, సమస్యా పరిష్కారానికి మానవత, సమరసభావం ఎంత అవసరమో- కొన్నివేళల్లో కరకుకత్తిలా వ్యవహరించడంకూడా అంతే అవసరం మని నమ్మినవాళ్ళం" అని ప్రకటించారు దేవిప్రియ ఒకచోట-

"ఇలారా....ఇక్కడ నీకోసం
మానవత్వపు అగరువత్తులు వెలిగించి వుంచాను" అంటారు.

## చేవకల్గిన కవులు :

విరసంలో ఉండి తర్వాత బయటపడ్డ కవులు, ఏ సంఘటనలోనూ చేరక స్వతంత్ర కవులుగా కొనసాగుతున్నవారు, అభ్యుదయ కవులమని మళ్ళి ప్రకటించుకున్న కవులు, కవిసేనగా ఏర్పడ్డ కవులు ఇటీవలి కవిత్వాన్ని సుసంపన్నం చేస్తున్నారు. వీరు ఏదైనా వర్గంలో ఉన్నా, లేకున్నా తమదంటూ ఒక సొంత గొంతుకను ఏర్పరచుకున్నవారు. ఇప్పటికే ఈ వ్యాస పరిధిలోకి వచ్చిన వారు కాక ఇంకా ఇలాంటి కవులు అసంఖ్యాకంగా తెలుగు నాట ఉండబట్టే ఆంధ్ర దేశం కవితామయంగా కనిపిస్తూ ఉంటుంది.

## శేషేంద్ర :

కవి, పండితుడు, కవిసేన నేత, ఆధునిక తెలుగు కవితను ఒక మలుపు తిప్పినవాడు. చాలా కాలం నుంచి సాహిత్య సృష్టి చేస్తున్నా, పది పదిహేనేళ్ళుగా ఆంధ్రదేశాన్ని ఒక ఊపు ఊపుతున్నారు శేషేంద్ర. వస్తువుకంటె రీతి ముఖ్యమని, ఆకలి కవిత్వం రాసినా, ఆవకాయ కవిత్వం రాసినా కవిత్వం రాయడం ముఖ్యమని శేషేంద్రగారి అభిప్రాయం. సంప్రదాయ పద్ధతిలో అద్భుత కవిత్వం రాయగల్గినా ఆధునికతకు పద్యంకంటే వచనమే శ్రేష్ఠమైనదని భావించి వచన కవితకే కొత్త అందాలు తెచ్చినవారు శేషేంద్ర. సామాజిక చైతన్యం కంటె సాహిత్యచైతన్యమే కవికి కావలసిందని వారి భావన. ఏ కవిత్వం రాసినా ప్రజల కోసమే రాశానని, నినాదాలు కాక కవిత్వమే రాశానని గుండెలమీద చేయి-వేసు

కుని చెప్పగల చేవ ఉంది ఈ కవికి. "మానవత నగ్నంగా, ఉద్విగ్నంగా, నూతన వ్యక్తీకరణ కోసం చూస్తోంది" అని భావించి భావవ్యక్తీకరణలో వినూత్న పంథాను అనుసరించారు. 'మండే సూర్యుడు', 'నా దేశం-నా ప్రజలు', 'గొరిల్లా', 'అరుస్తున్న ఆక్మి' ఇవన్నీ మనిషిని వైవిధ్యమయంగా, శ్రమజీవిగా, కర్తవ్యోన్ముఖునిగా, సమున్నత వ్యక్తిగా చూపేవే. "స్వేచ్ఛ మనిషికి మొదటి శ్వాస; అది నీ రక్తపు సజీవభాష; ఘోషించు నీవు నీ చివరి ఊపిరితీసే వరకూ నిలుపుకోవలసిన ఒకే శ్వాస" అంటారు వారు.

ఇప్పటి మానవుణ్ణి గురించి చెప్తూ శేషేంద్ర 'గొరిల్లా'లో ఇలా అంటారు:- "ప్రభాతం పసిడిగా ఉన్నప్పుడు సనాతన గంగలో స్నానం చేశాడు మానవుడు;- ఇప్పుడు మధ్యందిన మార్తాండ మండలాన్ని ఉపాసిస్తున్నాడు. మానవత నూతన యుగద్వార తీరాలు చేరింది. రక్తంలో భయాల్ని పొదుగుతున్న పాత నమ్మకాల్ని పటాపంచలు చేసింది."

మానవుణ్ణి ఏ రూపంలో చిత్రించినా అద్భుతమైన కవితారూపాన్ని మన ముందు ప్రదర్శించగల నేర్పు శేషేంద్ర శర్మగారికి ఉంది :

"చంపి కొండల్లో పారేసిన వాడి శరీరం
రాగం కోసం బిగించిన ఫిడేలులా
పడి ఉంది....
అడవిలో నాకోసం మరణించిన
ఆ వీరుడికి
ఎవడు కట్టగలడు ఎత్తయిన సమాధి
నా గుండె వాడిమీద లేచిన గోపురం
నా అశ్రువులే వాడిమీద రాలుతున్న పూలు."

## మాదిరాజు రంగారావు

వచన కవితను తాత్త్విక చింతన వైపుకు మరలించి కవిత్వం కూడా జీవితమంత గంభీరమైనదని నిరూపించిన కవి మాదిరాజు రంగారావు. యుగ సంకేతం, మానవీయం, నాలో ప్రవహిస్తోంది నది మొదలైన కవితా సంకలనాలు వీరి లేఖినినుంచి వెలువడుతూ ఉన్నాయి. ఆవేశంకంటె చింతన ప్రధానంగా వెలువడిన-వీరి కవితలు సామాన్యులకు బోధపడడం కష్టమే.

"నాలో ప్రవహిస్తోంది నది
హృదయ శిఖరం స్పృశిస్తూ మానవతా గంభీరమై

చింతనలో ప్రణవనాద తరంగ శ్రేణులతో
గతిలో కదలే వాస్తవ జీవన చిత్రాలతో...."
మానవీయ భావనలే వీరి కవిత్వానికి ఊపిరి.

## కె. శివారెడ్డి

'ఆసుపత్రి గీతం' 'నేత్ర ధనుస్సు', 'చర్య' 'భారమితి' మొదలైనవి శివారెడ్డిని ప్రత్యేకత కల్గిన కవిగా నిలబెట్టాయి. పీడిత ప్రజల పక్షాన నిలిచి, నినాద కవిత్వం నుంచి బయటపడి ఉత్తమ కవిత్వాన్ని అందిస్తున్న అసలైన కవి శివారెడ్డి.

"నాకొక్క ఆప్యాయతల-ముద్దు కావాలి-
రక్త సముద్రంలోంచి పుట్టే
నిశ్శబ్ద కెరటపు పెదవుల పల్కరింపు కావాలి"

అన్న శివారెడ్డి-

"ఎలాగో బతకడం వేరు
వెలుగుతూ బతకడం వేరు
వెలుగు ఎలుగెత్తి బతికే బతుకు
కటకటాల వెనకగూడా కాఠిన్యం కోల్పోని వజ్రగీత సంగీతం." కవి కాని వాడికి కవికి ఉండే భేదాన్ని ఇంతకన్న మిన్నగా చెప్పడం కష్టం :

"....వాడికి
కుక్కపిల్ల కుక్కపిల్లే
నాకు అనంత ఆర్తనాదం
వాడికి
బానిస బానిసే
నాకు బానిస ఎక్కుపెట్టిన విల్లంబు
వాడికి
మట్టి మట్టే
నాకు మట్టి కవిత్వం."

మట్టినీ మనిషినీ కవితగా మలచగల్గిన మహాత్ములు ఆధునికాంధ్ర కవిత్వాన్ని ఉన్నత స్థాయిలో నిలబెట్టారు. ఎన్ని పంథాలు ఏర్పడినా, ఎన్ని వర్గాలు ఏర్పడినా, వాదవివాదాలు జరిగినా మనిషికి కవిత్వంలో ఇచ్చిన విలువ చెక్కు చెదరకుండా ఉండి. మనిషి మనుగడకు దోహదంచేసే కవిత్వం ఎప్పటికీ ఉంటుంది. అదే మనిషి భవిష్యత్తుకు పునాదిరాయి అవుతుంది.

# నేటి కవిత్వంలో జాతీయ భావన

బి. రుక్మిణి
పి. జ్యోతి

ఒక మానవ సమూహం ఒక భౌగోళిక భాగంలో నివసించటం, దాని చరిత్ర, ఆచార పరంపర, తాత్త్విక దృష్టి, జీవనతత్త్వం ఇవన్నీ జాతీయతలో అంతర్భవిస్తవి. జాతికి సంబంధించిన ఈ సమష్టి అంశాలను ప్రతిబింబించే, ఉజ్జ్వలింపజేసే కవిత్వం జాతీయ కవిత్వం. జాతీయ భావన సంస్కృతీ నిష్ఠంగా భారతీయ సాహిత్యంలో ప్రాచీన కాలం నుండి వస్తూ ఉన్నది. ఐతే పూర్వం నుండి ఆధునిక యుగం దాకా అనేకమైన చారిత్రక కారణాలను పురస్కరించు కొని భిన్నభావ ధోరణుల సమన్వయాన్ని సంతరించుకుంది. ఈ సందర్భంలో దీన్ని కాస్త వివరిస్తే ఆర్ష ధర్మగతమై విలసిల్లిందని చెప్పాలి. భారతదేశం ఎన్నో ఒడుదొడుకులకు విదేశీయుల, పరధర్మీయుల దండయాత్రలకు, ఆఘాతాలకు లోనైంది. ఐనా దేశప్రజల జాతీయ భావన- తాత్కాలికమైన రాజకీయ పరివర్తనలకు అతీతంగా ఉంటూ- తన చైతన్యవంతమైన రూపం విడనాడలేదు. విడనాడకూడదు కూడ.

"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరియసీ"- అన్న సూక్తి భారతీయుల జాతీయ భావనకు ఆదర్శమైంది. ఇది—

"గంగేచ యమునే చైవ
గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరి
జలే స్మిన్ సన్నిధిం కురు"

అన్న నదీనదాల ఏకస్వరూప భావనలో దర్శితమైంది. భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక రూపాల్లో, బహుముఖాలుగా ఆయా కవులచేత, ఆయా సందర్భాలలో సాక్షాత్కరించింది, పవిత్రమైందిగా విలసిల్లింది. ఆధునిక యుగంలో ఈ జాతీయ

స్ఫూర్తి పునరుజ్జీవనోద్యమంలో వినూత్నంగా సాక్షాత్కరించింది. పృథ్వీమాత అయింది. జన్మభూమి బంకిచంద్రుని వందేమాతరంలో శక్తి రూపంగా, చైతన్య విలసిత మూర్తిగా, అనంతశక్తి రూపంగా దర్శింపబడింది. జాతీయోద్యమ కాలంలో భారతీయ సంస్కృతీ రంగాన్ని, సాహిత్యాన్ని ఈ భావన ముందుకు నడిపించింది, 'మాతృదాస్య విముక్తి లక్ష్యమైంది. పురాణ గాథలు ఆధునిక చైతన్యంలో సాక్షాత్కరించాయి.

సమాజం - సాహిత్యం ఆధార ఆధేయ సంబంధం కలవి. సమాజంలో వచ్చిన మార్పు సాహిత్యంలో ముఖ్యంగా కవిత్వంలో చాలా వేగంగా ప్రసరించడం అంతటా కన్పిస్తుంది. దేశ స్వాతంత్ర్యం కోసం ఉద్భవించిన రాజకీయ ఉద్యమాలు - భారతీయ భాషా సాహిత్యాల పరిణామ క్రమంలో ఆధునిక భావ పరివర్తనకు కారణమైనాయి. జాతీయ భావనను రాజకీయ ప్రభావంతో తీర్చి దిద్దాయి. ఇవి 1. పరపాలన నుండి దేశాన్ని విముక్తం చేయడం. 2. విముక్త మయ్యాక జాతీయ భావనకు క్షతి కలుగకుండా చేయడం, అనే మహోన్నతమైన లక్ష్యంతో విరచింపబడినాయి.

మొదటి విధమైన రచనలు నేరుగా స్వాతంత్ర్యం కోసం జాతీయ భావనను ప్రజల్లో ఉద్దీపింప చేసేందుకు వ్రాసినవి. ఇవి మన పూర్వచరిత్రలోని ప్రధానమైన అంశాలనో, ఘట్టాలనో తీసుకొని దాని నిర్వహణలో, లక్ష్యంలో జాతీయ భావ ప్రేరకంగా మలచడం ధ్యేయంగా కలవి. "భరత ఖండంబు చక్కని పాడియావు' (చిలకమర్తి), 'మా కొద్దీ తెల్ల దొరతనము' (గరిమెళ్ల) మొదలైన రచనలు అలాంటివి. గడియారం శేషశాస్త్రిగారి 'శివభారతము', రాజశేఖర శతావధానిగారి 'రాణాప్రతాపసింహ చరిత్ర' మొదలైన వానిలో రెండో రకానికి చెందిన లక్ష్యం కనిపిస్తుంది. ఇట్లా అనేకుల రచనలు పేర్కొనవచ్చు. ఈ రచనలు స్వాతంత్ర్యానికి పూర్వం వచ్చినవి. స్వాతంత్ర్యం వచ్చాక కూడ జాతీయ భావనతో కూడిన రచనలు ఎన్నో వెలువడినాయి. ఈ పరిస్థితులు వేరు, ప్రేరణ వేరు, లక్ష్యం వేరు

దేశం స్వాతంత్ర్యం పొందటంతో మరో కొత్తయుగం ఆరంభమైంది. ప్రజల ఆశలకు ఆశయాలకు వారి భవిష్యత్తు నిర్మాణానికి అనుగుణంగా సౌభాగ్య

వంతమైన దేశాన్ని రూపొందింపజేయడానికి - రాజకీయ సాంఘికమైన అనేక విధానాలతో, మార్గదర్శక సూత్రాలతో భారత రాజ్యాంగం 26 జనవరి 1950లో అమలులోకి వచ్చింది. జాతీయ భావం విస్తృతిని పొందింది. భారతదేశంలో ఉన్న వివిధ మతస్థులందరు పౌరులుగా గుర్తింపబడడంతో వారందరికీ ఈ దేశం గౌరవస్థానీయమూ,అభిమానార్హమూ పవిత్రమూ అవడం సహజం.ఈ సందర్భంలో జాతీయభావన పొందిన విస్తృత రూపం 1950 తరువాత వచ్చిన కవిత్వంలో ఏవిధంగా ఉన్నదీ గుర్తించడం అవసరం. ఈ భావన హిందూమత తాత్త్విక రూపంగా కాకుండా ఈ నేలపై పౌరుడుగా రాజ్యాంగ రీత్యా పరిగణింపబడిన హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు, పారసీకులైన ప్రతివ్యక్తికి చెందింది. స్వాతంత్ర్యోదయం తరువాత రాజ్యాంగం అమలులోకి రావడంతో దీని కొక స్థిరత్వం, ఒక రూపం ఏర్పడింది. జాతీయ భావనా స్వరూపం ఈ కాలంలో ప్రచలితమయ్యే సాంఘిక రాజకీయ కారణాలవల్ల విశాలత్వంతోపాటు, మత సహనం ఉదార భావనతో ప్రవర్తితమైంది. దీనికి బీజాలు ప్రాచీన కాలంలో లేక పోలేదు. విభిన్న సంప్రదాయాలతో సమన్వితమైన హిందూ తత్త్వంలోనే ఈ లక్షణం ఉన్నది. అంతేకాక "ఉదార చరితునకు వసుధయే కుటుంబము" అన్న సూక్తి గుర్తుకు రాకమానదు. మన ప్రాచీన వాఙ్మయంలో దీనికి సంబంధించిన అనేకములైన అంశాలు కన్పిస్తాయి. దానికీ దీనికీ తేడా ఏమంటే- ఈ కాలంలో వచ్చిన రాజకీయ సాంఘికమైన పరివర్తనంతో ముఖ్యంగా రాజకీయాలు గొప్ప ప్రభావాన్ని నెరపాయి.

భారత రాజ్యాంగం అమలులోకి రావడంతో చట్టపరమైన ఆమోదం లభించింది. విస్తృతమైన పరిధిలో ఆకారాన్ని మలచుకొని జాతీయ భావనతో బంకించంద్ర, టాగూర్ మొదలయిన సుప్రసిద్ధ కవుల చైతన్యవంతమైన ప్రేరణ ఆధారతలంగా తెలుగులో జాతీయ భావనాకవిత్వం ఎంతో వెలువడింది. ఈ కవిత్వాన్ని విశ్లేషిస్తే-

1. దేశ భౌగోళిక వర్ణనాత్మకమైంది - పర్వతాలు, పుణ్య నదీనదాలు, చారిత్రక స్థలాలు, పవిత్ర క్షేత్రాలు మొదలైన వాటిని వర్ణించేది.
2. సంస్కృతీ స్వరూపానికి సంబంధించినది- ఆచార వ్యవహారాలు, తాత్త్విక వేదాంత ధోరణులు, కళాత్మకమైన అంశాలను వెలార్చేది.

3. చారిత్రకమైన వస్తువుతో జాతిలో చైతన్యాన్ని ఉజ్జ్వలింపజేసేది.
4. తత్కాలీనమైన రాజకీయావగాహనతో యుద్ధ వాతావరణాన్నో, ఉద్యమాలనో, వర్తమాన పరిస్థితులనో పురస్కరించుకొని వెలువడేది- ఇత్యాదిగా ప్రధాన శాఖలు కనిపిస్తాయి.

ప్రస్తుత పరిశీలన కోసం విశ్లేషించినప్పటికి దేనికది కాకుండా కొన్ని కొన్ని అంశాలు కలసిన రచనలు దేశస్వాతంత్ర్యం తరువాత అనేకంగా వెలువడినాయి. దీన్నిబట్టి ఇక్కడ ఒక అంశం మనం గుర్తించవలసి ఉంటుంది. దేశం స్వాతంత్ర్యంపొందడంతోనే దేశభక్తి, జాతీయ భావన సమాప్తికాదు. కాకూడదు కూడ. స్వాతంత్ర్యోద్యమానికి పూర్వం జాతిలో ఈ భావన ఉంది. కొంతకాలం ఇది సుప్తమై ఉన్నది. తిరిగి స్వాతంత్ర్య ఉద్యమం విజృంభించడంతో మళ్లి ప్రజ్వలించింది. స్వాతంత్ర్యం సిద్ధించాక కూడ దీని అవసరం ఉంది. ఇప్పుడింకా ఎక్కువ ఉన్నదనే చెప్పాలి. ఎందుకంటే, మళ్లి తిరిగి దేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోకుండా, ఎల్లప్పుడు నిత్యచైతన్యవంతంగా ఉండేందుకు, భవిష్యత్తులో సౌభాగ్యాన్ని ఫలవంతం చేసేందుకు ఇది అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ అవసరమే ఔతుంది. ఈ వ్యాసం 1950 తరువాత వచ్చిన రచనలకు మాత్రమే పరిమితమైంది.

భారతదేశ భౌతిక సంపదలోని భాగాలే నదీనదాలు, పర్వతాలు, పుణ్యక్షేత్రాలు, చారిత్రక ప్రదేశాలు. ఇవి జాతికి మహనీయమైనవి, పవిత్రమైనవి. ప్రతి భారతీయుణ్ణి ప్రత్యక్ష సంబంధం చేత జాతీయభావ ప్రేరితుణ్ణి చేసేవి.

"జయజయజయ ప్రియభారత జనయిత్రీ దివ్యధాత్రి
జయజయజయ శతసహస్ర నరనారీహృదయనేత్రి."

శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రి భారతదేశాన్ని మాతృమూర్తిగా స్త్రీ పురుష సమాహితమైన అసంఖ్యాక జనానీకంతో రూపొందిన సంఘటిత శక్తిగా ఐక్యతను భావిస్తూ వ్రాసిన గీతం.

"ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా
భారతభువి పొంగెను ముక్త జీవధారా"

పరపాలన నుండి స్వాతంత్ర్యాన్ని పొంది దేశమంతటా స్వేచ్ఛా భావనలో కూడిన చైతన్య శక్తి ప్రవహిస్తూన్న తీరు ఇందులో దర్శితమైంది. ఈ జీవధార జాతిమనుగడకు అత్యంత ఆవశ్యకమైంది.

మహాకవి శ్రీ దాశరథి మంజీరా నదిని వర్ణిస్తూ-
"ఎవరి గజ్జెల రవళివే నీవు మంజీర
ఎవరి కజ్జల బాష్పధారవే నీవు మంజీర
నీవుపారిన దారిలో ఇక్షుదండాలు
నీవు జారిన జాడలో అమృత భాండాలు."

నిజాంసాగరు మంజీరానదిపై నిర్మితమైంది. ఈ నదీవర్ణనం నదీ జలాలతో దేశం సస్యశ్యామలం, విద్యుత్కాంతులాలంకృతం కావడం ప్రగతి పథంపై దృష్టి సారించడం ఇందులో కనిపిస్తుంది.

"నా తెలుగువీణ పోయిన మూర్ఛనలు నేడు
నీరుగా పారి నిండినవి నా భూమిలో."

దేశభక్తి స్ఫోరకమైన భావనతో నది పారిన పాయలలో జాతి సౌభాగ్యం చిత్రింపబడింది ఈ గేయంలో.

సంస్కృతీ స్వరూపానికి సంబంధించిన దర్శనంతో దేశభక్తి ప్రబోధకమైన కావ్యా లనేకం వచ్చాయి. విశ్వనాథవారి 'ఝాన్సీరాణి', 'శివార్పణం', ముదిగొండ వీరభద్రమూర్తిగారు 'వందేమాతరం', ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి గారి 'కీర్తితోరణం' పేర్కొనదగినవి. ఇవి చారిత్రకమైన వస్తు నేపథ్యంతో జాతీయతా ప్రబోధం లక్ష్యంగా కలిగినవి. పైన పేర్కొన్నట్లు ఒకే రచనలో భౌగోళిక, సాంస్కృతిక, తాత్త్విక, ప్రబోధాత్మక లక్షణం ఆయా సందర్భాలను బట్టి ఉండవచ్చు. ఈ రచనల్లోను ఈ అంశాలు పుష్కలంగా కన్పిస్తాయి. ఐతే ప్రస్తుత వ్యాస పరిధినిబట్టి ఆయా అంశాలు, ఆయా సందర్భాల్లో ఉల్లేఖితం కావడం జరుగుతుంది.

"తనదేశము తనధర్మము
తనవిద్యయు వదలి యెవడు తాఁ జేరుఁ బరా

వని విద్యాధర్మము లా
జను దొక్కడు చచ్చు రెండు చాపలు ధరణిన్"

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథవారి 'ఝాన్సీరాణి' - దేశగతమైన, ధర్మనిష్ఠమైన లక్షణంతో ఉజ్జ్వలమైన వీరరసంతో ఆవిష్కృతమైన కావ్యం. ధర్మవీరం ప్రాధాన్యం వహిస్తుంది. ఛత్రపతి శివాజీ వ్యక్తిత్వాన్ని జాతీయ భావనతోపాటు తత్వపరమైన అంశాలను జోడించి చేసిన అపూర్వరచన విశ్వనాథ వారి శివార్పణం. శివాజీ కారణజన్ముడుగా, అవతార పురుషుడుగా, యోగ మూర్తిగా, శక్తి స్ఫూర్జితుడుగా భావితమైన కావ్యమిది.

"మనము మనము కలసినచో
మన మతమును నిల్పవచ్చు మనదేశమ్మున్
మనది మనది కావచ్చును
మనయనునది మొదలు జీవమార్గము నందున్."

వ్యక్తి, వ్యక్తుల సమాహారమైన ఈ దేశ ప్రజలు- వీరిలో అనంతకాలంగా నిలిచి ఉన్న ఆధ్యాత్మిక శక్తి ప్రతిఫలించే శక్తిమంతమైన రచన ఇది.

దేశంలోని ఉద్యమాలకు కవిత్వానికి విడదీయరాని అనుబంధం ఉంది. ఉద్యమకాలంలో కాకుండా ఆ తరువాత కాలంలో ఉద్యమ స్ఫూర్తిని తనలో నిలుపుకొని దేశప్రజలలో నిలిపేందుకు చేసిన అపూర్వమైన కృషిఫలమే శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి 'వందేమాతరం'.

"ఎవడా చెప్పెడివాడు భారతజనం బెన్నేండ్లొ నేర్వన్ వలెన్
సవురా పాలన సల్పుకోననుచు నా సర్వజ్ఞు డజ్ఞుండె యీ
యవని న్నాగరకత్వ రేఖలకు బీజావాపనం బేడు చే
సె విచారించిన భారతున్ గుఱిచి యీ శీర్షోక్తి పల్కాడుచే."

ప్రపంచంలోని నాగరత్వ రేఖలకు బీజావాపనం చేసిన భారతీయుల ఔన్నత్యాన్ని ఆవిష్కరించే దేశభక్తి ఇందులో వ్యక్తమౌతుంది. ఈవిధమైన సాహిత్య జాతి చరిత్రను మననం చేయడంతో జాతి జాగృతికి ప్రేరకంగా ఉంటుందనే విశ్వాసం ప్రబలంగా కన్పిస్తుంది.

"భారతీయ జనుల స్వాతంత్ర్య దీక్ష
మారాకు దొడిగిన ప్రాకుతో సెనసె
భారత హృదయంబు పల్లవించినది
పికరుతి మాతృగీతిక వెల్లివిరిసె
భారతీయ ప్రజాభావ కుండముల
స్వాతంత్ర్య సముపేక్ష జ్వాల దగ్నియయ్యె"—

అంగ్లేయుల పాలనలో బానిసత్వాన్ని అనుభవించే భారతజాతిలోని స్వాతంత్ర్య దీక్ష, స్వాతంత్ర్యభావన, స్వాతంత్ర్య లక్ష్యం ఏవిధంగా ఆకృతిని పొందిందో ఈ మహాకావ్యంలో వీరభద్రమూర్తిగారు ఎంతో ప్రతిభావంతంగా సాక్షాత్కరింప జేశారు.

చారిత్రక నేపథ్యంతో ఇటీవల వచ్చిన మహాకావ్యం 'కీర్తితోరణం'. ఇందులో ఆంధ్రదేశానికి సంబంధించిన గాథ వర్ణింపబడింది. కాకతీయ వంశానికి చెందింది. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి చేతిలో దేశభక్తి దీపితమైన కళా కృతిగా రూపొందింది.

"తొంటిశౌర్యాతిశయమ్ము సంస్కృతి
నరమ్ములలో ప్రవహింప బాడెదన్"—

అని ఈ కవి దృఢమైన నిశ్చయభావంతో ఉపక్రమిస్తారు. ఇందులో వీరుల శౌర్య పటిమ మరియు ప్రజల ఉత్సాహ శక్తి, సంస్కృతి - వీటి ప్రభావోపేతమైన జీవవంతమైన స్వరూపం ఆవిష్కరింపబడింది. కాకతీయుల సామ్రాజ్యానికి తిక్కన సోమయాజి మనుమసిద్ధి వద్ద నుండి రాయబారం నడిపేందుకు వచ్చిన సంఘటనతో మొదలై, చివరకు ఫలప్రాప్తిని పొందే సుస్థితి వరకు కథాసూత్రం పర్యాప్తమైంది.

"గీతులుకట్టి ఆంధ్రసితకీర్తికి
తోరణమాల లల్లుచున్"

అన్న కవి మాటల్లో కీర్తితోరణం ఈ విధంగా సార్థకమైంది. ఇందులో ముఖ్య మైన అంశం - జీవితం యొక్క అమూల్యమైన విలువల్ని ఎత్తి చూపడం;

ప్రాణాలకన్నా స్వేచ్ఛ, జాతిగౌరవం ముఖ్యమన్న భావనతో ప్రేరితమైంది. జీవితంలో స్వేచ్ఛ, త్యాగం, కరుణ, దేశాభిమానం మొదలైన ఉదాత్తాశయాలను ప్రతిఫలిస్తూంది.

తత్కాలీనమైన రాజకీయవాతావరణంలో ఉద్యమాలను, యుద్ధాలను, విశేషస్థితులను, వైయక్తికమైన స్పందనలను, వర్తమానస్థితులను ఆధారం చేసికొని ఎన్నో ఖండికలు అవతరించాయి. ఇక్కడ కొన్నింటిని మాత్రమే ప్రాతినిధ్యపూర్వకంగా స్వీకరించడం జరుగుతుంది.

దేశం స్వాతంత్ర్యం పొందాక తిరిగి కలతలతో, కలహాలతో విచ్ఛిన్నం కాకూడదని శ్రీ ఆరుద్ర విశ్వాసం.

"గరుత్మంతుడు తెచ్చిన అమృతం
దక్కించుకోవడం అనృతం
దర్భలు నాకేరు మన ఏలికలు
అందుకే ఈ నాలుకల చీలికలు"—

స్వార్థపరులైన రాజకీయవాదుల కుటిల ప్రవర్తనం దేశసమగ్రతకు భంగం వాటిల్లజేసే తీరు ఇందులో భావితమైంది. జాతీయ భావనను ఉద్దీపింపజేస్తూ, దేశ సమగ్రతను కాపాడుతూ ప్రజల సమైక్యతను ఆవిష్కరిస్తూంది. "మూడు రంగుల ప్రభాతం మూర్తీభవించినపుడు / ఏడు స్వరాలూ కలిసి ఏం చక్రా మోగినపుడు / పంచభూతాలు మంచిని దీవిస్తున్నప్పుడు / వంచబడిన తలలన్నీ మంచుకొండల్లా"—లేచా యంటాడు కవి.

దేశంపై అనుకోకుండా హఠాత్తుగా ఆపతితమైన విపత్కరమైన యుద్ధ స్థితిలో దేశసమగ్రతను, దేశ క్షేమాన్ని అభిలషిస్తూ ప్రజల్లో దేశభక్తిని, వీరభావనను ఉజ్జ్వలింప జేస్తూ అనేకమైన రచనలు వచ్చాయి. చైనా, పాకిస్తాన్ దండ యాత్రలను పురస్కరించుకొని ఎందరో కవులు తమ దేశభక్తిని కవితల్లో ప్రకటించారు.

మనదేశం మీదికి చైనాదురాక్రమణ చేసినప్పుడు చలించిన ప్రముఖ అభ్యుదయకవి—శ్రీ పురిపండా అప్పలస్వామి ఈ విధంగా గర్జిస్తున్నాడు—

"భారత దేశం మా దేశం
హిమాలయం మా పొలిమేర
ఎవ్వడురా మా హిమాద్రి శిఖరం
రక్తం చిందిన రాక్షసుడు?
ఎవ్వడురా మా తపోవనంలో
చిచ్చురగిల్చిన దానవుడు?"
('సమరగీతి' సంకలనం నుండి-వే. నరసింహారెడ్డి-1963)

దేశంతో కవి కున్న గాఢానురక్తి ఇందులో వ్యక్తమవుతున్నది.

మరో మహాకవి - శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు సంప్రదాయ మార్గం లోని ఛందస్సులో చైనావాడిని ఈ విధంగా హెచ్చరిస్తున్నాడు-

"ప్రాణపదమ్ము మాకు హిమవంతము, మాకథలెల్ల తద్యశ
స్స్నాన పునీతముల్ విమతసైన్య పదార్పణ కిచ్చగింతుమే
మానము వోవ నింక కసుమాలపు జీవన మేమి శాంతి సం
ధానము సాగిరాదు కదనంబున ధర్మము తేలిపోవలెన్."
('సమరగీతి' సంకలనం నుండి)

కవి తన ధర్మ పతాకను చైనా వాని గుండెలో నాటి, ధర్మ రక్షణ కోసం దేని కైనా సిద్ధమేనని శత్రుమూకల్ని మందలిస్తున్నాడు.

అట్లాగే మహాకవి శ్రీ దాశరథి-

"గిరి మేల్కొన్నది పురి మేల్కొన్నది
గిరిగుహలో కేసరి మేల్కొన్నది
గిరిపురవనముల ధర మేల్కొన్నది
నరనారీ సంతతి మేల్కొన్నది."

అని ఇంతకాలం శాంతి స్థితితో జీవనం గడిపే ప్రజల మనస్సులో సుప్తమై ఉన్న వీరకేసరి మేల్కొని విజృంభించిన స్థితి ఎంతో భావస్ఫోరకంగా వర్ణితమైంది.

ఇదే సందర్భంలో డా॥ సి. నారాయణరెడ్డి-

"భరతజాతి సత్త్వమ్మును
పరీక్షించబోకుము అది
సహనానికి ఏలిక ! ఈ
సమరానికి కాళిక"-

భారతీయుల సత్త్వాన్ని పరీక్షించడం, సహనాన్ని పరీక్షించడమే అని ఈ యుద్ధ ప్రయత్నాన్ని లక్షించి సమరానికి భారత జాతి వెనుదీయబోదన్న ఆత్మ శక్తిని భావింపజేసే సమర సందేశాన్ని వినిపించారు.

శ్రీ బాలగంగాధర తిలక్-

"నమ్మకు నవ్వలేని వాడిని
పువ్వులు చిదిమే వాడిని
బరిమీద వదలిన పాముని
చైనా వాడిని''—('సమర గీతి'నుండి)

అని చైనీయుల కుటిలత్వాన్ని వ్యంగ్యంగా ఎంతో హృద్యంగా చిత్రించారు.

జాతికున్న స్థిరత్వాన్ని చాటి, దానికి భంగం కలిగించే ఏ విషయాన్నైనా ప్రతిఘటిస్తూ శ్రీ మాదిరాజు రంగారావు తన కవిత్వంలో-

"భరత జాతి హృదయం
శాంతికపోతి నివాసం
నివాసంపై తుపాకులు ప్రేల్చే
హంతకుని మరవకండి"—

"కదలండి శతఘ్నులవలె" అని హెచ్చరించి జాతిసమైక్యత నుద్దీపింపజేశారు. అంతేకాక-

"కొండవలె నిలచి కదలిక లేక
కలల తూగెడు జాతి కాదిది
చెలియలికట్ట ఎరుగని వార్నిధి
నిత్య జాగ్వర దేవతా మణి"—

అంటూ సుస్థిర భారత జాతి సమున్నత ఆత్మ సౌందర్యాన్ని దర్శించినారు.

శ్రీ కోవెల సంపత్కుమారాచార్య-

"మన గోసంపద నాహరించిన నేమా సంతతో నాగునా
మన భూసంపద నాహరింప రని సంభావింప వీలున్నదా?"

('సమరగీతి' నుండి)

అని మహాభారతేతివృత్తాన్ని అన్యాపదేశంగా చైనా దురాక్రమణ సందర్భంలో భావింప చేస్తూ చేసిన ఉత్తమ రచన.

"నీ జనతాభిరక్షణము నీయది, దానికి నేరవేని, నే
నే జయశాలినై పరుని నిర్జితు చేయుదు,——"

అని దేశాన్ని రక్షించే వీర భావాన్ని అర్జునుని వ్యక్తిత్వంలో నిక్షేపించి దేశభక్తిని ప్రకాశింపజేశారు.

ఇక పాకిస్తాన్ మనతో కయ్యానికి కాలుదువ్వినప్పుడు కూడ ఎందరో కవులు గొంతు విప్పి పాకిస్తాన్ కుత్సితబుద్ధిని నిరసించినారు. దేశ సమగ్రత కోసం, జాతి సమైక్యత కోసం సందేశాత్మకమైన గీతిక లల్లినారు. ఖడ్గధారల పోలిన కవితా ధారతో పాకిస్తాన్ దురాగతమును ఖండించినారు. ఒక సుప్రసిద్ధ అభ్యుదయ కవి- శ్రీ సి. వి. కృష్ణారావు ఈ విధంగా విప్లవించినాడు-

"భరతావనీ!
మాతృశ్రీ!
నీ పుత్రుల క్షాత్రము చూడు
ఒకడు సింహబలుని చంపినవాడు
ఒకడు రక్కసి కోరలు పీకినవాడు
ఒకడు శతఘ్ని కాల్చినవాడు
ఒకడు విరోధి మదమడచినవాడు
.... .... .... .... .... .... ....
విజయం మనదే
విజయం మానవునిదే"

('సమర భారతి' సంకలనం నుంచి వే. నరసింహారెడ్డి, విశ్వావసు)

అంటూ పౌరాణిక గాథా స్ఫూర్తితో ప్రస్తుత క్లిష్ట పరిస్థితిని అన్వయిస్తూ పగవాని గుండెను కంపింపజేసినాడు.

మరొక ప్రముఖ కవి- శ్రీ అనుముల కృష్ణమూర్తి జాతి ధర్మాన్ని గుర్తు చేస్తూ, దేశప్రజల్ని ముందుకు దూకవలసినదిగా ఇట్లా ఉత్తేజపరుస్తున్నాడు-

"ఇది నీ మాతృత్రాణమ్మును
తీర్చుకునే తరుణమ్మున
దూకు కవిత
గుండెల్లో ధైర్యంగా చస్తే
బ్రతికించే కవిత
మొండిగ అనుమానంతో
బ్రతికితే చంపే కవిత" ('సమర భారతి' సంకలనం నుండి)

ఇక్కడ కవి తన వీరగీతం సోమరులను కూడా ఏ విధంగా తట్టిలేపి కదనానికి నడిపించగలదో విశదం చేస్తున్నాడు.

ఇట్లాగే ప్రజాకవి శ్రీ కాళోజీ నారాయణ రావు—
"పేరుకు పాకిస్తానము
తిమిరానికి తేజోనామము"—

అని వర్తమాన రాజకీయ స్థితిని ఎంతో వాస్తవ ధోరణిలో సునిశితమైన వ్యంగ్య స్ఫూర్తితో జాతిలో దేశభక్తి భావన నుద్దీపింపచేసే రచనలు చేశారు.

ఇట్లా స్వాతంత్ర్యానంతరం చైనా వల్లనూ, పాకిస్తాన్ వల్లనూ దేశానికి రెండుసార్లు కలిగిన విపత్తు సందర్భంలో తెలుగు కవులు దేశసంరక్షణకోసం కంఠమెత్తి గానం చేసినారు. ప్రజలకు వీరగంధం పూసి, ధర్మయజ్ఞానికి సమాయత్తం చేసినారు. దేశ ధర్మానికి గొడుగు పట్టినారు.

దేశప్రతిష్ఠతకూ ప్రతిష్ఠకూ, జాతి మనుగడకూ ఆపద వాటిల్లినప్పుడల్లా కూడ కవులు చలించి కావ్యసందేశ మందించారు. అటువంటివారిలో శ్రీ వే. నరసింహారెడ్డి—

"దేశాన్ని విభజించి భజించరాదు
అది అఖండ స్వరూపం"——

అని భారతదేశం యొక్క అఖండ స్వరూపాన్ని భావింపజేస్తూ భారతీయుల్లో ఆ భావానికున్న పరివ్యాప్తినీ, అవసరాన్ని ఎంతో సుందరంగా చెప్పారు.

శ్రీ పేర్వారం జగన్నాథం——
"మన కన్నతల్లి కీనాడు
వెన్నులో పుట్టింది రాచపుండు
నాటువైద్యాలూ సర్వసచివులూ
పనికిరారు" అంటూ—

ఈ సమయంలో ఏదోవిధంగా దానికి సరియైన చికిత్స చేయండి, ఈ వ్రణం మాసిపోదన్నారు. మాతృదేశ ప్రస్తుత పరిస్థితిని- దాన్ని తొలగింప వలసిన అవసరాన్ని, సమయానికి తగిన చికిత్స చేయకపోతే వాటిల్లే మృత్యుస్థితిని భావింప జేశారు. భారతీయతకు భంగం కలిగించే విషమ శక్తులను ప్రతిఘటించవలసిందిగా, వారి విపరీత చర్యలను ఎదుర్కోవలసిందిగా ధ్వనింప జేశారు.

శ్రీ కోవెల సుప్రసన్నాచార్య-
"అనంతకాలమూర్తివి నీవు, అయినా నేడు సంజీవనివి
పరిగెత్తే జలపాతానివి, ప్రఫుల్ల సహస్రదళ పద్మానివి"-

అని దేశం యొక్క మాతృ స్వరూపాన్ని దేవీభావనతో నిరంతరం అవిచ్ఛిన్నంగా ప్రవహించే శక్తిరూపంగా ఎంతో ఉదాత్తంగా దేశభక్తి భావనా మహితంగా వర్ణించారు. ఇది ఆత్మతత్త్వం, అమృతత్వం, చైతన్య స్వరూపం, పరిపూర్ణత అనే అంశాలతో తాత్త్వికమైన స్ఫూర్తినిస్తూ దేశభక్తి భావోపేతమైంది.

సామాన్య కర్షకుని గాథను ఇతివృత్తంగా స్వీకరించి మలచిన ఆధునిక ఇతిహాసం - గుంటూరు శేషేంద్ర శర్మగారి "నా దేశం - నా ప్రజలు."

"ప్రాణాలతో నా దేశపు సరిహద్దుల కుడ్యాలు
లేపుతూ శత్రువుల గుండెల్లోకి"-

అని శత్రు నిర్మూలనకోసం జాతిని ఆత్మార్పణ భావనతో సిద్ధం చేసే మహా ప్రయత్నం, లక్ష్యశుద్ధి ఇందులో కన్పిస్తుంది.

మహాకవి శ్రీ దాశరథి-

తెలంగాణా విముక్తికై ఎంత ఆవేదనపడి ఉద్వేగంతో ఉపక్రమించారో అదే స్థాయిలో మహాంధ్రావతరణకు కూడా అంతే ఉత్సాహంతో గళమెత్తి గానం చేశారు.

"నాకు కావలె మహాంధ్రోర్వర
వంటి అన్నల్లార తూరుపు
దాటి కెదురుగ ద్వారబంధము
మనిషి మనిషి మనస్సుదారుల
రాగబంధము, రాగబంధము."

ఆంధ్ర రాష్ట్రంపై అభిమానమున్నప్పటికినీ మానవతను కూడా అడుగడుగునా ధ్వనింపజేస్తూ వీరి రచన ఒక ప్రత్యేకతన్ను సంతరించుకుంది.

"తెలుగు శబ్దమహిమ, తెలుగుధీగరిమంబు
తెలుగు ధర్మనిరతి తేటపడగ
ప్రభవమందియున్న ప్రత్యేక వీరాంధ్ర
రాష్ట్రమునకు కోటి ప్రణుతి పూజ"

అని జాషువా ప్రత్యేకంగా వీరాంధ్ర రాష్ట్రానికి ప్రణతు లర్పించారు.

శ్రీ అనుముల కృష్ణమూర్తి—

"నీవొక జీవజాతిని జ
నించిన పాడపు
విస్మరించకీ
భావము నీ చరిత్ర బహు
పౌరుష గాథ- స్మరించుకొమ్మ

అని తన జాతియొక్క జీవవంతమైన లక్షణాన్ని ఉటంకిస్తూ పౌరుష గాథలను స్మరిస్తూ పురోగమించ వలసిందిగా జాతి నుద్బోధిస్తాడు.

జాతికి ఆదర్శంగా నిలిచిన దేశనాయకుల స్ఫూర్తి సందర్భంలో కాని వారి జీవితాన్ని చిత్రిస్తూనో ఎందరో కవులు కావ్యాలను వెలయించారు. ఒక్కొక్కప్పుడు తాము పొందిన వేదనను జాతివేదనగా, సమష్టికి కలిగిన వేదనగా పర్యవసింప జేశారు. మొత్తం మీద ఈ కావ్యాలు దేశభక్తి- జాతీయ భావన దృష్టితో సామాజిక శ్రేయస్సును అభిలషించేవి. ఈ సందర్భంలో డా॥ సి. నారాయణరెడ్డిగారి 'కర్పూర వసంతరాయలు' పేర్కొనదగింది. వ్యక్తి తన దేశంకోసం తన ప్రాణాలను త్యాగం చేయడంలో సామాజికమైన శ్రేయో భావన నిక్షిప్తమైంది. "వ్యక్తి కన్నను దేశ సౌభాగ్యమ్ము ఆదర్శ పాత్రమైనది"- అని వ్యక్తి- సంఘం రెండింటిలో సంఘం అంటే దేశం ప్రథమగణ్యమన్న భావన లక్ష్యంగా కలిగిం దీ కావ్యం. ఈ కవిదే మరో రచన "జాతిరత్నం." దేశభక్తి, స్వాతంత్ర్య భావన మొదలైన వాటితో పాటు విశ్వజనీనమైన శాంతి, సమత, అహింస మొదలైన భావాలతో నెహ్రూ అపూర్వమైన వ్యక్తిత్వాన్ని చిత్రిస్తుంది. ఈనాటి సంక్లిష్ట స్థితిలో దేశప్రగతికి, విశ్వశాంతికి గాంధీజీ, జవహర్‌లాల్ సిద్ధాంతాల అవసరం ప్రసక్తమైంది.

1950 తరువాత తెలుగు కవిత్వంలో దేశభక్తి, జాతీయ భావనను సంబంధించిన ఎన్నో రచనలు వచ్చాయి. ఇవి చారిత్రకమైన వస్తువుతో రాజకీయమైన అంశాలతో, వర్తమాన స్థితులతో, అనేకం ఎప్పటికప్పుడు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో జాతిని చైతన్య శిఖరాలపై నిలిపే ప్రయత్నం చేశాయి. కాలం గడుస్తున్నకొద్దీ జాతీయ భావన క్రమక్రమంగా సామాజికమైన అవసరాలనుబట్టి జాతి సంస్కృతీ స్వరూపాన్ని ప్రతిబింబిస్తూనే మానవతపై దృష్టితో అంతర్జాతీయమైన అంచులను స్పృశిస్తూ ఉండడం కవులందరి రచనల్లోను అంతో ఇంతో స్పష్టంగా కనిపిస్తుంది.

# ఆధునిక కవిత్వం : దేశీయత

కోవెల సంపత్కుమారాచార్య

కవిత్వంలో, అందులోనూ, ప్రస్తుతానికి ప్రధానంగా అభ్యుదయ కవిత్వోద్యమానంతర తెలుగు కవిత్వంలో 'దేశీయత'ను గూర్చి వివరించుకోవటానికి ముందు, పూర్వరంగంగా ఒకటి రెండంశాలను ప్రస్తావించుకోవటం అవసరం.

శాశ్వతంగా ఈ దేశం బానిసదేశంగానే ఉండేట్టు చేయాలనే దురాలోచనతో అనాడు బ్రిటిషు ప్రభుత్వం ఈ దేశంలో ప్రవేశపెట్టిన ఇంగ్లీషు విద్యావిధానానికి కట్టుదిట్టంగా దూరాలోచనతో రూపకల్పన చేసినవాడు మెకాలే అనే విషయం ప్రసిద్ధమే. ఆయన దూరాలోచన ఎంతటిదో, దాని స్వరూప స్వభావాలేమిటో ఆయన తన తల్లికి ఆనాళ్లలో ఈదేశంలో తానుంటూ రాసిన ఒకానొక ఉత్తరంవల్ల తెలుస్తుంది. ఆ ఉత్తరంలో తాను రూపొందించిన విద్యావిధానాన్ని గూర్చి ప్రస్తావించి-ఈ విధానంవల్ల మరికొన్ని సంవత్సరాల్లోనే ఈ దేశీయులు మాటవరసకు భారతీయులుగానే అన్పించినాగూడా, ఆలోచనా పరంగానూ, ఆచరణపరంగానూ, 'భారతీయులు' కాకుండా విదేశీయులుగా వ్యవహరిస్తారన్న విశ్వాసాన్ని దృఢంగా వ్యక్తీకరించాడు. అంటే, దేశీయులయిన ఈ భారతీయులంతా దేశీయతను కోల్పోయి ఆలోచన సాగిస్తారనీ, వీళ్ల ప్రవర్తన దేశీయతారహితంగా తయారవుతుందనీ ఆయన తాత్పర్యం. ఇట్లా ఆయన ఉద్దేశించిన వాళ్లను గురించే కావచ్చు,-'ఆంగ్ల మానస పుత్రులు' అన్న పదబంధం వ్యాప్తిలోకి వచ్చి ఉంటుంది. అయితే, ఆయన విశ్వాసం పూర్తిగా విఫలమేమీ కాలేదు. ఆయన విధాన ప్రభావం, నేటికీ పూర్తిగా వదిలించుకోలేక పోవటాన, ఇంకా అంతో ఇంతో ఈ దేశాన్ని సతమత పెడుతూనే ఉంది. ఈ దేశానికి ఇంగ్లీషు తప్ప మరి గత్యంతరం లేదన్న విధంగా 'ఉద్యమాలు' నిర్వహించే కొందరు 'బుద్ధి జీవులకు' ఇంకా ప్రాణంపోస్తూనే ఉంది. దేశీయత యథార్థంగా అనుభవంలోకి రానీయకుండా అడ్డుపడుతూనే ఉంది. కాని-

వేలయేండ్ల పటిష్ఠమయిన పునాది కలది కావటాన, నేటివరకీ కన్పించే కొమ్మలు వగైరాలను నరికేసినా గూడా దృఢంగా నేలలోకి లోతుగా పాతుకు పోయిన వేళ్లల్లో జీవసత్వం ఇగిరిపోకపోవటం మూలాన, అసలుకది ఇగిరిపోయేది కాకపోవటాన, ఎన్నెన్ని అఘాతాలయినా సరే తట్టుకొని దేశీయత నిలదొక్కుకుంది. కమ్ముకొనే పర ప్రభావాల ఉక్కుపొరల్ని చీల్చుకొని పునః పునరుత్థానం పొందింది. పునఃపునః విజృంభించింది. విజృంభించుతూనే ఉంది; ఉంటుంది కూడా. ఇది దేశీయతయొక్క మౌలిక స్వభావం. ఈ దేశ జీవన వివిధ రంగాలను సముజ్జ్వలం చేసిన, చేస్తున్న ఎందరో మహానుభావులు ఇందుకు దాఖలా. అయితే-

మెకాలే ఆలోచనలు సఫలత్వం పొందిన వాసనలు, చీకటి నీడలు ఇంకా కొంత కొంత మిగిలే ఉన్నాయి. రకరకాల స్వార్థాల వత్తిడులు కారణంగా తెలిసి కొంతా, తెలియక మరికొంతా, భ్రాంతులతో ఇంకొంతా దేశీయతను విచ్ఛిన్న పరిచే ప్రయత్నాలు, వాటి ప్రతిరూపాలు రకరకాల '-మానసపుత్రులు' ఇంకా వస్తూనే ఉన్నారు. అందుకే దేశీయతను గూర్చి మరలామరలా విచారించుకొంటూ ఉండవలసిన అవసరం, అవగాహన పరచుకోవలసిన ఆవశ్యకతా ఏర్పడుతూనే ఉంది.

దేశీయత సందర్భంలోనే జాతీయతను గూర్చికూడా అవగాహన అవసరం. ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటి. 'జాతి' అనేదాన్ని పట్టుకొని ఈ దేశం బహుళ జాతిమయం, నానా జాతిమయం అనే 'వాదం' ఒకటి ప్రచారంలోకి వచ్చింది. ఈ దేశం ఏ జాతికీ సంబంధించింది కాదనీ; అనేక జాతులు ఒకటి తరువాత ఒకటిగా ఈ దేశంలోకి వచ్చాయనీ; ఒకటి ముందు, ఒకటి వెనుక-భేదం ఇంత మాత్రమేననీ; కాగా, బలవంతమయిన జాతి దేశాన్ని పరిపాలిస్తుందనీ; ఆంగ్లేయులు అన్నివిధాలా బలవంతులూ, ఉన్నతులూ, 'నీతి నిపుణులు' కావటాన వారే ఈ దేశాన్ని పరిపాలించటానికి అర్హులు; వారిది 'ధర్మరాజ్యం'- ఈవిధంగా దేశీయతా విరహితమయిన ఒక విచిత్రవాదం ఆనాటి పరిపాలకుల ప్రేరణ, వత్తాసులతో ఈ దేశపు గాలిలో, ఆకాశంలో ఊదసాగింది. ఈ ఊత తెలుగు సాహిత్యం-కవిత్వంలో గమనిస్తే గురజాడ నాటికే స్పష్టపడ్డట్టు కన్పిస్తుంది. ఈనాడు ప్రచారంలో ఉన్న గురజాడ 'దేశభక్తి' లేదా 'దేశమును

ప్రేమించుమన్నా' అన్న ఖండికలోంచి తొలగించబడినాగూడా, గురజాడ 'స్వదస్తూరి'లో-

'నిన్న వచ్చారింగిలీషులు,
మొన్న వచ్చిరి ముసలుమను, లటు
మొన్న వచ్చిన వాడ వీవని
మరచి, వేరులు బెట్టకోయి!'

(గురజాడ రచనలు: కవితల సంపుటం. సంపా. సెట్టి ఈశ్వరరావు; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ: 1986) అన్న పద్యం కన్పిస్తుంది. 'ఈ వు' (= నీవు) అంటే, 'భారతీయుడు' (?) అటు మొన్న వస్తే, మొన్న నిన్న వచ్చినవారు ముసల్మానులు, ఇంగ్లీషువారు, ఈ విషయం మరచిపోవద్దు. మరిచి వేరులు పెట్టకు- వేరే అనుకోకు అని తాత్పర్యం. రావటంలోనే వెనుకా ముందూ తప్ప, అందరూ వచ్చినవారే. కాబట్టి ఖచ్చితంగా ఈ దేశం ఎవరిదీ కాదని ఉద్బోధ. జాతికీ, దేశానికీ ఉండే అవినాభావ సంబంధాన్నీ, ఆత్మీయతను విచ్ఛిన్నం చేయటం ఈ తరహా వాదం పరమార్థం. కాలక్రమంలో ఆనాటి పరిపాలకులు ఆర్య-ద్రావిడ భేదాన్నీ, ద్విజాతి 'సిద్ధాంతా'న్నీ పెంచి పోషించి తమ ప్రభుత్వ రక్షణ కోసం స్థిరీకరించారు. ఈ తరహా వాదాలను విని పొంగి పోయి, స్వీకరించి, ఆంగ్లేయుల పరిపాలనకు తృప్తిపడి-

'వచ్చె నిదె బంగారు కాలము
వాంఛ లెల్లను తీరు, సుజనుల
కాంగిలేయుల ధర్మరాజ్యము
జ్ఞానమును స్వాతంత్ర్య మిచ్చుచు
సంతతము వర్ధిల్లు గావుత'

(గురజాడ: 'డించులంగరు' 1915 అక్టోబరు) అంటూ మనస్ఫూర్తిగా వాంఛించారు. 1912 లో ఐదవ జార్జి ఢిల్లీ రాక సందర్భంగా ముక్త కంఠంతో 'నల్లవాడును, తెల్లవాడును। నెల్ల శుభముల గూర్చుగావుత। తల్లి మేరీ మహారాజ్ఞికి। జార్జినరపతికిన్' అంటూ ఉద్ఘోషించారు. (గురజాడ గేయం 'ముత్యాల సరం' పూర్తి పాఠం అనుబంధంలో చూడవచ్చు).

> "విద్యా వ్యాప్తి విషయంలోనూ, సాంఘికంగా అభ్యుదయకరమైన చర్యల విషయంలోనూ ఇంగ్లీషు పాలనవల్ల దేశానికి మేలు కలుగుతూ ఉండడం చేత వీరేశలింగం, గురజాడ అప్పారావు వంటి మేధా (వులు) అది "జ్ఞానమును, స్వాతంత్ర్య మిచ్చే" "సజ్జనుల వాంఛలను తీర్చే" "ధర్మ రాజ్యం" గా దానిపట్ల భ్రమలకు లోనయ్యారు. గురజాడ పుట్టుకకు ముందరా, బాల్య విద్యార్థి దశల్లోనూ దేశంలో వీస్తోన్న గాలులు యిటు వంటివి."

(సెట్టి ఈశ్వరరావు, 1986) ఒక వైపు దేశంలో జాతీయోద్యమం తీవ్రమవు తున్న కాలం. (1912, 1915) లోనూ గురజాడవంటి మేధావుల్లో ఈ గాలులు వీస్తూనే ఉండటానికి మూలం దేశీయత, జాతీయతలను గూర్చి సరయిన అవగాహన లేకపోవటం, తామున్న 'ఆస్థానా'ల సుస్థితి ప్రధాన లక్ష్యం కావటం మొదలయిన ఇతరేతరాంశాలు మూలం. ఇవన్నీ ఇంగ్లీషువాళ్ళ రకరకాల వాదాలతోపాటు ద్విజాతి సిద్ధాంతానికి ప్రత్యక్షంగా పరోక్షంగా బలం సంపాదించి పెట్టినాయి. ఈ దేశ స్వాతంత్ర్యోద్యమంలోని ఒక ప్రధాన దశలో ఈ 'ద్విజాతి సిద్ధాంతం' తీవ్ర సమస్యగా తయారయి, చివరకు దేశాన్ని చీల్చింది. నిజానికిది కపటంతో కృత్రిమంగా కల్పించబడిన 'సమస్య.' ఆనాటి ఆంగ్ల పరిపాలకులు 'విభజించి పాలించట'మన్న కూటనీతి ప్రాతిపదికతో తమను నిరాకరించే దేశీయుల్ని రక రకాల కృత్రిమోపాయాలతో చీల్చి, చివరకు దేశాన్ని విడిచి వెళ్ళక తప్పని పరిస్థితి ఏర్పడ్డప్పుడు ఈ 'సిద్ధాంతా'న్ని 'తీవ్ర సమస్య'గా చూపించి, దారుణ కల్లోలాలు సృష్టించి, మూక ఉమ్మడి బజారు మారణకాండదాకా ద్వేషాన్ని పెంచి, దేశాన్ని రెండు ముక్కలు చేసి 'వెళ్ళి' పోయారు. వెళ్ళారన్న పేరే తప్ప, వ్యాపించిన దేశీయతా/జాతీయతా రాహిత్యం ఆసరాగా 'స్వతంత్ర భారత దేశా'నికి కొంతకాలం- తమ ప్రయత్నాల ఫలితాలను జాగ్రత్తగా నిర్వహించు కొంటూ 'గవర్నర్ జనరల్'గా కూడా 'ఉండి' పోయారు. ఆ ముక్కలయిన దాని ఫలితాలను ఈ దేశం ఈ నాటికీ పరమ దారుణంగా అనుభవిస్తూనే ఉంది. నిజానికి ఆనాడు 'దేశీయ' నాయకత్వంలో దేశీయతా భావన కూటనీతికి బలి కాకుండా సమగ్ర దృక్పథంగా ఉండి ఉంటే ఈ పరిస్థితి ఏర్పడేదే కాదు. కేవలం ఆనాడే అని కాదు, ఏనాడేనాడు ఆ దృక్పథం కొరవడిందో ఆనాడానాడు ఆ ప్రమాదం అనుభవానికి రానేవచ్చింది; వస్తున్నది కూడా. ఇందుకు గత వర్తమాన

చరిత్ర తిరుగులేని సాక్ష్యం. మరి యింతయునా, ఈ నాటికి గూడా ఆ స్థితిని దేశం పూర్తిగా అధిగమించటానికి నానా ఇబ్బందులు పడుతూ ఉండటం ప్రత్యక్షమవుతూనే ఉంది. ఈ దేశీయతా సమగ్ర భావన ఇప్పటికీ పూర్తిగా కలుగనీయకుండా దాన్ని అడుగడుగునా దెబ్బతీస్తూ దేశాన్ని మరిన్ని ముక్కలు చేసే ప్రయత్నాలు లోనుంచీ, వెలినుంచీ సమసిపోక పోవటం, రకరకాలుగా ఉబుకుతూ ఉండటం, ప్రాణాంతకంగా కల్లోలాలూ-ప్రమాదాలూ పెచ్చుమీరుతూండటం వర్తమానానుభవం. కాగా, ఈ విధమయిన నేపథ్యం దృష్ట్యా 'దేశీయత' మౌలికమయిన దన్న యథార్థం అనివార్యంగా గుర్తింపదగింది.

నిజానికి దేశీయతనుంచే జాతీయత రూపొందుతుంది. ఈ సందర్భంలో శ్రీ అరవిందుల మాటలు సంస్మరించుకోవలసి ఉంటుంది.

> "జాతీయతకు దేశము పునాది; జాతికాదు, ధర్మముకాదు, మరేంకేదియు గాదు; కేవలము దేశమే. జాతీయతయొక్క మిగిలిన ఉపకరణము లన్నియు గౌణములు, ఉపకారకములు మాత్రమే. దేశమే ముఖ్యమయినది. ఆవశ్యకమయినది.... స్వదేశమున్నచో జాతి ఉండితీరవలయును. ఒక దేశమందు రెండు జాతులు చిరకాలము నుండజాలవు. కలిసియే తీరును.... కూటబుద్ధిగల ఇప్పటి కొందరాంగ్లేయ రాజనీతిజ్ఞుల ప్రేరణవల్ల ఆ విరోధము ప్రజ్వలించి చల్లారకున్నది. (ఆ చల్లారకుండుటకు) ముఖ్యమయిన అంతరాయము మాతృదర్శనము యొక్క అభావము.... ఏనాడు అఖండ స్వరూపమయిన మాతృమూర్తిని దర్శింతుమో, ఆమె రూపలావణ్యములచే పరవశులమయి ఆమె కార్యమునందు జీవితము సమర్పించు వేగముతో ఉన్మత్తుల మగుదుమో ఆనాడీ అంతరాయము తిరోహితమగును. భారత(దేశ)ము యొక్క ఐక్యము, స్వాతంత్ర్యము, ఔన్నత్యము సహజసాధ్యములగును...."

అన్నా రానాడు శ్రీ అరవిందులు. (శ్రీ అరవింద వ్యాసావళి, 'దేశము: జాతీయత'. అను. వేలూరి చంద్రశేఖరం. (1947) పు. 137-143) మరి, ఈ సందర్భంలోనే ఈ 'దేశీయురాలు' అయిపోయిన సోదరి నివేదిత మాటలు గూడా గుర్తు చేసుకోవలసి ఉంటుంది.

> "The principle of nationality depends upon the fact that the supreme organic circumstances in moulding the destiny of man, is place.... In the realm of thought.... each man must recognise his birthland as the supreme fact in his life, and must consciously bow himself to her influence, glorying in it, and striving to rediscover and realise it in its essentials. In the realm of feeling, he must relate himself to the birth land and to all those who, with him, are born of her.. The land and the people-India and the Indian nation."

అంటుంది సోదరి నివేదిత. (Sister Nivendita : 'The Principle of Nationality - Civic and National Ideals' Udbodhan Office. Culcutta (1978) pp. 43)

ఒక జాతి ఏర్పడటమనే దానికి మూలం దేశం. ఆ దేశపు భౌతిక భౌగోళిక స్వరూపాలు, పరిస్థితులు, ప్రకృతి, వాతావరణం, బతుకుదలకు సంబంధించిన రకరకాల వనరులు- వాటితీరులూ ఈ మొదలయిన ఇతరేతరాంశా లనేకం ఉమ్మడిగా 'జీవి'ని రూపొందించి తీర్చిదిద్దుతాయి. ఈ తీర్పులో, దిద్దు బాటులో జాతికి విలక్షణమయిన అనుభవాలు, ఆలోచనా విధానం, ఆచరణ రీతి ఏర్పడుతయి. అందుకని, దేశం జాతికి తల్లి. దేశాన్ని జన్మభూమి అనీ, మాతృ భూమి అనీ-అచ్చంగా మాతృ స్వరూపమనీ గుర్తించి సేవించడంలోని పరమార్థ మిది. 'వందేమాతరం' అన్నది దేశానికి స్వాతంత్ర్యోద్యమ మంత్రం కావటంలోని అర్థ మిది. 'జననీ జన్మభూమి శ్చ స్వర్గాదపి గరీయసీ' అని వాల్మీకిమహర్షి ఈ దేశానికి రామచంద్రుడి ద్వారా అందించిన ఆర్షవాక్కులోని మౌలిక తాత్పర్య మిది. దేశాన్నిబట్టి జాతికి గుర్తింపు. కాగా, జాతి ఆలోచన, ప్రవృత్తి, ఆచర ణాదుల ద్వారా దేశానికి గౌరవప్రతిష్ఠలు. తల్లీపిల్లల స్థితి. వ్యక్తుల జీవితంలోనూ దేశజీవితంలోనూ ఇదే అనుభూయమానమయ్యే అంశం. ఈ విధంగా దేశానికి జాతికీ అభేద ప్రవృత్తి. 'ఇప్పటికీ దేశమంటే అర్థం మట్టిగడ్డలే కాని, మనుషులు కాదు' (గురజాడ కవితల సంపుటం. పు. XVIII. 1986) అని వాపోవడంలో

అర్థం లేదు. దేశమంటే మట్టి కాదు, దేశమంటే మనుషు లనీ; లేదా, మనుషులు కాదు, మట్టి అనీ - ఈ రకమయింది, అవాస్తవికమయిన ఆలోచన. దేశం వేరు, అక్కడి మనుషులు అంటే, జాతి వేరు అనేది ఆధారంలేని అసంగతమయిన ఊహ. అభేద ప్రతిపత్తిని విచ్ఛేదపరచటానికి కల్పించబడే అపోహ.

కొన్ని సందర్భాల్లో ఒక దేశంలోకి మరొక దేశీయులు - ఏ రూపంగా, ఏ కారణంగా నయినా సరే-వచ్చే పరిస్థితులు అది అసహజమేమీకాదు. అయితే, ఆ వచ్చిన దశలో-ఆ రావటం సామూహికంగా కూడా అయి ఉంటే, లేదా, వచ్చిం తరువాత సమూహంగా ఏర్పడినా గూడా-కొద్ది కాలందాకా మౌలిక జాతితోబాటు ఈ 'జాతి' కూడా-అంటే, 'రెండు' జాతులు 'ఆ' దేశంలో ఉన్నట్లుగా భాసించ వచ్చు. కాని, అనతికాలంలోనే ఆ వచ్చినవారు ఈ దేశీయులతో కలిసి 'ఏక జాతి'గా విలీనం కాక తప్పదు. ఈ దేశంలోకి వచ్చి, ఇక్కడే నిజంగా స్థిరపడి పోయినప్పుడు, జననాదిక సంబంధ బాంధవ్యాలు ఇక్కడే యథార్థంగా కుదురు కున్నప్పుడు, మౌలిక జాతిని తీర్చిదిద్దిన ఈ దేశం 'సర్వాత్మనా' ఇక్కడే 'స్థిరపడిన'వారినీ 'తీర్చిదిద్దటం'లో సహజంగానే సమంగా ప్రవర్తిస్తుంది. అందు వల్ల, వారూ-వీరూ 'వేర'నే స్థితికి నిలుకడగానీ. ఉనికిగానీ ఉండదు. కాగా, విలీనమయి 'ఏకం' కావటం సహజం. మరి, కాకపోవటమనేది అసహజం, కృత్రిమం. ఈ కృత్రిమస్థితి శ్రీ అరవిందులన్నట్టు 'కూట బుద్ధి' రకరకాల స్వార్థాల కోసం ప్రవర్తించే ఇంద్రజాలం, మాయ. నిజానికి విలీనం కాకపోవట మని ఉండదు. కాని, విలీనమవుతూనే కానట్టుగా; అయికూడా కావద్దన్నట్లుగా ప్రవర్తించటం కూటబుద్ధి లక్షణం. కల్లోలాలు రేపటం దాని లక్ష్యం. కాగా, మతం, ఉపాసనా విధానం, భాష, సంఖ్య వంటి అంశాలనుబట్టి జాతులను, వర్గా లనూ గుర్తించే తరహా విధానం అసహజం మాత్రమే కాదు. అశాస్త్రీయం కూడా మతాది విషయాల్లో వైయక్తికమయిన అభిరుచిని, స్వాతంత్ర్యాన్నీ ఈ దేశం రూపొందించుకొన్న మౌలిక ఆలోచనా విధానం అనాదిగా మన్నిస్తూనే ఉంది; భావ వైవిధ్యాన్నీ, ఆలోచనా స్వాతంత్ర్యాన్నీ ఆదరిస్తూనే ఉంది. అది ఈ దేశ మౌలిక జీవన విధాన స్వభావం. అందువల్ల ఈ దేశం ద్విజాతి; లేదా, బహుళ జాతి-నానా జాతిమయమనే వాదధోరణికి ఏ విధమయిన ఆస్కారంగానీ, అర్థం గానీ లేదు. కాని, రకరకాల స్వార్థాల నిష్ఠలతో, పరాయి ప్రేరణలతో, కూట

సిరిపరులయిన కొందరు కృత్రిమంగా, కుహనాబుద్ధితో ఇందుకు ఆస్కారం, అర్థం కలిగించేందుకు చేసే ప్రయత్నాలు దారుణమయిన ఫలితాలను కల్గిస్తాయనేది ఈనాడు అనేక రకాలుగా అనుభవిస్తున్నదే. అనుభవాన్ని విశ్లేషించుకొని, మౌలికాంశాలను, గుర్తుపట్టనీయని 'వ్యామోహం' దేశంలో చాలాచోట్ల ఇంకా కమ్ముకొని ఉండటం, ఆ వ్యామోహాన్ని ఉదారభావంగా వ్యక్తీకరించి తమను తాము మోసగించుకోవటం ప్రస్తుత దౌర్భాగ్యం. ఈ దౌర్భాగ్యం ఆంగ్లేయుల రాకనుంచే విజృంభించటం కాదనరాని చారిత్రక సత్యం. ఆంగ్లేయు ఈదేశానికి రావటానికి ముందు ఈ దేశంలో ఐక్యం లేదని ఈ దేశీయులు గూడా కొందరు 'అమాయకంగా' వాదించటాన్ని తీవ్రంగా నిరాకరిస్తూ—

> **"If india has no unity herself, no unity could be given to her. The unity which undoubtedly belonged to india was self-born and had its own destiny, its own function and its own vast powers; it was the gift of no one."**

అంది సోదరి నివేదిత. **(Sister Nivedita; 'My India My people'. - pravrajika Atma prana : Ramakrishna Sarada Mission (1985; pp. 55)** కాగా, నిజానికి దేశంలోని ఐక్యానికి స్థిరాంశం దేశీయత; రాజ్య - రాజకీయాది 'వ్యవహారాలు' కావు; కేవలం దేశీయత.

దేశం; ఆ దేశం ద్వారా రూపొందిన జాతి, ఆ జాతి తన అనుభవ-ఆలోచన-ఆచరణల ద్వారా సమీకరించుకొన్న భావన, ఆ భావన వికసించిన పురోగామి భావజాలం; ఇతరేతరాంశాలను సమన్వయించుకొంటూ సంప్రదాయ రూపంగా ప్రగతి పథాన ప్రవహించేకాలం - ఈ విధమయిన సమస్తమూ అవిభాజ్యమయిన ఒక సమైక్య సంపుటి. కాలప్రవాహపు వివిధ ఘట్టాల్లో పరిస్థితుల అల్లికల క్లిష్టత్వాదులవల్ల కలిగే అంతర్బహిస్సంఘర్షణల రూపాన వచ్చిన పరిణామాలనూ, మార్పులనూ బేరీజు చేసుకొని సమన్వయించుకొంటూ ప్రగతి సాధించటం ఈ సంపుటి మౌలిక స్వభావం. ఈ అనంతమయిన సృష్టిలో, విశాలమయిన ప్రపంచంలో వివిధ దేశాల భావజాలం పరస్పరం వివిధ నిష్పత్తుల్లో

ప్రభావించుకోవటం అన్ని కాలాల్లోనూ సాధారణం. కాని, ఈ ప్రభావం దేశీయతకు ఒదిగి సమన్వయం పొందటం మాత్రం సహజం. నిజానికి ఏ ఆలోచనా విధమయినా, భావజాలమయినా దేశీయ స్థితి-గతుల యాథార్థ్యంలోనుంచి ఉద్బుద్ధమయి ప్రయోజనాత్మకమయిన పరిష్కారాలను సాధిస్తుంది తప్ప, ఆరోపితమయినప్పుడు విపరీత ఫలాలకు దారితీసి అనర్థకం, ప్రమాదకరమవుతుంది. ఏదయినా, దేశీయతపై నిష్కరింపబడవలసిందే. కాగా—

దేశంలోని అంగుళాంగుళం నేలతో, మట్టితో, ప్రకృతితో, పరిసరాలతో, ప్రాణులతో, సమాజంతో, సంస్కృతి-సంప్రదాయాలతో, నాగరకతా-మర్యాదలతో, ఆలోచనా విధానాలతో, అనుగత పరిణామాలతో, ఆరోగ్యకరమూ-ప్రగతిశీలమూ అయిన మార్పులతో, ఆచరణ రీతులతో, అనుభావ విశేషాలతో, అంతర్బహిర్జీవన సమన్వయ విధానంతో - ఈ విధమయిన సమస్తంతో ఆత్మీయతా, మమత్వం కలిగి ఉండటం; దేశాన్ని సజీవ నిత్యజాగృత మాతృమూర్తిగా దర్శించటం; ఆలోచన అనుభూతి ఆచరణ రీతులలో మాతృభూమితో చైతన్యవంతమయిన మమైక్యాన్ని పొందటం; ఆమె గౌరవమర్యాదల పరిరక్షణలో, ఉద్దీపనలో ఆ భూమిలో తన తోబుట్టువులతో సార్థకమయిన ఐక్యంతో జీవితాన్ని సమర్పించగల నిష్ఠతో ప్రవర్తించటం; ఈ సమస్తం వ్యక్తమయ్యే దేశం ప్రాతిపదికగా సర్వక్రియా కలాపాలూ, ఆలోచనలూ, విధానాలూ, ఆచరణలూ, రకరకాల సమస్యల పరిష్కారాలూ నిర్వహించటంలో దృఢత్వం కలిగిఉండటం, దేశీయ చారిత్రక గమనం నుంచి అభ్యుదయకర పురోగామి స్ఫూర్తిని పొందటం; తద్వారా సమగ్ర వికాస రూపంగా భౌతిక-సామాజిక - వైజ్ఞానిక - ఆధ్యాత్మిక సమన్వయాన్ని సాధించటం; అన్యదేశాలనుంచి సంక్రమించే భావజాలాన్ని దేశీయతా నికషంపై నిష్కర్షించుకొని దేశీయ మౌలిక జీవన విధానంతో అన్వయించుకోవటం- ఈ విధమయిన సమస్తభావన దేశీయత.

ఈ సందర్భంలో జాగ్రత్తగా అవగాహన పరచుకోవలసిన అంశం ఒకటి ఉంది. దేశీయత అనేది వ్యతిరేక ముఖమయిన తరహాకాదు. స్వత్వం కోల్పోకుండా సర్వదేశీయతలను మన్నిస్తూ విశ్వమానవతా భావానికీ, వసుధైక కుటుంబ ప్రవృత్తికి, అనంత విశ్వచైతన్య లయానుభావానికి వ్యక్తినీ, వ్యక్తిమయమయిన జాతినీ ఎదిగించేందుకు అనుకూల ముఖంగా ప్రవర్తించే జీవన మౌలిక దృక్పథం.

దేశీయత. సంకుచితత్వానికిగానీ, కృత్రిమత్వానికిగానీ, కుత్సితత్వానికిగానీ, కుహనా విధానానికిగానీ, కఠోరత్వానికిగానీ, నృశంసత్వానికిగానీ ఈ దృక్పథంలో తావు లేదు. స్వశక్తితో శక్తిని గౌరవించి సమాదరించే ధార్మిక ప్రవృత్తిని దేశీయత సర్వదా సంభావించి పెంపొందిస్తుంది. నిజానికి ఈ విధమయిన దేశీయతకోసమే ఆధునికంగా ఈ దేశంలో అనేకోద్యమాలు ప్రత్యక్ష-పరోక్ష మార్గాల్లో నేరుగానూ, కొంత తిరుగుడుగానూ ప్రయత్నించినయి, ప్రయత్నిస్తున్నయి గూడా. కాగా—

దేశానికీ-జాతికీ గల అభేద ప్రతిపత్తి దృష్ట్యా మాత్రమే దేశీయత-జాతీయత అనేవి పర్యాయవాచకాలవుతున్నాయి. అట్లా వ్యవహరింపబడుతున్నయి. అయితే, జాతీయతా భావనకు ఆధారమయిన దేశీయత యథార్థమయిన మౌలిక దృక్పథమనేది అవగాహనపరచుకోవలసిన ప్రధానాంశం. అందువల్ల—

దేశయత అనేది అనేక విధాలయిన ఆలోచనా ధోరణుల్లో అది కూడా ఒకటి అన్నట్టుగా- ఒక ధోరణి కాదు; అన్నింటికీ ఆధారభూతమయిన జీవన మౌలిక దృక్పథం. కాబట్టి జీవితానికి సంబంధించిన అన్ని రంగాల్లో మాదిరిగానే సాహిత్య రంగంలో, అందులోనూ పరిణత రూపమయిన కవిత్వంలో ఈ మౌలిక దృక్పథం ప్రవర్తించటం అత్యంత సహజం మాత్రమే కాదు; అనివార్యం కూడా. అయితే దేశంలోని అన్ని ప్రాంతీయ భాషా కవిత్వాల్లో మాదిరిగానే తెలుగులోనూ ఆధునిక కవిత్వంలో ఈ దేశీయతను గూర్చి ప్రత్యేకంగా పరిశీలించి గుర్తించ వలసిన అవసరం ఏర్పడుతున్నది. ఆధునికంగా మాత్రమే దేశీయతను విచ్ఛిన్న పరిచే, దేశీయత విచ్ఛిన్నమయ్యే తరహాలూ, ప్రభావాలూ కవిత్వంమీద కూడా పడుతూ ఉండటమే ఈ అవసరాన్ని కల్పిస్తుంది.

తెలుగునాట ఆధునికంగా కవితా రంగాన తొలి ఉద్యమం భావకవిత్వం. ఈ ఉద్యమం సింహావలోకన చేసుకొంటే, దానికి ప్రవర్తకులు రాయప్రోలు సుబ్బారావు. ఆయన ఉద్యమించిన ఈ కవితా రీతికి ప్రేరణ వైదేశికమన్నది ప్రసిద్ధమే. కాని, సుప్రసన్న అన్నట్లు; ప్రధానంగా 'అది రూపానికి సంబంధించిందే' ('సహృదయ చక్రం' 1983. పు. 141). కాగా 'ఆయనను ప్రేరేపించిన శక్తి ఆంగ్ల కాల్పనికోద్యమ కవిత కావచ్చు. ఆ ప్రేరణతో తనదైన ఒక దృక్పథాన్ని కల్పించుకొని, మాతృభాషా సాహిత్య సమున్మేషానికి అను

వయిన ప్రవృత్తిని తాను పండించుకొని కవితా రంగానికి సూత్రధారుడయినాడు రాయప్రోలు' అన్నారు జి. వి. సుబ్రహ్మణ్యం. ('అభినవలోచనం' 1984. పు. 5). 'తనదైన' ఆ 'ఒక దృక్పథం' దేశీయతా సంకలితమయింది. గ్రహించిన వస్తువూ, పరిసరాలూ, విషయాలూ, తాత్త్వికత, అభివ్యక్తి, కవితా భాష- సర్వమూ దేశీయతా భావంతో తొణకిసలాడుతూ ఉంటాయనటానికి ఆయన కవిత్వమంతా ఉదాహరించవచ్చు. అందుకే- 'రాయప్రోలు సుబ్బారావుగారి వ్యుత్పత్తి శక్తి భారతీయమైనదే. సుబ్బారావుగారి సృజన కళాశక్తి దేశీయమైన సాహిత్య సౌష్ఠవం కలది. (గురజాడ) అప్పారావుగారి సాంఘిక సాంస్కృతిక విషయ వివేకాని కున్న వైదేశికమైన చారిత్రక అవగాహన శక్తి అద్వితీయమైంది' అని తులనాత్మకంగా రామకోటిశాస్త్రి స్పష్టపరిచారు. (విమర్శిని - 4. 1979. పు. III). రాయప్రోలుది దేశీయ ప్రాతిపదికపయిన రూపుదిద్దుకున్న దృక్పథం కాగా, గురజాడది వైదేశికమయిన అవగాహనా ప్రాధాన్యం కలది. ఆ కారణం గానే ఆధునికమయిన మొట్టమొదటి కవితోద్యమానికి రాయప్రోలు ఆద్యులూ, ప్రవర్తకులూ కాగలిగింది. ఆ తరువాత చాలా ఏండ్లకు వైదేశికతా ప్రాధాన్యాన్ని ఒంటబట్టించుకొంటుండిన శ్రీశ్రీ కవితారంగాన ప్రత్యేకమయిన స్వంత తరహా గొంతు విప్పుకొంటున్నప్పుడుగాని గురజాడకు ప్రాధాన్యం రాలేదు. కాగా, రాయప్రోలు ప్రవక్తకుడుగా రూపుదిద్దుకొని పురోగమించిన భావ కవిత్వం మౌలికంగా దేశీయతా ప్రాతిపదికను నిలుపుకొన్నది. బహుముఖంగా విస్తరించు కొన్నది. వస్తుపరంగా సామాజికాంశాలను నిరూపించటంలోనూ, ప్రస్తుతీకరించ టంలోనూ, ప్రబోధించటంలోనూ, స్త్రీ పురుషుల సామాజిక సంబంధాలపరంగా 'అమలిన శృంగారా'న్ని ప్రతిపాదించటంలోనూ, 'అనుభూతులకు పందిరివేసి' రూపపరంగా 'నూతన అభివ్యక్తి మార్గాలను సుసంపన్నం' చేయటం (సుప్రసన్న. 1983) లోనూ, అనుభూతిని విస్తరింప జేయటానికి సమర్థంగా ఆధునిక 'కవితా భాష'ను రూపొందించటంలోనూ రాయప్రోలు తీసిన దారిలో భావ కవిత్వం దేశీయతా ప్రాతిపదికను ఎక్కడా కోల్పోలేదు. అనేక విషయాలకు సంబంధించి దేశీయతకు సంబంధించి అవగాహనారాహిత్యానికి ఎక్కడా అవకాశం, ఆస్కారం కల్పించలేదు.

అయితే, ఇదంతా భావ కవిత్వం దేశాన్ని ఉర్రూతలూగించిన దాదాపు పాతిక సంవత్సరాలకాలంలోని పూర్వార్ధస్థితి. అబ్బూరి, విశ్వనాథ, నాయని, దువ్వూరి, వేదుల, బాపిరాజు, కృష్ణశాస్త్రి, కొడాలి, కవికొండల, బసవరాజు, పింగళి-కాటూరి, వెంకట పార్వతీశ్వర కవులూ మొదలయినవారి కవితలూ, కావ్యాలూ ఇందుకు దాఖలా. కాని, ఉత్తరార్ధంలోకి వచ్చేప్పటికి పరిస్థితిలో మార్పు పొడసూపసాగింది. దేశీయమయిన సామాజిక దృష్టి కొంతకొంత మసక మసక బారటం ఆరంభమయింది. కేవలం వ్యక్తిపరిధికే కాక, అందులోనూ సామాజిక భావనాస్పర్శకూడా మాయమయిపోతూ, 'పలాయన' లక్షణంతో ఊహా కల్పిత 'సుఖ' పరిధిని సంతరించుకుపోవటం నెమ్మది నెమ్మదిగా మొదలయిసాగింది. దేశీయతా మూలమయిన వస్తుసంపదకూ, వాస్తవికతా మూలమయిన భావనా విధానానికీ, భావజాలానికీ పట్టువిడిపోవటం పెరుగసాగింది. పూర్వార్ధంలో ఉదాత్తమూ, సమస్తాన్నీ ఆత్మీకరించుకోగలిగినంత విస్తృతమూ అయిన ప్రణయ భావం దేశీయ మౌలిక భావనా విధానానికి ప్రతికూలముఖంగా 'స్వేచ్ఛాప్రణయ' స్వరూపంలోకి మారుతూ 'లేత వలపు'గా పరిణమించింది.

"తేనెలంగార్చి, వలపుల దేటపఱచి
ధన్యురాలయ్యె మా చెలి తలిరుబోణి!
కాని, నిరతంబు మల్లికకడనె యుండి
ముదముగూర్పగ మా కొక్క-పూవె, చెపుమ!"

(కృష్ణపక్షం: కృష్ణశాస్త్రి. 1950 పు. 17.) వంటి 'స్వేచ్ఛా' ధోరణికి మచ్చుంది. ఇదొకరకం కాగా—

"ఎవ్వరని యెంతురో నన్ను, ఏననంత
శోక భీకర తిమిర లోకైక పతిని,
కంటక కిరీటధారినై కాళరాత్రి...."

(కృష్ణపక్షం. 1950. పు. 63.) వంటిది మరొకరకం. నిజానికి, కృష్ణశాస్త్రి ఇట్లాంటివి కేవలం 'ప్రయోగ (వాద)' ధోరణిలో పలికించారు. కాని, కృష్ణశాస్త్రి అభివ్యక్తి శక్తి ప్రభావంతో అభిభూతమైన ఈ ధోరణి రాగా రాగా చివరకు—

"నే భయంకర కాముకుడ
నీ కరాల చితిని
శ్యామలు వెన్నవలె కరగి పోదురు........."

(రామచంద్ర అప్పారావు. 'ఉపాసన' (చిత్రభాను సం.) పు. 20) వంటి బీభత్స ధోరణికి, దేశీయ భావనా రాహిత్యానికి దిగజారేందుకు ప్రేరణ కావటం భావకవితా రంగాన ఒక విషాదఘట్టం. సామాజికదృష్టి లేకుండా, ఎందుకో ఏమో అర్థం కాకుండా, నేల పునాది విడిచిన గాలిగోపురాలతో సంకుచిత 'స్వేచ్ఛ' కోసం పాకులాడింది. కృష్ణశాస్త్రి కవిత ఒకవైపు అందమయిన అభివ్యక్తిని, అనుభూతిని ముగ్ధమనోహరంగా, దేశీయ భావనా మయంగా అందిస్తూనే, మరొకవైపు 'ప్రయోగ' మార్గాన, వైదేశిక భావన సంపర్కాన ఈ రకమయిన దిగజారు ధోరణికి అసంకల్పితంగానే కావచ్చు—దారితీసింది. ఏడుపే భావకవిత్వమన్న అభిప్రాయం వ్యాపించేట్టు చేసింది. అనుభూతి కందని ఏడ్పు అందలమెక్కింది. వైయక్తికావరణం వింతగా కుదించుకుంటే అంత 'ఆత్మానుభవ-అభివ్యక్తి' అనే భ్రాంతి కలిగేట్టు చేసింది.

"ఆ కొత్త రోజుల్లో, మేలుకొన్న కొత్త సమాజంలో తనకు లభించిన ఏ ఒకటి రెండు అనుభవాలనో, కష్టసుఖాలనో కవి తన దివ్యకావ్యాల్లో పెట్టాడు. తరువాత అహంకారం వల్లనో, అశ్రద్ధవల్లనో ఆ అనుభూతుల్నే కౌగలించుకొని చుట్టూ ఆవరణ కట్టి కూర్చున్నాడు."

అన్న కృష్ణశాస్త్రి మాటలు ('పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వం' భారతి రజతోత్సవసంచిక) ఈ ఉత్తరార్ధంలోని ఒక ప్రధానాంశానికి అద్దంపడతయి. ఆ ఆవరణలు మరీ సంకుచితమై, కరుడుగట్టి కవి- కావ్యపాఠకులకు అఖాతం సృష్టించినయి. అహంకారం, అశ్రద్ధలు కారణంగా దేశీయతను అవగాహన పరచుకోవటంలోని వివిధ నిష్పత్తుల్లోని వైఫల్య రీతులు ఇందుకు మౌలికహేతువులు. కాగా, వస్తువు పూర్తిగా సంకుచితమై, దాదాపు నిర్వస్తుకమా అన్న స్థితి కూడా దాపురించి, ఆలోచనా భావనా విధానమూ మరింత చిన్నిచిన్ని ఆవరణలుగా కుంచించుకుపోయి, వైదేశికతను పులుముకొన్నంత మేరా ఈ స్థితి ఆయా నిష్పత్తుల్లో సాగుతూనే ఉంది. కానా—

ఈ విధమయిన ధోరణులు పొటమరిస్తున్న ఉత్తరార్ధపు ఆరంభ సంవత్సరాల్లోనే ఒకటి, ఆ తరువాత మరికొన్నాళ్లకు మరొకటిగా రెండు ఉద్యమాలు కవితా రంగాన అనుకూల-ప్రతికూల స్పందనలతో ముందుకు వచ్చినయి, పురోగమించినయి.

మొదటి 'నవ్య సంప్రదాయ కావ్య' ఉద్యమం భావ కవిత్వయుగ పూర్వార్ధంలో కేవలం ముడిసరుకుగానూ, స్వల్పంగానూ మాత్రమే ఉండి అల్పాల్ప పరిధుల్లో ఇరుకుడు పడిపోతూ ఉండిన 'వస్తు'వును పటిష్ఠమయిన, ప్రభావోత్పాదకమయిన 'ఇతివృత్తం'గా తీర్చి దిద్దుకొని ప్రయోజన దృష్టితో, మానవుడి అంతర్బహిర్జీవితాల సమన్వయ ప్రాధాన్యంతో, విస్తృతమయిన సమగ్ర దేశీయతా ప్రాతిపదికపయి కావ్యశిల్ప మహితంగా, సమష్టి చైతన్య సమగ్రత్వాభివ్యక్తి ముఖంగా ఉద్యమం పురోగమించింది. సమకాలీన వివిధ దేశీయోద్యమాలనుంచి ప్రేరణ, స్ఫూర్తి ఈ ఉద్యమానికి గాఢంగా లభించింది. దేశీయమయిన ఉదాత్త కావ్య సంప్రదాయాన్ని ఆధునికీకరించుకొని నవ్య సంప్రదాయ కావ్య విధానాన్ని నెలకొల్పింది. సంప్రదాయానికి సంబంధించిన అవగాహనారాహిత్యం ఆనాటి కింకా పుంజుకోలేదు. దాదాపు 1930 ప్రాంతం నుంచి అవిచ్ఛిన్నంగా ఈనాటికీ పురోగతి శీలంతో సాగివస్తూ ఉన్న ఈ ఉద్యమపు తొలియేండ్ల ఫలితాలే రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం, సౌందరనందం, ఆత్మకథ మొదలయిన మహా కావ్యాలు. జాషువా, కరుణశ్రీ మొదలయిన వారి కావ్యాలు ఈ ఉద్యమంత పూచిన ఆకర్షక పుష్పాలే, ఈ ఉద్యమంలో శిఖరాయమానమయిన మహాకావ్యం - శ్రీ రామాయణ కల్పవృక్షం ఈ నాళ్లలోనే ఆరంభమయింది. తన 'జంట కవియున్ ప్రియమిత్రము' అయిన కొడాలి ఆంజనేయులు 'మహాత్ముని అసిలేని సేన'లో చేరి స్వాతంత్ర్య సమరరంగ యోధుడుగా దేశానికి ఆత్మ సమర్పణ మార్గంలో నిమగ్నుడు కాగా, విశ్వనాథ సత్యనారాయణ అసివంటి తన రచనలతో దేశీయ సాంస్కృతిక, సామాజిక రంగాన లేఖినీ యోధుడుగా దేశీయతకు అంకితమయి పురోగమించాడు. దేశీయ స్వాతంత్ర్యోద్యమాగ్ని శిఖలను దేశమందంతటా ఆలోచనా వీధుల్లో వ్యాపింపజేసిన మహా కావ్యాలు రాణా ప్రతాపసింహ చరిత్ర, శివభారతం. 'శివ భారత' మనటమే దేశీయతా మహితమయిన గొప్ప భావనం. పరాక్రమణోద్యోగోద్వేగం, సంయమన

శిల్పం - ఈ రెండు దేశీయ లక్షణాలూ ఈ కావ్యాలద్వారా ఉత్ప్రేరణ పొందినయి. దేశ చరిత్ర నుండి స్ఫూర్తి పొందటం దేశీయతను సరిగా అవగాహన చేసికొనటానికి మొదటి మెట్టు. గతాన్ని వర్తమానానికీ, వర్తమానాన్ని భవిష్యత్తుకూ చక్కని పునాదులుగా రూపొందించటం ఆరోగ్యకరమయిన విధానం. ఈ విధానం ఈ ఉద్యమ కావ్యాల మౌలిక సూత్రం. ఏ కొందరికో పరిమితమయి ఉండిన జాతీయ స్వాతంత్ర్యోద్యమాన్ని జన సామాన్యం దాకా వ్యాపింపజేసి సామాన్యజనాన్ని ఉద్యమ శీలవంతం చేసిన మహాత్ముని మౌలిక జీవన విధాన సూత్రాలకూ, దేశీయ జీవితంలో ఆయన చేసిన ప్రయోగాలకూ అద్దం పట్టిన కావ్యాలు సౌందరనందం, ఆత్మకథ. దేశీయతా భూమికపయి వికసించిన ఈ మొదలయిన కావ్యాలు వస్తు పరంగా, శిల్ప పరంగా ఉదాత్త స్థాయి నందుకొన్నయి. వస్తు-శిల్పాల సమతౌల్యం, పారస్పరికత వీటిలో అనుభవానికి వస్తుంది. ఈ కావ్యాలకు ఛందస్సు సర్వ పరిష్వంగం కాలేదు. శక్తిమంతంగా ప్రవాహశీలమయిన వాహికగా భావాన్ని పరుపులు పెట్టించింది. భావ కవిత్వానుబంధంతో భాషా సౌందర్యాన్ని సుబాళించింది. సౌందర్యం భాషా - భావాభివ్యక్తుల సామూహిక సమన్వయం ద్వారా అనుభవానికి వస్తుందనేది ఈ కావ్యాలు నిరూపించిన ఒక ప్రధానాంశం. ఈ విధంగా దేశీయతా ప్రాతిపదికపయి సాగినందువల్ల ఈ కావ్యాలన్నీ ఈనాటికి ఆహ్లాదాన్నీ, ఉదాత్త ప్రేరణనూ కలిగిస్తూనే ఉన్నాయి, ఉంటయి కూడా.

మరో అయిదారేళ్ళకు వైదేశిక భూమికపై ఆరంభమయిన 'అభ్యుదయ' కవిత్వోద్యమం రెండవది. భావకవిత్వోత్తరార్ధానికి చెందిన కవుల్లో ఒకరయి, వాళ్ళల్లో విశిష్టుడయి కూడా, ఆ కవిత్వ విధానంతో అసంతృప్తిపడ్డ శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వోద్యమానికి ప్రవర్తకులు.

> "భావ కవిత్వం రాసే రోజుల్లో కృష్ణశాస్త్రిలాగా ఏడవడమో, విశ్వనాథలాగ అరవడమో తప్ప రాయ్రపోలు, అబ్బూరి వారల అంతస్సుకి చేరుకోలేక పోయాను. భావకవిత్వం పట్ల నా అసంతృప్తికి ఇదో కారణం. నేను ప్రాతినిధ్యం వహించే యువతరానికి ఇటువంటి కవిత్వం అవాంఛనీయమని నా కనిపించింది. అదే అభ్యుదయ కవితవైపు నన్ను మళ్ళించింది.

అన్నారు శ్రీశ్రీ (శ్రీశ్రీ: 'అనంతం' విరసం ప్రచురణ. 1986. పు. 164). అసంతృప్తి అవాంఛనీయత్వానికి, అది అభ్యుదయ కవిత్వానికి దారితీసింది. భావ కవిత్వానికి భిన్నమయిన మార్గాన్ని అన్వేషించి అనుసరించేందుకు శ్రీశ్రీ ప్రయత్నించారు. అందుకే, శ్రీశ్రీ 'అభ్యుదయ' కవిత వ్యావహారికంనుంచి కాక, గ్రాంథికతనుంచి ఉదయించింది. తనకు గురుప్రాయులూ, భావ కవిత్వానికి తొలినాళ్ళలో ప్రోదికలిగించినవారూ, కమ్యూనిస్టు పార్టీ (విరాళ) వ్యవస్థాపక సభ్యులూ, ఎం. ఎన్. రాయ్ విధానాన్ని ఖండించనందుకుగాను కమ్యూనిస్టు పార్టీ నుండి చంద్ర రాజేశ్వరరావు గారిద్వారా ఎక్స్‌పెల్ (?) చేయబడి రాయిస్టుగా నిలదొక్కుకున్నవారూ, ఎవరి అంతస్తును తానందుకోలేక పోయానని శ్రీశ్రీ భావ కవిత్వాన్ని గూర్చి అసంతృప్తిపడ్డాడో ఆ అబ్బూరి రామకృష్ణారావుగారి ప్రేరణతో వెలువడిన లండన్ 'ప్రగతిశీల రచయితల' మేనిఫెస్టో చదువటంతో నుంచి ప్రధానంగా శ్రీశ్రీ 'అభ్యుదయ' కవిత్వారంభకులయినారు. శ్రీశ్రీ కవితల్లో అభ్యుదయ కవితోద్యమానికి అనంతరకాలాన పట్టుగొమ్మల్లాంటి 'మహాప్రస్థానం, దేశ చరిత్రలు, ప్రతిజ్ఞ, జగన్నాథుని రథచక్రాలూ' ఆ విధమయిన గ్రాంథిక ప్రభావంనుంచి ఉద్భవమయిన విశిష్టమయిన కవితా రూపాలు మాత్రమే. (చూ. 'అనంతం'. పు. 164). అయితే తన పలుగీతాలకు మూలాలూ, ప్రేరణలూ, ప్రభావాలూ పేర్కొన్నారు. దాదాపుగా అవన్నీ వైదేశికమయినవే. వీటన్నింటినీ గమనిస్తే, విటి గ్రాంథికత విషయమట్లా ఉండగా, కొంత ప్రయోగధోరణి కూడా స్పష్టపడుతుంది. ఈ సందర్భంలోనే గమనించవలసిన మరొక అంశం- 'వైదేశిక చారిత్రక అవగాహన శక్తి అద్వితీయంగా ఉన్న గురజాడ 'క్రమక్రమం'గా శ్రీశ్రీని 'ఆవేశించ'టం.'

'వన్నెగానని వస్తుతత్త్వము
కాంచనేర్చిరి ఇంగిరీజులు;
కల్లనొల్లరు; వారి విద్యల
కరచి సత్యము నరసితిన్'

(గురజాడ రచనలు కవితా సంపుటం. పు. 5.) అంటూ బ్రిటిష తరహ ఆలోచనా విధానం గురజాడ రచనల్లో బహుముఖంగా వ్యక్తమవుతుంది. కాగా

ఈ మొదలయిన అంశాలను సమన్వయపరచుకొంటే శ్రీశ్రీ అభ్యుదయ కవితోద్యమ ప్రవక్తృత్వానికి వాస్తవిక ప్రేరణ, స్ఫూర్తి విదేశీయమే తప్ప దేశీయం కాదు. అభ్యుదయ కవిత్వానిది మౌలికంగా 'వైదేశిక పునాది.'

శ్రీశ్రీ ఆరంభించిన కవితా విధానానికి, ఉద్యమానికి 'అభ్యుదయ' అన్న పేరు రావటానికి. వచ్చి స్థిరపడటానికీ మరో దశాబ్దం పట్టింది. శ్రీశ్రీ 1934 లో రచించిన 'మహాప్రస్థాన' గీతంతో అభ్యుదయ కవిత్వం ఆరంభమయిందనుకుంటే 1936 లో 'అఖిల భారత ప్రగతిశీల రచయితల సంఘం' లక్నోలో ప్రేమచంద్ అధ్యక్షతన ఆరంభంకాగా, అ తరువాత దాదాపు ఎనిమిదేళ్ళకుగాని, -అంటే 1944 లో - తెలుగునాట 'అభ్యుదయ రచయితల సంఘం' ఏర్పడలేదు. అది ఏర్పడ్డప్పటినుంచిగాని 'అభ్యుదయ కవిత్వ'మన్న వ్యవహారం బహుళ ప్రచారంలోకి వచ్చి స్థిరపడలేదు.

ఈ సందర్భంలో ఒక ఆసక్తికరమయిన విషయం—

అఖిల భారత స్థాయిలో ప్ర.శీ.ర.సం. స్థాపన సందర్భంగా లక్నో వెళ్లి ఆ సంఘ కార్యనిర్వహణలో క్రియాశీలంగా ప్రాధాన్యం వహించిన అబ్బూరి తెలుగునాట తెనాలిలో 'అరసం' స్థాపన సందర్భాన అందులో ఏ విధంగానూ అన్వయించినట్లు కన్పించదు. ఆనాటికే ఆయన రాయిస్టు అయ్యారు. 'అబ్బూరి వారి సాహచర్యం వల్లనే చాలాకాలం నేను రాయిస్టుగా చెలామణి అయ్యాను. కాని విచిత్రం ఏమిటంటే, **M. N. Roy** గ్రంథాలేవీ చదువమని అబ్బూరివారు నాకివ్వనూలేదు; నేను స్వయంగా కొనిగాని, సంపాదించిగాని చదువలేదు. లెనిన్‌తో బుజం బుజం రాసుకొని తిరిగిన వ్యక్తిగా మానవేంద్రనాథరాయి నాకెప్పుడూ మాననీయుడే' అన్నారు శ్రీశ్రీ (అనంతం. పు. 119) రాయ్‌పై శ్రీశ్రీ గౌరవాని కదికారణం. కాగా, ప్రస్తుతానికి, అబ్బూరి కమ్యూనిజం నుంచి రాయిజానికి మారితే, శ్రీశ్రీలో కవితా పరమయిన మార్పు వ్యతిరేక దిశలో సాగిందనవచ్చు. అయితే కమ్యూనిస్టులకూ, రాయిస్టులకూ ఎప్పుడూ చుక్కెదురే. ఆనాడు రాయిస్టులయిన గోపీచంద్, జి. వి. కృష్ణారావులు సాగించిన సాహిత్య విమర్శను మార్క్సిజానికి వ్యతిరేకమంటూ మద్దూరి చంద్రశేఖరరావు తీవ్రంగా ఖండించిన అంశాన్నిక్కడ స్మరించుకోవచ్చు.

ఇదెట్లా ఉండగా, పైకి ఎన్నెన్ని మాటలు చెప్పినా, అరసం అనేది కమ్యూనిస్టులు తెరవెనుక ఉండి ఆడిస్తున్న నాటకమన్నది కమ్యూనిస్టుల వ్యూహరచనతో బాగా పరిచయం ఉండిన అబ్బూరికి స్పష్టమని, ఆయన అరసం స్థాపన విషయం లోనూ, ఆ తరువాత గూడా అన్వయించలేదు. పైగా 'అబ్బూరి అభ్యుదయ రచయితల ప్రపంచ సంఘాని కిక్కడ ఒక శాఖని స్థాపించాడు. నాటకాంతో, ఉపన్యాసాలతో పామరులకి జ్ఞానబోధ చేస్తారుట. దానికోసం వాళ్లనుంచి కథల్ని, పాటల్ని ప్రోగుచేస్తారుట. నేను దాంట్లో సభ్యుణ్ణి. కొంత రాజకీయ వాతావరణం, వాసన ఉంది. కొత్తగొడవలుగాపును' అన్నారు శ్రీశ్రీ. (శ్రీశ్రీ సాహిత్యం; కూర్పరి కె. వి. రమణారెడ్డి; శ్రీశ్రీ షష్టిపూర్తి సన్మాన సంఘం. 1970 పు. 69.) ఆ శాఖ 'వర్ధమాన లేఖక సంఘం' (?) ఆ తరువాత ఏమయిందోగాని, దీనివల్ల కమ్యూనిస్టు ప్రమేయంలేని అరసం వంటి దాన్ని అబ్బూరి ఉద్దేశించినట్లు కన్పిస్తుంది. అంతేకాదు, 'కొత్త గొడవలు గాపును' అంటూ అంటీముట్టని రీతితో ఉండే శ్రీశ్రీ లక్షణంగూడా వ్యక్తమవుతుంది.

'కమ్యూనిస్టులు'—ప్రజాయుద్ధ విధానంతో జాతీయోద్యమానికి వెలిఐడిన రోజులు—'లో అరసం కమ్యూనిస్టుపార్టీ అభ్యుదయ రచయితల సంఘానికి 'పురుడుపోసి పాలుపట్టి పెంచటం'తో 'రచయితల నందరినీ ఆ సంఘం ధ్వజం కింద నిలబెట్టటానికి చేసిన ప్రయత్నం తెలిసి పలువురు ఆ సంఘం నుంచి తప్పుకున్నారు. ఈ స్థితి దేశంలో సర్వత్రా ఏర్పడింది. కేరళలో 'ప్రగతిశీల రచయితల సంఘం' నిష్క్రియం, విచ్ఛిన్నం కావటం వివరిస్తూ-

> **'On the content of social progress the communists and the rest clashed a few years later, the result was that the progressive writers associatton split and was compelled for all practical purposes to wind up its activity.'**

అన్నారు ఇ.ఎం.ఎస్. నంబూద్రిపాద్. (**'Marxism and Literature'; Madras; 1975; P. 17.**) సామాజిక ప్రగతికి సంబంధించిన కవితా వస్తువిషయంలో మార్క్సిస్టు దృక్పథం మాత్రమే సరయిందని కమ్యూనిస్టుల విశ్వాసం.

దేశీయ దృక్పథం సరయిందనేవారు ఇతరులు. ఈ కారణంగా ఏర్పడిన వైరుధ్యంతో కమ్యూనిస్టుల పిడికిట్లో ఇమిడిపోయిన అరసం సర్వత్రా విచ్ఛిన్నం నిష్క్రియం కాక తప్పలేదు. కమ్యూనిస్టు పార్టీ పెద్దలు అడుగడుగునా రచయితలపై ఆంక్షలు విధించటం కూడా ఇందుకు ప్రధాన కారణం. అరసం ఆవిర్భవించి-అంటే, కమ్యూనిస్టు 'వింగ్'గా ఆవిర్భవించి దేశీయతకు శైథిల్యం కలిగించటం ప్రస్తుతానికి గుర్తింపదగిన అంశం. దేశీయత, జాతీయత అనేవి మార్క్సిస్టు తత్వానికి విరుద్ధమయిన అంశాలు. పైగా, ఆనాడు కమ్యూనిస్టులు అచ్చంగా దేశీయ పరిస్థితులను అట్లా ఉంచి రష్యా ఆజ్ఞలకు 'నిబద్ధుల'యినారు.

> 'అక్కడ రష్యాలో వాన కురుస్తోందని తెలిస్తే ఇక్కడ రష్యాభక్తులు గొడుగులు విప్పుతారనే వేళాకోళపు విమర్శలో కొంతైనా నిజంలేకపోలేదు'

అన్నారు శ్రీశ్రీ (అనం. పు. 135).

నిజానికి, అరసం ఆవిర్భావానికి పూర్వం తానే ఏకైక శక్తిగా తన 'నవ్యకవితో'ద్యమాన్ని శ్రీశ్రీ నిర్వహించారు. దేశీయ సాహిత్య అధ్యయన గాఢత్వంవల్ల, సంస్కారంవల్ల ఆయనలో - అన్యభావజాలపుటిరుకుళ్లలో నుంచి దేశీయత ఉద్బుద్ధమవుతూనే వచ్చింది. 'కవితా! ఓ కవితా' వంటి అద్భుతమయిన రచనలు ఇందుకు దాఖలాలు. శ్రీశ్రీ ప్రయోగ పరత్వంలో అధివాస్తవికత, డాడాయిజం వంటి రీతుల్లో అనేకంగా రచనలు చేశారు. అయినా ఆయన దేశీయత కోల్పోలేదు. అరసంతో మద్రాసు వార్షికోత్సవమప్పుడు (1945 డిసెంబరు 31-1946 జనవరి 1, 2) గాని ఆయనకు సంబంధం కలుగలేదు. అప్పుడాయన-

> 'గతచరిత్రను ప్రస్తుత ప్రయోజనం కోసమూ, భావి అభివృద్ధి నిమిత్తమూ ఏ విధంగా పఠించక తప్పదో, అదే విధంగా పూర్వసాహిత్యాన్ని సవిమర్శకంగా, సాకల్యంగా చదువకపోతే సారస్వత సృష్టికి అవకాశమే ఉండదు. ఇదివరకు వెయ్యబడిన గట్టిపునాదుల మీదనే ఈనాటి సాహిత్య సౌధం నిర్మించబడుతుంది. సారస్వత పరిణామాన్ని శ్రద్ధగా గమనిస్తున్న వారెవ్వరూ దీన్ని కాదనలేరు.'

అన్నారు శ్రీ శ్రీ. (శ్రీ శ్రీ సాహిత్యం స. వి. 3. పు. 199.) అరసం ఆవిర్భావ సభలకు అధ్యక్షం వహించిన తాపీ ధర్మారావు ప్రాచీన సాహిత్యాన్ని నాశనం చేయమని చేసిన ఉద్బోధ స్మరిస్తే శ్రీ శ్రీ స్వరూపం మరింత స్పష్టమవుతుంది. అరసం ఆవిర్భావానికి పూర్వం ఆయన, ఆయన్ని అనుసరించిన పలువురు 'అభ్యుదయ' కవుల్లోనూ దేశీయ సంప్రదాయ నిరాకరణం పెత్తితలలు వేయలేదు. దేశీయ సంఘటనలలో ప్రేరణ పొందిన 'నవ్యాగరా' కవులు ఇందుకు దాఖలా. అయితే, అరసం ఆవిర్భావం తరువాత ఈ స్థితిలో మార్పువచ్చింది. క్రమక్రమంగా పార్టీబిగింపులతో, శాసనాంతో అరసం, అరసంకవులూ రకరకాలుగా బ్బందులకూ, విరుద్ధభావ సంఘర్షణకూ గురయినారని పార్టీ తగాదాలు మొదలయిన అంశాల ద్వారా స్పష్టమవుతుంది. అనేక మంది అభ్యుదయ కవులు దేశీయతకూ - దానికి విరుద్ధమయిన మార్క్సిజానికీ మధ్య నలిగిపోయారు. అయితే—

మార్క్సిజానికి దేశీయతకూ వైరుధ్యాన్ని అంగీకరించని, పాటించని లేదా సమన్వయించుకొని సాగే ఒక వర్గం ఈ ఉద్యమంలోనూ, అరసంలోనూ దాదాపు తొలియేండ్లనుండే ఉండటం గమనించదగిన అంశం. ఇట్లాంటివారివల్లనే అభ్యుదయ కవితోద్యమం, అరసం చెడిపోతున్నదని పార్టీ అధినేతలు గొడవ పెట్టడం, వీరంతా పార్టీ పిడికిట సతమతమయిపోయి, ఇరుకుడుపడి బయటపడ్డ వారే. అవసరాన్నిబట్టి లోనికీ, బయటికీ తిరుగుతూ ఉండే శ్రీశ్రీ వంటివారుకాక, ఈ విధమయిన వారికి అగ్రేసరంగా, అగ్రశ్రేణిలో నిలిచింది దాశరథి, కాళోజీ, ఆరుద్ర, కుందుర్తి, అనిసెట్టి, తిలక్ వంటివారు. తెలంగాణా పోరాటంలో క్రియాశీలంగా జ్ఞాతవాసంలోనూ, అజ్ఞాతవాసంలోనూ, జైల్లోనూ, బయటా ఉద్యమించిన ఉద్యమ వీరకవి దాశరథి. పార్టీలో గాఢమయిన సంబంధాలుండిగూడా ఆయన దేశీయతా విషయంలో రాజీపడలేదు.

> 'జండా ఒక్కటె మూడు వన్నెలది, దేశం బొక్కటే భారతా
> ఖండాసేతు హిమాచలోర్వర, కవీట్కాండమ్మునన్ రవీం
> ద్రుండొక్కండె కవీంద్రు, డూర్జిత జగద్యుద్ధాలలో శాంతికో
> దండోద్యద్విజయుండు గాంధియొకడే, తల్లి మహాభారతీ!'

అంటూ, 'ఆకాశమంత ఎత్తరచిన' మహాభారతీ దృక్పథం గలవాడు దాశరథి. 'నా తెలంగాణ కోటి రత్నాలవీణ' అన్న ఆత్మీయత గలవాడు. అనేక మంది అభ్యుదయవాదులు ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేకాంధ్ర ఉద్యమాలను బలపరిస్తే 'మహాంధ్రోదయం' దర్శించినవాడు దాశరథి. తానే ఒక ప్రత్యేక కవితోద్యమంగా 'రుద్రవీణ' మీటి 'అగ్నిధార' ప్రవహింపజేసిన ఉద్యమజీవి. ఆయన కవిత్వమంతా దేశీయతను కోల్పోని ఉద్యమ దీప్తిని అభివ్యక్తం చేస్తుంది. దాశరథికన్నా ముందునుంచే 'అన్న'గా ఈ మార్గంలో ఉన్న కాళోజీ దేశం, దేశీయత విషయంలో ఎక్కడా, ఎప్పుడూ, ఎవరితోనూ రాజీ పడని విశిష్టమయిన 'అభ్యుదయ' వ్యక్తిత్వం గల కవిధీరుడు. దేశం గొడవనీ, ప్రపంచం గొడవనీ తనలో గొడవగా 'నా గొడవ' విన్పిస్తూనే ఉన్నాడు. విదేశీ దురాక్రమణ సందర్భంలో 'తుది విజయం మనది నిజం' అని ప్రకటించాడు. దేశ కాలాలను అనుబంధింపజేసి 'పరాభవ వసంతం, గ్రీష్మం....' ఇత్యాదిగా ఉత్తేజాన్ని ఉప్పొంగించిన సశక్తి కంఠం కాళోజీది.

కవి స్వతంత్ర వ్యక్తిత్వం గొంతు నులుమబడుతూండటం భరించలేక పార్టీ వత్తిళ్లనుంచి బయటపడి, అనేక సంఘటనలతో చివరకు, చైనా దురాక్రమణతో దేశీయతాస్ఫూర్తి మరింత స్పష్టపడి, నిర్నిబంధంగా చైనా దౌర్మాత్యాన్ని ఖండిస్తూ ముక్తకంఠంతో ఆరుద్ర ముందుకు వచ్చారు. అప్పటికే ఎప్పుడో అనిసెట్టి 'అగ్నివీణ' మీటి 'మాతృ సంగీతం' విన్పించాడు. 'వ్యాసస్సంతతివాడు'గా దేశీయతా సంప్రదాయాన్ని అనుస్యూతపరచుకొన్నాడు.

'నే నెదిగిన మట్టి నాదే యని ఘోషిస్తా
నలభై కోట్ల ప్రజ విప్లవకంఠం నా గీతం'

అంటూ దేశానికీ – మట్టికీ మనిషికీ ఉన్న అవినాభావ సంబంధాన్ని విప్లవ కంఠంతో గానం చేశాడు.

'నిజంకాదు నిజంకాదు నాదేశం
చీలి ఛిద్రమౌతుందని
నిప్పుకణికలీ అస్థులు నిలిచి ఎదుర్కొంటాయి
ప్రగతిశక్తు లీప్రాణాల్ పగతుర వేటాడుతాయి'

అంటూ నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. తెలంగాణా మిగిలిన దేశంనుండి విచ్ఛిన్నం కాకుండా, పరాయితనం నుండి విముక్తమయినందుకు మహోల్లాసంతో కుందుర్తి సమగ్ర 'తెలంగాణా' కావ్యం రచించారు. ఆయన దృక్పథం మారలేదనటానికి పూర్వపు 'దండియాత్ర', ఆ తరువాతి 'అముద్రిత కావ్యం' దాఖలాలు. 'నలభై కోట్ల మనుష్యుల నిజమైన ప్రాణం వున్న మనుష్యులతో నిండిన దేశం నాది/.... మాకు నటనలు వద్దు మా చుట్టూ కటకటాలు వద్దు గొప్పయిగా గోసాయి చిట్టాలా వద్దు' అంటూ తిలక్ (అమృతం కురిసిన రాత్రి) ముందుకు సాగారు. అదే దారికి వచ్చారు సోమసుందర్. అయితే, పార్టీ బంధాల్లోంచి బయటపడి స్వతంత్రంగా, దేశీయంగా ప్రవర్తించే మార్గంలో ముందుకు సాగే వారికి ఏదో ముద్ర వేసి అనభ్యుదయ కవులుగా ప్రచారం చేయటం 'నిబద్ధత'లో ఒక భాగమై పోయింది. 'అభ్యుదయ' మార్గంలోని ఈ వర్గ వైరుధ్యాలిట్లా ఉండగా—

'అభ్యుదయ' కవిత్వం ఆరంభమయిన 1934 నాటి నుంచీ దేశీయతను పదిష్ఠ పరచటానికీ, బలహీన పరచటానికీ ప్రయత్నాలు సాగాయన్నది స్పష్టం. దేశీయతా ప్రాతిపదికపయి అవిచ్ఛిన్న సంప్రదాయార్థిగా దేశీయమయిన ఆలోచనా విధానాన్నీ తాత్త్వికతనూ శక్తిమంతంగా వ్యక్తీకరించే విశ్వనాథ సత్యనారాయణ 1934లో ఆధునిత నవలేతిహాసం 'వేయి పడగలు' రచించారు. 'మనుజుడను నేను, మనుజధర్మంబు నాది'అని ప్రకటించే శ్రీరామచంద్ర నాయకమయిన శ్రీరామాయణ కల్పవృక్ష రచన ఆ సంవత్సరమే ఆరంభమయింది. అయితే, దేశీయతను మహా మానవతా ప్రాధాన్యంతో ఒక ఉద్యమంగా చేసి దూసుకుని ముందుకు వస్తూ దేశీయతాతత్త్వప్రాతిపదికపయి సాగే విశ్వనాథ; ఈ దేశానికి ఏ సమగ్రమయిన తత్త్వం లేదనుకొనేవారికి 'వ్యతిరేకి' అయి, వ్యతిరేక ప్రచారాన్ని ఎదుర్కోవలసి రావటంతో ఆశ్చర్యం ఏమీ లేదు. అయితే, ఈ ప్రచార సరళి ఏమయినా గూడా విశ్వనాథ దేశీయతా పూరితమయిన సాహిత్యోద్యమం బహుముఖంగా, అవిచ్ఛిన్నంగా సాగుతూనే ఉంది. అయితే, తెలంగాణా ఉద్యమం తరువాత అభ్యుదయ కవిత్వం స్తబ్ధమయి పోవటంతో మొత్తం తెలుగు కవితారంగమే స్తబ్ధమయి పోయిందన్న భ్రాంతి కలిగించటానికి విశేషప్రయత్నాలు జరిగినయి. కాని, నిజానికి దేశీయతానిష్ఠంగా సాగే సాహిత్యంలో స్తబ్ధత రాలేదు. 1950 నుంచి చూచినా, దేశీయతా భావ భూమికతో అనేక కావ్యాలు వచ్చినయి. ఉదాహరణకు కొన్ని :

దేశీయమయిన ఆర్థిక తత్త్వప్రాతిపదికపయి విశ్వనాథ రచించిన 'కుమారాభ్యుదయం' 1955 లో రాగా, అంతకు పూర్వమే, దేశీయ స్వాతంత్ర్యోద్యమ సాఫల్యా వైఫల్యాల మౌలిక విచారానికి సంబంధించి ఆయన రచించిన 'ఝాన్సీరాణి' 1948 లోనే వచ్చింది. రామాయణ కల్పవృక్షంలో స్త్రీపురుష సంబంధాలకు సంబంధించిన తాత్త్విక ప్రాతిపదికా ప్రాధాన్యంతో అరణ్యకాండ వచ్చింది. బోయి భీమన్న 'దీప సభ' మొదలయిన కావ్యాలు ఈ సంవత్సరంలోనే వచ్చినయి. 'పుట్టపర్తి' 'మేఘదూతం' 1955 లో, 'సిపాయి పితూరి' 1957 లో వచ్చినయి. 'శేషేంద్ర' 'ఋతుఘోష' 1963 లో వెలువడింది. నాయని సుబ్బారావు 'జన్మభూమి' 1960 లో ఆరంభమయి 1970 లో పూర్తయి 1973 లో వెలువడింది. 'వేదనావాసుదేవం' అంతకు ముందుదే. సి. నారాయణరెడ్డి కావ్యాలు 'విశ్వనాథనాయుడు' వంటివి 1950-60 మధ్యలో వచ్చినవే. ఈ సందర్భంలో వానమామలై జగన్నాథాచార్యుల 'రైతు రామాయణం' విశేషంగా గుర్తింపదగింది. ఈ విధంగా ఉదాహరిస్తూపోతే - ఈ పట్టిక చాలా పెద్దదవుతుంది.

1965 లో 'దిగంబరకవులు' అల్లరిచేసేదాకా తెలుగు కవితారంగం స్తబ్దంగా ఉండిపోయిందనటం ( 1955-65 ) అవిచారితమనే అంశం పైన పేర్కొన్న కావ్యాలను బట్టి స్పష్టపడుతుంది. 'దిగంబర' కవులది ఒక కవిత్వోద్యమ మనటం తెలుగు కవితా రంగంలో ఒక 'జోక్.' దిగంబర కవుల కవిత తెలుగు సాహిత్యరంగానికి ఒక 'షాక్ ట్రీట్ మెంట్' అంటూ సాగే ప్రచారం కూడా అంతే. ఒకవేళ అది 'షాక్ ట్రీట్‌మెంటే' అయితే, కేవలం 'అభ్యుదయ' కవులకు మాత్రమే అయిందేమోగాని దేశీయతా భూమికగలవారికి మాత్రం కాదు. ఈ కావ్యాలు ప్రవాహంగా వస్తూండటమే ఇందుకు దాఖలా. ఒక తత్త్వంగానీ, లక్ష్యంగానీ లేకుండా దిగంబర కవులు చేసింది ఒక అల్లరి.

ఈ దిగంబర కవుల అల్లరికి, హడావుడికీ నిరసనగా 1967లో 'చేతనావర్త' కవులు సంఘటితంగా ముందుకు వచ్చారు. దేశీయ భావచైతన్యాన్ని పటిష్ఠంగావ్యక్తీకరిస్తూ, కవిత్వపు విలువల్ని ఉదాత్తీకరిస్తూ 'చేతనావర్తం' సంపుటాలు రెండు (1967, 1970) వెలువడినయి. చేతనావర్త కవుల్లో ఒకరైన సుప్రసన్న మొదటి సంపుటానికి సమకూర్చిన 'భూమిక'లో-

'మానవ జీవితం ఐహికలోకం, భావలోకం, అధ్యాత్మలోకం అని మూడుగా విభజించవచ్చు. సమగ్రమైన మానవ వికాసానికి అన్ని రంగాల సమన్వితమయిన వికాసం అవసరం. పాక్షికదృష్టి అభివృద్ధిహేతుకం కాదు. ఈ సమన్వితి కోసం ఈ కవులు భావిదర్శనం చేస్తున్నారు.... జీవితంనుండి పలాయనం చేయడం, వర్తమానాన్ని తిరస్కరించడం మాత్రం వీళ్ళు చేయరు. మానవ జీవితంలోని పురోగతి, సుదూరాకాశాల స్ఫురించే దివ్య జీవన శిఖరం అధిరోహించడం, వీళ్ళు భావిస్తున్నారు. కాలం వీళ్ళకు అఖండమైన, అనంతమైన ప్రవాహం.'

అన్నారు. చేతనావర్త కవులు నలుగురిలోని పేర్వారం జగన్నాథం—

'అవినీతి, అన్యాయం, అరాచకం వంటి అంటురోగాలతో బాధపడుతున్న జనసందోహానికి విద్యుత్తులా నరనరంలోకి ప్రాకి హృదయ ప్రక్షాళనం చేసి, మనిషిలోని మంచితనానికి నీరాజనం పట్టి, మనిషిపై మనిషికి భరోసా కలిగించడం.'

తమ కవితా లక్ష్యంగా చెప్పగా,

'సమాజం, సమాజంలోని మండుతున్న సమస్యలు ఈనాటి (కవితా) వస్తువు.... సమస్యల్నించి పారిపోయే కవిని సమాజం క్షమించదు.... కవి అయిన వానికి సాంఘిక చైతన్యం, రాజకీయ చైతన్యం విధిగా ఉండవలసిన గుణాలు. దేశాన్ని గూర్చి, సమాజాన్ని గూర్చిన వాస్తవిక దృష్టి కావలసిన మరో ప్రధాన గుణం. నేను నా దేశాన్ని అఖండంగా తప్ప చూడలేను. ఇక్కడ వేర్వేరు జాతులు లేవు, భారతజాతి ఒక్కటే.'

అంటారు వే. నరసింహారెడ్డి. మరి,

'దేశకాల సమాజాల త్రిపుటి/అన్నిటికీ కేంద్రమైన వ్యక్తి/అనంత వైవిధ్యంగల మనః ప్రవృత్తి/అన్నిదశల్లో మానవ సమగ్ర వికాసం/ఆధునిక భావ చైతన్య విన్యాసం/నినాదాడంబరాలు లేని విధానం/ఇజాల విషవలయం చీల్చివచ్చే నిజం/ ఉభయంలోనూ ఏర్పడే సామీచీన్యం/.... అంతర్బహిరంగ సమన్వయాల సమాలోచన/.... అనంత జగచ్చైతన్యావగాహన.'

తమ కవితకు ప్రేరణ అంటారు సంపత్కుమార. ఇంత స్పష్టమయిన దేశీయ చైతన్యంతో. తాత్త్విక దృక్పథంతో, నిర్దిష్టమయిన లక్ష్యంతో, వాస్తవిక విధానంతో ఈ నలుగురూ శక్తిమంతమయిన రచనా విధానంలో ఉద్యమించారుకాబట్టే 'అభ్యుదయ కవిత్వంలో నయాగరా కవుల ప్రభావం ఎంతటిదో వచన కవిత్వంలో 'చేతనావర్తం' సృజించిన కవుల ప్రభావం అంత గాఢమైనది' అని రామమోహనరాయ్, 'అభ్యుదయ కవిత్వం నుండి విడివడి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకొన్న వచన కవితకు ఈ సంకలనంలోని నలుగురు కవులూ కొండంత ఆశను కల్పించారు' అని చక్రోరా, 'ప్రయోజనాత్మకమైన కవితావేశం కలిగి కవిత్వ స్థాయిని చక్కగా అందుకున్న కవితా సంకలనాలలో 'నయాగరా' తరువాత నాకు ఇదే ('చేతనావర్తం') నచ్చింది. ఈ కృషి ఆదిలో నే ననుకున్నదానికంటే అధికంగా ఫలవంతమైనట్లు నా కనిపించింది.... మొత్తంమీద ఈ పుస్తకం సంకలనాల చరిత్రలో ఒక మజిలీ' అని కుందుర్తి, 'నాడు 'నయాగరా' కవితా సంపుటి వెలువడ్డనాడు నేను కవితా వితర్దిపై నిలువలేదు. 'నయాగరా' సంపుణ్ణ కల్గించిన చైతన్యదీప్తి (అప్పట్లో కల్గించిన దీప్తి) నా కెరుకలేదు. కాని, ఈనాడు మీ సంపుటి చూసినతరువాత నాటి దీప్తిని ఊహించుకోగల్గుతున్నాను' అని సి. నారాయణరెడ్డి, ఇంకా పలువురు చేతనావర్త కవితను సహర్షంగా ఆహ్వానించారు. దిగంబర కవుల అల్లరిని వాస్తవికంగా, దేశీయ దృక్పథంతో ఎదుర్కొవటం ద్వారా చేతనావర్త కవిత సాహిత్యరంగాన కలిగించిన ధైర్యాన్ని ఆశను గుర్తుచేయటానికే పై ఉటంకింపులు ప్రస్తావించబడినయి.

1961లో 'పృథ్వీగీతం' వినిపించిన మాదిరాజు రంగారావు అవిచ్ఛిన్నంగా 'నాలో ప్రవహిస్తున్నది నది' (1985) అంటున్నంతవరకూ దేశీయతా భూమికపై తాత్త్విక సామాజికాంశాలను విశిష్టమయిన కవితా రీతిలో చిత్రించిన తీరు ప్రసిద్ధమే.

'నాలో ప్రవహిస్తోంది నది
ప్రాణంలో స్పందనతో ఊహలో చలనంతో
ధరణీ పరిష్వంగ రాగధునీ ప్రకాశనంతో
శక్తిచరణ ప్రసారంతో, నిరంతర పరివర్తనంతో

> ఆత్మరూపమై, జీవన మర్యాదాలోలమై
> నాలో ప్రవహిస్తోంది నది'

అంటూ దేశీయతా భావ ప్రవాహలక్షణాన్ని స్ఫురింపచేస్తున్నారు రంగారావు.

దిగంబర కవుల ఆఖరు సంకలనం (మూడోది) వెలువడ్డ 1967లోనే, ఆనుముల కృష్ణమూర్తి 'సరస్వతీ సాక్షాత్కారం' కల్గించారు. 'చేతనావర్తం' మొదటి సంకలనంగూడా ఇదే సంవత్సరం వచ్చిందని గుర్తుచేసుకొంటే దేశీయతా ప్రవృత్తి పటిష్ఠంగా ముందుకు సాగడం స్పష్టపడుతుంది. దిగంబర కవుల్లోని నగ్నముని-రమణారెడ్డి మాటల్లో ఈ నగ్నుకిలో 'ఎక్కువ మందికి మార్క్సిజంతో పరిచయమేగాక, ప్రమేయంకూడా ఉంది.' దిగంబర రూపాన్ని వదులుకొని, తిరుగబడు కవులూ ఇంకా రమణారెడ్డి ప్రభృతులూ కలిసి శ్రీశ్రీ నాయకత్వంలో విప్లవ రచయితల సంఘం 1970 జూలై నాల్గున ఆవిర్భవించింది. మరి అదే సంవత్సరం ఆగస్టులో 'చేతనావర్తం' రెండవ సంకలనం వెలువడింది. అరసం నాటికి నిబద్ధత, నిమగ్నత వంటి అంశాలేవీ వచ్చినట్టులేదు. అందువల్లనే అరసం నానా గోత్రీకుల కూడలిగా తయారైందన్న తాత్పర్యంతో గావచ్చు, విరసం ఈ అంశాలను ప్రధానంచేసి అవిచ్ఛిన్నంగా ఉండే ప్రయత్నం చేసిందనిపిస్తుంది. అయితే పార్టీకి, వివిధ 'విప్లవ గ్రూపుల'కు సంబంధించి నిబద్ధతలోని తేడాలవల్ల ఇందులోనూ చీలికలు రాక తప్పలేదు. చేకూరి రామారావు 'విప్లవ వాదం. వ్యాసం ఈ అంశాలను వివరించింది. రష్యన్ మిత్రుడు నికితాగురోవ్ ఆయన కొక 'జోక్' చెప్పారట- **'let us play the Indian game, let us split'** అంటారట రష్యన్ పిల్లలు. ఈ దేశంలోని కమ్యూనిస్టుపార్టీ, దాని 'వింగ్' అయిన ప్రజాసంఘాలు వివిధ స్థాయుల్లో అనేకానేకంగా చీలిపోవటాలపై వచ్చిన జోక్ ఇది.

> 'విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయ పక్షాన్ని అనుసరించి వెళ్ళ టానికి నాకు అభ్యంతరం ఉంది. రాజకీయ పార్టీలు తిరిగే మెలికలన్నీ సాహిత్యం తిరగటం సాధ్యం కాదు.'

అన్నారు కొడవటిగంటి కుటుంబరావు. ఆయన విరసం ఉపాధ్యక్షులు. మరి, విరసం కూడా ఒక రాజకీయ పక్షాన్ని అనుసరించింది, క్రమంగా చీలికలయింది. ఈ చీలికల విషయం అట్లా ఉంచి, 'మావో ఆలోచనా విధానం'తో 'రాజకీయ

సాహిత్యం - సాహిత్య రాజకీయం' లక్ష్యంగా విరసం ఒక తీవ్రవాద రాజకీయ పక్షమన్నంతగా చాలా కట్టుదిట్టంగా పనిచేసింది, చేస్తూంది కూడా. అయితే 1970 నుంచి విరసం 'దశాబ్దం'గా ప్రచారం అవుతున్న కాలంలోనూ దేశీయతా భూమికతో అనేక కావ్యాలు వెలువడటం గమనించకపోతే, నిజాన్ని గుర్తించక పోవటమే అవుతుంది. వందేమాతరం, కీర్తితోరణం, పోతన చరిత్రం, రైతు రామాయణం మొదలయిన కావ్యాలు ఈ కాలంలో చాలా వచ్చినయి.

ఈ సందర్భంలోనే గుర్తించదగిన అంశం శేషేంద్ర ఆరంభించి సాగించే కవిసేన ఉద్యమం. కవిత్వపు విలువలు లోపించి అకవిత్వం కవిత్వంగా చెలామణీ కావటాన్ని నిరోధించేందుకు, సామాజికంగా విప్లవాత్మకమయిన మార్పులు సాధించే లక్ష్యంతోనూ శేషేంద్ర ఈ ఉద్యమానికి లక్ష్యప్రాయంగా '70-'80 లలో నా దేశం-నా ప్రజలు, గొర్రిల్లా, మండేసూర్యుడు మొదలైన అనేక కావ్యాలు శక్తిమంతమయిన వినూత్న కవితా భాషలో వెలువరించారు. ఆయన భావించే విప్లవం దేశీయతా భూమికపై సాధించాలన్న గాఢ తాత్పర్యం గలది. ఏ విప్లవమయినా ఈ దేశంలోంచి, దేశపు మట్టిలోంచి, దేశీయమయిన ఆలోచనా విధానంలోంచి రావాలన్నది ఇక్కడ ప్రధానమయిన అంశం. ఏ భావాన్నయినా దేశీయతా నికషంపై నిగ్గుదేల్చుకోవటం ఇక్కడ విధానం.

నిజానికి కవి దేశీయతను కోల్పోకపోవటమే సహజం. అయితే కొన్ని రాజకీయాది సిద్ధాంతాల కారణంగానో మరేయే కారణాలవల్లనో తాత్కాలికంగా అణచబడి ఉండవచ్చు. అయినా సహజశక్తిగల దేశీయత స్వప్రయత్నంగానే ఉబికివస్తుంది. ఏ ఇనుపచేయీ ఆ ఉబుకుని ఆపజాలదు. కారణం - నిజమయిన కవి దేశీయ చైతన్యపు మొన.

# అనుభూతి కవితావాదం

జి. వి. సుబ్రహ్మణ్యం

ఎవరేమనుకున్నా, ఎంతమంది ఏమన్నా 'అనుభూతి కవిత్వం' మన మధ్య నివసిస్తోంది. ఈ రోజు దాని ఉనికిని కాదనటం గుడ్డితనం; దాన్ని ఆడిపోసుకోవటం అవివేకం. పేరు బాగా లేదని పెదవి విరిచేవారు కొందరుండవచ్చు; శబ్ద నిఘంటువులలోని నానార్థాలనూ, వ్యుత్పత్త్యర్థాలనూ తిరగవేసి అన్వయం చెప్పటానికి అవస్థలు పడేవారు కొందరుండవచ్చు; పుట్టుపూర్వోత్తరాలనూ ప్రగతి వికాసాలనూ గురించి విచారించే విచక్షణులు కొందరుండవచ్చు; అనుభూతి కవిత్వం వాదమా, ధోరణియా, ఉద్యమమా? అని చర్చించే విమర్శకులుండవచ్చు; సమకాలీన కవుల ప్రయోగాల్లో అనుభూతి కవితాచ్ఛాయల్ని అన్వేషించే సమన్వయ శీలురు కొందరుండవచ్చు; వ్యక్తి వాదమనీ, పలాయన వాదమనీ, ప్రజాజీవితం నుంచి వేరుచేసే వేర్పాటు వాదమనీ ఆక్షేపించేవారు కొందరుండవచ్చు. ఇవన్నీ - చీకట్లు చీల్చుకుని కొత్తగా తూర్పున ఉదయించి మింటి కెగబ్రాకుతున్న సూర్యబింబాన్ని చూచి, ఆ వాస్తవాన్ని అవగాహన చేసుకోవటానికి ప్రయత్నించే వివిధ ప్రాణుల యత్నాల్లాంటివే. పొడిచిన పొద్దు కొండలో పడేందాకా వెలిగేదే. అలాగే అనుభూతి కవిత్వమున్నూ.

ఏ యుగంలోనైనా ఒక కొత్త ధోరణి వచ్చినప్పుడు దానికో పేరు పెట్టుకొని పిలుచుకొనే పరిపాటి ఆధునిక లక్షణాల్లో ఒకటి - దానికి మూల కారణం చారిత్రక స్పృహ. నన్నయ కాలం నుంచి నవ్య కవిత్వం దాకా యుగ విభజనం చేసి పేర్లు పెట్టుకున్నది మనమే. అందులోనూ రెండు మూడు రకాలు. కొంతమంది రచయితలు లేదా చరిత్రకారులు కొన్ని పేర్లు ముందు సూచిస్తారు; మరికొందరు సవరిస్తారు. మరికొందరు కొన్ని కల్పిస్తారు. వాటిలో సామాజికుల హృదయాలకు హత్తుకున్నవి ప్రాచుర్యంలోకి వస్తాయి. 'ప్రబంధయుగం'-అనే పేరు అలా వచ్చిందే. 'భావకవిత్వం' కూడా అలాంటిదే. 'అనుభూతి కవిత్వం'-అటువంటిదే. ఇవి ప్రజల అంతశ్చైతన్యాల స్పందనకు నామకరణపు సమస్పందనలుగా, ప్రతీకలుగా ఉంటాయి.

అవి జన హృదయాల ప్రతిధ్వనులు. ఆధునికుల్లో మరొక పరిపాటి కూడా ఉంది. ఒక రాజకీయ సంఘమో, రచయితల సంఘమో, వర్గమో, పరిషత్తో ఒక ధోరణిని గాని, ఒక చైతన్యాన్ని గాని ఒక పేరు పెట్టి ప్రారంభిస్తుంది; దాన్ని ప్రచారం చేస్తుంది. దాన్ని ప్రజలు స్వీకరించక తప్పదు. 'దిగంబర కవిత్వం', 'విప్లవ కవిత్వం' లాంటి పేర్లు అటువంటివే. వీటికి అర్థాలు రచయితల సంఘాలు చెప్పేవే. 'సంఘం' పెట్టిన పేరుకు పిర్యాదు లేదు. ఎవరైనా వ్యక్తులు పెట్టిన పేరైతే ప్రజాసామ్య యుగంలో చర్చలు తప్పవు; తర్జన భర్జనలు తప్పవు; పండితులు వాదులాడుకొంటూనే ఉంటారు; ప్రజలు నచ్చినదాన్ని వాడుకుంటూ పోతూనే ఉంటారు. కొంతకాలానికి సద్దుమణిగి పండితులు ప్రజల మాటను శిరసా వహిస్తూనే ఉంటారు. ఒకనాడు 'భావ కవిత్వ'మనే వాడుకను వేడిగా, వాడిగా విమర్శించారు ఉమాకాంత పండితులు మొదలైనవారు. దాన్ని 'పులుముడు' కవిత్వమని వెక్కిరించారు. 'అపస్మారక కవిత్వ'మని ఆధిక్షేపించారు. 'భావం' లేనిది అసలు కవిత్వ ముంటుందా? 'భావ కవిత్వం' అనటం అర్థంలేని అభివ్యక్తి అంటూ ఆక్షేపించారు; అవహేళనం చేశారు. కాని, ప్రజలు నిశ్శబ్దంగా వారి వాదాలపట్ల తమ అనంగీకారాన్ని వ్యక్తం చేశారు. 'భావకవిత్వం' అని మనసారా పిలుచుకున్నారు; దానికి తనివితీర వ్యాఖ్యానాలు చెప్పుకొన్నారు.

ఈనాటి 'అనుభూతి' కవిత్వం కూడా అలాంటి చరిత్రనే నోచుకుంటున్నది. 'అనుభూతివాదం' మొదట తిలక్ ప్రతిపాదించాడని విమర్శకు లంటున్నారు. 'నవత-కవిత' ఖండికలో తిలక్ వాక్యాలివి-

"మిత్రమా!
కవిత వున్నప్పుడే నవత రాణిస్తుంది
అసలు కవితలోనే నవత కూడా వుంది
కాని, మోడరన్‌గా వుందామనీ, ఏదో అందామనీ
తనకే తెలియని అస్పష్టపు అనుభూతిని
అర్థంలేని ఇమేజరీతో కలగాపులగపు వర్ణనలతో
డిలాన్ థామస్‌కు చేతకాని అనుకరణలతో
ఒక దేశం నిర్దేశించలేని వాక్యాల వికారంతో
ఎందుకు బాధిస్తావు నన్ను, బాధపడతావు నువ్వు? ...."

"కవిత్వంలో అబ్స్ట్రక్ట్‌యానిటీ కొన్ని సందర్భాలలో వుండొచ్చును.
కాని, పాఠకుడికి నీ అనుభూతి ఆకారం అందాలి, హత్తుకోవాలి.
అది ట్రాన్స్‌పరెంట్ చీకటైపై వుండాలి. నిన్ను పలకరించాలి,
కవిత కొత్త అనుభవాల కాంతి పేటికను తెరవాలి, కదలించాలి,
ప్రతి మాటకీ శక్తి వుంది; పదును వుంది
ప్రతి చిత్రణకీ అర్థం వుంది; ఔచిత్యం వుంది
గులకరాళ్ల డబ్బా మోగించి గొప్ప సంగీతం అని దబాయించకు
అలిగి నన్ను శపించకు, అన్నా! నీ మీద నాకు కోపం లేదు".
(అమృతం కురిసిన రాత్రి : 1964)

ఆధునిక ప్రయోగాలనే పేరుతో అయోమయాన్ని సృష్టించే రచయితలను ఉద్దేశించి ప్రధానంగా తిలక్ ఈ గీతం వ్రాశాడు. ఇందులో రెండంశాలు ముఖ్యం - 1. 'కవిత కొత్త అనుభవాల కాంతి పేటికను తెరవాలి, కదిలించాలి.' 2. 'పాఠకుడికి నీ (కవి యొక్క) అనుభూతి ఆకారం అందాలి, హత్తుకోవాలి. ఈ రెండు లక్ష్యాలను సాధించటమే తిలక్ అనుభూతి దృక్పథం.

తిలక్ అనుభూతి దృక్పథాన్ని విశ్లేషించిన వారున్నారు. వారిలో 'అమృతం కురిసిన రాత్రి' పీఠికాకర్త కుందుర్తిని మొదట తీసికొందాం. ఆయన అన్న మాటలను ఒక పొందికగా అమర్చుకొని చూద్దాం.

1. "తిలక్ తాను ప్రధానంగా అనుభూతివాదినని బల్లగుద్ది చెప్పుకున్నాడు. ఈ అనుభూతివాదము యిటీవలి కాలంలో భావ కవితాయుగ సంబంధి - ఇది వ్యక్తివాదానికి మరొక పేరు." (పుట. 3)

2. "తిలక్ ఖచ్చితమైన మానవతావాది. కేవలం వ్యక్తిగతమైన అనుభూతికి సంబంధించిన మానవతా భావనకు, సమాజపరమైన మానవ కారుణ్యభావనకూ చాలా తేడా వుంటుంది. తిలక్ నిశ్చయంగా యీ రెండవ పద్ధతికి చెందినవాడే." (పుట. 5)

3. "తిలక్ కవిత అభ్యుదయ కవిత్వం కొన్నిపాళ్లు, భావకవిత్వం కొన్నిపాళ్లు కలిపిన మిశ్రరూపం.... తిలక్ అభ్యుదయ భావనకు అందమైన శైలిని

సమకూర్చి అభ్యుదయ కవితా కాలంలో ఉన్న దోషాన్ని తొలగించటానికి ప్రయత్నించాడని చెప్పుకోవచ్చు; అభ్యుదయ కవిత్వాన్ని కూడా పేలవంగా కాకుండా అందంగా చెప్పుదాం అన్నదే తిలక్ ఆచరణ ద్వారా చేసిన సూచన." (పుట. 5)

4. "అభినవ కాల్పనికవాదమని చెప్పుకోదగిన అతని అనుభూతివాదము కవితకు తుది తీర్పు కాజాలదు." (పుట. 5)

కుందుర్తి దృష్టిలో అనుభూతివాదం వ్యక్తివాదం. అయితే, తిలక్ అనుభూతి వాది అయినా అభ్యుదయ భావన కలవాడే అని అంగీకరించాడు. అనుభూతివాదం భావకవితా సంబంధి కాబట్టి తిలక్ కవిత్వంలో భావకవితా స్వభావం కొంత చోటు చేసుకొన్నది. కాని, అది అభ్యుదయ కవిత్వంలో ఉండే పేలవత్వాన్ని తొలగించి నిండుదనాన్ని కలిగించటానికి తోడ్పడిందట. ఒక్క మాటలో చెప్పాలంటే - అనుభూతివాదమంటే అభినవ కాల్పనికవాదంట. తిలక్ కవితను సమన్వయించ టానికి కుందుర్తి కొంత శ్రమపడ్డాడు. మిశ్రస్వభావాన్ని మింగలేక, కక్కలేక చెప్పక తప్పింది కాదు.

తిలక్ 'అనుభూతివాదా'న్ని వ్యాఖ్యానించిన విమర్శకుల్లో ముఖ్యులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు. వారి మాటల్లో - "తిలక్ 'అమృతం కురిసిన రాత్రి'లో అనేక గేయాల్లో, మనస్సు లోలోపలి అనుభూతులకి అక్షర కల్పన చెయ్యడంలో అపూర్వ విజయం సాధించాడు. దీన్ని 'అనుభూతివాదం' అనవచ్చు" (అనుభూతివాది తిలక్ : విమర్శ వేదిక-పుట. 113). "ఆధునిక కవితలో రాదగిన ఒక బ్రహ్మాండమైన పరిణామం అనుభూతివాదమని తిలక్‌కి తెలుసు. ఒక ఉపన్యా సంలో ఆయన అంటాడు - 'ఛందస్సూ, కవి సమయాలూ మొదలైన సంకెళ్ళ నుండి తప్పుకొనిన కవిత ఎలాగ అచ్ఛమయిన రూపం సవరించుకొంటున్నదో అలాగే కథా సంవిధానం అనే అనవసరపు తొడుగుని విప్పుకుని ప్రధాన అనుభూ తుల ఆకృతితో దర్శనమిస్తోంది....కవి దృష్టి నేడు ఒక లాంతరు పట్టుకుని నలుమూలలకూ వెళ్లి ఓపికగా పరిశీలించడం లాంటిదికాదు. వస్తు స్వరూపాలకూ సంఘర్షణలకూ శక్తులకూ మూలమైన కీలక స్థానం మీద శక్తివంతమైన ద్యాష్టి లైట్ ఫోకస్ చెయ్యడం లాంటివి.' (విమర్శ వేదిక పుట. 123) అభ్యుదయ

కవిత్వానంతర ధోరణుల్లో ముఖ్యమైనది అనుభూతి కవితా ధోరణి కాగలదని తిలక్ గాఢంగా భావించినట్లు దాని కాతడు కృషిచేసి [illegible] శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు సుస్పష్టంగా పేర్కొన్నారు.

అనుభూతివాదాన్ని నిరసించే వారిలో ముఖ్యులు మార్క్సిస్టులు. దానికి కారణం అనుభూతివాదం అభ్యుదయ కవిత్వానికి విప్లవ కవిత్వానికి తిరుగుబాటు కావటమే. ఈ విమర్శకుల్లో కూడా మూడు రకాలున్నారు- ఒకరు అనుభూతి వాదాన్ని పేరు దగ్గరి నుంచీ ఖండించుకొనేవారు. వీరికి ప్రతినిధిగా శ్రీ. ఏ.యస్. కాంతారావుగారిని పేర్కొనవచ్చు. "అనుభూతివాదం" అనేది ఒక నాన్సెన్సికల్ టరమ్. ఇది కవిత్వంలో ఒక వాదం ఎప్పుడూ కానేరాదు. అనుభూతి లేకుండా కవిత్వం ఎప్పుడూ లేదు. అయితే ఈ అనుభూతి వ్యక్తికి పరిమితమా? వ్యక్తులకు పరిమితమా? అన్నవే ప్రశ్నలు." (భారతి; జులై, 1983 పు : 66)- అంటూ రాయన. ఇది ఒక విధంగా అతివాదం; మరోవిధంగా అర్థంలేని వాదం. అనుభూతి మూలం కవిత్వమనే ప్రాథమిక జ్ఞానం లేకుండానే 'అనుభూతివాదం' అన్న పేరు పెట్టారని ఊహించటం పై వాక్యాల వెనుక కనపడుతోంది. ఇది తొందరపాటు తనం. మరొకరకంవారు తాము సమర్థించే కవితాధోరణితో అనుభూతివాదులు కలిసిరాలేదని ఈసడించుకొనేవారు. ఉదాహరణకు శ్రీ సంపత్ సిద్ధారెడ్డి మాటలు గమనించవచ్చు. "ఆధునిక కవిత్వంలో 'అనుభూతి' కవిగా ముద్రవేసుకున్న మొట్టమొదటి కవి తిలక్. ఈ అనుభూతి దృష్టి కొలనులాగా అక్కడే ఉండి పోయింది తప్ప ఇది ప్రవహించలేదు. దిగంబరకవుల షాక్ ట్రీట్మెంట్లు, విప్లవకవుల ప్రభంజనం సమాజాన్ని కుదిపింది. కవిత్వాన్ని కదిలించింది. ఆ దశలో వీటితో సంబంధం లేకుండా విలక్షణమైన అనుభూతుల్ని పేర్చుకొని వేగుంట మోహన్ ప్రసాద్ కవిత్వం చింతించాడు. ఇస్మాయిల్ తన చెట్టునుంచి కొత్త పదచిత్రాల్ని పంచిపెట్టాడు. ఒత్తిడులకు లోనై విప్లవకవిత కొంత అజ్ఞాతం కాగానే శ్రీ కాంతశర్మ తన అనుభూతుల్ని గీతాలుగా తనే ముద్ర వేసుకున్నాడు. శేషేంద్రశర్మ చిత్రోక్తుల వేగంపై నడిచాడు; అరచేత్తో అలంకారాలు సృష్టించాడు. ఇంకా కొత్తపల్లి సత్యశ్రీమన్నారాయణ, పై. శ్రీరాములు ఈ ధోరణికి దగ్గరగా నడుస్తున్నారు." (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు :

పు. 160) అనుభూతి వాదాన్ని అవగాహన చేసికొని, దానిలో ప్రయోగాలు చేస్తున్న సాహితీవ్రతుడు వ్రాసినట్లుండదు సిధారెడ్డి వ్యాసం. మార్క్సిస్టు దృక్పథంతో అనుభూతి వాదాన్ని అధిక్షేపిస్తున్నట్లుంటుంది. అది ఆయన దోషం కాదు. ఆంధ్ర సారస్వత పరిషత్తు చేసిన దోషం. లేకపోతే శ్రీకాంతశర్మను గురించి వ్రాసిన వాక్యం అంత వక్రంగా సాగదు. విప్లవ కవిత అజ్ఞాతం అయిందని అంగీకరిస్తూనే అనుభూతివాదం పేర ఆయన కవిత్వం వ్రాయటం మాత్రం మహా దోషంగా పేర్కొంటాడు; శేషేంద్రశర్మను గురించి వక్రోక్తులు వ్రాసే ముందు విప్లవ కవిత్వం వెనుకబడటానికి గల కారణాలు, అందులో కొరవడిన ఏయే లక్షణాలను కవితలో పూరించుకోవటానికై అనుభూతి కవిత్వం వెలువడిందో వివరించే సహృదయత, ఋజుప్రవృత్తి విమర్శలో కొరవడింది ఒకరకంగా శ్రీ సిధారెడ్డి రచన అనుభూతివాదద్వేషుల సమీక్షకు చక్కని ఉదాహరణ. మూడవరకం విమర్శకులు అనుభూతివాదాన్ని చారిత్రకదృష్టితో మార్క్సిస్టు దృక్పథంలో వివేచించేవారు. ఈ తరహాకు డా॥ కె. కె. రంగనాథాచార్యులుగారి వాక్యాలు తీసికోవచ్చు. "తెలుగులో భావకవిత్వం తరువాత వ్యక్తివాదాన్ని ప్రతిఫలించే ధోరణులుగా అస్తిత్వవాద, అనుభూతివాద ధోరణులు వచ్చాయి. అస్తిత్వవాదధోరణి పాశ్చాత్యదేశాల నుంచి దిగుమతి అయితే, అనుభూతివాదం మధ్యతరగతి అసమాజికత నుంచి, అనాసక్తత నుంచి వచ్చింది.... అభ్యుదయ కవిత్వం స్తబ్ధతలో ఉన్నదశలో భావకవిత్వానికి అంతగా భేదం లేకుండా అవతరించిన ధోరణి అనుభూతివాదం. భావకవిత్వంలో లాగే అనేక రకాల ధోరణులు-మానవ కారుణ్యవాదం, ఇజాల వ్యతిరేకత, మార్మికత, 'నేను' ప్రాధాన్యం మొదలైన ధోరణుల సముదాయమే అనుభూతివాదం. అనుభూతి వాద కవులుగా పేర్కొన్న వారి రచనలకు సమానమైన తాత్త్విక ప్రాతిపదిక లేదు. ఒకేరకమైన దృక్పథం లేదు. ఒకరకంగా అభ్యుదయ కవిత్వానికి పూర్వరంగం భావ కవిత్వం అయితే విప్లవ కవిత్వానికి పూర్వరంగం అనుభూతి కవిత్వం. విప్లవోద్యమావిర్భావం తరువాతకూడా అనుభూతి వాదధోరణి కొనసాగించి. ఇటీవలనే అనుభూతివాదాన్ని ఒక వాదంగా నిలబెట్టే ప్రయత్నం జరుగుతున్నది. బాహ్య ప్రపంచ దృశ్యాలు అంతరంగ ప్రపంచంలో దృశ్యత్వాన్ని కోల్పోయి కేవల అనుభూతిగా మిగలటమే అనుభూతి వాదమని ఈ ఉద్యమానికి సంబంధించినవారు నిర్వచిస్తున్నారు. అస్తిత్వవాదం ఎక్కువగా వచన రచనలోను, అనుభూతి వాదం

కవిత్వంలోను కనిపిస్తుంది." (ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు: పు. xvii-xviii) వీరి దృక్పథంలో అనుభూతి వాదం భావ కవితా సంబంధియే. అయినా, వీరి అనుశీలనలో మరి రెండు ఆసక్తికరమైన అంశా లున్నాయి. అవి: 1. అస్తిత్వ వాదం పాశ్చాత్యం; అనుభూతి వాదం దేశీయం. 2. అనుభూతి వాదం విప్లవ కవిత్వానంతరం కూడా కొనసాగుతోంది; విమర్శ కులు దానిని ఒక వాదంగా నిలబెట్టే ప్రయత్నం చేస్తున్నారు. దీన్నిబట్టి దేశీయ మైన అనుభూతి వాదం విప్లవ కవిత్వానంతర ధోరణిగా అనుభూతి వాదులు కాని వారు కూడ భావిస్తున్నారని స్పష్టమౌతున్నది.

## 2

అనుభూతి కవిత ఆధునికాంధ్ర సాహిత్యంలో ఒక ఉద్యమంగా రూపొం దాలని సమాయత్తమౌతున్న బలమైన, దృఢమైన ధోరణి. కడచిన యేభై యేళ్ళనుంచీ వస్తున్న సాహిత్య ధోరణులనుగాని, ఉద్యమాలను గానీ పరిశీలిస్తే వాటిని మూడు రకాలుగా విభజించవచ్చు. 1. రాజకీయ పార్టీ మద్దతు కానీ, అజమాయిషీ కానీ ఉన్న రచయితల సంఘాలు నిర్వహించినవి; 2. పార్టీ బలం వెనుక లేని స్వతంత్ర రచయితల సంఘాలు కాని, కొందరు రచయితలు సంఘటితంగా కాని సాగించినవి; 3. సంఘీభావ స్పృహ లేకుండానే సమకాలీన మైన ఒక చైతన్యాన్ని రచయితలు ఎవరంతట వారుగా పోషించినవి. వీటిలో మొదటి రకానికి ఉదాహరణగా అభ్యుదయ రచయితల సంఘాన్ని పేర్కొనవచ్చు. దానికి కమ్యూనిస్టు పార్టీ పన్నెముక. అలాగే విప్లవ రచయితల సంఘం కూడా మార్క్సిస్టుల పార్టీకి ఉపాంగం. వీటి జయాపజయాలు, స్తబ్ధతలు, నిర్వీర్యతలు, విజృంభణలు, విభేదాలు అన్నీ పార్టీ స్థితిగతులమీద ఆధారపడి ఉంటాయి. 1955 లో కమ్యూనిస్టు పార్టీ ఎన్నికల్లో (ఆంధ్ర రాష్ట్రంలో) చిత్తుగా ఓడి పోవటం, అభ్యుదయ రచయితల సంఘ ప్రగతికి పెద్ద దెబ్బ పోయింది. దానితో అరసం ఉద్యమం మందగించింది. అభ్యుదయ రచయితల సంఘం బలంగా ఉన్న రోజుల్లో (1946-48) కమ్యూనిస్టు పార్టీలో చీలికలంతగా ఉండేవి కావు. విప్లవ రచయితల సంఘం ఏర్పడిన నాటికి (1970) పార్టీలో గ్రూపులు బలంగా ఏర్పడ్డాయి. మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా

ధోరణుల్ని మన దేశ పరిస్థితుల కనుగుణంగా అన్వయించుకొనే పద్ధతులను రూపొందించుకోవటంలో ఆ గ్రూపుల మధ్య ఏకాభిప్రాయం లేదు. అందువల్ల సాహిత్య ధోరణుల్లోనూ చీలికలొచ్చాయి. "సాహిత్యంలో అభ్యుదయ వాదం-విప్లవ వాదం అని రెండు భేదాలున్నాయి. విప్లవ వాదుల్లో అరుణోదయ, జన నాట్య మండలి భేదాలొకవంకా, వి. ర. సం., జనసాహితి భేదాలొకవంకా ఉన్నాయి. (చే. రా. ఆధునిక సాహిత్యంలో విప్లవ వాదం (వ్యా) ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు పు. 193) ఈ భేదాలవల్ల రాష్ట్రంలోనూ దేశంలోనూ రాజకీయంగా బలమైన నాయకత్వం లేకపోవటంతో, 1980 ప్రాంతానికి విప్లవ కవితా ధోరణి చల్లబడిపోయింది. ఇప్పటికీ కొందరు ఇంగువ కట్టిన గుడ్డల్లా రచనలు సాగిస్తున్నారే కాని వాటిలో పొంగు లేదు, రంగు లేదు. ఇలా కావటానికి మరికొన్ని కారణాలు కూడా చెపుతారు. మొదటిది : రచయితలకు చిత్తశుద్ధి లేకపోవటం. శ్రీ ఘుళ్ళపూడి సచ్చిదానందమూర్తి 'ఎవరు మీరు?' కవితలో ఈ సత్యాన్ని వ్యక్తీకరించారు. (మహాభియానం. పు. 39).

"ఎవరు మీరు? ఎవరు మీరు?
ఎందుకట్లా అరుస్తారు?
మీదంతా వట్టి భ్రమ
ఎందుకీ వృథా శ్రమ?
ఈ దేశం పొలాలలో
ఆ విత్తనాలు మొలకెత్తవు
మీ కొడవళ్ళ స్వర్గాలు నిజం కావు
మీ పిడికిళ్ళ స్వప్నాలు బుజూ కావు
మీ వర్గ ద్వేషం పంటలు పండవు
మీ పొలికేకలతో కడుపులు నిండవు
మేడలలో నీడలలో తీరికగా కూర్చుని
మొసళ్ళలా కన్నీళ్ల కార్చటం నేర్చుకొని
అమాయకులను అనామకులను వంచించకండి
అనవసరంగా నిప్పు మూట కట్టుకోకండి....

ఆ తరువాత నిరసన కవులు నిరసించిన ఈ క్రింది పట్టీ అంతా చెప్పవచ్చు-

"ఒకడి ఆలోచనమీద మరొకడి శాసనాన్ని నిరసిస్తున్నాం-
వేసుకున్న రంగుల్లకిందా, పట్టుకున్న జండాలకిందా
దాక్కునే కళాభీరుపుల్ని నిరసిస్తున్నాం -
కవిత్వరుచిని చంపటాన్ని నిరసిస్తున్నాం-
రచయితలు రాజకీయ కార్యకర్తలుగా మిగిలిపోవటాన్ని నిరసిస్తున్నాం -
బందెలదొడ్డిగా సారస్వత సమాజాన్ని మార్చడాన్ని నిరసిస్తున్నాం -
ప్రజాసాహిత్యం పేరుతో వేసుతున్న పార్టీసాహిత్యాన్ని నిరసిస్తున్నాం -
మార్క్సిస్టు ప్రబంధాల్ని నిరసిస్తున్నాం -
మార్క్సిజం మార్పు సహించని మతగ్రంథంగా భ్రమింపజేస్తున్న
- ఫ్యూడల్ మార్క్సిస్టుల్ని నిరసిస్తున్నాం—"

(నిరసన (1988) : కవిత్వం కునుకుతోంది : పు. 3, 4)

రెండవ రకంలో తెలంగాణా రచయితల సంఘం, ఫ్రీ వర్స్ ఫ్రంట్ మొదలైన వాటిని పేర్కొనవచ్చు. ఒకటి తెలంగాణంలో కవితాచైతన్యాన్ని పెంపొందింప చేయటానికీ, మరొకటి కుందుర్తి నాయకత్వంలో వచనకవితా ప్రక్రియను విస్తరింపచేయటానికీ విశేషంగా కృషిచేశాయి. కొందరు రచయితలు సంఘటితంగా సాగించిన కృషికి ఉదాహరణంగా దిగంబరకవులను వారి రచనల్ని పేర్కొనవచ్చు. వీరి కృషినిగురించి మార్క్సిస్టులు ప్రశంసిస్తూ తెలుగుకవితకు షాక్ ట్రీట్‌మెంట్ ఇచ్చారని పేర్కొంటారు. అభ్యుదయవాదులు కొందరువీరి ఉద్యమాన్ని నిరసిస్తారు-.... శ్రీ సోమసుందర్ మాటల్లో -"వర్తమాన వ్యవస్థను తీవ్రమైన బూతులతో దుయ్యబట్టడం చూసి దిగంబరులు అభ్యుదయకర పాత్ర నిర్వహించగలరని కొందరు భ్రమపడ్డారు. ప్రజాస్వామికవ్యవస్థ పనికిరాదని, నియంతృత్వ మొక్కటే సర్వసమస్యా పరిష్కారమార్గమనీ భావించే ఇరుడు కట్టిన ఫాసిస్టులుసైతం వర్తమాన వ్యవస్థను తీవ్రంగానే విమర్శిస్తారు. తీవ్రంగా విమర్శించినదంతా అభ్యుదయమే ననుకొని భ్రమచెందటం నిష్కృతి కలిగించదు. అతివేల ప్రగల్భంతో అట్టహాసం చేసిన దిగంబర ఉద్యమం ఐదేళ్ళయినా బ్రతక కుండానే కళ్ళు మూసింది ..."

మూడవ విభాగానికి ఉదాహరణంగా అభ్యుదయ కవితాయుగంలో వెలసిన నియోక్లాసికల్ ధోరణులను పేర్కొనవచ్చు. వీటికి రచయితల సంఘాలు లేవు. మేనిఫెస్టోలు లేవు. కార్యాచరణసూత్రాలు ఉండవు. అయినా సమకాలీన చైతన్యానికి స్పందించి కర్తవ్యపరాయణులైన రచయితలు దేశీయమైన ఈ ప్రక్రియల్ని భక్తిశ్రద్ధలతో ప్రతిభామయంగా నిర్వహిస్తూ వచ్చారు. ఈ రచయితలకు సంఘటితమైన ఒక వ్యవస్థ లేకపోయినా, సమన్వయాత్మకమైన ఒక స్థూలమైన అవగాహన ఉంటే ఉండవచ్చు. ఈ కోవకే చేరుతుంది 'అనుభూతి కవితాధోరణి' కూడా.

అనుభూతి కవితను గురించిన వివిధ కవుల అభిప్రాయాలను క్రోడీకరించి చూస్తే ఈ సత్యం తెలుస్తుంది. మచ్చుకు రెండు మూడు :

"అన్నా! కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చెయ్యాలి
విస్తరించాలి చైతన్యపరిధి
అగ్ని జల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి" — తిలక్ (1964)

"అంతరంగానికి లోతెక్కువ
అట్టడుగుకు మునిగేకొద్దీ
అంతు తెలియని నాడుల నాచుమొక్కలు
ముట్టేస్తాయి —
ఎప్పుడో గతంలో పారవేసుకొన్న
ఎన్నెన్నో అనుభూతులు అక్కడ
చుట్టేస్తాయి ....
మనస్సు రంగుల చేప
లోకపు ఉపరితలంపైకి
మక్కువగా గిరికీలు కొట్టబోతే
వాస్తవికత వల, మీదపడుతుంది...

— ఇంద్రకంటి శ్రీకాంతశర్మ.
(1976) అనుభూతి గీతాలు (పు. 28)

"నాలో నేను చిత్రించుకున్న
కాలమూ దూరమూ లేని పటం
నువ్వూ, నేనూ, గడ్డీ, ఎండా
అందం, ఆకాశం, అంతా
నాలోని చిదాకాశం
అంతటా నేను
నా హృదయంలోని తేజస్సు
మనోదర్పణ కోణాలలో
చిలికలై రంగులై చిందే
ప్రపంచంగా రూపొందింది...." —చలం (సుధ : 1961)

ఈ మూడు కవితలూ స్వభావాన్ని బట్టి అనుభూతి కవితలే. అయితే తిలక్ కవిత అనుభూతికవిత పరిధిని చెపుతోంది; చలం కవిత అంతరమైన అనుభూతిని ప్రతీకాత్మకంగా అభివ్యక్తంచేస్తున్న వైఖరిని వెలువరిస్తోంది. ఇంద్రకంటి శ్రీకాంతశర్మ కవిత అంతరంగానుభవాన్ని మనస్సు మోసుకొని అవ్యక్తచేతనం నుంచి వ్యక్తచేతనంవరకూ పయనించి అభివ్యక్తమయ్యే ప్రస్థానాన్ని భావచిత్రం ద్వారా చెపుతోంది. మూడుకవితలూ ఒకేవిధమైన చైతన్యాన్ని మోసుకొనివస్తున్నా మూడురకాల అభివ్యక్తి శిల్పాలను ఆశ్రయించి ఉన్నాయి. పై ముగ్గురూ ఒక రచయితల సంఘంలో సభ్యులు కాకపోయినా ఒక చైతన్యంలో తరంగాలు. అనుభూతివాదులకు మేనిఫెస్టో లేదనీ, ఒక దృక్పథం అంటూ లేదనీ మార్క్సిస్టులు విమర్శిస్తారు. మేనిఫెస్టో అవసరం లేకుండానే విభిన్నప్రయోగాల్లో ఒకే రకమైన చైతన్యాన్ని వ్యక్తీకరించే అవకాశం ఉన్నదని మన సాహిత్యచరిత్ర చాటిచెప్పుతూనే ఉంది. పాశ్చాత్య ప్రభావంతో ఏర్పడిన సాహిత్యఉద్యమాల కారకేర్పడిన రచయితల సంఘాలకే మేనిఫెస్టో ఉండటం పరిపాటి. భారతీయ ప్రస్థానాలలో సజాతీయస్పందనంతో రచయితలు ప్రయోగాలు చేయడం పరిపాటి. అనుభూతివాదం స్వదేశీయం.

## 3

అనుభూతి లేకుండా ఏ కాలంలోనూ ఏ కవీ ఏ రచనా చేసియుండటానికి వీల్లేదన్నది నిర్వివాదాంశం. ఈ సూత్రం ప్రాచీన కవుల కెంత వర్తిస్తుందో ఆధునిక కవులకూ అంతే వర్తిస్తుంది. భావకవుల కెంత వర్తిస్తుందో విప్లవ కవులకూ అంతే వర్తిస్తుంది. అయినప్పుడు అనుభూతికవిత్వమనే పేరును ఒకానొక చైతన్యం ప్రతిఫలించే కవిత కుంచటంలోగల వైశిష్ట్యం ఏమిటని సమాలోచించవలసి ఉన్నది. అనుభూతి కవిత్వమంటే అనుభూతికి సంబంధించిన కవిత్వమని కాని, అనుభూతికొరకైన కవిత్వమనికానీ, అనుభూతిని ఆవిష్కరించే కవిత్వమని కానీ, అనుభూతికి ప్రాధాన్యమిచ్చే కవిత్వమనిగానీ చెప్పటానికి వీలుంది. అనుభూతి కోసం అన్వేషిస్తూ, దాన్ని సాహితీజగత్తులో సాక్షాత్కరింపజేయాలన్న తపన, ప్రయత్నం ఉన్న కళాకారులు, రచయితలు ఈ శబ్దాన్ని ప్రయోగించగలుగుతారు. అందుకు కారణం తమకు పూర్వంకాని, తమ సమకాలీన సాహిత్య చైతన్యంలోకాని అనుభూతిస్పర్శ కవిత్వంలో లుప్తమైపోతున్న వేదనకూడా వారు బలంగా పొందిఉంటారు. లేదా అనుభవం యొక్క సమగ్రతను సాహిత్యం ద్వారా అనుభవించాలన్న ఆకాంక్ష సమకాలీన సాహిత్య ప్రయోగాలవలన తీరకపోవటంవల్ల సమగ్రానుభవంకోసం తీవ్రమైన వేదనపడుతూ సాహితీ ప్రయోగాలను నిర్వహించే ప్రవృత్తి రచయితలు ప్రదర్శిస్తూ ఉంటారు. ఇటువంటి పరిస్థితులు ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఏర్పడ్డ దాఖలాలు మనకు కొన్ని బలంగా ఉన్నాయి. ఆ చారిత్రక కారణాలే అనుభూతి కవితాస్పృహకు దోహదం చేశాయి అనుభూతి కవిత్వమనే పేరుతో పిలవటానికి ప్రేరణ కలిగించాయి కూడా.

"అనుభూతి కవిత" అనే పేరు పెట్టుకొనేనాటికి ముందే ఆ పేరుతో కవిత్వాన్ని పిలుచుకోవాలన్న తపన బీజరూపంగా సాహితీజగత్తులో ప్రారంభమై క్రమంగా అంకురావస్థనూ, వికాసదశనూ పొంది ఫలావస్థకువచ్చి ఆ పేరుతో ప్రత్యక్షమయిందని చెప్పాలి. ఏ ఉద్యమానికైనా ఈ క్రమవికాసం చారిత్రక సత్యంగా అమరిఉంటుంది. దాన్ని అనుశీలించేముందు అనుభూతి స్వరూప స్వభావాలను గురించి కొంత నివేదిస్తాను.

రసం సామాజిక నిష్ఠం. అల్లాగే అనుభవంకూడా సామాజిక నిష్ఠం. సమాజం అనుభవాన్ని అయిదుకోణాలతో ఆస్వాదిస్తుంది. భారతీయ వేదాంత

పరిభాషలో చెపితే అవి-అన్నమయ, మనోమయ, విజ్ఞానమయ, ప్రాణమయ, ఆనందమయ కోశాలు. వీటినే ఆధునిక మనశ్శాస్త్ర పరిభాషలో చెపితే ఇంద్రియ చైతన్య ప్రవృత్తి (Physical Domain), భావచైతన్య ప్రవృత్తి (Emotional Domain), జ్ఞానచైతన్యప్రవృత్తి (Intellectual Domain), జీవచైతన్య ప్రవృత్తి (Psychic Domain), ఆధ్యాత్మిక చైతన్య ప్రవృత్తి (Spritual Domain). ఈ అయిదు ప్రవృత్తులు మనిషికి ఎలా వర్తిస్తాయో సమాజానికికూడ అలాగే వర్తిస్తాయి. సమాజం వ్యక్తుల వ్యవస్థా స్వరూపం. వ్యక్తివివేచనే సమాజ సమాలోచనకు మూల సూత్రం. సమాజతత్వ పేటికను తెరవటానికి వ్యక్తియే తాళంచెవి. సమాజం ఇంద్రియ చైతన్య ప్రవృత్తితో-అన్నమయ కోశంద్వారా-వాస్తవానుభూతులను ఆస్వాదిస్తుంది; భావ చైతన్య ప్రవృత్తితో-మనోమయకోశం ద్వారా-కాల్పనికానుభూతుల్ని ఆస్వాదిస్తుంది. జ్ఞాన చైతన్య ప్రవృత్తితో-విజ్ఞాన మయ కోశం ద్వారా బుద్ధిశక్తిచేత సాధించే వివిధ వైజ్ఞానిక ప్రయోగాల ప్రజ్ఞా పాటవం వలన కలిగే జ్ఞానానుభూతుల్ని ఆస్వాదిస్తుంది. జీవచైతన్య ప్రవృత్తితో ప్రాణమయకోశం ద్వారా సమాజంలోని సాటి మానవ సహానుభూతులకు స్పందించే సాత్విక చైతన్యాన్ని సాధించి పూర్ణమైన విశ్వచైతన్యంలో వ్యక్తిని కూడా పూర్ణచైతన్యాంశంగా పరివర్తింపచేయగలిగే అనుభవాన్ని ఆస్వాదిస్తుంది. ఆధ్యాత్మిక చైతన్య ప్రవృత్తితో, ఆనందమయకోశం ద్వారా, విశ్వ చైతన్యం వ్యక్తి చైతన్యం ఒక్కటే అన్న అద్వైత స్పృహతో కూడుకొన్న తాత్వికానుభవం సాధిస్తుంది. ఈ అయిదుకోశాలద్వారా పొందే అనుభవం సమాజంలో ఉంది. దానితో సహజీవనం చేయటం సామాజిక జీవితం; ఆ సహజీవనంలో వ్యక్తి సమాజ ప్రవృత్తికి శక్తిగా వ్యక్తమౌతాడు. సామాజికానుభూతిని రికార్డుచేస్తే సాత్త్విక సాధనం మనిషి. రికార్డుచేసి ఊరుకుంటే సామాజికుడు. దాన్ని ఉద్దీపనం చేసి సాహిత్యరూపంగా అభివ్యక్తీకరిస్తే రచయిత. సమాజంలో భుక్తమౌతున్న అనుభూతులను సాహిత్యంద్వారా నెమరుకుతెచ్చి అనుభోక్తవ్యాలుగా చేసేవాడు రచయిత. అనుభోగమే అనుభూతి. అనుభూతికి ప్రేరణం కవిత; అభివ్యక్తి ప్రక్రియ; అభివ్యక్తమైన కవితాప్రక్రియ కవికెంత అనుభవసిద్ధమో సహృదయ సమాజానికంత అనుభవసాధ్యం.

ప్రపంచం అనుభవంకోసం పంచజిహ్వలతో అర్రులుసాచే చైతన్యాగ్ని. పంచజిహ్వలతో ఆస్వాదించిన అనుభవం సమగ్రం; పరిపూర్ణం. వాస్తవ, కాల్ప

నిక, వైజ్ఞానిక, జీవచైతన్య ఆధ్యాత్మికానుభూతుల సంపుటీకరణమే సామాజిక సమగ్రానుభూతి స్వరూపం. దానిని సామాజికుల కందించే ప్రక్రియను మహా కావ్యం అనవచ్చు. క్లాసిక్ అనవచ్చు; తెలుగులో ఆంధ్ర మహాభాగవతం, ఆంధ్ర మహాభారతం అటువంటి సాహితీరచనలు. శ్రీనాథాది కవులు, పెద్దనాది ప్రబంధ కర్తలు సమాజానికి అటువంటి అనుభవ సమగ్రతను కల్పించే యత్నంలో తమ తమ రచనలు చేసి అందించారు. అటువంటి మహానుభూతి నందించే కృతుల ఆవిర్భావం క్రమంగా 17 వ శతాబ్దినుండి వెనుక పడింది. వీరేశలింగం పంతులు యుగం దాకా ఆ వెలితి బాగా కనపడుతూ వచ్చింది. వేమనయోగి, పదకర్తలు ఆ వెల్తిని భర్తీ చేయటానికి యత్నించారు. ఒకరు వాస్తవాన్ని పూరించారు; మరొకరు ఆధ్యాత్మికానుభూతిని ఆవిష్కరించారు. కాని, క్షీణప్రబంధయుగం నుంచి సమగ్రానుభూతికి తెలుగుసాహితి నోచుకోలేదు. సమాజానికి సమగ్రాను భవం ఇవ్వటం ఒక్కోయుగధర్మం. అలా ఇవ్వటానికి అనువైన ప్రక్రియలనూ, ప్రయోగాలను సంతరించుకోవటం ఆయా యుగ చైతన్యాల స్వభావం. సమాజం లోని అనుభవకామనలోనుంచే ఆయా కాలాల్లో ప్రేరకశక్తులు ఉత్పన్న మౌతాయి; ఆయా ప్రయోజనాలను సాధింపగలిగిన సాహితీ మూర్తులను ఉద్భవింప చేసు కొంటాయి. సమకాలీన సమాజానుభవాలసమ్యక్సంకల్పబలాల శక్తి సంపన్నులే ఆయా యుగకర్తలైన మహాకవులు; మహాప్రయోక్తలైన రచయితలు. ఒక్కొక్క సారి సమాజానుభవ చైతన్యాన్ని తమ తమ స్వీయ ప్రతిభాశక్తులతో ప్రకంపితం చేసి, జాగృత పరచటమే కాకుండా, స్తబ్ధతనుండి స్పందనవైపుకో, క్రియా రాహిత్యాన్నుంచి సృజనశీలం వైపుకో, అసన్మార్గం నుండి సన్మార్గం వైపుకో, అసమగ్రతనుంచి సమగ్రతవైపుకో నడిపించే మహాకవులు, రచయితలు ఒక్కొక్క యుగంలో జన్మించవచ్చు. అప్పు డతడు వైతాళికుడు కావచ్చు; కాలాంతరంలో వెలుగులోకివచ్చే కాంతికిరణం కావచ్చు; విశ్లథంగా ఉన్న యుగచైతన్యానికి సంధాత కావచ్చు; విడివిడిగా సాగుతున్న అనుభవ పంచక ప్రయోగాలను సమన్వయం చేసి యేకధారగా పొంగించే కవిధీరుడు కావచ్చు. సమాజమే కవి పుట్టుకకు బలమైన హేతువు; కవియే సమాజ చైతన్యవికాసానికి దోహద హేతువు.

అయితే, సమాజంలో ఒక్కొక్క ప్రవృత్తి తన కనువైన అనుభూతి కోసం తీవ్రయత్నం చేసే సమయాలుకూడా చరిత్రలో కనపడతాయి. ఒక

యుగంలో సమాజం వాస్తవిక దృక్పథాన్ని పెంచుకుంటుంది; మరొక కాల ఖండంలో కాల్పనికతను వరిస్తుంది; మరొక తరుణంలో జీవచైతన్యస్ఫూర్తిని, అలాగే మరికొన్ని కాలాల్లో భక్తిని, హేతువాదాన్ని, అధ్యాత్మికానుభవాన్నీ వాంఛిస్తుంది. వీటికి తగిన ప్రేరణశక్తులు ఆయాకాలాల్లో బలంగా పుంజుకోవటం చూస్తుంటాం. ప్రధాన వివక్షతో ఒక చైతన్యం ఒక కాలంలో పైచేయిగా ఉన్నప్పుడు, ఆ చైతన్యాన్ని కవులు పోషిస్తూ ఒక ధోరణినో, ఒక ఉద్యమాన్నో సాగిస్తున్నప్పుడు సమాజచైతన్యంలోనే మరొక భాగమైన తదితర ప్రవృత్తులు బలహీనంగా ఉన్నా, చచ్చిపోవు. తమ శక్తులకు కూడగట్టుకోవటానికి మందం గానో, లేదా తీవ్రంగానో, వ్యక్తంగానో లేదా అవ్యక్తంగానో కృషిచేస్తుంటాయి. ఒక్కొకసారి ఆ శక్తులకు ప్రతినిధిగా ఒక రచయిత తన ప్రయత్నాన్ని బలంగా సాగించవచ్చు. ఉద్యమశక్తి ప్రవాహంగా సాగితే ఆ రచయిత గండశిలగా నిలిచి నట్లు తోచవచ్చు. కాని, అతడు చావడు; కాలం కలిసివచ్చినప్పుడు కరిగి పారతాడు. ఇటువంటి సన్నివేశాలు ఆధునికాంధ్రసాహిత్య చరిత్రలో మనం చూస్తాం.

వీరేశలింగం పంతులుగారి నుంచి నవ్యకవిత్వ యుగం ప్రారంభమైంది. సామాజిక సంస్కరణలు సాహిత్య చైతన్యంలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమించాయి. వాస్తవానికి వాసి హెచ్చింది. బుద్ధి ప్రమాణ వాదానికి ప్రఖ్యాతి కలిగింది. అలా అని కాల్పనిక చైతన్యం చావలేదు; నవలలను ఆశ్రయించి జీవించింది; జీవచైతన్యం చల్లారలేదు; అది కవితాధార నాశ్రయించి ఆయువును పెంచుకొన్నది; అధ్యాత్మిక చైతన్యం అంతరించి పోలేదు; భక్తి ప్రవృత్తి నాశ్రయించి కవితగా ప్రవహించింది. నవ్యకవిత్వ యుగంలో పంచవిధ ప్రవృత్తులు భిన్నప్రక్రియల నాశ్రయించినా సామూహికంగా సమగ్రానుభవంవైపు సమాజం పురోగమించటం గమనిస్తాం. సాహిత్యం ఆ సమాజం సృష్టించుకొన్న సహజ కళాశక్తి కేంద్రం. రచయితలు యుగాన్ని నడుపుతున్నట్లు కనపడతారు; కాని, వారు యుగచైతన్య ప్రతీకలు. ఇక్కడ ఒక ప్రశ్న మీమాంసకు వస్తుంది. అదేమి టంటే, వీరేశలింగం పంతులుగారు యుగచైతన్యాన్ని సృష్టించారా? సమాజ చైతన్యానికి పంతులుగారు ప్రతినిధులుగా నిలిచారా? అని. పైకిచూస్తే పతులుగారి కృషి నిర్ద్వందంగా కనపడుతుంది. కాని, లోనచూస్తే మూఢాచారాల మూగ

బాధతో మూలుగుతున్న సమాజ చైతన్యం అసన్మార్గం నుండి సన్మార్గంవైపు; చీకటినుండి వెలుగువైపు పయనించాలన్న తీవ్రవేదనలోనుండి పంతులుగారు కార్య చైతన్యంలా ఉద్భవించినట్లు కనపడుతుంది. లేదా సమకాలీన సమాజ చైతన్యానికి విరుద్ధంగా ఆయన ఉద్యమం సాగించినట్లు కనపడుతుంది; కాని, సమాజ వేదన ఆయనలో ప్రవహించి ఆయనను తనకు కావలసిన అనుభవంవైపు మళ్ళించు కొన్నది. వ్యక్తి దృష్టితోచూస్తే కాలానికి ఎదురీది గెలుపొందిన జోదు పంతులు గారు; సమాజదృష్టితోచూస్తే కాలం కన్నబిడ్డ; కర్తవ్యం నిర్వహించిన కార్యకర్త; యుగచైతన్య ప్రతినిధి-యుగకర్త. యుగకర్త యుగచైతన్య స్రష్టగా గోచ రించినా, యుగచైతన్య ప్రతినిధి. ఆ యుగంలోని సాహిత్యానుభవం అతడనుభ వించి ఆవిష్కరించినట్లుంటుంది; సమాజ చైతన్యం అతణ్ణి సృష్టించుకొని అతని ద్వారా ఆ అనుభావాన్ని అస్వాదించుకొంటున్నట్లూ ఉంటుంది. అనుభవం వ్యక్తి నాశ్రయించి ప్రవహిస్తే ప్రక్రియ; అది సృజనవ్యాపారాన్ని ఆశ్రయించి సాగిన చైతన్యం : అనుభవం ఆస్వాదన ప్రవృత్తి నాశ్రయించి ప్రసరిస్తే సామాజిక చైతన్యం; అది వ్యక్తిలోనికి ప్రవహిస్తే రచన; అదే వ్యక్తినుండి సమాజంవైపు ప్రసరిస్తే ధోరణి-లేదా-ఉద్యమం.

నవ్యకవితా యుగచైతన్యంకంటె విలక్షణమైనది భావకవితా యుగచైతన్యం. ఇందులో కాల్పనికానుభవ ప్రవృత్తికి అగ్రతాంబూలం అందింది. కృష్ణశాస్త్రి రచ నలు కాల్పనికవాద చైతన్యశక్తిని వ్యక్తీకరించాయి. 'కవియొక్క ఒక అవి స్పష్ట వాంఛాకురము, అంతర్నిగూఢతాపము, ఒక చిన్న కావ్యంలో 'ఊదబడితే' భావకవిత్వ మౌతుం"దని విశ్వనాథవారన్నారు. (భారతి, అక్టో. 1939) కవిలో నుండి ఉదయించే భావకవిత్వం అతని అనుభవస్థితిని ఎలా వ్యక్తీకరిస్తుందో విశ్వ నాథవారు పేర్కొంటే, సమాజం దాన్ని ఎలా ఆస్వాదిస్తుందో కూడా శ్రీశ్రీ వివ రించాడు: "హృదయాలను, మానసాలనూ కలవరపరుస్తూ అల్లకల్లోలంగా ఘూర్ణిల్లే ప్రమాద ప్రాంతాలలో కవికి నిరాఘటంగా విహరించే అధికారం కలదు. అట్టి సంచారాలలో ఏ సమ్మోహనార్తావనో కావ్యగీతం ఒకటి మెరుగులు తీరిన విలక్షణ రచనా ధోరణితో వెలుగు చూస్తుంది. ఆ గీతం ఆ కవి అనుభవించిన రసస్థాయిని సమగ్రంగా పాఠకునిలో ఆవిష్కరించ గలుగుతుంది. ఉత్కృష్ట భావగీతానికి నా నిర్వచనం ఇది." (శ్రీశ్రీ-సాహిత్యం-సంపు. 1-పు. 225)

కాల్పనిక యుగ చైతన్యం మానవునిలోని అంతర జగత్తుకు సంబంధించిన అనుభవాన్ని వ్యక్తీకరించటానికి శాబ్దికమైన, ఆర్థికమైన, బింబ పరికల్పనం చేసికోవటంలో ప్రధానంగా జీవిస్తుంది. స్వేచ్ఛ, ఊహ, భావనాశక్తి, గాఢ తన్మయత, ఆత్మాశ్రయత్వం, అంతర్ముఖీనత్వం, అభివ్యక్తి నవ్యత, లయాత్మకత మొదలైన లక్షణాలతో కవితా ప్రయోగాల్లో ప్రత్యక్షమౌతుంది. భావ కవిత్వం కాల్పనిక సాహితీ చైతన్యాన్ని వ్యక్తంచేసే ప్రవృత్తిగా గుర్తింపబడింది. ఆత్మానుభూతిని వ్యక్తం చేయటమే ఆ కవిత్వంలో కనబడే స్వేచ్ఛయనీ, 'సమాజ రహితమైన ఆత్మవ్యక్తి 'నేను' భావ కవిత్వాని కంతటికి ఆలంబన'మనీ, అనుభూతియే కావ్య వస్తువనీ, దాన్ని వ్యక్తీకరించటానికి ఖండకావ్యమే ఉత్తమ రూపమనీ, ప్రణయతత్వం భావ కవిత్వంలో ప్రధానస్థానం ఆక్రమిస్తుందని వివేచింపబడింది.

భావ కవి రచన సమాజానుభవ చైతన్యాన్ని వ్యక్తం చేస్తుందా? సమాజానుభవానికి సంబంధం లేకుండానే కవియొక్క ఆత్మానుభూతికి పరిమితమైపోతుందా? అటువంటి అనుభూతిని సమాజం కూడా కవిత ద్వారా ఆస్వాదిస్తుందా? ఆస్వాదించదా? అన్న ప్రశ్నలు అనుభూతి చర్చలో తలెత్తక మానవు. ఈ సందర్భంలో వెల్చేరు నారాయణరావుగారి ఈ క్రింది మాటలు గమనింపదగ్గవి-

"నేను నాకోసం రచన చేసుకుంటాను అనడం అబద్ధమే కాదు; అసాధ్యం. రచనాప్రక్రియ సాహిత్య సృష్టిలో ఒక భాగం మాత్రమే, పఠనప్రక్రియ దాని పరిపూరకభాగం. సాహిత్యపు అస్తిత్వానికి రచయిత, పాఠకుడు - ఈ ఉభయుల సమష్టి ప్రయత్నం అవసరం. అందుచేత కళాసృష్టి ఎన్నడూ ఏకపక్షంగా ఉండదు..., పాఠకుడు చదివేటప్పుడు తన ఆత్మీయత ద్వారా రచనకు అస్తిత్వం ఇస్తాడు. తనలో ఉన్న అనుభూతులనే రచనద్వారా పొందుతాడు. రచనలో మాటలు ఆయా అనుభూతులను జాగృతం చేసే సాధనాలు మాత్రమే....రచన చెయ్యడం అంటే, యధార్థాన్ని (దాన్ని మార్చటంకోసం) ఆవిష్కరించడం; ఆ రచన పాఠకుని ఔదార్యానికి అప్పచెప్పటం-ఈ రెండు పనులూ రచయిత యొక్క, పాఠకునియొక్క అంతరంగ స్వేచ్ఛవల్లనే జరిగేవి. రచయిత రచన చేస్తున్నాడంటే, తక్షణంలోనే: తన పాఠకుల స్వేచ్ఛని గుర్తిస్తున్నాడన్నమాట. అందుచేత కళాసృష్టి ఏ వంకనుంచి చూచినా, మానవుల స్వేచ్ఛను విశ్వసించి, ఆకాంక్షించే చర్య." (తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పు. 228, 229.)

కవిత్వం అనుభూతికి ఆవిష్కృతి అయితే దానికి అస్తిత్వం కల్పించే శక్తులు రెండు: 1. రచయిత 2. పఠిత. ఒకరు సృజనశక్తి ద్వారా; మరొకరు ఆస్వాదన ప్రవృత్తి ద్వారా ఆ అస్తిత్వాన్ని నిరూపిస్తారు. పఠితలు సామాజికానుభవాభిరుచులకు ప్రతినిధులు. "సమాజంలో వస్తున్న మౌలికమైన మార్పులకి శ్రోతల సాహిత్యాభిరుచులను రూపొందించగల శక్తి వుంది. అలాంటి మార్పులు జరిగినప్పుడు ఒక కొత్త కవితారూపం వాళ్లకోసం ఏర్పడుతుంది." (తెలుగులో కవితా విప్లవాల స్వరూపం. పు. 217.) అందువలన భావకవిత్వం కూడా సమాజానుభవ ప్రవృత్తిని బట్టి ప్రభవిల్లిందనే ధ్రువపడుతోంది. అది ఎంతకాలం ఉన్నదన్నది వేరే విషయం.

భావకవిత్వ చైతన్యానికి కేంద్రబిందువు కృష్ణశాస్త్రి. "ఆత్మాశ్రయమైన కావ్యంలో స్వేచ్ఛకోసం అఱ్ఱులు చాచటం ఒకటీ, ప్రేయసిని సృష్టించుకోవటం మరొకటీ కృష్ణశాస్త్రిగారిలోని ప్రత్యేకత. ఇది క్రమక్రమంగా భక్తుడు పరమేశ్వరునికి ఆత్మనివేదనం చేసుకొనడంగా తర్వాత, తర్వాత **Sublimate** అయింది. అందుచేత మనకు రొమాంటిక్ కవి ఎవరంటే కృష్ణశాస్త్రి అన్నది స్థిరపడిపోయిందన్న దాంట్లో సందేహం లేదు." (వడలి మందేశ్వరరావు: సాహిత్యం, విమర్శ: పుట. 76.)

అయితే భావకవిత్వంలో వెలసిన వివిధ శాఖలూ, కవుల రచనల్లో కనపడే వివిధ ధోరణులూ-ఆ కాలంలో సమాజ ప్రవృత్తి కాల్పనిక చైతన్యం ద్వారా ఒక సమగ్రానుభూతిని పొందాలని యత్నించినట్లు నిరూపిస్తున్నాయి. గురజాడ కాల్పనిక చైతన్యంలోని వాస్తవికతను పోషించాడు. రాయప్రోలు అమలినశృంగార సిద్ధాంతం ద్వారా వైజ్ఞానికానుభవస్ఫూర్తిని కాల్పనిక యుగానికి అందించాడు. హేతువాదులు కూడా ఇటువంటి ప్రవృత్తిని పోషించినవారే. ప్రణయకవిత్వశాఖను పూయించిన కవులందరూ జీవచైతన్యానుభూతిని కాల్పనిక ప్రవృత్తికి పోషకంగా అనుసంధించారు. దేశభక్తి మధురభక్తి ప్రవృత్తులు ఆధ్యాత్మికానుభవంతోని ఆధునిక రుచుల నంచిస్తూ కాల్పనిక చైతన్యానికి ఒక సమగ్రత నాపాదించాయి. కృష్ణశాస్త్రి కవితలోని కాల్పనిక చైతన్యం సమాజానుభవ చక్రానికి ఇరుసుగా నిలిచింది. అసలు కాల్పనికత అంతోఇంతో లేని కవితాయుగం ఉండదు. సృజన వ్యాపారముండదు. అన్ని యుగాల కవితల్లోనూ ఇది అంతర్వాహిని. కాల్పనిక

చైతన్యాన్ని ద్వేషించే వారిలో కూడా ఇది కొంత జీర్ణించుకొని ఉంటుంది. అంటే సమాజానుభవ ప్రవృత్తికి కాల్పనికవాదం దూరంకాదు; అయితే, భావకవిత్వ యుగంలో దానినే కేంద్రంగా చేసికొని సమాజం సమగ్రానుభవసిద్ధి కోసం యత్నించింది.

వాదాపు 1933 నాటినుంచి ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో ఒక పెద్ద సంఘర్షణ మొదలైంది. అది అభ్యుదయవాదం మధ్యా అనుభూతివాదం మధ్యా. 1933 లో అనుభూతివాద మేమిటి? అని వెంటనే ఎవరైనా అనుకోవచ్చు. అది ఆ పేరుతో ఆనాడులేదు. అసలు తాను ఏ పేరుతోనూ లేదు. శ్రీశ్రీ ప్రారంభించిన కవితా చైతన్యం ఉద్యమంగా మారి అభ్యుదయవాదంగా కవిత్వంలో సాగింది. విశ్వనాథ సత్యనారాయణగారి కావ్యపరమార్థవాదం నవ్య సంప్రదాయవాదంగా నేటి విమర్శకులచే పిలువబడుతోంది.

విశ్వనాథ రామాయణ కల్పవృక్ష రచనం 1934 ప్రాంతంలో మొదలై 1961 దాకా సాగింది. ఇదే కాలంలో అభ్యుదయ కవిత్వయుగం పుట్టటం, పెరగటం, విరగటం కూడా జరిగింది. భావకవిత్వం నుండి పైదొంగి తమ తమ కవితా చైతన్యాలను ఉద్యమాలుగా నిర్మించుకొన్నవారే విశ్వనాథ సత్యనారాయణ, శ్రీరంగం శ్రీనివాసరావు. వారి ఉద్యమాలను గురించి కొంత విశ్లేషించుకుంటే అనుభూతి కవితావాద స్వరూప స్వభావాలు కూడా మరికొంత తేటతెల్లమౌతాయి.

స్థూలంగా వివేచిస్తే శ్రీశ్రీ వర్గరహితమైన సమాజాన్ని, ఆర్థిక అసమానతలను తొలగించి సమసమాజాన్ని నిర్మించాలని ప్రబోధించినాడు. ఆర్థికాభ్యున్నతి సాధించినా జాతి జీవనం ఆధ్యాత్మిక ధర్మచైతన్యంతో ముందుకు నడచినప్పుడే మానవ వికాసం సంపూర్ణమౌతుందనీ, అప్పుడే సమసమాజం సాధ్యమౌతుందనీ విశ్వనాథ ప్రబోధించాడు. ఒకరు ఆర్థిక ధర్మానికి ప్రాధాన్యమిస్తే, మరొకరు హార్దిక ధర్మానికి ప్రాణం పోశారు.

కల్పవృక్షం సమకాలీన సమాజంలోని సమగ్ర కళానుభవాన్ని కోరే సాత్త్వికకళక్షుల బలమైన ఆకాంక్షకు ప్రతిఫలం. 1934 నాటికి భావకవిత్వ యుగంలో రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం, కృష్ణశాస్త్రిగారి

ఆదర్శసౌందర్యాన్వేషణం, చలంగారి స్త్రీవ్యక్తిత్వ విప్లవచైతన్యం, త్రిపురనేని రామస్వామి చౌదరిగారు సంప్రదాయంపై తీసుకొనివస్తున్న వివేచనాత్మకమైన విమర్శ (దీన్నే కొందరు హేతువాదమంటున్నారు), మొదలైనవి నూత్నభావ చైతన్యానికి తెలుగుసాహిత్యంలో మార్గాల నావిష్కరించాయి. స్వాతంత్ర్యోద్యమం, ప్రబోధ కవిత్వం, హరిజనోద్యమం, బ్రహ్మసమాజాది మతవ్యాప్తి - ఇవన్నీ జాతిలో నూత్నజాగృతిని కలిగించాయి. ఆధునిక నాగరకత పాశ్చాత్య సంస్కార సంవలితమై భారతీయమైన సంస్కృతి సమస్యలను పునఃపరిశీలను గురిచేస్తున్నది. కాలానుగుణంగా సమాజంలో విలువలు మారుతూవస్తున్నవి. ఎన్ని మార్పులు వచ్చినా వాటికి ప్రాతిపదికగా నిలువగలిగింది గార్హస్థ్య జీవితం. స్త్రీ పురుషుల సంబంధంలో పరమార్థదృష్టి క్రమంగా లోపించడం, ధర్మం అర్థ సాధన కనువుగా మారటం, కామం సర్వప్రవృత్తులకు మూలచైతన్యంగా భావించటంవంటి మార్పులు ఆ వ్యవస్థను అర్థరహితంగా మార్చే ప్రమాదం వాటిల్లింది. ఆధునిక నాగరకత, నవ్యభావ విప్లవం భారతీయ గార్హస్థ్య జీవన వ్యవస్థను భగ్నంచేయరాదనే విశ్వాసం కలవాడు విశ్వనాథ. సర్వధర్మాలకు బీజరూపమైన ధర్మమది. సీతారాముల ప్రణయం అద్వైతప్రేమకు చిహ్నం. భారతీయ జీవిత పరమార్థాన్ని జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో కూడా శాసిస్తున్న తత్వమది. దాన్ని నవ్యకవితా ప్రక్రియల్లో కులపాలికాప్రణయ తత్వంగా విశ్వనాథ ప్రతిపాదించాడు. దాన్ని మహాకావ్య ప్రక్రియలో రూపొందించటానికి రామాయణ కల్పవృక్షాన్ని రచించారు.

సమాజానుభూతి దృష్టితో గమనిస్తే విశ్వనాథ రచనాపరమార్థం మరింత స్పష్టంగా గోచరిస్తుంది. పంచవిధ ప్రవృత్తుల ద్వారా సమాజం పొందగలిగే అనుభూతి విశేషాలను వివిధ ప్రక్రియలద్వారా, వివిధ కవులు సాహితీ ప్రపంచంలో ప్రచలింపచేస్తున్న ప్రయోగాలద్వారా పరిచ్ఛిన్నంగా పొందగలిగే వికీర్ణ స్థితిని విశ్వనాథ సమీక్షించి, వాటినన్నింటిని సమాజానికి సమాహారరూపంగా అందింపగలిగిన ఒక మహాకావ్యాన్ని రచించటానికి పూనుకొన్నాడు. రామాయణ కల్పవృక్షం పేరుకు తగ్గట్టు సమాజం ఆకాంక్షించే వాస్తవిక, కాల్పనిక, వైజ్ఞానిక, జీవచైతన్య, ఆధ్యాత్మికానుభవాల సంపుటిని అందింపగలిగిన విశిష్టరచన. ఆయన జీవునివేదన సమగ్రకళానుభూతికోసం సమాజ జీవచైతన్యం ఆర్తులు

సాచే ఆవేదన. పంచజిహ్వల సమాజచేతనకు విశ్వనాథవారు అందించిన అమృత నైవేద్యమే, అనుభవకోశమే రామాయణ కల్పవృక్షం. ఆ కావ్యంలోని సన్నివేశాలు, పాత్రస్వభావాలు సమాజంలో కానవచ్చే వాస్తవజీవిత ప్రతిబింబాలుగా ఉండటం వల్ల వాస్తవానుభవాన్నీ అపూర్వ కాల్పనిక చైతన్యంతోనూ, కల్పనామహనీయ విశేషాంతోనూ పద్యంలో వ్రాసిన నవలా అన్నట్లు పఠితలను రమింపచేయటంచేత కాల్పనికానుభవాన్నీ, భారతీయ తత్వశాస్త్ర మర్యాదధారతో అందుకోనూ-అద్వైత మత దృష్టితో రామకథాతత్వాన్ని వ్యాఖ్యానించిన కావ్యం కావటంచేత జ్ఞానానుభవాన్నీ, జీవ వేదనాభరితమైన ఆ కావ్యమంతా జీవచైతన్య భరితమైయుండటం చేత రసానుభవాన్నీ, భక్తి కర్మ జ్ఞాన మార్గాల విశిష్ట సమన్వయంగా సాగే భారతీయ జీవన పరమార్థధార పరమరమ్యంగా కావ్యార్థాలలో వ్యంజింపబడటం చేత ఆధ్యాత్మికానుభవాన్నీ రామాయణ కల్పవృక్షం సమాజ సమగ్రానుభవ సంసిద్ధికి అందించే శక్తిమంతమైన కావ్యంగా రూపొందింది. మహాకావ్యానుభూతి కోసం పరితపించే సాహితీ జగత్తుకు, సమాజప్రవృత్తికి భాగవతంలాగా పరిపూర్ణానుభవస్థితిని కల్పించే యత్నమే జీవిత ధ్యేయంగా కృషిచేసి కృతార్థుడైన యుగచైతన్యమూర్తి విశ్వనాథ.

అభ్యుదయ కవితా ప్రస్థానానికి ప్రభాత భేరి మ్రోగించిన శ్రీశ్రీ సమాజ చైతన్యంలోని సామ్యవాద ప్రవృత్తికి ప్రాణం పోశారు. మొదట భావకవితాయుగం మీద తిరుగుబాటు ప్రకటించిన శ్రీశ్రీ రష్యా విప్లవ చైతన్యంతో ఉత్తేజితుడై మరో ప్రపంచంవైపు మహాప్రస్థానం సాగించాడు. అతని చైతన్యాన్ని ఒక శక్తిగా ఉద్యమంగా రూపొందించటంలో శిష్ట్లా, నారాయణబాబు, పఠాభి, పురిపండా, ఆరుద్ర మొదలైన కవుల రచనలు కూడా తోడ్పడ్డాయి. "లోకపుటన్యాయాలూ, కాల్చే ఆకలి, కూల్చే వేదన, దారిద్ర్యాలూ, దౌర్జన్యాలూ, పరిష్కరించే, బహిష్కరించే, బాటలు తీస్తూ, పాటలు వ్రాస్తూ, నాలో కదిలే నవ్య కవిత్వం, కార్మిక లోకపు కల్యాణానికి, శ్రామిక లోకపు సౌభాగ్యానికి, సమర్పణంగా, సమర్చనంగా" వ్రాస్తున్నానని శ్రీశ్రీ కలాన్ని కాహళగా మ్రోగించాడు. శ్రీశ్రీ కవితా చైతన్యం మార్క్సిజానికి ఉన్ముఖంగా సాగింది. దానిలోని గతి తార్కిక భౌతికవాదం, వర్గ పోరాటం మొదలైన అంశాలతో ఆవరించింది. శ్రీశ్రీ మహా

ప్రస్థానంలోని కొన్ని గేయాల్లో ప్రపంచ కార్మికోద్యమ చైతన్యం స్పష్టంగా కనిపిస్తుంది. బూర్జువా వర్గానికీ కార్మిక వర్గానికీ గల శత్రుత్వాన్ని కార్మికులు గుర్తించేటట్లు చేయటం, ఆనాటి సాంఘిక రాజకీయ వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగే విప్లవోద్యమాన్ని బలపరచటం, ఆర్థిక మూలమైన సామాజిక వ్యవస్థనూ, రాజకీయ వైరుధ్య ప్రధానమైన వాస్తవానుభూతినీ శ్రీశ్రీ తన కవితలో వ్యక్తం చేశాడు. శ్రీశ్రీ గేయాలు సామ్యవాద దృక్పథానికి సామవేదాలుగా నిలిచాయి. 1943 లో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడింది. "అభ్యుదయ రచయితల సంఘానికి కమ్యూనిస్టు పార్టీ పురుడు పోయటమే కాక పాలుపట్టి పెంచింది. రచయితలను రాజకీయాలకు ఉపయోగించుకోవడం ఆ పార్టీ విధానాలు ఆమోదించే కార్యక్రమం" అన్నారు ఆరుద్ర. ఒక విధంగా అభ్యుదయ రచయితల సంఘం వెనుక మార్క్సిస్టు ఉద్యమ రాజకీయ చైతన్యం దర్శకత్వం, కర్తృత్వం నిర్వహించింది. కాని, ఆ సంఘంలో రాజకీయ శక్తుల నియంత్రణకు లొంగని, వాటి ఆదేశాలను పాటించని రచయితలూ ఉన్నారు. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోనే కాకుండా స్వతంత్రంగా నిజాం ప్రభుత్వాన్ని ఎదిరించిన అభ్యుదయ కవులు దాశరథి, వట్టికోట, కాళోజీ మొదలైన వారెందరో ఉన్నారు. మార్క్సిజంను పూర్తిగా అంగీకరించకపోయినా అందులోని సామాజిక స్పృహను తమ కవితా చైతన్యంలో నింపుకున్న వారే అభ్యుదయ కవులు.

సాహిత్యంపట్ల మార్క్సిజం వ్యవహరించే విధానంలోనూ, ప్రసరించే దృక్పథంలోనూ ఎప్పటికప్పుడు మార్పులు వస్తూండేవి. వాటిని రాజకీయనేతలు నిర్ణయిస్తూ ఉండేవారు. మార్క్స్ ఏంగిల్స్ తమ సిద్ధాంతంలో సాహిత్యం ఆర్థిక సాంఘిక వ్యవస్థల చేత నియంత్రితమౌతుందనీ, ఆర్థిక సాంఘిక ప్రమాణాలతోనే సాహిత్యపు విలువలు నిర్ణయింపబడతాయనీ ఎక్కడా పేర్కొనలేదు. వారప్పుడప్పుడు సాహిత్యంమీద, రచనలమీదా వ్యక్తం చేసిన అభిప్రాయాలను గమనిస్తే సాహిత్య సృష్టి సర్వ స్వతంత్రమైనదిగా గుర్తించినట్లే స్పష్టమౌతుంది. కొన్ని కొన్ని యుగాల్లో వెలసిన మహాకావ్యాలకూ ఆయా కాలాల్లో ఉన్న ఆర్థిక సాంఘిక పరిస్థితులకూ సంబంధం కనపడటం లేదని కూడా వారు చెప్పారు. కాని క్రమంగా మార్క్సిస్ట్ ఆలోచనాధోరణుల్లో వచ్చిన మార్పులనుబట్టి, కావ్యాల, కళాఖండాల విలువలను నిర్ణయించటానికి మార్క్సిజమే ప్రమాణమన్నే సిద్ధాంతం

వచ్చింది. స్టాలిన్ కాలంలో సాహిత్య స్వాతంత్ర్యం పూర్తిగా అంతరించింది; పార్టీ విధానాల ననుసరించి వ్రాసే వ్రాతలుగా, ప్రచార సాధనాలుగా సాహితీ ప్రక్రియల్ని పరిగణించటం జరిగింది. రెనెవెలెక్, ఆస్టిన్ వారెన్ మాటలు గమనింప దగినవి—"Marxism never answers the question of the degree of dependence of literature on society... There is great literature which has little or no social relevence; social literature is only one kind of literature and is not central in the theory of literature, unless one holds the view that literature is primarily an 'imitation' of life as it is and of social life in perticular. But literature is no substitute for sociology or politics. It has its own Justiifcation and end" (Theory of literature : పు 109.)

విప్లవరచయితల సంఘంకూడా మార్క్సిజంనే ధ్యేయంగా పెట్టుకుంది. ఆ రచయితలు ఆ పార్టీ లక్ష్యాలకు అంకితమైన సభ్యులై ఉండాలనీ, ప్రత్యక్ష వర్గపోరాటంలో సాహిత్యాన్ని ఆయుధంగా వాడాలనీ నిర్దేశిస్తారు. అయితే లక్ష్యాలను గురించీ, లక్ష్యసాధనాలను గురించీ, సాధనలో అనుసరించవలసిన పద్ధతులను గురించీ వామపక్ష రాజకీయ వర్గాలలో ఏకాభిప్రాయం లేకపోవటంచేత నిర్దిష్టమైన ప్రగతి రచయితలకు, రచనలకు కొరవడింది. "A good deal of the recent confusion of our writers in the Leftist Camp has been due to their not understanding or being unable to make up their minds whether they are aiming at long-range or short-range writings" అని ఎడ్‌మెండ్ విల్సన్ అన్నాడు.

మార్క్సిస్ట్ సాహిత్యానికి ఎన్ని బలహీనతలున్నా దానికి ఒక సాంఘిక తాత్త్వికదృక్పథం వెన్నెముకగా ఉండటం, నిర్దిష్టమైన కార్యక్రమం ఉండటం అనేవి బలమైన అంశాలుగా పేర్కొనవచ్చు. మార్క్సు సిద్ధాంతానుసారం మానవ సమాజాన్ని పునర్నిర్మించాలన్న నిబద్ధత ఆ వాదంలోని శక్తి. కాని, రాజకీయ నాయకత్వంలో ఉన్న పరిమితులవల్లా బలహీనతలవల్లా మార్క్సిస్టు

సాహిత్యోద్యమం మందగించి పోవటం చారిత్రక సత్యం. తెలుగులో విప్లవ కవుల ఉద్యమం పరిస్థితీ అలాగే తయారైంది.

భారతీయులు - ఆమాటకొస్తే మార్క్సిస్టులు కాని వారందరూ భావించే సామాజికానుభూతికిన్నీ మార్క్సిస్టులు చెప్పే అనుభూతికిన్నీ ఎంతో భేదం ఉంది; మార్క్సిజంవల్ల సాంఘిక వ్యవస్థలోని కొన్ని రంగాలలో సుస్థితి ఏర్పడుతుందని నమ్మే వాళ్ళుకూడా అనుభూతి విషయంలో వారి దృక్పథాలను అంగీకరించరు. మార్క్సిజంకు కట్టుబడిన అభ్యుదయ రచయితలూ, విప్లవ రచయితలూ సమాజ వ్యక్తిలోని వాస్తవానుభూతిని, విజ్ఞానానుభూతిని అంగీకరింపగలరేమో కాని మిగిలిన మూడూ వారి దృష్టిలో మృగ్యాలే లేదా మిధ్యలే. ఆ మూడు ప్రవృత్తులను స్పృశించే కవితా చైతన్యాలను వారు వ్యక్తివాద ధోరణులనీ, రూపవాద ధోరణులనీ, సాంప్రదాయకమైన ధోరణులనీ, బూర్జువా పద్ధతులనీ, తిరోగామి విధానాలనీ వారి పారిభాషిక పదాల్లో, చట్రాల్లో ఇమిడ్చి తిరస్కరిస్తారు. నిజంగా మానవ సమగ్ర వ్యక్తిత్వాన్నీ, మానవ వికాసాన్నీ, కళానుభవ సమగ్రస్వరూపాన్నీ, సాహిత్య స్పృహనూ మన్నించేవారు మార్క్సిస్టులను అనుభూతి విరోధులుగా భావిస్తారు. మార్క్సిస్టుధోరణి మేధను కదిలించినంతగా, బోధను కలిగించినంతగా జీవచైతన్య స్పందనను అందించలేదు. అందులోని బలమైన వాస్తవికత లోకాన్ని ఎంతో ఆకర్షిస్తుంది. కాని, ఆ రచయితల నిబద్ధత కవితను సృజనాత్మక కళగా ఎదగవలసినంత ఎదగనీయకుండా చేస్తుంది. అందువల్లనే వారిది అకవిత్వమని ఆధిక్షేపించేది. అనుభూతి స్పృహకు దూరమైన కవిత అని విచారించేది. తెలుగులో అనుభూతి కవితావాదం తలయెత్తటానికి అభ్యుదయ కవిత్వ ధోరణిలోనూ, విప్లవ సాహిత్య ధోరణిలోనూ మార్క్సిస్టులు - తరతరాలుగా ఈ దేశంలో, మనసాహితిలో పరిపూర్ణ కళానుభవమనీ, రసానందమనీ దేనిని భావిస్తున్నారో, దానిని ఏయే సమర్థవంతమైన ప్రకియలద్వారా అభివ్యక్తీకరించటానికి వీలున్నదని తెలిసి ప్రయోగాలు నిర్వహిస్తున్నారో, వాటిని చదివి సమాజం కళానుభవాన్ని యేవిధంగా పొందుతున్నదో - సరియైన వివేచనతో విలువలతో గ్రహింపక తిరస్కరించటమే బలమైన కారణం. మార్క్సిస్టు దృక్పథమే సాహిత్య ప్రమాణమని చెప్పే సిద్ధాంతం ప్రపంచంలోని మేధావులందరిచేతా విమర్శింపబడుతున్నది. సమాజ సమగ్రానుభవ స్పృహను, సాహితీ స్పృహను కాదనే వారి తీవ్రవాదం ఆంధ్ర

సాహిత్య రంగంలో మార్క్సిస్టేతరుల ఆగ్రహానికి, తిరస్కారానికి గురి అయింది. మార్క్సిస్టుల ప్రచారంలో, సాహిత్యంలో అపార్థంపాలౌతున్న విష మూర్ఛితమైపోతున్న సాహిత్య సమగ్రానుభవాన్ని, సామాజికపరంగా రచయితల పరంగా దానికి చెప్పకోవలసిన సమన్వయాన్ని మరలా పునరుజ్జీవింప చేసుకోవ టానికి తమ రచనల ద్వారా ఉద్యమాన్ని సాగిస్తున్న రచయితల నిశ్శబ్దసంగ్రా మమే అనుభూతి కవితావాద ధోరణి.

## 4

కవిత్వ పరమావధిని గురించి చెపుతూ తిలక్ 'అగ్ని జల్లినా, అమృతం కురిసినా, అందం, ఆనందం దాని పరమావధి' అని పేర్కొన్నందుకు మార్క్సి స్టులు తమ సిద్ధాంతపరిధిలో 'ఆనంద' శబ్దాన్ని చింపిన విస్తరిలాగా చేసి చిటపట లాడేటట్లు దానికి విమర్శాగ్నిని ఎలా రగులుస్తారో శ్రీ రాచమల్లు రామచంద్రా రెడ్డిగారి వాక్యాలు చదివితే తెలుస్తుంది.

"కవిత్వం అందంగా ఉండాలనడమూ, ఆనందం ఇవ్వాలనడం నిర్ద్వం ద్వంగా భావకవుల అవగాహనే.... మన సమాజం ఫ్యూడల్ వ్యవస్థనుండి బూర్జువా వ్యవస్థకు మారినప్పుడే ప్రబంధ కవిత్వం గతించి భావకవిత్వం వచ్చింది. బూర్జువా అవగాహనలో జీవితం వ్యక్తినిష్ఠం; వ్యక్తి శక్తిసామర్థ్యాలనుబట్టి కష్ట సుఖాలు లభిస్తాయి కనుక, ప్రతి వ్యక్తీ తన హృదయ పరిపాకాన్నిబట్టి జీవితా నందాన్ని ఆస్వాదించవచ్చునని భావకవులు విశ్వసించారు. ఆనందమే జీవిత లక్ష్యం గనుక, కవిత్వం వాస్తవ జీవితంలో లేని ఆనందం ఇస్తుంది గనుక, కవిత్వం జీవితంకంటే ఉన్నతమైందిగా కనపడింది. చివరకు జీవితానికి దూరమై యెవనిపాటికివాడు 'తనలో తానొక ఏకాంత సౌందర్యం రచించు' కోవడమే కవిత్వ పరమార్థమయింది. ఆనందం జీవితంనుండి ప్రవహించటానికి బదులు, కవి కల్పిత స్వప్నలోకాలలో ఊరసాగింది. వాస్తవ జీవితానికీ, కవిత్వానికీ మధ్య అఘాతం విస్తరించేకొద్దీ జీవిత వాస్తవాన్ని విస్మరించటమే కవిత్వ ధ్యేయ మయింది. పర్యవసానంగా కవిత్వం మద్యంలాంటిదయింది. కవిత్వమిచ్చే ఆనందం కైపులాంటిదయింది.... అభ్యుదయ కవులు తిరుగుబాటు చేసింది సరిగ్గా ఈ కైపు కవిత్వంమీదనే. అభ్యుదయ కవుల అవగాహనలో కవిత్వం ఇవ్వవల్ల

సింది ఆనందం కాదు, ఉత్తేజం .... ఈ ఉభయ కవితారీతుల మధ్యగల భేదాన్ని ఒక్కమాటలో చెప్పాలంటే, భావకవిత్వం ఆనందం ద్వారా ప్రమత్తతా పర్యవసాయి, అభ్యుదయ కవిత్వం ఉత్తేజం ద్వారా క్రియాశీలతాపర్యవసాయి లేక కార్యోత్సాహ పర్యవసాయి." (సారస్వత వివేచన - పు. 111-112)

ఇందులో తేలిందేమిటంటే, అభ్యుదయ రచయితల దృక్పథంలో కవిత్వం అందంగా ఉండకూడదు, ఆనందాన్ని ఇవ్వకూడదు, అయితే ఉత్తేజాన్ని కలిగించాలి. ఇది కవిత్వ సామాన్య లక్షణమని సహృదయులు అంగీకరించటం కష్టం. ఉత్తేజం హృదయానికైతే పరవాలేదు - ఇంద్రియాలకైతే ప్రమాదం. అయినా అది అభ్యుదయకవిత్వ లక్షణమని రా.రా.గారి అభిప్రాయం. అంతేకాదు, కవిత్వం మద్యం లాంటిది: రసమంటే మద్యం తాగినప్పటి కైపువంటి కైపు అని వ్యాఖ్యానించారు. ఆ శబ్ద శక్తి తెలుసుకొన్నవారు ఇది విని నొచ్చుకోక మానరు. 'తిలక్' కూడా అటువంటి అర్థంలోనే వాడాడా ? అని కొందరికి అనుమానం రావచ్చు. అలా అనుమానం కలిగించటం రా.రా. అభిమతంకావేమో! కాని, వారి అభిప్రాయంలో సంప్రదాయార్థ విచ్ఛేదం మాత్రం స్పష్టంగా కనపడుతోంది. అది రచయితకూ, విమర్శకుడికీ, సామాజికునికీ గూడా శ్రేయస్కరం కాదు. ఈ విమర్శవలన తిలక్ కవిత్వంలోని సాహిత్యపు విలువలు తెలియకపోగా మార్క్సిస్టు దృక్పథంతో వాటిని ద్వేషించటం తెలుస్తూంది. పర్యంతంలో ఒక కవిని గురించి, అతని కవిత్వ తత్వాన్ని గురించి సదవగాహన కల్పించలేని విమర్శపై వెగటు గూడ జనించవచ్చు. నేటి మార్క్సిస్టు విమర్శ మీద లోకానికి కలుగుతున్న విసుగుకు ఇదే కారణం.

"ప్రతిమాటకీ శక్తివుంది; పదునువుంది
ప్రతి చిత్రణకీ అర్థం వుంది; ఔచిత్యంవుంది
గులకరాళ్ల శబ్దా మోగించి గొప్ప సంగీతం అని దబాయించకు
అలిగి నన్ను శపించకు; అన్నా! నీ మీద నాకు కోపంలేదు"

అన్న తిలక్ గీతం కవిత్వాన్ని ఉద్దేశించింది చెప్పింది మాత్రమేకాదు - నేటి మార్క్సిస్టు విమర్శకూ వర్తిస్తుందని చెప్పవచ్చు.

ఇస్మాయిల్‌గారు కవిత్వాన్ని గురించే కాక, విమర్శాంశాలను గురించి కూడా మార్క్సిస్టులు అనుసరించే వైఖరిని ఎలా బట్టబయలుచేశారో గమనించండి- "వైయక్తిక అనుభూతికి, సాంఘిక చైతన్యానికి మధ్య సామరస్యం సాధించిన కవులే మంచి కవిత్వం రాయగలిగారని (నేను చెప్పదలచిన సంగతి). ఈ సందర్భంలోనే యేట్స్, బ్రెహ్ట్, పాస్టర్‌నాక్ వగైరాలను పేర్కొనటం. ఐరిష్ జాతి వేదనకి తన వ్యక్తి జీవితానికి మధ్య తాదాత్మ్యం సాధించాడు యేట్స్. బ్రెహ్ట్ ఈస్ట్ జర్మన్ కమ్యూనిస్టు పార్టీ సభ్యుడైనా, పార్టీ సిద్ధాంతానికి ఎప్పుడూ బానిస కాలేదు. అగత్యం కలిగినప్పుడు పార్టీని అధిక్షేపిస్తూ పద్యాలు రాయటానికి వెనుకాడలేదు. కమ్యూనిస్టుపార్టీ కన్నా తన ప్రజ గొప్పదని భావించిన పాస్టర్ నాక్ సోవియట్ ప్రభుత్వ యంత్రాన్ని ఎదిర్చటానికి ఎప్పుడూ భయపడలేదు. సామాజిక ప్రయోజనానికీ కవిత్వపు విలువలకీ మధ్య సరైన తూకం నిలిపిన వాళ్ళు వీళ్ళంతాను. అందుకని మంచి కవిత్వం రాయగలిగారు. ఈ పని మన రాజకీయ కవులు చెయ్యలేకపోతున్నారు. కారణమేమై ఉంటుందా? ఆలోచించమన్నాను. ఆ పని ఎవ్వరూ చేయక పోగా....నన్ను కసిరారు....మార్క్సిస్టులకు స్వేచ్ఛంటే ఎక్కడో మంట పెట్టినట్టే వుంటుంది. వాళ్ళ సమాజంలో వ్యక్తికి ప్రాముఖ్యం లేదు. సమాజ యంత్రంలో వ్యక్తి ఒక చిన్న చక్రం మాత్రమే. యంత్రంలో భాగంగా తిరుగ వలసిందే. సమాజ ప్రయోజనం కోసం వ్యక్తి స్వేచ్ఛ, వ్యక్తి సుఖమూ, వ్యక్తి విలువలూ బలి కావలసిందే. అటువంటి సమాజం ఎంత ఆనందమయంగా వుంటుందో మీ రూహించుకోగలరు. ఎందుకంటే, మొన్న మొన్నటి వరకు అటువంటి సమాజ వ్యవస్థలో నలిగిన వాళ్లమే మనం." (కవిత్వంలో నిశ్శబ్దం: 95-97) ఇస్మాయిల్‌గారి మాటలు వింటే అనుభూతి కవిత్వవాద కవులు మార్క్సిస్టు వైఖరిలోని స్వేచ్ఛా రాహిత్యానికీ, రాజకీయ నిబద్ధతకు, పార్టీ ప్రమాణాలతో సాహిత్యాన్ని సమీక్షించే వైఖరికీ, మన జాతి అనుభవానికి విరుద్ధమైన వ్యాఖ్యానాలకూ సహించి నిశ్శబ్దంగా ఊరుకుండే రోజులు గతించాయని స్పష్టమౌతోంది. కవిత్వంలోని నిజమైన విలువలకోసం కలాన్ని పట్టి, కావలసి వస్తే కదనానికైనా సిద్ధం కావటమే నేటి అనుభూతికవితావాదుల ఉద్యమం.

అనుభూతికవితావాదులకు బలమేకాదు, గళం కూడా ఉందనీ, ప్రయోగ శక్తియే కాదు, ప్రయోజన ప్రసక్తి కూడా ఉందనీ, సామాజిక స్పృహయే కాదు,

సాహిత్య స్పృహ కూడా ఉందనీ. శాస్త్ర పరిజ్ఞానమేకాదు సంప్రదాయ విజ్ఞానం కూడా ఉందనీ, ఇది దేశీయమే కాదు, విశ్వ చైతన్యంతో కూడుకొన్నదనీ ఎలుగెత్తి బల్లగుద్ది చెప్పిన వారిలో అగ్రగణ్యులు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ. వారి కవిసేన మేనిఫెస్టో - విప్లవ కవిత్వానంతరం తెలుగు సాహిత్యంలో అనుభూతి కవితా స్పృహ ఎలా జీవించగలుగుతుందో వ్యాఖ్యానించిన వివేక చూడామణి. అనుభూతి కవితకు ఒక వాదాన్ని కల్పించి యిచ్చినవారు శ్రీ శేషేంద్ర శర్మ; దాన్ని ఉద్యమంగా ముందుకు తీసుకొని పోతున్న వారు శ్రీకాంత శర్మ, ఇస్మాయిల్, సుప్రసన్న, మాడిరాజు రంగారావు మొదలైన ప్రయోక్తలు, అద్దేపల్లి రామమోహన రావు, ముదిగొండ వీరభద్రయ్య మొదలైన విమర్శకులు. వివరాలివ్వవలసిన పని లేదనుకుంటాను. వీరి గొంతులు నేడు బలంగానే వినపడుతున్నాయి.

## 5

ఆధునికాంధ్ర సాహిత్యప్రయోగాలను సమీక్షిస్తే అనుభూతిని ఆస్వాద యోగ్యంగా చెయ్యడానికి రచయితలు,సామాజికులుపాటించే పద్ధతులు ప్రధానంగా మూడు రకాలని వివేచించవచ్చు.

అవి——

1. సాధారణీకరణం
2. సామాజికీకరణం
3. స్వాత్మీయీకరణం

### 1. సాధారణీకరణం :

భారతదేశ రససిద్ధాంతంలో సాధారణీకరణం ప్రసిద్ధం. ఈ మార్గం కథనాశ్రయించిన కావ్యాలకే ఎక్కువగా వర్తిస్తుంది. సామాజికానుభవ చైతన్యాన్ని గమనించిన కవి, సామాజికులు సహానుభూతి పొందకలిగిన పాత్రలను సన్నివేశాలను భావాలను సంపుటీకరించి సాహితీప్రక్రియలను వెలువరుస్తాడు. కావ్యం, ఇతిహాసం ఈ ప్రక్రియల్లో ఉదాత్తమైనవి. పఠిత కావ్యపాత్రలద్వారా వ్యక్తమయ్యే అనుభవాలను సాధారణీకరణంద్వారా స్వీయానుభవాలుగా మార్చుకొని రమిస్తాడు. ఆ రమణంలోని హృదయద్రవస్థితియే రసానుభవం. రసాను

భవం సమాజంలోనే ఉంది. దాన్ని కోరేదీ సమాజమే. అందుచేత కవి ఆ అనుభూతికి కారకుడు. కారకుడైన కవి కూడా సమాజంలో భాగమే. కానీ సమాజానుభవాసక్తిని గుర్తించి స్వీయ ప్రతిభాశక్తితో తనదైన దర్శనంతో ఒక ప్రక్రియను సృష్టింపగల్గిన వ్యక్తికూడా. వ్యక్తిచైతన్యాన్ని విశ్వచైతన్యంతో సంవదింపచేసే సాహిత్యసాధన సాధారణీకరణం. ఆధునిక సాహిత్యంలో నవ్య సంప్రదాయధోరణినిపోషించిన కవులందరూ ఈ మార్గాన్ని ప్రవర్తింపచేయడానికి ప్రయత్నం చేసినవారే. ఒక్క విషయం: ఇది పాతబడ్డపద్ధతని భావించడం పొరపాటు. ఇది విశ్వజనీనం కాబట్టి ప్రతి యుగంలోనూ బ్రతికే ఉంటుంది. తద్విరుద్ధమైన ప్రయోగాలకు ప్రాబల్యం వచ్చినపుడు స్వీయశక్తి ప్రదర్శనకోసం అభినవ శక్తితో విజృంభిస్తుంది. అంతే తప్ప దానికి చావు లేదు. విచ్ఛిత్తి లేదు. పైన పేర్కొన్న మూడు విధాలైన ప్రక్రియల్లో అత్యంత సరళమైనది, శక్తిమంతమైనది ఈ సాధారణీకరణ పద్ధతి.

**2.** సామాజికీకరణం :

ఈ మాట అనుశీలనంకోసం ఏర్పర్చుకుంటున్నదే. అభ్యుదయ కవులు విప్లవ కవులు సమాజ వాస్తవికతను కవిత్వంలో ప్రతిఫలింపజేస్తూంటే, వాస్తవకథనాల పట్ల సానుభూతిని, ఉద్యమ కర్తవ్యాలపట్ల ఉత్తేజాన్ని, ఉద్రేకాన్ని సాహిత్యంలో అనుభవించటం ఈ ప్రక్రియలో ముఖ్యం. ఇందులోనూ సృజన వ్యాపారంలో కవి ప్రకటించే ఉద్రేకానికి, ఉత్తేజానికి ఇచ్చిన ప్రాముఖ్యంకంటే సామాజికులు రచన వలన పొందే ఉద్రేకానికి ఉత్సాహానికి ప్రాముఖ్యం ఉంటుంది. అంటే మార్క్సిస్టు ఉద్యమంలో వివాదమో, నినాదమో కవిత్వంలో కవి చేస్తే దాన్ని చదివి ఉత్తేజితుడైన సామాజికులు ఆ కవిత్వం విని, లేదా చదివి మానసికంగా ఉత్తేజం పొంది సహృదయులుగా మాత్రమే మిగిలిపోతే అది సామాజికీకరణం కాదు. వారు కార్యోన్ముఖులై విప్లవ రంగంలో దూకితే లేదా మార్క్సిస్టు దృక్పథంతో సమాజ పునర్నిర్మాణానికి భౌతికంగా పూనుకుంటే అది సామాజికీకరణం అవుతుంది. సాధారణీకరణంలో కావ్యాలు పఠిత అంతరంగాన్ని రసీకరించి ఊరుకుంటాయి. అతడు ఆ తరువాత చైతన్యోన్ముఖుడు కావచ్చు. కాని, ఆ వ్యాపారాన్ని సాహిత్య పరిధిలోకి తీసుకోరు. కాని, సామాజికీకరణంలో మాత్రం కవిత్వం కారణం, ఉద్యమం కార్యం. అంటే కార్య కారణ రూపాలైన కవిత్వమూ కార్యా

చరణమూ- ఈ రెండూ కలిస్తే తప్ప మార్క్సిస్టు కవిత్వానికి అస్తిత్వం లేదు. అందువలన ఎంత విప్లవం దేశంలో వచ్చింది? అన్నదానిమీదే విప్లవ కవిత్వం ఆధారపడి ఉంటుంది. సామాజికీకరణంలో మరొక విశేషం కూడా గుర్తుంచుకోవాలి. ఇది ప్రధానంగా వామపక్ష ధోరణికి సంబంధించింది కాబట్టి వర్గ దృక్పథం ప్రాధాన్యం వహిస్తుంది. మార్క్సిస్టు కవిత నిబద్ధ సామాజికునికా? సామాన్య సహృదయునికా? అన్న ప్రశ్న ఇందులో ఉదయిస్తుంది. సామాజిక సమగ్రానుభవ చైతన్యంలో మార్క్సిస్టు దృక్పథం భాగం కాదని చెప్పడానికి వీల్లేదు. అయితే అది సమగ్రానుభవ స్ఫూర్తిని సంతరించుకోలేదని మాత్రం నిస్సంశయంగా చెప్పవచ్చు. అంటే, వాస్తవ వైజ్ఞానికానుభవాల చోదనం మార్క్సిస్టు సాహిత్య చైతన్యంలో విశేషంగా గోచరమౌతున్నపుడు అభ్యుదయ కవిత్వం కానీ, విప్లవ కవిత్వంకానీ ఆయా అనుభవాల అభివ్యక్తికి, ఆస్వాదనకు తోడ్పడవచ్చు. దీన్నే మరోమాటలో చెప్పాలంటే మార్క్సిస్టు చైతన్యాన్ని సమాజంలో జాగృతం చేసేది ప్రధానంగా రాజకీయపార్టీ. ఆ సమాజ సంస్కారానికి ఉత్తేజం కల్గించడానికి కవి తన కవితతో తోడ్పడతాడు. ఇటువంటి కార్యం నిర్వహిస్తున్నపుడు పార్టీ చెప్పిన దానిని ప్రజలకు ఉత్తేజం కలిగేట్లు చెప్పే పద్ధతిని మాత్రమే అనుసరిస్తే ఆ కవితకు నినాద కవిత్వమని ప్రచార కవిత్వమని పేర్లు పెట్టడం అప్పుడప్పుడు తటస్థ పడుతుంటుంది. ఏమైనా కవి ప్రజలలో పార్టీకి అనుకూలమైన చైతన్యాన్ని సృష్టింప కల్గితేనే మార్క్సిస్టు దృక్పథంలో కవిత్వం సార్థకమైనట్లు. దీన్నే సామాజికీకరణం అని అంటున్నాం. మార్క్సిస్టు సాహిత్యాన్నంతా ఈ దృష్టితోటి అనుశీలింపవలసివస్తోంది. ఇందులో అనుభవం ప్రమాణం కాదు; ప్రతిక్రియ ప్రమాణం. సహానుభూతి ప్రమాణం కాదు; కొంతవరకు సానుభూతి ప్రధానం. సద్యఃపర నిర్వృతికాదు ఇందులో ముఖ్యం; సత్వర కార్యాచరణం. కవిత ఎంత హృదయాన్ని కదిలించింది అన్నది కాదు ప్రధానం; సామాజికుని మానసిక చైతన్యం కార్యరూపంగా ఎంత ప్రవహించింది అన్నదే ప్రమాణం. ఆచరణ వెనుక అనుభూతి లేదని చెప్పడం అసంబద్ధం. మానసికంగా ఉత్తేజంపొందని వాడు శారీరకంగా కార్యశీలి కాలేడు. కవి ఉత్తేజితుడైతే కలమాడితే చాలు. కాని మార్క్సిస్టు కవిత కలంతో సంతృప్తి పడేదికాదు. హలంగానో, గన్‌గానో మారాలి. వాటిని పట్టినవాడే విప్లవ కవిత్వానుభూతిని కార్యరూపంగా సాధిస్తున్నవాడు. ఒకవిధంగా మార్క్సిస్టు సాహిత్యంలో కలాని

కున్న ఈ గౌణమైన గౌరవాన్ని బట్టి కవి ప్రచారకుడని, కవిత్వం సినాదమని, అనుభవం కవిత్వంవ్రాసేకవిడికాదు, కాదు దాన్ని కావ్యరూపంలో పెట్టే సమాజాని దేనని సాధారణంగా భావింపబడుతోంది.అందువలన ఈ పద్ధతిలో-కవితా సామగ్రికి కనీస గౌరవం; కార్యాచరణ సూత్రాలకు కనకాభిషేకం.

3. స్వాత్మీయాకరణం : కవి ప్రధానంగా ఆత్మాశ్రయ కవిత్వం చదివి లోకం అనుభూతిచెందే విధానంగా భావించవచ్చు.చలం అన్నట్లు లోకం బాధ కవి తనదిగా వ్యక్తంచేసినా,తన బాధ లోకంఎిగా వ్యక్తంచేసినా ఆత్మాశ్రయ స్వభావం మాత్రం తప్పదు. సాధారణీకరణంకంటే దీన్ని వేరుగా చెప్పడంలోగల తాత్పర్య మేమిటంటే, కవి తన స్వీయానుభూతిని ఆత్మనాయకంగా ఈ ప్రక్రియలో వ్యక్తీకరిస్తాడు. అది కవి వ్యక్తిగత అనుభవం అనడానికి వీలుంది. కానీ, నిజా నికి లోకంలో వ్యక్తిగతమైన అనుభవాలకు ఆత్మాశ్రయకవితలో వ్యక్తమయ్యే అనుభవాలకు ఎంతో భేదం ఉంది. వ్యక్తిగత అనుభవాలన్నీ లోకంతో పంచుకు నేవికావు. ఆత్మాశ్రయ కవితలోని భావాలన్నీ లోకంతో కవి పంచుకోగలిగినవిగానే ఉంటాయి; లోకంకూడా అవి తనవిగా తాదాత్మ్యభావంతో అనుభవింపగలిగేవిగా ఉంటాయి. ఒకవిధంగా పరులచేత అనుభవింపచేయటానికి వీలున్న స్వీయానుభవా లనే కవి ఆత్మాశ్రయకవితలో ఉదాత్తీకరించి కళామయంచేసి అందిస్తాడు. ఐతే ఆధునికాంధ్ర సాహిత్యంలో ఆత్మాశ్రయ కవిత ఖండకావ్య ప్రక్రియ నాశ్రయించి మాత్రమే వెలువడింది. ఆ ప్రక్రియ స్వభావాన్ని అనుసరించి కవులు సామా న్యంగా ఒక మానసికమైన అవస్థను కల్పింపగలిగే శక్తివంతమైన భావాన్నో, లేదా సజాతీయమైన భావసంపుటినో, లేదా వితర్కాన్ని కలిగించగలిగిన భావ సంక లనాన్నో సంపుటీకరించే శిల్పాన్ని వెలారుస్తారు. ఖండకావ్యంలో మహాకావ్యంలో లాగా సంచారులచేత పరిపుష్టంచెందే స్థాయిభావస్ఫూర్తి ఉండదు. శక్తిమంతమైన భావాలచేత ప్రజ్వలింపబడే ఒక మానసిక అవస్థాచైతన్యం మాత్రమే స్ఫుటంగా పఠితచేత అనుభవింపబడుతుంది. సామాజికునకు అనుభవ యోగ్యమైన స్వీయాను భవాన్ని కవితలో కవి వ్యక్తీకరించడం,దాన్ని సామాజికుడు ఆత్మీకరించుకొని తాదాత్మ్యంతో అనుభవించడం అనే ప్రక్రియ ఇందులో గాఢంగా కనబడుతుంది. కాబట్టి దీన్ని స్వాత్మీకరణం అని పేర్కొనడం జరిగింది. ఈ ప్రక్రియ అను భూతి కవిత్వానికి కూడా వర్తిస్తుంది.

అనుభూతికవులు సమాజానుభూతికోసమే కవిత్వం రాస్తారుకాబట్టి వారిలో పూర్వం పేర్కొన్న పంచవిధ ప్రవృత్తులకు సంబంధించిన చైతన్యాలుకూడా ఉండవచ్చు. అనుభూతి కవిత్వం ప్రధానంగా జీవచైతన్య ప్రవృత్తికి సంబంధించింది. మిగిలిన నాలుగు ప్రవృత్తులను సాధ్యమైనంతవరకు జీవచైతన్య ప్రవృత్తితో సంగమింప చేసుకోవడమో,దానికి పోషకంగా నిలుపుకోవడమో చేస్తారు అనుభూతికవులు. దీనివల్ల ఆయా కవులయొక్క అభివ్యక్తివైవిధ్యాన్ని బట్టి- వాస్తవ చైతన్యానికి జీవచైతన్యానికి పోషకంగా నిలిపే కవులని, కాల్పనిక చైతన్యాన్ని జీవచైతన్యానికి పోషకంగా నిలిపే కవులని, జ్ఞానప్రవృత్తిని జీవచైతన్య ప్రవృత్తికి పోషకంగా నిలిపే కవులని- ఆధ్యాత్మిక ప్రవృత్తిని జీవచైతన్య ప్రవృత్తికి పోషకంగా నిలిపేకవులని, నాలుగువిభాలుగా అనుభూతి కవులను వింగడించవచ్చు. వారి రచనలనుకూడా ఈ విభాగాన్ని ఆశ్రయించి విశ్లేషించవచ్చు. సాధారణంగా ఈ నాలుగువిధాల చైతన్యాలను సమీక్షిస్తే- సమాజికి సమగ్రానుభవస్ఫూర్తిని అనుభూతి కవిత్వంద్వారా ఆవిష్కరించడానికి సమకాలీన కవులు సమకాలీన సామాజిక స్పందనతో కవితా వ్యాసంగాన్ని నిర్వహిస్తున్నారనీ, సంఘటితంగా ఈ కవితాచైతన్యాన్ని సమీక్షిస్తే- సమగ్ర సమాజానుభవ దర్శనానికై సాహితీ చైతన్యం ఉద్యమిస్తోందని స్పష్టమౌతోంది. భావకవిత్వ యుగం కాల్పనిక ప్రవృత్తి ప్రధానంగా సమాజసమగ్రానుభూతిని సాధించాలని ప్రయత్నిస్తే, అనుభూతికవిత్వ ధోరణి ఉద్యమ చైతన్యాన్ని సంతరించుకుని జీవ చైతన్యప్రవృత్తి ప్రధానమైన సమగ్రానుభవస్ఫూర్తిని సమాజానికి అందించే ప్రయత్నాన్ని చేస్తోందని నిస్సంశయంగా చెప్పవచ్చు.

అనుభూతి కవిత్వాన్ని రచిస్తున్న కవులను, వారు సాధించిన ప్రత్యేకతలను సమీక్షించడానికి మరోవ్యాసమే కాదు గ్రంథమే వ్రాయవలసివస్తుంది.

అధునిక కవుల్లో జీవచైతన్య ప్రవృత్తిని వాస్తవ చైతన్యంతో పరిపుష్టం చేసిన కవుల్లో కవిత్రయం అనదగినవారు తిలక్, శేషేంద్ర, ఇస్మాయిల్.

జీవచైతన్యాన్ని కాల్పనిక మార్మిక చైతన్యాలతో పరిపోషించిన రచయితలుగా మాదిరాజు రంగారావు, అరిపిరాల విశ్వం, వేగుంట మోహన్ప్రసాద్, మర్షానంద్ చినవీరభద్రుడు, మొదలైన వారిని పేర్కొనవచ్చు.

కాల్పనిక ప్రవృత్తితో జీవచైతన్యాన్ని పోషించే అనుభవాన్ని కవిత్వంలో పోషించిన కవులలో ఇంద్రకంటి శ్రీకాంతశర్మను, వై. శ్రీరాములును మొదట పేర్కొనవచ్చు.

వైజ్ఞానిక తాత్త్విక ప్రవృత్తులతో జీవచైతన్య ప్రవృత్తులను పోషించిన కవుల్లో పేర్కొనదగినవారు బుచ్చిబాబు, అజంతా, సుప్రసన్న, కొత్తపల్లి సత్య శ్రీమన్నారాయణ, రేవతీదేవి మొదలైనవారు.

ఆధ్యాత్మిక ప్రవృత్తిని తాత్త్విక ప్రవృత్తిని జీవచైతన్యంలో నింపు కున్న కవులలో మొట్టమొదట పేర్కొనదగినవారు చలం, ఆర్.ఎస్. సుదర్శనం, వజీర్ రహ్మాన్, సుప్రసన్న మొదలైనవారు.

అనుభూతి కవిత్వ ఉద్యమంలో ప్రయోగాలు చేస్తున్న రచయితల రచన లను విశ్లేషించే యత్నం కూడా విమర్శలో సాగుతున్నది. డా॥ ముదిగొండ వీర భద్రయ్యగారు అనుభూతి కవిత్వాన్ని అభ్యుదయ అనుభూతికవిత్వమనీ, మార్క్సి యాభ్యుదయ అనుభూతి కవిత్వమనీ, జాతీయవాదానుభూతి కవిత్వమనీ విశ్లేషించి వివరించారు. అందులో అభ్యుదయానుభూతి కవిత్వానికి శేషేంద్రకవిత నుదాహ రించారు. (అనుభూతి కవిత్వం -కొన్ని వ్యాసాలు: పుట 38) అలాగే జాతీయాను భూతివాద కవిత్వానికి చేతనావర్త కవుల కవితలను పేర్కొనవచ్చు. మార్క్సి యాభ్యుదయ కవిత్వానుభూతికి కె.వి.ఆర్. కవితలను పేర్కొనవచ్చు.

అనుభూతి కవిత్వాన్ని గురించి ఇప్పుడు అన్వేషించవలసిన పనిలేదు. దాని స్వరూప స్వభావాలను గురించి గాఢంగా ఆలోచింపవలసిన సమయం ఆసన్న మయింది. కవులు విమర్శకులు ఎందరో ఇప్పటికే రంగంలో దూకి అనుభూతి కవిత్వాన్ని ఉద్యమంగా రూపొందించటానికి కృషి చేస్తున్నారు.

అనుభూతి కవిత్వ ఉద్యమానికి గమ్యమేమిటి? సమాజ సమగ్రానుభూతి నందింపగల్గిన సాహితీ ప్రక్రియావిష్కారం; సామాజిక చైతన్యంలోని పంచవిధ ప్రవృత్తులకూ అనుభవాన్ని అందింపగలిగిన సాహితీ స్పృహను, నవీన ప్రయో గాలను సాహిత్యరంగంలో సాధించటం.

ఆనాడు గురజాడ వాస్తవ దృక్పథాన్ని ఆరంభించాడని, భావకవిత్వ చైతన్యం వలన కొంతకాలం అది మందగించిందని, మరల శ్రీశ్రీ కవితలో అది పునర్భవించి వ్యాపించిందని విమర్శకులు వివేచించారు. అలాగే అనుభూతి కవిత్వా నికి కూడా అన్వయం చెప్పుకోవచ్చు. ఆధునికాంధ్ర సాహిత్యంలో సమగ్ర

సామాజికానుభవ స్ఫూర్తి కోసం మహాకావ్యరచనం చేసి అభ్యుదయ కవితా యుగమంతా తానే ఆవరించి నిలిచాడు విశ్వనాథ. ఆ స్పృహను పోషించిన నవ్య సంప్రదాయయుగానికి నాయకుడై ముందుకు నడిచాడు. సమాజ సమగ్రానుభవ స్పృహకు ఆధునిక సాహిత్యంలో విశ్వనాథయే భగీరథుడు.

అభ్యుదయ కవిత్వ యుగంలోనే మార్క్సిస్టులు అనుభవ వ్యతిరేక ధోరణులను కవిత్వంలో ప్రవేశ పెట్టారు. అనుభవానికి తమకు తోచిన అర్థాలు చెప్పారు. అంతరించి పోతున్న అనుభవ స్పృహను పునరుజ్జీవింప చేయడానికి అనుభూతివాదం తలఎత్తింది. బహుముఖంగా అది సాగుతోంది. ఖండకావ్య ప్రక్రియ నాశ్రయించిన అనుభవ మార్గాన్నే నేడు అనుభూతి కవిత్వమని పిలుస్తున్నాం. ఇది నాలుగైదుపాయలుగా ప్రవహిస్తున్నట్లు కూడా గమనించాం. ఇవన్నీ ఒకచోట సంగమించాలి. అదే సమగ్ర సమాజానుభవం. ఆ మార్గం చూపింది విశ్వనాథ. దాన్ని జాతి క్రమంగా దర్శిస్తోంది. కవులు ఖండ కావ్యాల నుండి "ఆధునిక ఇతిహాసాల" వైపు నడుస్తున్నారు. పరిచ్ఛిన్నంగా అందిస్తున్న పంచవిధ సామాజిక అనుభవ ప్రవృత్తులనన్నింటిని ఏకోన్ముఖం చేసి సాహిత్యం ద్వారా అందించాలన్న లక్ష్యం వైపు ముందుకు సాగుతున్నారు.

అనుభూతి సమగ్రత కోసం సాహిత్యం ఉద్యమించడమే యుగధర్మం. ఆధునికాంధ్ర సాహిత్యంలో నవ్యకవిత్వ యుగం విభిన్న ప్రక్రియలద్వారా అనుభవాన్ని సాధించింది. భావ కవిత్వయుగం వివిధ ప్రవృత్తులతో అనుభవాన్ని సాధించింది. భావ కవిత్వ యుగంలో భాసించిన వైవిధ్యాన్ని ఏకోన్ముఖం చెయ్యాలని విశ్వనాథ ప్రయత్నించాడు. మహాకావ్యం వ్రాశాడు. నవ్య సంప్రదాయ యుగం ఆయన వెంట నడిచింది. అభ్యుదయ కవిత్వ చైతన్యం పాక్షికంగా అనుభూతిని సాధించింది. అందువలన సమగ్రానుభూతి కోసం అనుభూతి కవిత్వం ఆ యుగంలోనే బలంగా తలెత్తింది. వేగాన్ని సంతరించుకుంది. దిగంబర కవిత్వంలో అనుభూతికి తావులేదు. విప్లవ కవిత్వంలో అనుభూతికి వ్యతిరేకత కూడా వ్యాపించింది. దానితో అనుభూతి కవితా వాదం స్వీయ రక్షణకేకాక స్వీయ ఉద్యమవ్యాప్తికి కూడా కంకణం కట్టుకొని కదనానికి సిద్ధమైంది. కవిత్వంలో సమగ్ర సామాజికానుభవాన్ని పండించాలన్న అత్యంత ఆధునిక సాహిత్య స్పృహతో చేస్తున్న ప్రయత్నమే అనుభూతి కవితావాదం.

# వ్యాసకర్తల పరిచయాలు

## పేర్వారం జగన్నాథం

జననీజనకులు : సయ్యమ్మ, సంతాజి; పుట్టిన తేది : 23-8-1934; జన్మస్థలం : ఖిలాషాహపురం, రఘునాథపల్లి మండలం, తా॥ జనగామ, జి॥ వరంగల్లు (ఆం.ప్ర.); విద్యార్హతలు : ఎం.ఏ., పిహెచ్.డి.; పరిశోధన : ఆరె జానపద సాహిత్యంపై తెలుగు ప్రభావం; వృత్తి : ఆచార్యుడు - తెలుగు శాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు; శాశ్వత చిరునామా : 1/705/5-1-C, మిథిలానగర్, బాలసముద్రం, హనుమకొండ, వరంగల్లు జిల్లా; పదవులు : తెలుగు శాఖాధ్యక్షులు, కాకతీయ విశ్వవిద్యాలయం, సంయుక్త కార్యదర్శి, ఆం.ప్ర. సాహిత్య అకాడమి (1979-83), కార్యవర్గసభ్యుడు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు; డైరెక్టరు, కాకతీయ అధ్యయన కేంద్రం (పోటీ పరీక్షల శిక్షణా కేంద్రం), అధ్యక్షుడు, కాకతీయ విశ్వవిద్యాలయ అధ్యాపక సంఘం; ముద్రిత రచనలు : సాగరసంగీతం (కవితా సంకలనం), వృషభ పురాణం (కవితా సంకలనం), 'చేతనావర్తం' సభ్యులలో ఒకడు, సాహిత్యావలోకనం (వ్యాస సంకలనం), ఇంద్రద్యుమ్నీయం (ప్రౌఢ ప్రబంధం-సంపాదకత్వం), ఆరె జానపద గాథలు (సమీకరణ, సంపాదకత్వం), ఆరె జానపద గేయాలు (సమీకరణ. సంపాదకత్వం)

* * *

## ఆర్. ఎస్. సుదర్శనం

జననీ జనకులు : రాటకొండ కనకమ్మ,సుబ్బయ్యానాయుడు; పుట్టిన తేది : 13-12-1927; జన్మస్థలం : మదనపల్లి, చిత్తూరు జిల్లా; విద్యార్హతలు : ఎం. ఏ (ఇంగ్లీషు భాషా సాహిత్యాలు) మద్రాసు విశ్వవిద్యాలయం, 1947; వృత్తి : అధ్యాపకత్వం(1948-66) కళాశాల ప్రిన్సిపాల్ (1966-81) ఆంధ్ర ప్రదేశ్ ఉన్నత విద్యా శాఖలో రీజినల్ జాయింట్ డైరెక్టర్‌గా పదవీ [illegible]

(1981-85); శాశ్వత చిరునామా : 9/258 కమ్మవీధి, మదనపల్లి; ప్రస్తుత చిరునామా : 8/241 సువిశేషపురం, రాజమండ్రి; పరిశోధన : ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యాలలో; బిరుదములు, బహుమానములు : ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ వార్షిక బహుమతులు, 1975 లో 'సమాజము-సాహిత్యము' (విమర్శ), 1977లో సంసార వృక్షం' (నవల), నూతలపాటి గంగాధరం సంస్కృతి బహూకృతి, 1977 లో 'సంసార వృక్షం', 1984 లో 'మధుర మీనాక్షి' (కథలు) పొందినవి. ఆం. ప్ర. ఉత్తమ అధ్యాపక సన్మానం 1980 లో లభించినది; పదవులు : కేంద్ర సాహిత్య అకాడెమీ, నేషనల్ బుక్ ట్రస్ట్ ఇండియా, తెలుగు విశ్వవిద్యాలయం సలహాసంఘాల్లో సభ్యత్వం; ముద్రిత రచనలు : అనుబంధాలు, మళ్లీ వసంతం, అసురసంధ్య (నవలలు), కాలం తెచ్చిన మార్పు, మధుర మీనాక్షి (కథలు), సాహిత్యంలో దృక్పథాలు, సమాజము - సాహిత్యము, సాహిత్య నేపథ్యం, నూరు సమీక్షలు (విమర్శ), నిశాంతం (కవిత).

* * *

## గుంటూరు శేషేంద్రశర్మ

పుట్టినతేది : 20-10-1927; శాశ్వత చిరునామా : జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్, గోషామహల్, హైదరాబాదు - 12; ప్రస్తుత చిరునామా : జ్ఞాన్‌బాగ్ ప్యాలెస్, గోషామహల్, హైదరాబాదు-12; ముద్రిత రచనలు: 1. సొరాబు (కవిత)1951; 2. ఋతుఘోష (దీర్ఘ కవిత)-1963; 3. చంపూవినోదిని (చంపువు) -1961; 4. పక్షులు (కవితాసంపుటి) - 1970; 5. శేషజ్యోత్స్న (కవిత) - 1972; 6. మండేసూర్యుడు (కవిత) - 1974; 7. నా దేశం - నా ప్రజలు (ఆధునిక ఇతిహాసం) - 1975; 8. నా రాస్తా (కవిత) - 1975; 9. నీరై పారిపోయింది (కవిత); 10. గొరిల్లా (కవిత) - 1977; 11. సముద్రం నా పేరు (కవిత) - 1973; 12. ప్రేమలేఖలు (కవిత) - 1980; 13. నేనూ నా నెమిలీ (కవిత)-1980; 14. అరుస్తున్న ఆద్మీ (కవిత) - 1983; 15. మేరీ ధర్తీ-మేరీ లోగ్ (కవిత) - 1983; 16. బిక్తాహువా ఆద్మీ (కవిత) - 1985; 17. రక్తరేఖ (డైరీ) - 1974; 18. ఇన్ డిఫెన్స్ ఆఫ్ పీపుల్ అండ్ పొయిట్రీ (లేఖలు - ఆంగ్లం)-1977; 19. షోడశి (విమర్శ)- 1985; 20. సీత (విమర్శ)- 1985 21. స్వర్ణహంస (విమర్శ) 1967; 22. సాహిత్య కౌముది (విమర్శ)-1968;

23. కవిసేన మేనిఫెస్టో (విమర్శ) - 1977; 24. నరుడు - నక్షత్రాలూ (వ్యాసాలు) - 1963; 25. ఊహాలో (వ్యాసాలు) - 196-; 26. విశ్వవివేచన (సైన్సు) - 1963; 27. విహ్వాల (కథలు)- 1968; 28. మబ్బుల్లో దర్బారు (నాటిక) - 1968; 29. మిశ్రకృతి (సంకలనం) - 1977; 30. ఆధునిక మహాభారతము (కవిత) - 1985.

* * *

## ఆవంత్స సోమసుందర్

జననీ జనకులు : వెంకాయమ్మ, వెంకటరావుగార్లు; పుట్టిన తేది : 18-11-1924; జన్మస్థలం : తూర్పుగోదావరి జిల్లా-పిఠాపురం; విద్యార్హతలు : కాలేజీ చదువుల వరకు; వృత్తి: రచనా వ్యాసంగం; శాశ్వత చిరునామా: కళాకేళి నికేతన్; పిఠాపురం-533 450; ప్రస్తుత చిరునామా : కళాకేళి నికేతన్; పిఠాపురం-533 450; బిరుదములు, బహుమానములు : బిరుదులు చాలా ఉన్నాయి వాడడం అలవాటులేదు. అభ్యుదయ కవి శేఖర, మహాకవి ఇత్యాది. సోవియట్ లాండ్ నెహ్రూ అవార్డు, రాజాలక్ష్మి ఫౌండేషన్ అవార్డు, కొండేపూడి శ్రీనివాస రావు అవార్డు; పదవులు : ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం, అధ్యక్షవర్గ సభ్యులు, ఆంధ్రప్రదేశ్ ఇస్కస్ ఉపాధ్యక్షులు; ముద్రిత రచనలు: 1. వజ్రాయుధం (1949) ప్రస్తుతం నాల్గవ ముద్రణం; 2. కాహళి- 1953; 3. గోదావరి జలప్రళయం; 4. మందీ మనిషి; 5. సోమరసం-సుందరకాండ; 6. మేఘరంజని; 7. మిణుగురులు; 8. శేషేంద్ర జాలం; 9. అనల కిరీటం; 10. వెన్నెలలో కోనసీమ; 11. రాలిన ముత్యాలు; 12. మా ఊరు మారింది; 13. రుధిర జ్యోతిర్దర్శనం; 14. కృష్ణశాస్త్రి కవితాత్మ; 15. పురిపండా ఎత్తిన పులిపంజా; 16. బుద్ధదేవ్‌బోస్; 17. ఆగతానికి శుభారంభం; 18. సోమసుందర్ బృహత్కావ్యాలు; 19. సాహిత్యంలో సంశయ కల్లోలం; 20. కవిత్వం కాలాతీత కాంతిరేఖ; 21. అమృత వర్షిణి; 22. ఒక్క కొండలో వేయిశిల్పాలు; 23. రక్తాక్షి (ద్వితీయ ముద్రణ); 24. సోమసుందర్ కథలు; 25. లియోనార్డో డావిన్సీ; 26. ఆంగ్లసీమలో ఆమనిపీణలు; 27. కృష్ణశాస్త్రి వెలిగించిన కార్తీక దీపాలు; 28. వాహిని (యు. కె. తెలుగు క్లబ్ వారి సావనీరు - సోమసుందర్ పర్యవేక్షణలో)

## డి. రామలింగం

జననీ జనకులు : ఈశ్వరమ్మ మల్లయ్యగారు; పుట్టిన తేదీ : జూన్ 8, 1924; జన్మస్థలం : బనిగండ్లపాడు, మధిర తాలూకా, ఖమ్మం జిల్లా (ఆం.ప్ర.); విద్యార్హతలు : బి. ఎ. (లిటరేచర్); వృత్తి : ప్రభుత్వోద్యోగం చేసి రిటైర్ అయినాను; శాశ్వత చిరునామా : No. 1-8-726/30, నల్లకుంట, హైదరాబాదు - 5000 44 (A.P); ప్రస్తుత చిరునామా : No. 1-8-726/30, నల్లకుంట, హైదరాబాదు -5000 43 (A.P.); బిరుదములు, బహుమానములు : బిరుదములు లేవు, నా 'స్వరాజ్యం నా జన్మహక్కు' అనే పుస్తకానికి ఉత్తమ బాల సాహిత్యం క్రింద 1985 సంవత్సరానికి తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతి లభించింది; పదవులు : కేంద్ర సాహిత్య అకాడమీయొక్క తెలుగు సలహా సంఘం సభ్యుడుగా గడచిన నాలుగేళ్ళనుంచీ ఉన్నాను; ముద్రిత రచనలు : 1. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావు పంతులు (జీవిత చరిత్ర): 2. విశ్వకవి (బాలలకు రవీంద్రనాథ టాగూరు జీవిత చరిత్ర); 3. భారతీయ పునరుజ్జీవనం (A book on Indian Renaissance).

* * *

## డాక్టర్ అనుమాండ్ల భూమయ్య

జననీ జనకులు : శాంతమ్మ; లసుమయ్య: పుట్టిన తేది : 3-6-1949 జన్మస్థలం : వెదురుగట్ట-గ్రామం, జిల్లా-కరీంనగర్; విద్యార్హతలు : ఎం.ఏ; ఎం.ఫిల్; పి.హెచ్.డి.; వృత్తి : తెలుగు లెక్చరర్; శాశ్వత చిరునామా : తెలుగుశాఖ, కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు; ప్రస్తుత చిరునామా : 5-7-47, లష్కర్‌బజార్: హన్మకొండ — 506 001; పరిశోధన : నాయని సుబ్బారావు కృతులు-పరిశీలన: ముద్రిత రచనలు : పుస్తకాలు :— 1. నాయని సుబ్బారావు కృతులు - పరిశీలన: 2. కొఱవి గోపరాజు — సాహిత్య విశ్లేషణ: 3. వేయిపడగలు-ఆధునిక ఇతిహాసం; వ్యాసాలు - 13.

## కోవెల సుప్రసన్నాచార్య

జననీజనకులు : వెంకట నరసింహాచార్యులు, లక్ష్మీనరసమ్మ; పుట్టిన తేదీ : 17-3-1936, యువ ఫాల్గుణ బహుళ నవమి; జన్మస్థలం : వరంగల్లు; విద్యార్హతలు : ఎం. ఏ, పిహెచ్. డి; వృత్తి : అధ్యాపక వృత్తి; శాశ్వత చిరునామా : 3-19, పరిమళ కాలనీ, వడ్డెపల్లి, వరంగల్ - 506 370; ప్రస్తుత చిరునామా : 3-19, పరిమళ కాలనీ, వడ్డెపల్లి, వరంగల్-506 370; పరిశోధన : 1. రామరాజ భూషణునిపై పరిశోధన (1959 - 1961); 2. పర్యవేక్షణలో ఎనిమిది పిహెచ్.డి.లు, ఆరు ఎం.ఫిల్‌లు వచ్చాయి; బిరుదములు, బహుమానములు : 1. తెలంగాణా రచయితలసంఘం కవితాస్పర్ధలో బహుమతి (1955); 2. ఉత్తమ విమర్శగ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు - సాహిత్య వివేచన (1971) 1972 సంవత్సరం; 3. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారి ఉత్తమ అధ్యాపక సన్మానం; పదవులు : ప్రొఫెసర్ - తెలుగుశాఖ, డీన్ ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్, అధ్యక్షులు - ద్రావిడ అధ్యయన విభాగము - అఖిల భారత ప్రాచ్య విద్వన్మహాసభ కలకత్తా (1986); ముద్రిత రచనలు : 1. తేజశ్చక్రము-దుఃఖయోగిని (1958); 2. అధునా (1964); 3. ఋతంభర (1974); 4. పాండిచ్చేరీ గీతాలు పన్నెండు (1976); 5. పాంచాల రాయశతకము (1977); 6. సాహిత్య వివేచన (1971); 7. సహృదయ చక్రము (1983); *8. హృద్గీత; 9. ఆనందలహరి (1957)*; ఈ రెండూ శ్రీ సంపత్కుమారతో కలసి చేసిన (1954) రచనలు; కవితా సంకలనాలు (సంపాదకుడిగా); 1. చేతనావర్తం (1967); 2. అగ్నిగర్భ (1974); 3. హిరణ్యగర్భ (1983).

* * *

## వడలి మందేశ్వర రావు

జననీ జనకులు : శ్రీమతి రాజేశ్వరి, శ్రీకామశాస్త్రి; పుట్టిన తేది : 21-12-1922; జన్మస్థలం : కొమరాజు లంక, కొత్తపేట తాలూకా, తూర్పు గోదావరి జిల్లా; విద్యార్హతలు : బి. ఏ. (గణితశాస్త్రంలో) ఎం. ఏ. (ఆంగ్లములో) (ప్రథమస్థానం) బి.యిడి; వృత్తి : 1944-46 మధ్య 'ఆనందవాణి' సహాయ సంపాదకత్వం, ఉపాధ్యాయుడుగా, ఆంగ్లోపన్యాసకుడిగా, [illegible]

**Institute of English and Foreign Languages**, హైదరాబాదులోనూ - 1947 నుండి 1966 వరకు 1966-82 వరకు కేంద్రీయ విద్యాలయాల్లో ప్రిన్సిపాల్ గా; శాశ్వత చిరునామా : 17-1-391/35, సుబ్రహ్మణ్యనగర్; ప్రస్తుత చిరునామా : సైదాబాదు కాలనీ సమీపాన, హైదరాబాదు - 500 659; బిరుదములు, బహుమానములు : i. 'ఇది కల్పవృక్షం' గ్రంథానికి కాకినాడ విశ్వనాథ సాహిత్య పీఠము బహుమతి; ii. ప్రిన్సిపాలుగా కేంద్రీయ విద్యాలయా సంఘటన పురస్కారము; ముద్రిత రచనలు : 1. అనుశీలన (సాహిత్య విమర్శ స్వరూప స్వభావాల పరిశీలన); 2. సాహిత్యం - విమర్శ; 3. ఇది కల్పవృక్షం; 4. మరోమారు కల్పవృక్షం (అచ్చులో ఉంది); 5. ద్రష్ట నన్నయ (అచ్చు కావాలి). ఇవిగాక పత్రికల్లో అప్పటప్పటి వ్యాసాలు, రేడియో ప్రసంగాలు ఆంగ్లంలో త్యాగరాజు, విశ్వనాథ, గురజాడ, సాహిత్యంలో శాస్త్రీయ దృక్పథం మున్నగు వ్యాసాలు.

* * *

## డాక్టర్ వి.వి.యల్. నరసింహారావు
[వాసిలి వేంకట లక్ష్మీ నరసింహారావు]

జననీ జనకులు : కోటిలింగం, వేంకట సుబ్బమ్మ; పుట్టిన తేది : 10-7-1930; జన్మస్థలం : చేబ్రోలు, గుంటూరు జిల్లా; విద్యార్హతలు : ఎం.ఏ. పి.హెచ్.డి.; వృత్తి : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయం పరిశోధనాలయం-డైరెక్టర్; శాశ్వత చిరునామా : చేబ్రోలు, గుంటూరు జిల్లా; ప్రస్తుత చిరునామా : ఆఫీసు : డైరెక్టర్: ఓ.యం.యల్. & ఆర్. ఐ; హైదరాబాద్ - 1, ఇం.నెం. 1-8-700/12, న్యూనల్లకుంట, హైదరాబాద్-500044; పరిశోధన : నన్నయ కవిత్వము : అక్షరరమ్యత; బిరుదములు, బహుమానములు : 1974 లో ప్రభుత్వపు ఉత్తరువు ననుసరించి రాజమహేంద్ర కవిపండిత సమక్షమున, నవరత్నస్థగిత స్వర్ణకంకణ బహూకృతి; పదవులు: 1. ఆంధ్రోపన్యాసకత్వము; 2. ఆంధ్రశాఖాధ్యక్షత్వము; 3. కళాశాల ప్రిన్సిపాల్ పదవి; 4. ప్రభుత్వ గ్రంథాలయం పరిశోధనాలయం సంచాలకత్వము; ముద్రిత రచనలు : 1. ఆనందభిక్షువు (పద్యకావ్యము); 2. వసుచరిత్రతత్త్వము (విమర్శ); 3. వినరా సుమతీ (సుమతి శతకవ్యాఖ్య); 4. పిల్లల రేడియోకథలు,

వ్యాసాలు (రేడియో ప్రసంగాలు); 5. ప్రతిమ (భాసరూపకానువాదము); 6. నన్నయ కవిత్వము : అక్షర రమ్యత (పరిశోధన గ్రంథము); 7. కుమార భారతము (స్వతంత్ర నాటకము); 8. అనేక ముద్రితవ్యాసాలు.

* * *

## అద్దేపల్లి రామమోహనరావు

జననీ జనకులు : రాజేశ్వరి, సుందరరావు; పుట్టిన తేది : 6-9-1936; జన్మస్థలం : మచిలీపట్నం; విద్యార్హతలు : యం. ఏ. (తెలుగు); వృత్తి : అధ్యాపకుడు; శాశ్వత చిరునామా : అద్దేపల్లి రామమోహనరావు, శివాలయం వీధి, జగన్నాథపురం, కాకినాడ - 2; ప్రస్తుత చిరునామా : అద్దేపల్లి రామ మోహనరావు, శివాలయం వీధి, జగన్నాథపురం, కాకినాడ-2; పదవులు : సంస్కృతి సమాఖ్య - రాష్ట్ర అధ్యక్షత; ముద్రిత రచనలు : శ్రీశ్రీ కవితా ప్రస్థానం, విమర్శ వేదిక, మధుజ్వాల, అంతర్జ్వాల, కుందుర్తి - వచనకవిత, కుందుర్తి కవితా వైభవం, మినీ కవిత.

* * *

## ఇంద్రగంటి శ్రీకాంతశర్మ

జననీజనకులు : వెంకటరత్నమ్మ, హనుమచ్ఛాస్త్రి; పుట్టిన తేది : 29-5-1944; జన్మస్థలం : తూర్పుగోదావరి జిల్లా, రామచంద్రపురం; విద్యార్హతలు : ఎం.ఏ., (తెలుగు) భాషాప్రవీణ; వృత్తి : ఆకాశవాణి విజయ వాడ కేంద్రంలో రచయిత; శాశ్వతచిరునామా : 59-6/1-11, ఆర్.టి.సి. కాలనీ, మారిస్‌స్టెల్లా కాలేజి వెనుక, విజయవాడ - 8; ప్రస్తుత చిరునామా : ఆకాశవాణి కేంద్రం, విజయవాడ-10; పరిశోధన : డిగ్రీగా చేయడం ఇష్టంలేదు. బహుమానములు : 'అనుభూతి గీతాలు' కవితా సంపుటానికి ఫ్రీవర్స్ ఫ్రంట్, గంగాధరం సాహితీ సంస్థ బహుమతులు; ముద్రిత రచనలు : 1. శిలామురళి (గేయకథా కావ్యం); 2. అనుభూతి గీతాలు (కవిత్వ సంపుటం); 3. పొగడపూలు (పాటల సంపుటం); 4. తూర్పున వాలిన సూర్యుడు (నవల); 5. ఆలోచన (సారస్వత వ్యాస సంపుటం); 6. గాథావళి (58 [illegible] లకు తెలుగు కథా వ్యాఖ్య)

## అక్కిరాజు రమాపతిరావు

జననీజనకులు: అన్నపూర్ణమ్మ, రామయ్యగారలు; పుట్టినతేది: 4-5-1936; జన్మ స్థలం : వేమవరం (పల్నాడు తాలూకా, గుంటూరు జిల్లా); విద్యార్హతలు : పిహెచ్. డి; వృత్తి : తెలుగు అకాడమిలో పరిశోధనాధికారి; స్థిరమైన చిరునామా: 140 బి, సంతోష్‌నగర్ కాలనీ, సైదాబాదు, హైదరాబాదు-500 659; ప్రస్తుత చిరునామా:140 బి, సంతోష్‌నగర్ కాలనీ, సైదాబాద్, హైదరాబాదు-500659. పరిశోధన : కందుకూరి వీరేశలింగం పంతులు సామాజిక, సాహిత్య కృషిని గూర్చిన పరిశోధనకై పిహెచ్. డి. లభించింది; బిరుదములు బహుమానములు : 19, 20 శతాబ్దుల తెలుగు దేశపు సామాజిక పరిణామాలు, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర అధ్యయన విశ్లేషణ, అభిరుచులు. సృజనాత్మక రచయిత కూడాను. నాటి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి నుంచి వ్యవహారిక భాషా చరిత్ర : వికాసం అనే గ్రంథం బహుమతి పొందింది (1971); 10 నవలలు, 4 కథా సంపుటాలు వెలువరించాను; ముద్రిత రచనలు : కథలు, నవలలు, జీవితచరిత్ర, సాహిత్య విమర్శ మొదలైనవి 25 దాకా పుస్తక రూపంలో వెలువడ్డాయి. మరో 20 దాకా సంపాదక బాధ్యతలో వెలువడ్డాయి. కొన్ని కథలు దక్షిణాదిభాషలలోకి, హిందీ, బెంగాలీ వంటి ఉత్తరాది భాషలలోకి అనూదితం. రష్యన్‌లోకి కూడా ఒక కథ అనువాదం పొందింది.

*　　　*　　　*

## మాదిరాజు రంగారావు

జననీ జనకులు: లక్ష్మీదేవి, నారాయణరావు; పుట్టిన తేది: 7-12-1935; జన్మస్థలం : పండితాపురం, ఖమ్మం జిల్లా, తాలూకా ఇల్లెందు; విద్యార్హతలు : యం. ఏ. (సంస్కృతం); యం. ఎ. (తెలుగు); పిహెచ్.డి (తెలుగు); వృత్తి : ప్రొఫెసర్, తెలుగు విభాగం, కాకతీయ విశ్వ విద్యాలయము, వరంగల్; శాశ్వత చిరునామా : క్వార్టరు నెం. 14, కాకతీయ యూనివర్సిటీ కాంపస్-విద్యారణ్యపురి వరంగల్ - 506 009; ప్రస్తుత చిరునామా : క్వార్టరు నెం. 14, కాకతీయ యూనివర్సిటీ కాంపస్, విద్యారణ్యపురి, వరంగల్; పరిశోధన : కవిత్రయము - పాచన సోమన కావ్య సిద్ధాంతములు, - సమాలోచనం; ముద్రిత రచనలు (A)

విమర్శ: 1. నవల స్వరూప సమాలోచనము; 2. దాశరథి కవితాసమాలోచనము; (B) కవిత్వము: 1. యుగ సంకేతం; 2. మేల్కొన్న ఆకాశం; 3. ఉషఆగమనం; 4. ముక్తకాలు; 5. మానవీయం; 6. వయొలిన్‌పై రాగంతో; 7. ముక్తధాత్రి 8. పడగెత్తిన ఉదయం; 9. ఆవాహన; 10. విప్లవచ్ఛాయల్లో వియత్నాం; 11. మినీ కవితలు; 12. రేఖాచిత్రాలు; 13. ఆనంద ధుని; 14. మేల్కొన్న ఈ సమయం; 15. శబ్దమై ప్రాణమై; 16. వియత్నాం శాంతి కవితలు; 17. కాలాన్ని నిలిపి క్షణం; 18. నాలో ప్రవహిస్తోంది నది; 19. నాకు జ్ఞాపకం ఉంది; 20. ఈతరం స్వర చిత్రం.

* * *

## తంగిరాల వెంకట సుబ్బారావు

జననీజనకులు : సీతామహాలక్ష్మి, వెంకట సుబ్బావధానులు; పుట్టిన తేది : 30-3-1935; జన్మస్థలం : తణుకు, పశ్చిమగోదావరిజిల్లా; విద్యార్హతలు : ఎం.ఏ; (తెలుగు), పిహెచ్.డి.(వీరగాథాకవిత్వము); వృత్తి, శాశ్వతచిరునామా : ఆచార్యుడు, మరియు ఆంధ్రశాఖాధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయము; 'జ్ఞానభారతి' బెంగుళూరు - 560 056; ప్రస్తుత చిరునామా: 'జ్ఞానభారతి' బెంగుళూరు - 560 056; పరిశోధన : (1) తెలుగు వీరగాథా కవిత్వము; (2) ఆధునిక కవిత్వము; (3) తెలుగు-కన్నడ తులనాత్మక పరిశీలనము; పదవులు : పరీక్షా నియంత్రణాధికారి;గుల్బర్గా విశ్వవిద్యాలయము (1980-83); ఆంధ్రశాఖాధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయము (1974-80) (1987- ముద్రిత రచనలు : 1. హంసపతిక (వచనగీతాలు), 1967; 2. వనదేవత (బుఱ్ఱకథ), 1968; 3. జానపదసాహిత్యము-వీరగాథలు, 1975; 4. కాటమ రాజు కథలు (మొదటి సంపుటము) 1976; 5. కాటమరాజు కథలు (రెండవ సంపుటము) 1978; 6. తెలుగు వీరగాథాకవిత్వము (రెండవ సంపుటము) 1983.

## ఎం. కులశేఖరరావు

జననీ జనకులు : శ్రీమతి జానకమ్మ, శ్రీ పరాంకుశరావు; పుట్టిన తేది : 25-6-1932; జన్మస్థలం : నక్కర్త, రంగారెడ్డిజిల్లా-ఆం.ప్ర; విద్యార్హతలు: ఎం.ఏ., పిహెచ్.డి.; వృత్తి : అధ్యాపకుడు-ఉస్మానియా విశ్వవిద్యాలయం; శాశ్వత చిరునామా : B10-F3, విజ్ఞానపురి,విద్యానగరం-హైదరాబాదు; ప్రస్తుత చిరునామా : B 10-F3, విజ్ఞానపురి. విద్యానగరం-హైదరాబాదు; పరిశోధన : తెలుగు వచన వాఙ్మయం; పదవులు : తెలుగు శాఖాధ్యక్షుడు. ఉ. వి. వి.; ముద్రిత రచనలు : 1. ఆంధ్రవచన వాఙ్మయం-1972; 2. రుచిరాలోకనం-1985; 3. తెలుగు సాహిత్యము-పరిశోధనం-1984; 4. సాహితీ మంజూష-1973; 5. చేమకూర కవితా వైభవం-1978; 6. అనేక వ్యాసాలు వివిధ పత్రికల్లో; 7. శ్రీకృష్ణచరిత్ర; 8. హరివిల్లు; 9. శ్రీనివాసశతి.

* * *

## ఆర్వీయస్ సుందరం

జననీ జనకులు : రాళ్ళపల్లి సుశీలమ్మ-రాళ్ళపల్లి పిచ్చయ్య; పుట్టిన తేది : 21-4-1948; జన్మస్థలం : నెల్లూరు; విద్యార్హతలు : ఎం. ఎ. తెలుగు, ఎం. ఎ. కన్నడ, ఎం. ఎ. సంస్కృతం, పిహెచ్.డి., డిలిట్; వృత్తి : విశ్వవిద్యాలయాధ్యాపకుడు; శాశ్వత చిరునామా : తెలుగుశాఖ, మైసూరు విశ్వ విద్యాలయం, మైసూరు - 570 006; ప్రస్తుత చిరునామా : తెలుగుశాఖ, మైసూరు విశ్వ విద్యాలయం, మైసూరు 570 006; పరిశోధన : 'తెలుగు - కన్నడ జానపద గేయాలు' - పిహెచ్.డి.; బిరుదములు, బహుమానములున : 1. ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ బహుమతి 1968-69; 2. మాతృభాషేతర పుస్తక రచనకు కేంద్ర విద్యా మంత్రిత్వ శాఖ బహుమతి, 1983; 3. కార్టగడ్డ సాహితీ అవార్డు 1985; 4. యు. జి. సి. కెరీర్ అవార్డు, 1986; ముద్రిత రచనలు : 1. తెలుగు కవిత 2; 2. విమర్శ 2; 3. నాటకం 1; 4. నవలలు 2; 5. జానపద విజ్ఞానం 6; 6. భాషాశాస్త్రం 2; 7. సంపాదకత్వం 3; 8. అనువాదాలు వగైరా 5; 9. కన్నడ పుస్తకాలు 13; 10. ఇంగ్లీషు 1; 11. పాఠ్య పుస్తకాలు వగైరా 4; మొత్తం అచ్చయినవి 41; రచనల్లో :

కవిత, విమర్శ, భాషా సాహిత్య చరిత్రలు, నటకం, నవల, జానపద విజ్ఞానం, భాషాశాస్త్రం, అనువాదాలు, జీవిత చరిత్రలు, కవి జీవితాలు. పాఠ్య పుస్తకాలు చేరి ఉన్నాయి.

* * *

## బి. రుక్మిణి

జననీజనకులు : సూర్యాదేవి, బి. రామరాజు; పుట్టినతేది: 16-1-1952; జన్మ స్థలం: వరంగల్లు; విద్యార్హతలు : ఎం.ఎ, పిహెచ్.డి.; వృత్తి : అధ్యాపకురాలు; శాశ్వత చిరునామా : 1-8-117/2, చిక్కడపల్లి, హైదరాబాదు; ప్రస్తుత చిరునామా : తెలుగు విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి - 506 009; పరిశోధన : ''నన్నయ భారతంలో ఉపమ''; ముద్రిత రచనలు : "నన్నయ భారతంలో ఉపమ", సాహిత్య వ్యాసాలు.

* * *

## పి. జ్యోతి

జననీజనకులు : కౌసల్యాదేవి, పి. సోమనర్సింహారెడ్డి; జన్మ తేది : 8-2-1952; జన్మస్థలం : వరంగల్లు; విద్యార్హతలు : ఎం ఎ., ఎం.ఫిల్, పిహెచ్.డి.; వృత్తి : అధ్యాపకురాలు; శాశ్వత చిరునామా : బౌతాపురం, జనగామ తాలూకా, వరంగల్ జిల్లా; ప్రస్తుత చిరునామా : తెలుగు విభాగం, కాకతీయ విశ్వవిద్యాలయం, విద్యారణ్యపురి - 506009; పరిశోధన : 'విశ్వనాథ త్రిశూల నాటకం' - ఎం. ఫిల్., పిహెచ్.డి. పరిశోధనాంశం- ముదిగొండ వీరభద్రమూర్తి గారి 'వందేమాతం' కావ్యం; బిరుదములు : ఎం.ఫిల్. గోల్డ్‌మెడల్; ముద్రిత రచనలు : సాహిత్య వ్యాసాలు.

* * *

## కోవెల సంపత్కుమారాచార్య

జననీజనకులు: చూడమాంబ-రంగాచార్యులు: పుట్టిన తేది: 26-6-1933 శ్రీముఖ ఆషాఢ శు. 4; జన్మస్థలం : వరంగల్లు; విద్యార్హతలు : భాషాప్రవీణ,

ఎం.ఏ. (తెలుగు) ఎం.ఏ. (హిందీ); వృత్తి : అధ్యాపనం; శాశ్వత చిరునామా: 15-9-64, రామన్నపేట, వరంగల్ - 506002; ప్రస్తుత చిరునామా : 15-9-64, రామన్నపేట, వరంగల్-506002; పరిశోధన : ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ - సాంప్రదాయిక రీతి: పదవులు : రీడర్, తెలుగు విభాగం కాకతీయ వి. వి.; ముద్రిత రచనలు : 1. తెలుగు ఛందోవికాసం; 2. లక్షణ దీపిక; 3. మన పండితులు కవులు రచయితలు: 4. మధుర గాథలు; 5. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ - సాంప్రదాయిక రీతి; 6. తెలుగు ఛందఃపదకోశము; సంపాదితములు : 1. లక్షణసార సంగ్రహము కూచిమంచి తిమ్మకవి; 2. సుకవిజన రంజనము కూచిమంచి వెంకట రాయడు; ఈ రెండు ఆ. ప్ర. అకాడమీ ప్రచురణలు.

## జి. వి. సుబ్రహ్మణ్యం

జననీజనకులు: సరస్వతమ్మ, వీరరాఘవయ్య; పుట్టినతేదీ: 10-9-1935; జన్మస్థలం : ఆదిపూడి, ప్రకాశంజిల్లా, ఆంధ్రప్రదేశ్; విద్యార్హతలు : ఎం.ఏ; పిహెచ్.డి; పరిశోధన : మార్కండేయ పురాణం, ప్రబంధ కథామూలం; వృత్తి : ఆచార్యులు, తెలుగుశాఖ, హైదరాబాదు; కేంద్ర విశ్వవిద్యాలయం, హైదరాబాదు; శాశ్వత చిరునామా : శ్రీవాణి, 1-8-702/105, నల్లకుంట, హైదరాబాదు - 500 044; పదవులు : ఆంధ్ర శాఖాధ్యక్షులు, హైదరాబాదు విశ్వవిద్యాలయం; బహుమానాలు: 1960లో వీర రసము గ్రంథానికి, 1983లో 'రసోల్లాసము' గ్రంథానికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డులు.1986లో 'ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావము' గ్రంథానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు. ముద్రిత రచనలు : 1. వీరరసము (ఆంధ్ర సారస్వతము)- 1961; 2. ప్రథమాంధ్ర మహాపురాణము. ప్రబంధ కథామూలము - 1967; 3. సారస్వత సౌరభము-1970; 4. నవ్యాలోకము - 1973; 5. పిల్లలమర్రి పినవీరభద్రకవి- 1973; 6. రసోల్లాసము - 1980; 7. రామకథ-సాయిసుధ - 1982; 8. అభినవలోచనము - 1983; 9. ఆంధ్రసాహిత్య విమర్శ - ఆంగ్లప్రభావము - 1983; 10. రాగమంజరి (నవల) 1957; 11. జీవనగంగ (నవల) 1960; 12. మానవత్వం (నాటిక) 1958.

ABHYUDAYA KAVITVANTARA DHORANULU

Edited by

Prof. PERVARAM JAGANNADHAM

A Collection of eighteen essays

by eminent critics presenting

a judicious and incisive

analysis of the Post-Progressive

trends of Contemporary

Telugu Poetry

*Published by :*

**Sahithi Bandhu Brindam**

(Regd. No. 20/1981)

1/705/5-1-C, Mithilanagar,

Hanamkonda - Warangal - A. P.

Price : Rs. 80-00